# కాయకల్ప రసము

## సకల వ్యాధులకును ఈ రసమును లోనికిని పైకిని యుపయోగించిన గంటల మాత్రమున అత్యద్భుతమగు గుణమిచ్చును.

నివారణమగు వ్యాధులు:—తలనొప్పి, పార్శ్వపు తలనొప్పి, ప్రక్క మెడనరములు లాగుట, కీళ్ల వాతము, వీపునొప్పి, కీళ్లనొప్పులు, శరీరమునందే భాగముననైన తిమ్మిరి, కీళ్లు పట్టుట, నరములు చుట్టుకొనుట, నరముల వ్యాధులు, పండ్లనొప్పి, నడుము నొప్పి, చర్మమున వాపు, తామర.

అన్ని విధములైన జ్వరములు, అజీర్ణము, మంద విరేచనములు, కలరా, మలబద్ధము, పిత్తాశయ ప్లీహారోగములు, పక్షవాతము, ధాతు సంబంధమైన దుర్గుణములు, కక్కువాయి, స్త్రీలకు కలుగు ఋతు సంబంధమైన వాయువు, సూతక కట్టు, సూతక సన్నిపాతము, గుల్మము, మొదలైన అన్ని విధములైన దేహవ్యాధులు కాయకల్ప రసమువల్ల నివారణమగును.

ఏ రోగమునకైనను కఠిన నిర్బంధము లేదు.

**ఒక సీసా వెల రూ. 1-8-0.**

తపాలాచార్జి ప్రత్యేకము.




# ఇండియన్ మెడికల్ వర్క్సు,

ఆలందూరు పోస్టు, మద్రాసు. — **234**, గోవిందప్పనాయక్ వీధి, మద్రాసు.

Lost or Impaired

# VITALITY

RESTORED

# DIABETES EXPERT

SECURE A SPECIALIST'S ADVICE, IN CASES OF LOST-VITALITY & DIABETES.

*Full particulars from*

WRITE LEGIBLY, STATING YOUR AGE, MARRIED OR SINGLE, OCCUPATION AND A BRIEF HISTORY OF YOUR CASE. CORRESPONDENCE STRICTLY CONFIDENTIAL.

DR. JEAN F. STRANDGARD,
(LATE OF BERLIN AND VIENNA),
BANGALORE, S. INDIA.



# భారతి

## సచిత్ర మాసపత్రిక


అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య



సంపుటము ౧౨, సంచిక ౬

ఆంధ్రపత్త్రికా ముద్రాలయము, మద్రాసు

౧౯౩౪

# భారతీ - ద్వాదశ సంపుటము—భా. ౧.

## వ్యాసముల అకారాదిపద సూచి

శ్రీ

ష

---

## సవరణలు

౧

భావ సం.ర ఫాల్గుణమాస భారతిలో ప్రకటించిన అంబీరదేవుని ఓరుగంటిశాసనముయొక్క కాలమును నిర్ణయించు సందర్భమున నొకదోసగు వాటిల్లినది. అందు (పుట ౪౨౯) ప్రమాది సం.ర మాఘ శుద్ధ ౧౦ శుక్రవారము క్రీ. శ. ౧౪౫౯ ఫిబ్రవరి నెల ౧వ తేది శుక్రవారమునకు సరిపోయినట్లు వ్రాసియున్నది. ఇది పొరబాటు. అది క్రీ. శ. ౧౪౬౦ ఫిబ్రవరినెల ౧వ తేది శుక్రవారమునకు సరిపోవును కావున క్రీ. శ. ౧౪౬౦ ఫిబ్రవరి ౧వ తేది శుక్రవారమునాడు అంబీరదేవుడు ఓరుగంటిని స్వాధీనము జేసుకొనెను.

౨

యువ సం.ర వైశాఖమాస భారతియందు ప్రకటింపబడిన 'కొందయుకవులు-వారికాలము' అనువ్యాసమునందలి "తరువాత కుమరగిరిరెడ్డి రాజ్యారంభ కాలమున అనగా ౧౪౭౨-౭౫ సంవత్సరములకు మధ్య నతడు... .........కావున విక్రమార్కచరిత్ర రచనాకాలము క్రీ. శ. ౧౪౭౫ - ౯౦ సంవత్సరముల మధ్య నగుట యొప్పును" అను వాక్యముల (౬౯౪ పుట)లోని యంకెలను వరుసగా ౧౩౭౨-౭౫, ౧౩౭౫-౯౦ అని చదువుకొనవలయును. పొరపాటున ౩ కు బదులు ౪ పడినది.

—వేలటూరి వెంకటరమణయ్య.

# భారతి – ద్వాదశ సంపుటము – భా. ౧.

## త్రివర్ణచిత్రముల అకారాదిసూచి

# విషయానుక్రమణిక



## త్రివర్ణచిత్రములు

సావిత్రి; కృష్ణదశమి; కృష్ణఏకాదశి.

## సాధారణచిత్రములు

సార్వభౌమదంపతులు; 'తాతా' శిలావిగ్రహము; చిరునగవుచెలువు; దేహసౌందర్యము, గానమాధుర్యము; ప్రతిబింబము, హాల్ బాగు, బెంగుళూరు; తాతా ఇన్‌స్టిట్యూటు, బెంగుళూరు; అందచందములకు పేరొందిన 'జెఅర్లోవా' సినిమానటి; నీలగిరిపడుచు; ఉపహారము; రాయలసీమ గ్రామదృశ్యములు ౨; ఐనవల్లి ప్రకృతిశిఖర చిత్రములు 3; మహోత్సవము బోర్సుమూలో ప్లేగునివారణనుగూర్చి సర్దారుపటేలుగారితో చర్చించుట; కమలా, ఇందిరా నెహ్రూలు; సి. యఫ్. ఆండ్రూసు; యూరపు వెడలిన భారతీయ విశ్వవిద్యాలయముల విద్యార్థినులు; బెజవాడ లలితకళావర్ధమండలి; సక్కుబాయి సినిమాచిత్రములు 3; మైసూరు చాముండేశ్వరి దేవాలయము; నటరాజమూర్తి; భారతీయనర్తకి 'ఇష్వానిగుల్బనో'; నునుకటి మైసూరు మహారాజుగారి శిలావిగ్రహము, బెంగుళూరు; తంజావూరుకోట దేవాలయము; వ్యంగ్యచిత్రములు; ఇతర చిత్రములును.




సంపు. ౧౨ యువసంవత్సరము, జ్యేష్ఠమాసము (జూన్ ౧౯౩౫) సంఖ్య ౬

# వకుళమాలిక

* శ్రీ శివశంకరశాస్త్రి *

3

నిండువెన్నెలలోన
        నిల్చియున్నా డతడు
ఏగుదెంచుచునుండ
        నెదురుగా ప్రియురాలు
అడుగు ముందుకు వేసి
        ఆలింగనము చేయు
భావమ్ముతో దీర్ఘ
        బాహుయుగళము చాపె.
ఎట్లుండునో యంచు
        నెంచుచుండెడివేళ
నయనపర్వంబుగా
        నాథు వీక్షించితిని.
అత్యపూర్వం బైన
        ఆకారముం దాల్చి
దివ్యదీధితితోడ
        స్త్రీమూర్తివలె నుండె!

దీర్ఘకుంకుమరేఖ
        తీర్చియున్న ముఖంబు,
నడుమపాపటిచాలి
        నల్లని శిరోజాలు,

కనకహారము ప్రేలు
కంఠప్రదేశంబు,
అంగుళీయాలతో
నలరారు హస్తాలు;

పాలనురుగుల రుచుల
పట్టుత్తరీయంబు,
కౌముదీమిసమిసల
కౌశేయకంచుకము

కామినీమానసా
కర్షకాద్భుత మైన
పురుషాకృతిని గాంచి
పొంగిపోతిని నేను!

అంగుళీ సంజ్ఞతో
నావలకు గొంపోయి
హృదయేశు మెల్లగా
ఇందిరాలలితాంగి

సాంద్రవకుళావనీ-
జచ్ఛాయ ప్రాపించి
విభుని కంఠాన నన్
వేయగా పైకెత్తి,

నతమస్తకుం డైన
నాథు గ్రీవమునందు
నిపుణమ్ముగా నుంచి,
నిర్భరప్రేమతో

హృదయనాథుని కౌగి
లించుకొన్నది బిగ్గ
బంగారురుచిమీరు
బాహువల్లరులతో

నిజబాహుదండాల
నిబిడంబుగా నామె
నాలింగనము చేయ
నాత డుద్దేశాన,

పడుచువారల గాఢ—
పరిరంభణమ్ములో
నలిగిపోవుదు నంచు
నాకు భీతి జనించె!

పట్టురైకయు నామె-
పాలిండ్లు చల్లగా
దయనీయగతినుండి
తప్పించినవి నన్ను!

కొంత శాంతము పొంది,
కుతుకంబు విడలేక
పడుచుజంటవిధంబు
పరికింపసాగితిని.

వివశభావముతోడ
విభుని పేరురముపై
శిరసువాల్చిన దామె.
సిగలోని పూదండ-

పరిమళంబు ముఖాన
ప్రసరించుచుండగ
మూర్ధంబు మూర్కొనియె
ముగ్ధుడై యాతండు.

మోము పైకెత్తి యా
ముద్దుగు మ్మావలను
విభుని మానససీమ
వీక్షింప, నాతండు



# మీ భార్య
# ఆరోగ్యకళతోనున్నది

భార్యాభర్తలసౌఖ్యము యిరువురి ఆరోగ్యముపై నాధారపడియుండును. మీభార్య బలహీనముగానున్న యెడల, ఆమె భార్యగను బిడ్డలతల్లిగను తన జీవిత కర్మములను సరిగా నెరవేర్పజాలకపోవుట కలుగును. అపుడు మీకును, మీ సంతానమునకును సౌఖ్య మే మాత్రము నుండదు.

కాబట్టి మీ భార్యకు తిరిగి బలము ఆరోగ్యము చేకూరుటకుగాను ఆమెకు సనటోజన్ యొసంగుము. సనటోజన్ వలన స్త్రీలకు పురుషులకు మంచి బలము సత్తువ యేర్పడును. ఈ బలప్రవర్ధకౌషధసేవ అద్భుతముగా పనిచేయును. కొద్దికాలములోనే మీ యిల్లాలు తిరిగి ఆరోగ్యము, బలముతో కళకళలాడుచుండుట చూడగలరు ఆమెకు బలహీనత పోవును. మీకు ఆమె వలన నిజమైన సౌఖ్యము చేకూరగలదు. మీ బిడ్డలకు గూడ సనటోజన్ యొసంగుము. వారు మిక్కిలి దృఢముగానుండి నూతనారోగ్యమును పొందెదరు. నేడు ఒక సీసా కొని వాడుడు.

# SANATOGEN

నిజమైన బలప్రవర్ధకౌషధము.
బజారులో అన్నిచోట్లను దొరకును.
చేతితో స్పృశింపబడియుండలేదు.

# రాజమోహన హేరాయలు



శ్రేష్ఠమయిన సువాసనగల తలనూనె. మెదడుకు చల్లదనమును గలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, మాడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఏ. అండు కంపెని,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

---

ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని, కవిరాజ
కందుకూరి వేంకటసుబ్బారావుగారి

# कामामृतम्

**కామామృతము:**—దేశదేశములలోఁ బ్రఖ్యాతిఁబొందినది. రాత్రి 1 మాత్ర సేవించిన 1 గంటకే ఎంత నిస్సారమైనశుక్లమైనను సంసారసౌఖ్యము నీయఁగలదు. ఏవిధముగా నష్టమగుచున్న శుక్లమైనను 5 దినములలో నిలిపివేయును. మధ్యనపుంసకులు, నరములకీర్తిత్తినవారు ఈ మందునే పైకి పూతగాఁగూడ నుపయోగించుకొనవలెను. 20 మాత్రల సీసా 1-కి రూ. 2-0-0.

**తేజోమృతము:**—సెగరోగము (గనోరియా) ఎట్టిరంగుతో, ఎంతటిబాధతో, ఎన్నిసంవత్సరముల నుండియున్నను మొదటిమోతాదునుండియే సుగుణమును జూపించి పూర్తిగ నివారించును. 1 సీసా రు. 4-0-0

**వృద్ధామృతము:**—ఒక్కసీసా చాలును. నల్లమందువేసికొనుదురభ్యాసమునువొలఁగించి ఆదాయమును బలమును వృద్ధిచేయును. 1 సీసా రు. 5-0-0

విలాసము:—అమృతాశ్రమము,
నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.

ప్రణయవిహ్వలు డౌచు
పగడంపు మోవితో
జవరాలి కెమ్మోవి
సరభసంబుగ నొక్క.

మాట యేమియు లేక
మహనీయ సుఖములో
తన్మయంబుగ గొంత
తడవుండి, యామీద

నన్యోన్యముగ జెక్కు-
టద్దాలు ముద్దుగొని
రతివేలగతితోడ
నాప్రియుల్ తమకాన.

ఎట్టెట్టులో తుదకు
ఇందిరా ఇందిరా
అని యార్త డింపుగా
నామె సంబోధించి

బాహుబంధము మరల
బాఢమ్ము గావింప,
ప్రాణేశ్వరా యంచు
బలికె మెల్లగ నామె.

3

ఇందిరా, నిన్ను నే
నిష్టదేవతవోలె
భావించుచున్నాను
భక్తితో నిరతంబు.

నీమనోహరపాద-
నీరేజయుగళంబు
అర్చింతు ఇందిరా,
అంతరంగమునందు!

నీతోడి యెడబాటు
నిమిషకాలం బైన
భరియింపగా జాల
ప్రాణేశ్వరీ, యింక!

ఎంతకాలం బింక
నేకాకిగా జీవ-
యాత్ర చేయన్వలెనొ
ఆనతీయంగదే!

మీమందిరముచుట్టు
మిగుల నుత్కంఠతో
తీర్థయాత్రలు చేసి
దేవీ, బడలినాను!

నీపాదపద్మాల
నిటలమ్ము సోకంగ
వాలిపోవ ననుజ్ఞ
వాంఛించుచున్నాను.

ఇంకనైన ననుగ్ర-
హించి రక్షింపవే
నాజీవితేశ్వరీ!
నాముక్తికామినీ!

అని జాలి యుట్టిపడు
నంబకమ్ములతోడ
వీక్షింప ప్రియురాలి
విమలాస్య మాతండు,

చిరునవ్వుతో నతని
స్నిగ్ధగండంబులను
ముద్దాడి ముద్దాడి
ముద్దరాలు వచించె:—

౪

అనిశము నాకొరకు మీర
లనుభవించుచున్న బాధ

అవగతమ్మౌ నాథ కాని
ఆగుడు నాథా,
కొలదిరోజు
లాగుడు నాథా!

ఈయమూల్యమైన హృదయ
మిట్టి వ్యర్థురాలిమీద
ఎట్లు నిల్పినారో తెలియ!
దాగుడు నాథా
కొలదిరోజు
లాగుడు నాథా!

శ్రీఘమ మీపాదపద్మ
సేవ చేయవలయునసెడి
చింత వేగిరించు, కాని
ఆగుడు నాథా,
కొలది రోజు
లాగుడు నాథా!

ప్రాణనాథు సంకములో
పడగనీక నన్ను లాగు
బంధ మొకటి కలదు, కాని
ఆగుడు నాథా,
కొలది రోజు
లాగుడు నాథా!

కౌగిలింప కొక్కసారి
కన్నతల్లి ననుదినంబు
కాల మెపుడు గడపలేదు
ఆగుడు నాథా,
కొలది రోజు
లాగుడు నాథా!

బంధనాలు వీడిపోవ
బాధలెల్ల తొలగిపోవ
ప్రమదంబున వత్తు నేను,
ఆగుడు నాథా!
కొలది రోజు
లాగుడు నాథా!

మీ కేవిరులమీద
మిగుల ప్రీతియటంచు
గ్రహియించి దామమ్ము
కంఠాన వేసితిని.

వకుళాలమీద మీ
వలపనే ప్రాణేశ,
కలిగె నాకునుగూడ
గాఢానురాగంబు.

వేగమ్ముగా పొగడ
విరులు శుష్కము కావు
ఐన పదిలమ్ముగా
నరయుచుండుడు దీని.

వకుళమాలిక యెంతొ
వాడిపోవకముందె
అర్ధాంగి నౌదు మీ
కనివార్యముగ నాథ!

అని యిందిరాదేవి
అంసభాగము మీద
లజ్జతో వాలి తన
లలితాననం బెత్తి
అరకంట వీక్షింప,
హర్ష వివ్వాలు జాచు
ముద్దాడి ప్రియురాలి
ముద్దునెమ్మో మతడు
"నిజముగా నిజముగా
నిజముగా ప్రియతమా
అగుదువా అగుదువా
అర్ధాంగి వగుదువా!

నమ్మలేకున్నాను
        నాయదృష్టం!" బంచు
గ్రుచ్చి కౌగిట జేర్చు
        కొన్నాడు ప్రేయసిని.

జలజలని రాలె నా
        సమయాన వారిపై
పొగడశాఖలనుండి
        పుష్పాలు వానగా
పర్ణముల్ చలియింప
        పండువెన్నెల నిగ్గు
వాలె సొంపుగ వారి
        వదనబింబాలపై.

అపు డనిర్వాచ్యమా
        నానందమున మున్గి
నిశ్శబ్దముగ నట్లె
        నిలిచియుండగ వారు
కామినీ మృదుకంఠ
        గళితమౌ శబ్దంబు
కర్ణగోచర మయ్యె
        గదినుండి మెల్లగా.

ఉత్కర్ణులై చూచి
        రుభయు లాపార్శ్వంబు
ప్రాణవల్లభునితో
        పలికె నాయమ యిట్లు:

"అదిగో నాసోదరి
        ఆ జాలకమునందు,
గాఢానురాగంబు
        కలదామె నామీద.

మీ రెరుంగకయుండ
        మిమ్ము వీక్షించినది.
చాల చక్కనివారు
        సజ్జనుల్ మీ రన్న
భావ మామెకు కల్గి
        పరిణయమ్మునకై
ఉత్సాహ మేవేళ
        నొసగుచున్నది నాకు."

"పూజ్యురాలికి మనః
        పూర్వకం బైన నా
వందనం బర్పింప
        వలయు ప్రాణప్రియా!"
అని పల్క నత, డింది-
        రాంబ వల్లె యంచు
సెలవు వేడెను నాథు
        చిరునవ్వుమోముతో.

"నిను విడిచి యేరీతి
        నిల్వ నేర్తును ప్రియా!
గడపుచున్నా నెట్లొ
        క్షణ మొక్కయుగముగా!
తోచుచున్నది మహా
        దుస్సహమ్ముగ నాకు
ఏకాకిజీవితము
        హృదయాధిదేవతా!"

అని జాలిగా బల్కి
        నాత్మేశు ముద్దాడి,
ఓరడించి సుధామ-
        యోక్తులం బచరించి,

విడిపించుకొని యెట్లో
        విభుని దోర్బంధంబు
కదలినది తుద కంచ
        గమనమ్ముతో నామె.

చేయు చదుగడ్గునకు
        సింహావలోకనము
చనుచుండగా నామె
        సాంద్రచంద్రికలోన
పాలమున్నీటిలో-
        పల విహారము చేయు
పద్మాలయాదేవి
        పగిది దోచెను నాకు !

అదియె తుదిచూపాయె,
        అవల నామెను నేను
కన్గొనెడు భాగ్యంబు
        కలుగలే దెన్నండు.
ఆమె నడిచిన త్రోవ
        నాలోకనము చేయు
చట్టె నిలువంబడియె
        నచటనే నాస్వామి.

చూడసాగితి నాథు
        సోయగము నే నపుడు :
మ్లాన మయ్యెను వదన
        మండలం బొక్కింత.
వీక్షించి సౌధమ్ము
        విడిచి నిట్టూరుపును
కదలె నంతట మంద
        గమనమ్ముతో స్వామి.

---



# "నానాసూన" పద్యార్థవిమర్శనము

బులుసు వేంకటరమణయ్య

నానాసూనవితానవాసనల
నానందించు సారంగ మే
లా న న్నొల్లదటంచు గంధఫలి
బల్ కాకం దపంబొంది యో
షా నాసాకృతిఁ బూని సర్వసుమన
స్సౌరభ్యసంవాసమై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీ
పుంజంబు నిర్వంకలన్.

పయిపద్యము వసుచరిత్రము(ద్వితీయాశ్వాసము) లోనిది. అందలికథానాయిక (గిరికాదేవి) నాసికా వర్ణన మిట ప్రస్తుతము. పూవు లన్నింటిపయి వ్రాలి వానితావుల నాఘ్రాణించుతుమ్మెద తనపై వ్రాలమికి సంపఁగిమొగ్గ మిగుల తపించి గిరికనాసికగా మాఱి సర్వసుమనఃసౌరభ్యముల కావాసమయి కటాక్షము లనెడి మధుకరీపుంజము నిరుకెలంకులఁ బూనెనని యర్థము. గిరికాదేవినాసిక చంపకముకుళమువలె, చూపులు తుమ్మెదలవలెను నున్నవనుట ప్రస్తుత వర్ణనము.

చూపులకు స్త్రీపురుషభేదమును వివక్షింపక భ్రమరసామాన్యముతో సామ్యముకూర్చుట కలదు. కాని ఆఁడుతుమ్మెదతోడిసామ్యమే అత్యంతమధురము. ఒకశబ్ద మనేకలింగములం దున్నను, స్త్రీలింగమే గ్రహించుట లెస్సయని సంస్కృతాలంకారికుల మతము. "స్త్రీతి నామాపి మధుర" మ్మని వారితలంపు. కావున ఇచటి "ప్రేక్షణమాలికామధుకరీపుంజంబు" అను పదము ఎంతయు రసావహము.

పయి గంధఫలీసారంగవృత్తాంతమువలన ప్రస్తుతేతరమగువృత్తాంత మొకటి ధ్వనించుచున్నది. అది "నాయకుఁడొకఁడు బహునాయికాంతరాసక్తుఁడయి తన్నొల్లమిచే నాయిక యొకతె పంచాగ్నిమధ్యమున తపస్సుచేసి సర్వకాంతా సౌందర్య సౌభాగ్యగరిమను వెలసి తన నాయకుని చేఁజిక్కించికొనె" ననుట. ఇట్టి వ్యంగ్యార్థ మిట కలదనియు, అందుచే— ప్రస్తుత వృత్తాంతమువలన గమ్యమానమగు అప్రస్తుతవృత్తాంతము లయెడ నుండు సమాసోక్తి యనునలంకార మున్నదనియు వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు.

పయి వ్యంగ్యార్థము మూలమునందలి 'గంధఫలి' యనుచోటఁగల స్త్రీలింగమువలనను, "సారంగము" అను పుంలింగనిర్దేశమువలనను సిద్ధించినది.

ఈవ్యంగ్యార్థవిషయమునఁ గొందఱి కొకసందేహముకలిగినది. "స్త్రీయయినగంధఫలి సారంగనాయకునికొఱకుఁ దపముచేయఁగా ఆమెకుఁ గలిగినది నాయకలాభముకాదు; మధుకరీపుంజలాభము. దాని వలన గంధఫలికి ప్రయోజనము శూన్యము. కావున ఇట్టియెడ వ్యంగ్యార్థమునకు అనౌచిత్యము వాటిల్లును. సమాసోక్తి కుదురకపోవును." అని పయివారి సందేహము. ఈసందేహమునే యొకప్పుడు (విశాఖపట్టణమందు ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికమహాసభ జరిగినపుడు) జయపురాధిపతులు శ్రీవిక్రమదేవవర్మ మహారాజులుంగారు పండితసమక్షమున విశదపఱచినారు. ఇంకొకపుడు వేఱొకరు దానినే ఆంధ్రపత్రికాముఖమున వెల్లడిపఱచిరి.

మీఁది సందేహము సయుక్తికము. ఎటులనయిన దానిని పోఁగొట్టుట విహితము. లేనిచో వసుచరిత్ర కర్త యనుచితపుఁగూర్పు కూరిచినాఁడను నపవాదము వాఙ్మయలోకమున వ్యాపించును. అతఁ డిట్టియనౌచిత్యమును నిబంధించుటయు నసంభవము.

ఇచట నీక్రిందిసమాధానము నరయునది:

పతివ్రతయగు గంధఫలియను నాయిక తన నాయకుఁడు సారంగము నాయికాంతరవ్యాసక్తుఁడయి

తనదరికి రాకపోఁగా తన దుర్గతికి మదిని చింతించి తత్సాంగత్యమును బొందఁగోరి పంచాగ్ని మధ్యమున నిలిచి తీవ్రముగ తపంబొనరించెను. తత్ప్రభావమున నామె యం దనితరనాయికాసాధారణమగు తేజము సంక్రమించి యామెసౌందర్యమును లెస్సగ పోషించెను. మఱియు వనితలకు ఎన్నెన్ని యుత్కృష్టగుణములు విహితములో ఆవన్నియు నీమెయందు పుంజీభవించి యుండెను. లోకోత్తమములగు తన్నాయికాసౌందర్య సౌశీల్యాదుల కచ్చెరువంది తత్సహస్రాంశము నయినను సంపాదింపనెంచి, ఆమె ననుకరింపవచ్చి ఆమె యనుగ్రహమును నిరీక్షించుచున్న మధుకరీనివహ మిరువంకల నిలిచి యాడిగమూసలుపుచున్నవి. "గురుశుశ్రూషయా విద్యా."

ప్రయోజనము నాసించి వచ్చుటచే ఆనాయికలకు తపస్వినియగు నాయికయెడ సపత్నీభావమును నశించినది.

సారంగనాయకుఁడు తనప్రియురాండ్రకొఱకు తిరుగుచు, వారిని ఎచ్చటను కనఁజాలక, అవి యున్నయెడకు, అనఁగా తననాయికసన్నిధికి వచ్చియేతీరును. అప్పుడు తపఃప్రభావమున లోకోత్తరసౌందర్యమును గుణగరిమమును వహించిన నాయికను గాంచి ముగ్ధుఁడయి ఆమెకు పదదాసుఁడు కాకతప్పదు. మఱియు సౌందర్యాదినిధానములని తానెంచిన ప్రియురాండ్రు తన ప్రథమప్రియురాలికి దాసులగుటచే, ఆ ప్రియురాండ్రదాసుఁ డను నతఁడు నాయికకు దాసుఁడు కాకుండు టెట్లు?

నాయికకు దాసానుదాసుఁడను సారంగ మచట ఉన్నట్లు వర్ణనమున లేదే? అది సరిపడునా?

సరిపడకేమి? నాయికయెడఁ దా నొనరించిన యపరాధము సామాన్యమయినది కాదని యెంచి యతఁడు తనముఖమును ఆమెకుఁ జూపుటకు మిగుల లజ్జించెను. నాయిక యొక్కరితయున్నచో ఆమెపాదములపైఁ బడి క్షమింపవేఁడవచ్చును. కాని యిపు డచ్చట "మధుకరీపుంజ" మున్నందున సారంగము గంధఫలిని జేరుటకు మఱియు లజ్జించెను. మఱియు "స్వైరవిహారధీరలగు సారసలోచన లున్నచోటికి భోరున లాఁతివారు చనఁబూనినచో రసభంగ" మగును. కావున నాతఁడు వారిం "జేరక పూవుదీవియలచెంతనె నిల్చి" లోకోత్తరసౌందర్యవిలసితయగు నా "లలితాంగిరూపు కన్నారఁగాంచి" ముగ్ధుఁ డగుచుండెను. పొంచియుండి ఆనందించువానిని మనముమాత్రమేల బయటికీడ్వవలెను?

నాయకునికొఱకుఁ దపస్సుచేసిన నాయిక ఆ సవతులయాడిగమునకే మురియుచు నాయకుని మఱచినదా యేమి? లేదు. ఆమె యతనిని మరువనులేదు. అతనింగూర్చుటకు పునఃప్రయత్నమును చేయనులేదు.

మంచిచెడ్డల నించుకేని విచారింపక నాథుఁడు తన్ను కాలఁదన్నినాఁడు. నాయిక తపస్సుచేసి లోకోత్తరసౌందర్యమును గడించినది. నాయకుఁ డెట్లును ఆమెదగ్గఱకు రాకతప్పదు. ఇట్టియెడ నామె తత్సమాగమముకొఱకు పునఃప్రయత్న మేలచేయవలెను? ఆమె సౌభాగ్యమదమున గర్వించిన గర్వింపవచ్చును. ఇంతకష్టపడి తపంబొనరిచి యింకొకసారి కాలఁద్రేఁ బడుటయా? ఆమె తగినపనియే చేసినది. "ఆర్జవం హి కుటిలేషు న నీతిః" "వ్రజన్తి తే మూఢధియః పరభవం భవన్తి మాయావిషు యే న మాయినః."

నాయికకోరిక ఫలించినది. నాయికా చక్రవర్తిత్వ మామెకబ్బినది. ఇఁక అఱనిముసమేని నాయకుఁ డామెను విడువ వీలుకాదు. నాయకుఁ డభిలషింపఁదగినదియు నంతే. అతఁడు ధన్యుఁ డయినాఁడు.

* * * * *

పయి వ్యంగ్యార్థ సమన్వయమున సమాసోక్తి భంగముకాని, అనౌచిత్యదోషముగాని కలుగదు. మానవతి యగు నాయిక తన్ను తిరస్కరించిన భర్త వశపఱచుకొనుటకుఁ దపస్సుచేసి యతని ప్రియురాండ్ర సందఱిని తన పదదాసులనుగఁ జేసికొనుటయే యిందలి అప్రస్తుతవృత్తాంతము. ఆ సమాసోక్తివలన నాయక సమాగమము వ్యంగ్యము.

* * * * *

పయిపద్యమునందలి "మధుకరీపుంజంబు" అనుచోట మగతుమ్మెదలనే గ్రహింపవలెననియు, "పుంజంబు" అని "సామాన్యే నపుంసకమ్" అను న్యాయమున నపుంసకలింగము కలిగెననియు, "గంధఫలి" కోరిన నాయకపుంజమే యిచట వివక్షింపఁబడెననియు తలఁపవచ్చునని కొందఱి యూహ. ఇచట "పుంజము" సమూహవాచకము. "మధుకరీ" శబ్దము స్త్రీప్రత్యయ విశిష్టమయినదే యిచటనున్నది. అది ఎటులను నపుంసకలింగము కాఁజాలదు.

పతివ్రతయగు నాయిక నాయకసమాగమము కొఱకు తపస్సుచేసినది. ఆమెకు తనభర్త యొక్కఁడే కావలెను. పరపురుషులు గుంపులుగుంపులుగా ఆమె సన్నిధికి వచ్చిన నేమిలాభము? ఆమె వీరిని కన్నెత్తి చూచునా? ఈపిలువని పేరంటము లేల?

ఒకవేళ నాయిక సామాన్యస్త్రీయే యనుకొనుఁడు. అటులయినను నాయిక వలచిన ప్రియుఁడు రాక ఇతరులు వేలకొలఁది వచ్చినను ప్రయోజనము లేదు. ఆమెతపస్సు నిరర్థకము.

మఱియొకసంగతి. "గంధఫలి" "సారంగము" కొఱకు తపమొనరింప "మధుకరములు" వచ్చుట ఉచితము కాదు. "సారంగ" మే వచ్చి తీరవలెను.

---



చెఱసాల

K. P. S.

# మనుచరిత్రములోని యొకపద్యము

కురుగంటి సీతారామయ్య

ఎందే డెందము గందళించు రహిచే
నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికా
శ్రీదోఁప నెందెందుఁబో
కెందే నింద్రియముల్ సుఖంబుఁ గను నా
యింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు
నంతర్బుద్ధి నూహింపుమా. (౨-౮౨).

పైపద్యముయొక్క పాఠము కవులచేతను, పండితులచేతను ఇంతవర కంగీకరింపబడుచున్నది. ఇప్పటికి ప్రచారముననున్న టీకలన్నియు నీపాఠమునే గ్రహించి యర్థమును రచియించినవి. "ఆ, యింపే" యను దానిలోని "ఆ"కు వెనుకనున్న పద్యమును మూడువాంతరార్థములుగా విడదీసి వానిమూడిటిని పై "ఆ"కు సంబంధింపజేసినవి. ఆయవాంతరార్థముల నీక్రిందివిధముగా నిచ్చుచున్నాను:

(౧) ఎందేన్, డెందము, రహిచేన్, కందళించున్.

(౨) (ఎందున్) (డెందము) ఏకాగ్రతన్' కుంభగతప్రదీపకళికాశ్రీ దోఁపన్, నిర్వృతిన్' చెందున్.

(3) ఎందెందున్, పోక, ఎందేన్, ఇంద్రియములు, సుఖంబున్, కనున్.

పైవిభాగము ప్రకారము రెండవయర్థముకొరకై "ఎందున్", "డెందము" నను రెండుమాటల నధ్యాహారము చేసుకొనవలసియున్నది. వీనిలో "ఎందున్" అనుపదమును తెచ్చుకొనకుండ "ఎందెందున్" అను దానిలోని మొదటి "ఎందున్" పదము నన్వయించుకొనుటకు వీలులేదు. "ఎందెందున్" అను పదము సంధితో నేర్పడిన సమష్టిపదము. కావున సమష్టిపదముగానే గ్రహింపనగును.

కొంతకాలమునుండి నాకీయర్థము సందేహాస్పదముగా నుండెను. పెద్దనగారియభిప్రాయ మిట్లేమైయుండునా యని తోచుచుండెను. కించిజ్జ్ఞుడ నగుటచే నాసందేహమును తెలియచేయుటకు వలయు సాహసము లేకపోయెను. ఇట్లుండ నాకు తంజావూరున నుండు భాగ్యము కొన్నిసంవత్సరములక్రిందట తటస్థించెను. అప్పుడచ్చటి సరస్వతీమహాలుగ్రంథాలయమునందలి మనుచరిత్రముయొక్క ప్రతులను చూచితిని. అందలి యొకప్రతిలో పైపద్యము పైనచెప్పబడినట్లే వ్రాయబడి ప్రక్కన "చి" యని వ్రాయబడియుండెను. దానిపై దృష్టియుంచి యూహింపగా నాసందేహము తీరెను. పైపద్యమున "గందళించు" కు మారుగా "గందళించి" యుండవలయునని నాసవినయమగు ప్రార్థనము. నాకుతోచినకారణముల నిట మనవిచేయుచున్నాను. ఆనందము నొడగూర్చుటలో పనిచేయునవి 'మనస్సు' 'ఇంద్రియములు' నను రెండువిషయములు. అందు[illegible]న పెద్దనచే రెండవాంతరార్థములే యభిప్రేతములని యూహింపనగును. దీనికి పద్యమునందలి ప్రథమపాదాదియందును, తృతీయపాదాదియందును నుపయోగింపబడిన "ఎందేన్" అను రెండుప్రయోగములు తార్కాణములు. ప్రథమార్థమున "డెందమును", ద్వితీయార్థమున "ఇంద్రియము"ను కర్తగా నుండవలెనని పెద్దనగారి యభిప్రాయమని తోపకమానదు. తృతీయార్థమని చెప్పబడు దీనికి "ఎందేన్" ఉపయోగించిన పెద్దనగారు నిజముగా మూడర్థములనే వ్రాయదలచిన మరియొక "ఎందేన్" ప్రయోగింపలేకపోయెనా? రెండుపదముల నధ్యాహారములుగా తెచ్చుకొనునట్లు పద్యమును పెద్దన వ్రాసెననుట సమంజసమా? రెండర్థములే యున్నవన్న

# రజతోత్సవములు

"నావిష్ణుః పృథివీపతిః"

బ్రిటీషురాజ్యాంగపరిణామమునందు గత మాసమునందు జరిగిన శ్రీ పంచమ జార్జి చక్రవర్తిగారి జ్యూబిలీ యుత్సవము లోక విచిత్ర పర్వము. బ్రిటీషురాజ్యాంగములందు రాజస్థితిని నిర్ణయించుట దుర్లభము. "రాజు భగవంతుడు" అనుసిద్ధాంతము ప్రజాస్వామిక పరిణామమును పొందగల విధమునకు బ్రిటీషు రాజ్యాంగపరివర్తనము ప్రమాణముగ నున్నది. రాజులు ప్రజారాధనపరాయణులై ప్రజాగౌరవమును బడయగల విధమునకు బ్రిటీషు రాజ్యాంగములు వ్యాఖ్యానములుగ నున్నవి. బ్రిటీషుసామ్రాజ్యమునకు జార్జిచక్రవర్తి పేరునకు సార్వభౌముడైనను భిన్నప్రాంతములకు- ౧. పరాధీనరాజ్యములు, ౨. రాజాధినివేశ రాజ్యములు, 3. అధినివేశరాజ్యములు ౪. స్వదేశములు మొదలగువానికి-భిన్నమైన రాజ్యాంగపాశబంధములు గలవు. భిన్నములైన రాజ్యాంగపాశబంధములకు రాజు మూలవిరాట్టు. మొదటి చార్లెసు కాలమునుండియును వర్తమానకాలమువరకును నిరంకుశ రాజ్యాధికారము నియమిత రాజ్యాధికారముగను మారిన విధము రాజ్యాంగ పరిణామమునకు ప్రమాణము. అవ్యక్తమైన దేవునకు వలెను అవ్యక్తమైన రాజ్యాధికారమునకును ధూప దీప నైవేద్యములను సమర్పించుట సులభము. రాజాధిరాజులు, రాజులు, ప్రభువులు, కార్మికులు, పూర్వాచారప్రియులు, సంస్కరణప్రియులు, జాతీయవాదులు, మితవాదులు స్వేచ్ఛానుసారముగను రాజభక్తిని వెల్లడిచేయుట కవకాశములు గలుగుచున్నవి. రాజభక్తి వ్యాజమునను స్వార్థారాధనమున కవకాశములను జ్యూబిలీ యుత్సవములు గలుగజేసినవి. బ్రిటీషు సామ్రాజ్యాభిమానులకు సామ్రాజ్యపాశబంధములను దృఢతరము చేయుటకు వినియోగపడుచున్నవి. జూబిలీ యుత్సవములు బ్రిటీషు జాతీయపక్షమునకు బలప్రతిష్ఠలను సమకూర్చుటకు వినియోగపడినవి. కాంగ్రెసు జ్యూబిలీయందు తటస్థభావమును వహించుటయును సామ్రాజ్య పరిస్థితుల కనురూపముగ నున్నది. హిందూస్థానమునందు జ్యూబిలికి వసూలైన ద్రవ్యము సద్వినియోగ మగుట ప్రశంసనీయము. చెన్నరాష్ట్రమునందు వసూలైన ద్రవ్యమునందు రూ. ౬౬,౦౦౦ శ్రీరామకృష్ణ వసతిగృహమునకును, రూ. ౪౦,౦౦౦ సేవాసదనమునకును, శేషించినది ఇతర ధర్మసంస్థాపనలకును వినియోగపడుట జ్యూబిలీకి ధర్మప్రయోజనమును సమకూర్చినది. జార్జి సార్వభౌముని రాజ్యకాలము బ్రిటీషు సామ్రాజ్యచరిత్రమునందు పరివర్తనకాలముగ నున్నది. అధినివేశ రాజ్యములు స్వతంత్రరాజ్యములు గాగోరుచున్నవి. ఐర్లాండు స్వాతంత్ర్యమును ప్రకటించినది. హిందూస్థానము పూర్ణస్వరాజ్యమభిలషించుచున్నది. గ్రేటుబ్రిటనునందు సాంఘిక కార్మికపక్షబలము వ్యాపించుచున్నది. సామ్రాజ్యాభిమానులు సంగ్రామజ్వరపీడను వ్యాపింపజేయ సమకట్టుచున్నారు. ప్రపంచమంతయును సంగ్రామగర్జనములతో ప్రతిధ్వనించుచున్నది. స్వాతంత్ర్య నిర్బంధములకును, శాంతిసమరములకును, నిర్మాణసంహారములకును ప్రచండసంరంభము సంప్రాప్తమగుచున్న సమయమునందు శ్రీ జార్జి సార్వభౌముని సౌమ్యశీలము రజతోత్సవపరిణామమును పొందుట బ్రిటీషు సామ్రాజ్యసంరక్షణమునకు సాధనభూతముగ నుండుటకు భగవంతు డనుగ్రహించుగాత !



రామ్సే మాగ్డనాల్డుగారు



బాల్డ్విను గారు



సర్ శ్యామూలు హోరుగారు



జట్లండు ప్రభువుగారు

రసభంగమగునా? ఏమియును లేదే? "కంపళించు" పదమును లక్షణార్థముననే గ్రహింపవలయును గదా? "డెందము వికసించి నిశ్చలమైనసౌఖ్యమును చెందునో" యని యర్థము చెప్పుకొనుటలో రసభంగము కాకపోవుటయేగాక సరసముగా నున్నదనుట స్పష్టము. ఆనంద ప్రాప్తిని చెందువిషయములు రెండే యైయుండగా పెద్దనగారు రెండుమార్లు "ఎందేని" పద ముపయోగించి యుండగా దానిని రెండవాంతరార్థములుగా విడదీయక మూడుగాచేయుట "గౌరవ"మను దోషమునకు తావిచ్చుట యగును. గౌరవముకంటె లాఘవము మీమాంసాన్యాయానుసారముగా నున్నది.

"ఏవిషయమునందు శక్తిచే మనంబు వికసించి, కుంభమున నుంపబడిన దీపమువలె నేకాగ్రమై సుఖంబు చెందునో, ఏవిషయమందు నింద్రియము లిట్టట్టు చలింపక సుఖంబును పొందునో యట్టి విషయానందమే పరబ్రహ్మము" అని యర్థము చెప్పిన నిప్పుడున్న టీకల కంటె సమంజసముగ నుండుటయేకాక పెద్దనయం "దర్థగౌరవ" లోపము నాపాదింపజేయనివారము నగుదుము. పదముల నప్పుతెచ్చుకొనునవసరముపోవును.

"డెందము నిర్వృతిం జెందునో"

"ఇంద్రియముల్ సుఖంబుగనునో."

పై విధముగా రెండర్థములే పెద్దనచే నభిప్రేతము లని నా దృఢమైనవిశ్వాసము. సహృదయులు దీని విమర్శించి "గందళించి" యనుపాఠాంతరము నంగీకరింతురుగాక యని నమ్ముచున్నాను.



# ఆధునికాంధ్రవాఙ్మయము—స్త్రీలు

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు

౬

**కే**వలము ఆధునికమార్గములనే అనుకరింపక ప్రాచీనపద్ధతులనుసహిత మలవరచుకొని చక్కని భావములతో పద్యముల నెలయించుచున్న నేటి కవయిత్రులలో శ్రీమతి చిల్కపాటి సీతాంబగారొకరు. శ్రీ సీతాంబగారు ఆంధ్రశ్రీవైష్ణవులు. ౧౯౦౦ సంవత్సరమునం దీమె జన్మించెను. ఈమెపుట్టినిల్లు నెల్లూరుజిల్లా కలికివాయి; మెట్టినిల్లు రాపూరుతాలూకా ఆదూరుపల్లె. ఈమె 'కౌండిన్యగోత్రవిఖ్యాత రాఘవార్యునకు మంగమాంబకు నాత్మజాత'; 'అనఘ వేంకట నారసింహార్యపత్ని.'



శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

[Courtesy : Grihalakshmi]

శ్రీ సీతాంబగారు 'పద్మినీపరిణయ' మను శృంగారప్రబంధమును, 'క్షీరసాగరమథన' మను నాటకమును, 'దిలీప' యను ఏకాంకరూపకమును రచియించిరి. పద్మినీపరిణయమను కావ్యమునందు నన్యాంధ్రసాహిత్యమునందు గన్పట్టుచున్న క్రొత్తతీరుపోకడ లేవియు కానరావు. ఇందు చంద్రోపాలంభము, మన్మథదూషణ, విరహతాపము, వనవిహారము, ఋతువర్ణనములు, జలక్రీడ, పుష్పలావికావిలాసము మొదలగు మహాకావ్యలక్షణములన్నియు సక్రమముగ అనుకరింపబడినవి. ఈకవయిత్రి నిర్ణయించుకొనిన కథావస్తువు సహితము పెక్కుప్రాచీనకావ్యములందలి కథావస్తువులను బోలి యలరుచున్నది.

రత్నగర్భుడను రాజు శోభావతీపురము నేలుచుండెను. ఇతడు సంతానమునకై పెక్కుదానములు గావించి ఫలములేనందున విసిగి మిన్నకుండెను. ఒకదినమున నారదు డాతనికడ కరుదెంచి, ప్రతిదినము తులసీవ్రతము గావించిన సంతానము కలుగునని తెల్పి వెడలిపోయెను. రత్నగర్భుడును, ఆతనిభార్యయగు గౌతమీదేవియు, ప్రతిదినము తులసిపూజ గావింపదొడగిరి. కొంతకాలమునకు వారికొకపుత్రిక యుదయించెను. ఆమెయే పద్మ.

కొన్నిదినములకు పద్మినికి వయసు వచ్చినంతనె, అమరావతిని పాలించుచున్న శూరసేనుని కుమారుడగు మాధవున కాతన్వంగి నొసంగి వివాహముగావింప రత్నగర్భుడు తలచెను. పద్మినిగూడ మాధవుని మనసారా ప్రేమించుచుండెను. ఒకదినమున పద్మిని, చెలికత్తెయగు కళావతికి తనహృదయము నెఱిగించెను. మాధవుని దర్శించి, పద్మినియొక్క ప్రేమ నాతనికి దేటపరుపదలచి కళావతి ఒక యోగివేషముదాల్చి అమరావతి కేగెను. ఈయోగియెడ మాధవునకు భక్తి కుదిరెను. ఒకదినము మంచిసమయమున పద్మిని హృదయమును మాధవున కెఱుకపరచి, వెంటనే శోభావతీపురమునకు తిరిగి

వచ్చి, మాధవుని రూపపటమును పద్మినికొసగి, కళావతి తనపని నెరవేర్చుకొనెను.

రూపపటమును తిలకించి పద్మిని విరహార్తయై విలపించుచు నొంటిగ నుద్యానవనంబున నున్నపు డొక కాపాలికుడు కాళికాదేవి కామెను బలియొసగ దలచి, బలవంతముగ నామె నెత్తికొని సమీపారణ్యమును ప్రవేశించెను. అదృష్టవశమున ఆ యరణ్యమున తిరుగుచున్న మాధవు డాకాపాలికుని సంహరించి పద్మినిని రక్షించెను. ఇరువురు నొండొరుల దెలిసికొనిరి. తరువాత వారు అమరావతి కేగిరి. రత్నగర్భ డీ యుదంతము నెరిగి సపరివారముగ నమరావతికేగి అచట తన పుత్రునకు వివాహము గావించెను.

ఈ గ్రంథమును పఠించునపుడు 'రుక్మిణీకల్యాణము'న రాయబారము నడపిన భూసురుడు, 'విజయ విలాసము'నందు కపటత్రిదండివేషమున రైవతకారామ వాటికి పయనమైన అర్జునుడు జ్ఞప్తికి వత్తురు. మరియు అనపత్యుడగు భూధవుడు నారదుని యుపదేశము, వ్రతములవలన సంతానము గాంచుట మొదలగువిషయములు మనకు క్రొత్తవి కానేరవు. కథావస్తువును బట్టియే కావ్యము పూర్వపద్ధతుల ననుసరించుచున్నది. ఈకాలమునం దిట్టిగ్రంథముల వెలయించి పాఠకుల యప్పనపడయుట సామాన్యమగు విషయము కానేరదు.

'శారదపూర్ణిమాద్యుతి ది
శల్ రమణీయముగాగ నిండుటల్
గోరువలు న్మకంబులును
గోరి హుళాహుళిగాగ గూయుటల్
మారుడు సాయకంబులను
మాటికి నేయగ నోర్వలేక య
వ్వారిజగంధి యేడ్చె బిక
వాణిని గేరు కలస్వనంబునన్.'

అను పద్యమున పొందుపరుపబడిన విరహార్తయగు స్త్రీ వర్ణనము

'కోమలంబులౌ చిగుళ్లగొంచు జీర్ణపర్ణముల్
భూమిమీదరాల్ప వేడ్కబూను తరులగాంచ నా
రామలక్ష్మి యవ్వసంతురాక నెంచి పచ్చనౌ
కోమలాంబరంబు దాల్చుకొన్న లీల గన్పడెన్.'

అను వసంతఋతువర్ణనము, మఱియు వనవిహారమును దెలుపు

'అలసితివమ్మ చాల వికచాంబుజపత్రవిశాలనేత్ర! మే
మలరులగోతుమమ్మ యిటులందము నై తను పూలపాన్పునన్
బోలుపెసగంగ విశ్రమము పొందగదమ్మ విరుల్ గ్రహించుచున్
జెలువుగ నంతిసీమకును జేరగబోవుదమమ్మ నెమ్మదిన్.'

అను పద్యము ఒకింత రమ్యముగ నున్నవి.

'తమ్మి యరవిచ్చి వలపులు ధరణి నెల్ల
గ్రమ్మకొనసాగ కొదమభృంగమ్మ జేరి
యలరు తేనియ గ్రోలగావలయు నింక
నంబుజాననలార ముదంబు మీర.'

ఈపద్య మొక ప్రకృతిసూత్రము నాధారపరచుకొని కథావస్తువున కనుగుణముగ నొక చక్కని భావమును బయల్పరచుచున్నది.

ఈపద్మినీపరిణయమునందు శ్రీ సీతాంబగారు తమ వ్యక్తిత్వమును (Individualism) చక్కగా ప్రదర్శించిరి. ఈ గ్రంథ మొక నారీమణిచే వ్రాయబడిన దని పాఠకున కెఱుక లేకున్నను ఇందు కొన్ని పద్యములను పఠించినంతనె తెలిసికొనగలడు. పెండ్లికూతురును వర్ణించునపుడు 'వలిపె చెంగావిపట్టువల్వ గట్టి గరిమ సరిగంచు అవికె వేడ్కలర దొడిగి, వెంట్రుకల నార్చి కీల్గంటునైచి', 'నెలిపట్టు చీరెగట్టగ నిచ్చి యాకుపచ్చ సైక దొడగి' మొదలగు వాక్యములతో స్త్రీలకు వస్త్రముల నలంకరించుటలో గల ప్రజ్ఞను విశదపరచుచున్నారు. శ్రీ సీతాంబగారు ఆంధ్రవైష్ణవులు. అందులకే పెండ్లిభోజనమునకు వచ్చిన బందుగులు

'చక్కెరయు గదళిఫలములు
మక్కువతో ద్రాక్ష మంచిమామిడిపండ్లున్

చిక్కని మీగడపెరుగులు
జక్కగ సాపడిరి బుధవితానముతోడన్.'

అనియు, పద్మిని చెలికత్తెయగు కళావతి యోగివేషము దాల్చినపుడు 'శారదాపూర్ణిమాచంద్రు గేరు మొగంబున' నూర్ధ్వపుండ్రంబును పొందుపరచె ననియు, పద్మినీమనోహరుడగు మాధవుడు 'నగు మొగంబున గీరునామంబు' నలంకరించినట్లును, వర మొసంగవచ్చిన సురహూని సహితము 'ఊర్ధ్వపుండ్రంబు' ధరించె ననియు వర్ణించి తమ వైష్ణవసంప్రదాయాభిమానమును వెలువరించిరి. ఏవిషయమునుగూర్చియైనను తన నిజాభిప్రాయమును వెలువరింపగలవాడే నిజమగు కవి. లోకమునకు వెరచి, వ్యక్తిత్వమును చంపుకొని, ఆవేశమును అణచివైచుకొని, నిస్సారమగు గ్రంథములను వెలువరించుటవలన లాభము లేదు. ఆధునికాంధ్రకవులలో నిర్భయముగ అభిప్రాయములను వెలువరింపగలవారిసంఖ్య చాల తక్కువ. ధనాపేక్షచే పరులను ప్రశంసించుచు పద్యములను వ్రాయుటయందే తమ కాలమునంతయు వమ్మొనరించి, స్వతంత్రాభిప్రాయములను గోల్పోయి, గ్రంథములయందుసహితము పొగడ్తలతో కాలము పుచ్చు అలవాటు తెనుగుకవుల కిప్పుడిప్పుడే తొలగిపోవుచున్నది. కొలది వత్సరములనుండి ఆంధ్రవాఙ్మయమునందు గన్పట్టుచున్న ప్రశంసనీయమగు మార్పులలో నిదియొకటి. కవయిత్రులయందును శ్రీమతులు వరలక్ష్మమ్మ, సీతాంబ, రుక్మిణమ్మగార్ల రచనములందొకింత వ్యక్తిత్వ ప్రదర్శనము గానవచ్చుచున్నది.

శ్రీ సీతాంబగారు 'వీరచంద్రావతి' యను శీర్షిక క్రింద వెలువరించిన పద్యములు వారి కూర్పునేర్పును, ఆవేశమును విశదపరచుచు ఎంత రమ్యముగ నున్నవో తిలకింపుడు.

వీరచంద్రావతి యశవంతసింహుని పట్టపురాణి. అలంగీరుపాదుషా సైనికులతో యుద్ధముసల్పుచు, యశవంతసింహుని సేనలు వెనుదిరిగినప్పుడు చంద్రావతి కోటబురుజుపైనుండి:

'పందలవోలె నొక్కనికి
బానిసలై భుజశౌర్యమేని రా
జ్యేందిర నిట్టు క్రూరమతి
నేల నరాతులకిచ్చి దీనులై
యుందురె భారతీయులన
నొప్పునె మిమ్ముల మాతృభూమికిన్
జెందినపాటు గన్గొనుడి
సీ పరివారలు నవ్వరే మిమున్.'

'ఆజికి దప్పి శత్రువుల
కౌదలలొగ్గితిరేని మేమికన్
గాజులనూడ్చి కత్తులను
కత్తళముల్గొని వైరిసేనలన్
తేజమడంచి యీభరత
దేశము కున్నతిగూర్చి హైందవ
స్త్రీజనశౌర్యము దెలిసి
చేతులుమోడ్పగ జేతు మీతరిన్.'

అని ప్రబోధించెను.

శ్రీ సీతాంబగారు మనుష్యప్రకృతిని బాగుగా తెలిసికొనియున్నారు. బాల్యదశయందును, తారుణ్యదశయందును, స్థవిరదశయందును మానవునకేరీతి మనమునం దాలోచనలు రేకెత్తునో చక్కగా విశదపరచి తమప్రతిభను వెల్లడించిరి. బాల్యమున

'చాల మిలమిల మెరయుబంగరు
చాయలను నాకసమునంతయు
బాలభానుడు బరపె నిది యే
ప్రభుని యానతినో'

అనియు,

'వేలువేలుగ నన్ను బోలిన
బాలకులు బాలికలచే దగి
చాల శోభిలు ధరణి యెవ్వని
పాలనంబుననో'

అనెడి వింత యనుమానములు కలుగుననియు,

'అన్నిటికి దా ప్రభువరుండై
తిన్నగా జగమేలునాతడు

కన్నులకు గనరాక యుంటకు
కారణం బేమో ?'

అను సంశయముగూడ బాలకుని మనమునం దొకప్పుడు కలుగునని తెల్పి, శ్రీ సీతాంబగారు బాలకుల నిర్మల హృదయములను, పవిత్రములగు ఆలోచనలను పాఠకునకు విశదపరచిరి.

తారుణ్యదశయందు మానవుని భావములయందు గొప్పమార్పు గోచరించును. అందులకే బాల్యమున

'చాల మిలమిలమెఱయు బంగరు
చాయలను నాకసమునంతయు
బాలభానుడు బరపె నిది యే
ప్రభుని యానతినో'

అని సూర్యుని గాంచినంతనె కలిగిన తలంపులు తారుణ్యదశలో సూర్యుని గాంచినపుడు

'బాలభానుని దలచునంతనె
పద్మినీసతి యలరు, వీరల
కోలి ప్రణయపు విద్దె నేర్పిన
యొజ్జ యెవ్వరోకో ?'

అని వింతరీతి మారిపోవును. ఒకేవిషయముపట్ల బాల్యయౌవనదశలయందలి భావము లెంత భేదముగ నుండునో చక్కగా విశదపరచిన ఈకవయిత్రి నేర్పు కొలది కరానిది.

'సతిసుతాదులు వెంటరారట
అతికఠినుడట కాలు డిక నే
గతియు కాలము చేరువట నిక
గాచువారెవరో ? '

అని స్థవిరదశయందు మానవుడు వాపోవునట్లు చిత్రించి శ్రీసీతాంబగారు పాఠకునకు చక్కని నీతిని గరపుచున్నారు.

ఈస్థవిరదశను వర్ణించునపుడు

'అంచితాంగ విశేష మడగుచు
నతిబలము శల్యానుగతమై
సెంచ భీమగదాహతికి తను
వీటుల ప్రమ్రగుచు భారతము నుప
మించి చూడగ దేహధర్మము
యిటుల మారెనుగా.'

అని పలికి, ఇందు ప్రకృతార్థమొకటి రెండవది భారతయుద్ధపర్యాయమని నుడివిరి. ఇచట భారతయుద్ధమునందలి విషయము ధ్వనించున ట్లేల శ్లేషకల్పింపబడెనో తెలియకున్నది. శ్రీ తిరుపతివేంకటేశ్వరులు 'పాండవవిజయము'న ప్రస్తావనయందు నటీసూత్రధారుల సంభాషణమున నటియొక్క కురులను, దాని సౌందర్యమును వర్ణించుచు ఒకచో నటిచేత

"కాలక్రమమునుమాట దలంచిన నీకురులసంతతియే కాదు
అంచితాంగాతిశయ మెల్ల నడగిపోవు
జవరకు బలంబు శల్యావశిష్టమగును
గడకు భీమగదాహతి గాల్గ గదప
లేక చెడు రాజరాజైన నీకయెడలి."

అని పలికించి, మానవుని స్థవిరదశను వర్ణించి, రాబోవు భారతయుద్ధ మేరీతిముగియునో ముందే పాఠకునకు వింతరీతి నెఱుకపరచి, తమ ప్రతిభను విశదపరచిరి. ఇచ్చట పొందుపరుపబడిన శ్లేష మిగుల యర్థవంతమై, నాటక మేరీతి ముగియునో, ముం దేమి రానున్నదో కొలదిగ సూచించిరి. ఉత్తమనాటకమున నుండవలసిన లక్షణములలో నిది యొకటి. దీనినే ఆంగ్లమున **Dramatic irony** అందురు. శ్రీ సీతాంబగారు మిగుల నేర్పుతో 'స్థవిరదశ' అను వ్యాసమున సమకూర్చిన శ్లేష ప్రయోజనకారి కాలేదు. ఇచ్చట భారతయుద్ధ ప్రసక్తికి తావు గన్పట్టదు.

ఈకవయిత్రి పద్యములు ప్రసాదగుణమును, అందులకు వన్నెగూర్చు ధారాశుద్ధిని కల్గి పాఠకుని అలరించును. కాని వీరిపద్యములయందు పెక్కు అర్థవంతములుగాని పదములు గన్పట్టుచున్నవి. పద్యమును దొల్లింపగల శక్తిమాత్ర మట్టిపదములకు గలదు. కాని అవి అర్థపుష్టిని గూర్పక పద్యపాదమున గణములతూకమున కమర్చబడిన 'పడికట్టుపదము'లవలె గన్పట్టును. ఈ పదములు

పద్యమునందలి యర్థమునకు గాని, పద్యగమనమునకు గాని అడ్డురావు. కాని అంతమాత్రమున వానిని విరివిగా నుపయోగించుట పాడికాదు. వీని నిక పైనరికట్టిన ఈకవయిత్రి గ్రంథముల కింకను ఎక్కుడు గౌరవము చేకూరగలదు.

కథావస్తువులను నిర్ణయించుకొనుటలో నీకవయిత్రి యొకింత ఆధునికపద్ధతుల నలవరచుకొనిన బాగుండును. పద్యము లెంతరమ్యముగనున్నను, వర్ణింపబడిన కథ ప్రాచీనసంప్రదాయముల ననుసరించియుండినచో, ఈకాలమునం దట్టి గ్రంథములు రాణింపవు. సజీవమగు భాషయందు మార్పులు కాలముగడచినకొలది వచ్చితీరును. కాలము మారినకొలది మానవులఅభిరుచులు, ఆశయములు మారుచుండును. క్రొత్తగ వెలువడుగ్రంథములు సహితము క్రొత్తయలంకారములతో నలరవలయును. ఆయాగ్రంథములయందలి కథావస్తువులయం దాయాకాలమునసంఘమునందు, రాజకీయవ్యవహారములయందు, వాఙ్మయమునందు గన్పట్టు మార్పులు తనరీతి ప్రతిబింబింపవలయును. అప్పుడే తెనుగుభాష సజీవముగా నున్నదని చెప్పవచ్చును.

మొత్తముమీద శ్రీ చిల్కపాటి సీతాంబగారి పద్యములయందు కఠినములగు సమాసములు, డొంకతిరుగుడుఅన్వయములు కానరావు. ఇట్టి యుత్తమలక్షణములతోపాటు వీరు మరికొన్ని క్రొత్తపద్ధతుల నలవరచుకొని గ్రంథములను వెలువరించి, ఆంధ్రభాషాయోషను తనరీతి అలంకరించి, ఇతోధికసుప్రతిష్ఠను బడయుదురని తలంతును.



# పూర్వకాలపు ప్రజాపరిపాలనాకక్షలు

తుంపూడి భగవంతంగుప్త

ప్రజలను చక్కగ పరిపాలించుట రాజుయొక్క విధాయకము. రాజకీయమన్నను, ప్రజాపరిపాలనమన్నను ఒకటే. అయినను, ప్రస్తుతము ప్రజాపరిపాలనావిధానములు కొన్నిటిలో రాజు ఉండుటయే లేదు గనుక రాజకీయమును ప్రజాపరిపాలనమని చెప్పుటయే సమంజసముగ నుండును. ఈప్రజాపరిపాలనము ఏవిధముగా జరుగవలసినది అను విషయమందు ప్రజలకు వివిధాభిప్రాయములు ఏర్పడియున్నవి; క్రొత్తవి యేర్పడుచున్నవి. ఒక్కొక అభిప్రాయము కలవారికి ఒక కక్షయని చెప్పవచ్చును. ఇంగ్లండులో కాన్సర్వేటివ్, లిబరల్, లేబర్, సోషియలిస్టుకక్షలు కలవు. మనదేశమందు కాంగ్రెస్, నేషనలిస్టు, ఇండిపెండెంటు, సోషియలిస్టు మొదలగు కక్షలు కలవు. ఈ కక్షలు జాతిమతములకు సంబంధించినవి కావనియు, ఒకజాతివారే ఒకమతమువారే వారిజాతినిగాని, మతమునుగాని విడువకయే వేరువేరుకక్షలకు చేరుచుందురనియు గ్రహింపదగినది. 'ఒక్కకుటుంబములోనివారే కక్షలుచేరి పనిచేయుచుండవచ్చును. భరతదేశపు ర్వచరిత్రను పరిశోధించిచూడగ ఇట్టికక్షలు మన దేశమందు పూర్వకాలమందును ఉండినట్లు ఏర్పడుచున్నది.

మనదేశమందలి ఆదిభారతీయులు కొందరు అడవులందును, కొండలందును నివసించుచుండిరి. కొందరు చదునుప్రదేశములందు గ్రామములు ఏర్పరచుకొని నివసించుచుండిరి. విదేశమునుండి మొదట భరతదేశము చేరినవారు తురేనియనులు, లేక ద్రావిడులు అని చెప్పబడుచున్నారు. వీరితర్వాత వచ్చినవారు ఆర్యులు. ఈ మూడుజాతులే రామాయణమందు వానరులు, రాక్షసులు, నరులు అని పేర్కొనబడినవి. వానరులనగా కోతులవలె వనములందు తిరుగువారని భావము. బ్రహ్మయొక్క తామసదేహమునుండి పుట్టినవారని చెప్పబడుటచేత వీరును ఆర్యులును ఒకజాతివారే అయినను ఆర్యులకంటె ముందుగా హిందూస్థానముచేరి శ్యామలవర్ణులు అయినవారని గ్రహింపదగినది. ఆర్యులు శ్వేతవర్ణులు.

ఆర్యులు ఉత్తరహిందూస్థానము చేరి అందు వ్యాపించుచుండగా వారియందు రెండుకక్షలు ఏర్పడినవి. ఒకకక్షవారి ఆదర్శము మూడుజాతులను ఐక్యముచేసి వారియందు ఆర్యనాగరికతను వ్యాపింపజేయుట. ఈకక్ష అన్నిజాతులకు స్నేహభావముగ మెలగుచుండుటచే దీనికి విశ్వామిత్రకక్ష యని పేరు వచ్చుచుండెను. ఈ కక్షనాయకుడు ఆదిభారతీయులకును ద్రావిడులకును ఆర్యపద్ధతులను అలవరచి తత్సూచకముగ వారికి గాయత్రీమంత్రము నుపదేశించి, వారిని ఆర్యసంఘమందు చేర్చుకొనుచుండెను. కనుకనే గాయత్రికి ఋషి విశ్వామిత్రుడు. రెండవకక్షకు అధిపతి వశిష్ఠుడు. ఈకక్షవారి సంకల్పము మూడుజాతులకును సంపర్కము లేకుండజేసి అనార్యులను ఆర్యుల ఏలుబడిలో నుంచుకొనుట. ఈరెండుకక్షలును ప్రస్తుతపు "నేషనలిస్టు" "కమ్యూనలిస్టు"కక్షలను కొంతవరకు పోలియున్నను రెండుకక్షలనాయకులు ఆర్యులే. ప్రాతకక్షలను ఇప్పటి "రిఫారము" "సనాతనిస్టు" పార్టీలకు పోల్చిన మరికొంత సరిపోవచ్చును. విశ్వామిత్రుడు అనుపేరుగాని, వసిష్ఠుడు అనుపేరుగాని ఒక మానవుని పేరు కాదనియు, ఆయా కాలమునకు ఆ కక్షకు నాయకుడుగ నుండినవాని పేరనియు గ్రహించదగినది. అనగా ఈపేర్లు పదవులపేర్లుగాని పురుష నామములు కావు. ఎన్నితరములు జరిగినను శంకరపీఠమును అధిష్ఠించినవానిపేరు శంకరాచార్యుడేగదా? ఒకరాష్ట్రమును పరిపాలించునది ఎవరైనను ఆయుద్యోగి పేరు గవర్నరుఅనియే చెప్పుచున్నారుగదా!

విశ్వామిత్రకక్షకు కాలక్రమమున పలుకుబడి హెచ్చుట సహజము. ఈకక్షకు చేరిన జనులసంఖ్య పెరుగుచుండెను. వీరు అనార్యులతో సంపర్కము చేయుచు వారి సహాయముతో రాజ్యాధిపతు లైరి. కనుకనే వేదకాలమందు ఋషిగ గ్రహింపబడిన విశ్వామిత్రుడు పురాణకాలమున క్షత్రియుడుగ భావింపబడెను. అనార్యసంపర్కమును నిరసించిన వశిష్ఠకక్షవారు మతగురువులుగ భావింపబడుటయు ఆశ్చర్యము కాదు. ఈ రెండుకక్షులకు పోరాటము కలుగుటయు, ఒకప్పుడు ఒక కక్ష, మరియొకప్పుడు మరియొకకక్ష విజయముపొందుటయు మనము నిరీక్షించదగినవిషయములే.

ఈకాలమున గాంధిమహాత్ముడు హరిజనోద్ధరణకు పూనుకొన్నట్లే పూర్వము విశ్వామిత్రుడు ఆశ్రమములను ఏర్పరచి అందు ఆదిభారతీయులకు శుచిత్వమును, విద్యాబుద్ధులను కరపుచుండెను. ఇట్టిఆశ్రమములందు తయారై సంగీతసాహిత్యవిద్యలందు నిపుణులైన మాతంగకన్యలకు రాజాంతఃపురమున ఉద్యోగముల నిమ్మని హరిశ్చంద్రచక్రవర్తిని విశ్వామిత్రుడు కోరగ, వశిష్ఠకక్షకు చేరిన ఆ చక్రవర్తి అందుకు అంగీకరింపడాయెను. హిందూ మహమ్మదీయసమ్మేళనమునకై తనవంశపుకన్యలను రాజపుత్రులకు ఇచ్చి వారి కన్యలను తనవంశమువారికి తీసుకొన్న అక్బరుచక్రవర్తి ప్రయత్నములను జాతివైషమ్యములను నిర్మూలముచేసి దేశమందుభ్రాతృభావమునెలకొల్పుటకేకదా! జమదగ్ని భార్యయగు రేణుకాదేవి విశ్వామిత్రకక్షకు చేరి ఇప్పుడు హరిజనోద్ధరణమని చెప్పబడు పూర్వకాలపు ఆదిభారతీయసంస్కరణోద్యమమునకు చేరియుండెను. జమదగ్ని వశిష్ఠకక్షకు చేరినవాడగుటచే ఆమెప్రయత్నములకు రోసి, ఆమెను తనగృహమునుండి వెడలగొట్టుటకు ప్రయత్నించెను. కాని తన కుమారులలో ఒక్కరుతప్ప తక్కినవారందరు తల్లిపక్షము వహించిరి. పరశురాముడుమాత్రము పితృవాక్యపరిపాలనకు ఇయ్యకొనెను. రేణుకాదేవి యిల్లువెడలి ఆదిభారతీయులను చేరి వారికి నాయకురాలగుటచే ఆమెచుట్టును చేరిన సంఘమునకు తల బ్రాహ్మణశిరస్సును, మొండెము చండాలదేహమును ఏర్పడెను. ఉత్తరార్కాడుజిల్లా పోలూరుతాలూకా పడవేడుగ్రామములోని పురాతన రేణుకాలయములోని ఈవిగ్రహమును హరిజనులు పూజించుచున్నారు. అనంతరముకట్టిన పెద్దఆలయములోనిప్రతిమను బ్రాహ్మణులు ఆరాధించుచు తలను మాత్రము పూజించుచున్నట్లు చెప్పుచున్నారు. రేణుకాదేవికి తల బ్రాహ్మణస్త్రీయొక్క తల యనియు, మొండెము చండాలస్త్రీ మొండెమనియు పురాణగాథలు చెప్పుటకు కారణము ఇప్పుడు స్పష్టమగుచున్నది. రాజపుంగవుడగు త్రిశంకువు గుణవంతుడును, విద్యావంతుడును అగుటచేత అతనిని బ్రాహ్మణుడుగ పరిగ్రహింపజేయుటకు విశ్వామిత్రుడు ప్రయత్నించెను. వశిష్ఠకక్షవారు ఇందుకు అంగీకరించకపోయిరి. మానవుని యోగ్యతలు ఎట్లున్నను జన్మము మారువరకు వర్ణము మారజాలదని వారి వాదముగా నుండెను. త్రిశంకువు బ్రాహ్మణుడగుటకు ప్రయత్నించినందు బ్రాహ్మణులు వానిని చండాలుడుగ భావించిరి. త్రిశంకుని బ్రాహ్మణునిగ భావించనియెడల వర్ణాములను పునర్నిర్మాణముచేయుటకు విశ్వామిత్రుడుసంకల్పించెను. త్రిశంకువిషయమై ఏకక్షసంకల్పమును సంపూర్ణముగ నెరవేరకపోవుటచే త్రిశంకుస్వర్గము అను సామెత ఏర్పడెను. విశ్వామిత్రసృష్టియనగా వర్ణములయందు విశ్వామిత్రుడు కలుగజేసిన మార్పు గ్రహించదగినది. బ్రహ్మసమాజమువారు, ఆర్యసమాజవారు, గాంధిమహాత్ముడు సంకల్పించిన సంస్కారములవంటివే పూర్వము విశ్వామిత్రకక్షవారిఆదర్శములు.

ఏదేశమందుగాని రాజులు, గురువులు ప్ర[illegible]ముగ ఏర్పడినతర్వాత వారికి కలతలు పొడముట తప్పదు. రోమక్సామ్రాజ్యమందు ఇది తప్పలేదు. ఇంగ్లాండునందు తప్పలేదు. ఐహికమందు సర్వాధికారము తమదని రాజకక్షవారు వాదింతురు. మానవులకు ఆముష్మికము ప్రధానమని గురువులకక్షవారు ప్రబోధము కావించుచుందురు. రాజులు ఆముష్మికవిషయములందును, గురువులు ఐహికములందును ప్రవేశించకుండు

నట్లు ఏర్పాటుచేసుకొనువరకు ఈపోరాటము తప్పదు. ఐహికాముష్మికములను ఇహలోకమున విడదీయుట సులభముకాదు. ఉభయకక్షులలో ఎవరిబలమో తగ్గటయే గత్యంతరము. ఈతగవులే పురాణములందు గాథరూపముగ చిత్రించబడినవి. వశిష్ఠాశ్రమమున నుండిన కామధేనువు ఈప్రజావశీకరణమే. ఆకాలమందు ఈవశీకరము మతగురువులయం దుండగా దానిని రాజకక్షువారు గ్రహింపగోరి అపజయము పొందిరి. ఇందువలన గురువులప్రభావము అధికమాయెను. వారు రాజుల పలుకుబడిని నిర్మూలముకావింప సమకట్టిరి. వశిష్ఠకక్షకు చేరిన పరశురాముడు ఈకార్యమును నిర్వహించెను. ఫ్రెంచిరివల్యూషనులో ప్రజాకక్షువారు రాజకక్షువారిని నాశనముచేసినట్లును, జర్మనినుండి హిట్లరుయూదులను తరిమివేసినట్లు, రష్యాలో సోవియటువైరులను దండించినట్లు పరశురాముడు నిర్దయుడై మెలగి కార్యసఫలతనొందెను. కాని దేశోద్ధరణకును, ఐకమత్యమునకును చేయబడు ప్రయత్నములు క్రూరత్వమువలన అంతరించజాలవు. దౌర్జన్యము అధికముగ నున్నప్పుడు అవి తలదాచుకొన్నను, తరుణము దొరకినప్పుడు వెలికివచ్చుచు గమ్యస్థానము చేరువరకు సంకల్పము విడువకుండును. అమెరికాఖండములోని యునైటెడ్ స్టేట్సులో జరిగినదియు ఇట్టిదే. ఐర్లాండులో ఇప్పుడు జరుగుచున్నదియు నిదే.

విశ్వామిత్రకక్షువారు తరుణముకొరకు వేచియుండిరి. తమయందలి లోపములను గ్రహించిరి. చెల్లాచెదరై దైన్యమునొందియున్న తమకక్షువారు ఐకమత్యముపొంది కార్యదీక్ష పూనవలయును. యువకులు నాయకత్వము వహించవలెను. ఆర్యుల నాగరికత దేశమంతటను వ్యాపించి జాతిసమ్మేళనము కావలెనన్న కొన్నిసంస్కరణలు కావలసియుండెను. ఆదిభారతీయులు దేశద్రిమ్మరులగుట మాని, గ్రామములు నిర్మించుకొని, వ్యవసాయము ప్రారంభించవలెను. వారి స్త్రీలందు స్వయంవిహరణము అంతరించి వివాహబంధములు ఏర్పడవలెను. ద్రావిడులందు నిరంకుశప్రభుత్వము అంతరించి ప్రజాహితప్రభుత్వము ఏర్పడవలయును. మతద్వేషము అడుగంటవలయును. యువకనాయకుడు ఇవి నిర్వహించుటకు సమర్థుడు కావలయును. విశ్వామిత్రుడు శ్రీరాముని ఈయుద్యమమునకు నియోగించి తయారుచేసెను. ఈయువకుడు తాటకిని సంహరించుటలోని భావము స్త్రీలోలత్వమును విడుచుట. అట్లు విడిచినవాడుగాని ఆదిభారతీయస్త్రీల స్వయంవిహరణత్వమును మాన్పజాలడుగదా! సుబాహువును సంహరించుటవలన శ్రీరాముడు బాహుబలముకలవాడని యేర్పడెను. స్త్రీలోలుడు కాకపోయినను బాహుబలము కలవాడైనను ద్రవ్యాపేక్ష లేనివాడుగాని ధనవంతుడైన ద్రావిడులను లోబరచుకొనజాలడు. శ్రీరామునిబాణము మారీచుని దూరముగాకొంపోవుటలో ఆయువకనాయకుడు ధనాశాపీడితుడు కాడని తెలుచున్నది. ఈమారీచుడు రాముని వీడి దూరముగా పోయినను, సీతాదేవి దరిచేరి, యామెను మోసగించి, దుఃఖసముద్రమున ముంచెను. బంగారులేడియనగా ధనకాంక్షయేగద! శ్రీరాముని గుణము లన్నిటిలో ఏకపత్నీవ్రతము ముఖ్యముగ కొనియాడబడెను. దశరథునికి ముగ్గురు భార్య లుండగా శ్రీరాముని ఏకపత్నీవ్రతమునకు ప్రాముఖ్యమిచ్చుటకు కారణమేమి? ఆదిభారతీయ స్త్రీసంఘ సంస్కరణావశ్యకతయే ఇదియని చెప్పవచ్చును. శ్రీరాముడు నాయకుడగుటకుముందు చూడవలసిన శోధనలు మరిరెండు కలవు- అహల్యాశాపవిమోచనము, శివచాపభంగము. అహల్య అనగా నాగలికి అలవికాని భూమి. ఇంద్రుడు మేఘాధిపతి. ఇంద్రజారత్వముచే, అనగా అధికవృష్టిచే మన్ను కొట్టుకొనిపోయి రాళ్లు బయటపడినప్రదేశము అహల్య అనిపించుకొనును. ఇట్టి స్థలములు వ్యవసాయయోగ్యములగు వరకు ఆదిభారతీయులు గ్రామవాసులు కానేరరు. వారికి గృహనివాసము ఏర్పడువరకు వారికి నాగరికత అబ్బదు. రాళ్లు రప్పలుగా నుండినచోట నవనవలాడు పైరుపచ్చలు లేచుట అహల్యాశాపవిమోచనమని చెప్పుటలో అతిశయోక్తి లేదు. శివుడు ద్రావిడులదైవము. ఆదినివాసులదేవతలు కాళి, కన్యక, కామాక్షి మొదలగు స్త్రీదేవతలు. శివచాపమును విరు

మటలో ద్రావిడమతమును వశీకరముచేసికొను సామర్థ్యమును శ్రీరాముడు ప్రదర్శించెను. శ్రీరాముడు సీతను పెండ్లియాడుటవలన కోసలకును, విదర్భకును సఖ్యము ఏర్పడెను. శ్రీరాముని నాయకత్వమువలన ధైర్యము జెందిన రాజన్యులు విశ్వామిత్రకక్షకు చేరిరి. ఈబలమును చూచి వశిష్ఠకక్షవారు సఖ్యమునకు అంగీకరించిరి. పరశురాముడు తన నాయకత్వమును విడిచి మళయాళదేశము వెళ్లిపోయెను. వశిష్ఠుడు ఆదిభారతీయస్త్రీయైన అరుంధతిని వివాహమాడెను. అనగా ఆదిభారతీయ సంపర్కము నంగీకరించెననుట. ఇట్లు ఇరుకక్షలు ఏకీభవించుటచే తలపెట్టిన కార్యము సులభసాధ్యమాయెను. ఈకాలమున హిందూమహమ్మదీయ సమ్మేళనము కలిగెనచో నిర్వహింపజాలని సమస్యలు మనదేశమున నుండవుగదా! వశిష్ఠవిశ్వామిత్రులవంటి ఉదార స్వభావములు ఇరుతెగలయందును పొడముటయే తడవు.

ఉత్తరహిందూస్థానమున ఐకమత్యము ఏర్పడి ధైర్యసాహసములు అంకురించినతర్వాత శ్రీరాముడు కార్యదీక్షవూనదగిన తరుణ మేర్పడెను. వృద్ధుడగు దశరథుడు మొదట విశ్వామిత్రునితో శ్రీరాముని పంపుటకు జంకినట్లే మరల యిప్పుడు జంకెను. భరతుని సామాన్యరాజకార్యమునకు నియోగించి విశ్వామిత్రోద్యమనిర్వహణమునకు సమర్థుడగు రాముని పనుప కేకయ రాజపుత్రి బోధించెను. ఈబోధ నింద్యార్హము కాదు. కైకేయియొక్క ధైర్యసాహసములు, బుద్ధివిశాలత్వము కొనియాడదగినవి. యువకనాయకుడు దండకారణ్యము ప్రవేశించి, దక్షిణాగ్రము చేరి సామ్రాజ్యము నెలకొల్ప పూనుకొనగా అతని అనుచరులు అయోధ్యయందు రాజ్యనిర్వహణము జరుపుచుండిరి. దశరథనిర్యాణముతో పూర్వపరిస్థితు లంతరించెను. యువజననాయకత్వము ఏర్పడెను. ఈనాయకత్వము ప్రజాసేవకొరకుగాని స్వప్రయోజనముకొరకు గాదు. భరతుడు అయోధ్యయందలి మేడలలో నివసించలేదు. కుగ్రామముగు నందిగ్రామమున కటికిభూమిని నిద్రించుచుండెను. శ్రీరాముడు నారచీరలు ధరించెను.

శ్రీరామునికిముందు దండకారణ్యముచేరి విశ్వామిత్రసంకల్పములను నిర్వహించుచుండిన ఆర్యవరేణ్యులను ఆదరించి, వారికి ప్రోత్సాహము కలిగించి, వారి యనుభవాశీర్వాదములను పొందుట యువకనాయకుని మొదటిపని. ఆదిభారతీయులందలి స్త్రీస్వయంవిహరణాచారమునకు మూలాధారుడగు వాలిని సంహరించి, తారను తిరిగి తన మొదటిభర్తయగు సుగ్రీవున కిచ్చి, ఆవానరోత్తమునకు పట్టముకట్టుట రెండవపని. పురుషుడు రూపవతియు, యౌవనవతియు నగు స్త్రీకి ఎదురై ఆపెదురాచారమును నిగ్రహింపదలచుట కష్టసాధ్యము. అట్టిస్త్రీని దర్శించగనే యౌవనపురుషుని యందలి సంకల్పబలము సగము తగ్గిపోవును. శ్రీరాముడు వాలికి ఎదురునిలిచి పోరాడక చెట్టుచాటున నుండి బాణమువేసెననుటలోని భావము స్త్రీస్వయంవిహారణమును పోరాటమువలనగాక యుక్తియుక్తముగా నిగ్రహించెననుట. ఇట్లు శ్రీరాముడు దండకారణ్యమున స్త్రీస్వయంవిహారణమును మట్టుపరచుచుండగా, పరశురాముడు మలయాళముచేరి అక్కడ దానిని స్థిరపరచి, కొన్నికట్టుబాట్లు ఏర్పాటుచేసెను. మళయాళురు అనగా కొండమనుష్యులు (మలై + ఆళ్). పశ్చిమ సముద్రము పడమటికనుమలనుండి దూరముగాపోగా ఏర్పడిన బయలుప్రదేశములో కొండలనుండి దిగిన మనుష్యులు వాసము చేయసాగగా ఆదివాసుల ఆచారము స్థిరము నిలబడెను.

రావణుడు ద్రావిడరాజు. ఇతడు నాగరికుడు ధనవంతుడు, విద్యావంతుడు. కాని స్త్రీలోలుడు. తనతో చేరుటకు ఇష్టపడని స్త్రీలను నిర్బంధించక పోయినను, స్వతంత్రవర్తనలగు అనాదస్త్రీలను తెచ్చుకొని వారితో భోగించుచుండెను. మండోదరి అట్టిస్త్రీయే. ఈపె ఒకకొండక్రింద దొరికెనని చెప్పుట చూడగా కొండలలో నివసించుచుండిన ఆదిభారతీయ స్త్రీయని బోధపడుచున్నది. ఇట్టిస్త్రీ కొంతకాలము వాలిభార్యయై యుండి, అంగదుని కనెనని చెప్పుటవలన ఈపెస్వయంవిహారణదశలో అంగదునికన్నతర్వాత రావణుడు దేశమును ప్రవీణతతో పరిపాలించుచుండినను

ప్రజల సమ్మతిని గ్రహించి రాజ్యముచేయుటలేదు. ప్రజాహితముగ రాజ్యనిర్వహణము కావించుట విశ్వామిత్రదీక్ష. కనుక శ్రీరాముడు రావణాధిపత్యమును రూపుమాసి విభీషణాధిపత్యమును నెలకొల్పెను. అంతటితో ప్రజల భయములు తీరెను. నిరంకుశాధికారము అంతరించెను. స్వరాజ్యమేర్పడెను. సామ్రాజ్యనిర్వహణబద్ధకంకణులైన యువకుల ప్రయత్నము రాజ్యములను ఆక్రమించుటకు కాదు. రాజ్యములను రాజ్యములనుగనే యుంచి, వానియందు ఐకమత్యము మిత్రభావము, పరస్పరసహాయము పెంపొందించి భ్రాతృవర్గము ఏర్పరచుట వీరి సంకల్పము. ఇదియే వీరి మనోవీథిని పొడగట్టుచుండిన సామ్రాజ్యము. కనుకనే కిష్కింధకు సుగ్రీవుడు, లంకకు విభీషణుడు రాజులయిరిగాని ఈ రాజ్యములు కోసలయందు చేరిపోలేదు. శ్రీరాముడు లంకయందు ఒకపచ్చరాతిని చూచి, దాని విలువను గ్రహించి దానిని అయోధ్యకుతీసికొనిపోవలెననుబుద్ధి సమయమునకు పుట్టినను, దానిని నిరోధించి లంకనుండి అయోధ్యకు ఒకతృణమైనను తీసుకొనిపోలేదని చెప్పుచున్నారు. వశిష్ఠకక్షవారు యజ్ఞయాగాదులందు ప్రధానదైవముగ గ్రహించుచుండిన బ్రహ్మయు, విశ్వామిత్రకక్షవారు ప్రాముఖ్యమునకు తెచ్చినభక్తపరాధీనుడగు విష్ణువును, ద్రావిడదేవుడగు శివుడునుచేరి సమ్మిళితసంఘమునకు త్రిమూర్తులైరి. ఆదిభారతీయుల స్త్రీదేవతలు శివునిభార్యయైన పార్వతియొక్క అవతారములుగ గ్రహింపబడెను.

విశ్వామిత్రసంకల్పము శ్రీరామునిమూలముగ సఫలీకృతమై విశ్వామిత్రుడు లోకమిత్రుడై వెలసెను. ప్రస్తుతకాలమందును వృద్ధనాయకులు యువకులను నేర్పరులుగజేసి వారి కార్యదీక్షను పురస్కరించుకొని ఫలప్రాప్తిజెంది, ఆధునికవిశ్వామిత్రులనుదురుగాత.

---

# పురా!

విశ్వనాథ సత్యనారాయణ

అప్పుడపుడు నూటికి కోటి కచ్చటచట
ఒక మనోహర లోచనం బొగ్గి నాదు
నెదదనుక నేఁటి తనబాధ మెక్కువగుట
వడి సమాకృష్టిఁ జను నాదువలనునుండి.

అది పురాజన్మమందు నాయందు లగ్న
మైన యొకజీవి కాఁబోలు నట్లు కాద
యేని నాకన్నుతుద నాదు నెడదదాఁక
నాఁపుచూపులోనంత చొచ్చుకొననేల!

---

# సంస్కృతసంఖ్యావాచకములు

శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి

౧. జన్యభాషలనుబట్టి చూడగా 'ఇండో - యూరపియన్' మాతృభాషలో సంఖ్యలు మూడువిధముల దెలియజేయబడుచుండినట్లు తెలియుచున్నది. కొన్ని సంఖ్యలు వ్యస్తపదములచేతను (ఉ. త్రి), మఱికొన్ని సంఖ్యలు సమస్తపదములచేతను (ఉ. ద్వాదశ), మిగిలినవి వ్యస్తపదసముదాయముచేతను (ఉ. త్రయశ్చ, వింశతిశ్చ) దెలుపబడుచుండెను.

'ఇండో - యూరపియన్' దశాంశగణితమున దశ (**dekm̥-**) యనుపదము మిక్కిలి ముఖ్యమైనది. త్రింశత్, చత్వారింశత్ మొదలగుపదములలో నగపడు శత్ (**-km̥t-; -komt,** చూ. గ్రీ. **triakonta**) శబ్దమును శత(.**km̥tom**) శబ్దమును దశశబ్దముతో సంబంధించియుండి -dkm̥t, -dkomt-,-dkm̥tom అను శబ్దము నుండి పుట్టినవై యుండవచ్చును.

సంఖ్యావాచకముల వ్యుత్పత్త్యర్థము మనకు సరిగా దెలియదు. అనేకములగునూహలు దానినిగుఱించి చేయబడినవి. త్రియనునది నడిమివ్రేలిపే రనియు, పంచయనునది యంగుళివాచకమనియు, దశయనునది ప్రతిగ్రహమునకై చాచిన హస్తద్వయసంజ్ఞ యనియు సూచింపబడినది. కాని యిట్టియూహల యాథార్థ్యమును నిర్ణయించుట కవకాశములు లేవు.

సంఖ్యావాచకములలో బూరణార్థకములు త (-to-), మ (-mo-) అనుప్రత్యయముల మేళనమున నేర్పడుచున్నవి. ఈప్రత్యయములు తర (-tero-) తమ (-tm̥mo-) ప్రత్యయములకు సమానార్థకములు. చతుర్థాదిశబ్దముల భాషాంతరరూపములలో తకార మగపడుచున్నదికాని థకార మగపడుటలేదు. ఉ. చతుర్థ, గ్రీ. **tetartos,** లా. **quartus,** లిథు. **ketvirtas;** షష్ఠ. గ్రీ. **hektos,** లా. **sextus,** గాథి. **saihsta,** లిథు, **szesztas.** అవెస్తాభాషలో మాత్రము కొన్నిశబ్దములలో థకార మగపడుచున్నది. ఉ. **puxtha** (పంచథ), **haptatha** (సప్తథ). కాన జతుర్థాదిశబ్దములలోని థకారము ప్రాచీనముకాకపోయినను ఆర్యక్ మూలభాషలోనే తప్రత్యయములోని తకారమునకు థకారోచ్చారణము ప్రారంభమైనదని చెప్పవలసియున్నది. ప్రథమశబ్దమున నవెస్తాభాషలోగూడ థకార మగపడకపోవుటచే (చూ. అవె. **fratema**) నిది సంస్కృతమునందే జన్మించినదని చెప్పవలసియున్నది. (చూ. ప్రథమశబ్దము. § ౨)

౨. ఏక.—భిన్నభాషలలోని రూపములనుబట్టి చూడగా మాతృభాషలో నేకారరూపప్రాతిపదికము ప్రత్యయాంతరయుక్తమై (**-no, -vo, ko**)యేకార్థమున వ్యవహరింపబడినట్లు తెలియుచున్నది. చూ. అవె. **aeva,** గ్రీ. **oinos,** లా. **oinos,** గాథి. **ains,** ఆర్మీనియన్ గ్రీక్ భాషలనుబట్టి చూడగా సమ్ (sem-) అను మఱియొక శబ్దముకూడ మాతృభాషలో నేకార్థమున వ్యవహరింపబడుచుండినట్లు తెలియుచున్నది. సంస్కృత సకృత్పదమునందలి సయనుభాగ మీశబ్దమునుండె పుట్టినట్లు తలంపబడుచున్నది.

ప్రథమ.—ప్రారంభమునుండియు నేతదర్థకశబ్దము ప్ర. పర్ (per-) ధాతువునకు వ(-vo), మ(-mo), తమ (-tm̥mo), ఇష్ట (-isto) అనుప్రత్యయములలో నేదేనియొకటి చేరుటచే నేర్పడుచుండెను. ఉ. ప్రథమ, అవె. fratema; పూర్వ, పూర్వ్య, అవె. Pourviya గ్రీ. **protos,** ప్రా. ఇంగ్లీ. **fyrst.** సంస్కృతప్రథమశబ్దమున తకారము (ప్రతమ) చతుర్థాదిశబ్దముల ననుసరించి థకారములోనికి మాఱినది. చూ. ప్రతర, అవె. **fratara.**—అగ్ర్య, ఆదిమ అనుశబ్దము లాదిశబ్దభవములు.

3. ద్వి.—భిన్నభాషలలోని రూపముల ననుసరించి మాతృభాషలో -dvo- (duvo-) అనునది ప్రాతి

పదికగా నుండవలయునని యూహింపవలసియున్నది. చూ. సం. ద్వౌ, ద్వా, అవె. dva, గ్రీ. duō, లా. duo, గాథి. tvai. సమాసమునను కొన్ని ప్రత్యయములు పరమగునప్పుడును నాశబ్దము dvi అనురూపమును పొందును. ఉ. ద్విపద్, గ్రీ. dipous, లా. bipēs; ద్విక, గ్రీ. dittos. సంఖ్యావాచకసమాసములలో ద్వాయను రూపమునుగూడ బొందును. ఉ. ద్వాదశ, ద్వాత్రింశత్, ద్వాషష్టి, ద్విషష్టి, ద్వ్యశీతి. త్రిశబ్దమునను సరించి ద్విశబ్దము మాతృభాషలోనే వ్యవహారములోనికి వచ్చినదని భాషాశాస్త్రజ్ఞులు తలంచుచున్నారు.

ద్వితీయ—ఇది ద్వితశబ్దభవము-జన్యభాషలలో నేతదర్థకపదములలో రూపసాదృశ్య మగపడుట లేదు. కాన ప్రాచీనరూపమును నిర్ణయించుట కవకాశము లేదు. అవె. Bitya, ప్రా. పెర్షి. dūvītiya (ఈరెండు రూపములును సంస్కృతరూపమును పోలియున్నవి). గ్రీ. deuteros (ఇది సంస్కృతమూలశబ్దముతో సంబంధించియున్నది), లా. secundus, గాథి. anthar.

౩. త్రి—తృతీయశబ్దమునుబట్టి చూచినచో త్రిశబ్దములోనియికారము ప్రత్యయమువలె నగపడుచున్నది. బహువచనము త్రయః, అవె. thrāyo, గ్రీ. treis, లా. trēs గాథి. threis. సంఖ్యావాచకసమాసములలో త్రి, త్రయ యనురెండురూపములును నగపడుచున్నవి. ఉ. త్రయోదశ. త్రయస్త్రింశత్, త్రయఃషష్టి, త్ర్యశీతి. దీనికి స్త్రీలింగరూపము ఆర్యన్ కెల్టిక్ భాషలలోనే యగపడుచున్నది. ఉ. తిస్రః, అవె. tisarō, ప్రా. ఐ. teoir. తిస్సృశబ్దముగా మారినదనియు, మొదలి రెండవయక్షరము స్వసృశబ్దములోని రెండవ యక్షరముకంటె భిన్నముకాదనియు భాషాశాస్త్రజ్ఞు లూహించియున్నారు.

తృతీయ—ఇది త్రిశబ్దభవము- ఏతదర్థకశబ్దము కొన్ని భాషలలో తృశబ్దఘటితముగాను, మఱికొన్ని భాషలలో త్రిశబ్దఘటితముగాను నున్నది. ఉ. తృతీయ గ్రీ. tertos, లా. tertius; అవె. thritya, గ్రీ. tritos.

౪. చతుర్.—జన్యభాషలలోని యీశబ్దరూపములనుబట్టిచూడగా మాతృభాషలో నీశబ్దము ketver (ketvor) అనురూపమున నుండినట్లును, దీనికి ketur (ktur), ketūr (ktūr), ketru (ktru) మొదలగు స్వరవిపరిణామకృతరూపభేదము లనేకము లుండినట్లును దెలియుచున్నది. సం. చత్వారః, అవె. cathwārō, గ్రీ. tetores, లా. quattvor, గాథి. fidvor; నపుంసకలింగము చత్వారి; స్త్రీలింగము తిస్సృశబ్దమువలెనే చతస్సృశబ్ద మేర్పడినది. ఈ స్త్రీలింగరూపము నాధారముగాజేసికొని చత్వార్ శబ్దములోని వర్ అనుభాగము ప్రత్యయమని యూహింపబడినది.

చతుర్థ.—ఏతదర్థమున సంస్కృతమున తుర్య, తురీయ అనుశబ్దములును, నవెస్తాభాషలో tūirya అను శబ్దమునుగూడ గలవు. ఇవి చత్వార్ శబ్దముయొక్క స్వరవిపరిణామజన్యదుర్బలరూపములనుండి గలిగినవని చెప్పనగును.

౬. పఞ్చ.—పఞ్చాదిదశపర్యంతములగుసంఖ్యావాచకములు మాతృభాషలో నవ్యయములుగా నుండినవి. జన్యభాషలలోగూడ మొదట నట్లేయుండి తరువాత క్రమముగా విభక్తిప్రత్యయములను గ్రహించినవి. ఉ. వై. పఞ్చకృష్టిషు, గ్రీ. pente daktutōn, లా. quinque virōrum, గాథి. fimf hlaibans; అవె. xsvas satāis, గ్రీ. sex ēmerās, లా. sex mēnsibus; వై. సప్తసింధుషు, అవె. hapta satais, అవె. astasatāis, nava satāis; వై. దశకక్షీయాభిః, గ్రీ. deka nausi, లా. decem nāvium, గాథి. taihun skattans,—సం. పఞ్చ, అవె. panca, గ్రీ. pente, లా. quinque, గాథి. fimf, లిథు. penki.

పఞ్చమ—సంస్కృతమున పఞ్చథయనుశబ్దము కూడ గలదు. భాషాన్తరరూపములు దీనికే సమానముగా నున్నవి. అవె. puxtha, గ్రీ. pemptos, లా. quīntus, గాథి. fimfta, లిథు. penktas. పఞ్చమశబ్దము సప్తమాదుల ననుసరించి వ్యవహారములోనికి వచ్చియుండవలయును.

౭. షష్—జన్యభాషలలోని రూపముల నన్నిటిని విమర్శింపగా మాతృభాషలో **seks, veks, sveks** అను మూడుపరస్పరసంబంధముకల వైకల్పిక రూపములు వ్యవహారములో నుండినట్లు తెలియుచున్నది. ఉ. అవె. **xsvas,** గ్రీ. **fexhex,** లా. **sex,** గాథి. **saihs,** లిథు. **szeszi.** సంస్కృతమున దువతుకారము సంధియందు షకారవిపరిణామమును బొందుటచే షకారములోనికి మాఱియుండవచ్చును. దీని సాహచర్యమున మొదటివర్ణముకూడ షకారములోనికి మాఱియుండవచ్చును. అంత్యషకారము ప్రథమాద్వితీయాసప్తమీ విభక్తులలో టకారములోనికి మాఱుచున్నది. కకారములోనికి మాఱవలయును. భకారాదివిభక్తులననుసరించి యీవికారము సంభవించినది. షోడశశబ్దమున షష్ శబ్దము షోయనురూపమును పొందుచున్నది. ఈవికారము వోఢుమ్, సోఢుమ్ మొదలగుశబ్దముల ననుసరించి సంభవించినది.

షష్ఠ.—అవె. **xstva,** గ్రీ. **hektos,** ప్రా. హై. జ. **sehto,** లిథు. **szesztas.** ప్రాచీనతప్రత్యయము సంస్కృతమున థప్రత్యయములోనికి మాఱినది.

౮. సప్త.—జన్యభాషలలోని రూపముల యాధారమున మాతృభాషలో నీశబ్దము **septm̥** అనురూపమున నుండినట్లూహింపవలసియున్నది. ఉ. అవె. **hapta,** గ్రీ. **hepta,** లా. **septem,** గాథి. **sibun,** లిథు. **septyni.** సంస్కృతగ్రీకుభాషాపదములస్వరము ననుసరించి మాతృభాషారూపమున నంత్యోచ్చదాత్తముగా నుండినట్లూహింపవలసియున్నది. అపుడు సంస్కృతరూపము సప్తమ్ అని యుండవలయును. నవదశశబ్దములననుసరించి యది సప్తయనురూపమును పొందియుండును.

సప్తమ.—వేదమున సప్తథయను శబ్దముకూడ గలదు. భాషాన్తరరూపములు వైరెండురూపములును ప్రాచీనములైనట్లు తెలుపుచున్నవి. చూ. అవె. **haptatha,** గ్రీ. **hebdomos,** లా. **septimus,** ప్రా. హై. జ. **sibunto.**

౯. అష్ట—వేదమున అష్టౌ, అష్టా అనురూపములుకూడ నగపడుచున్నవి. భాషాన్తరరూపములనుబట్టి చూచిన నివియే ప్రాచీనరూపములవలె గనబడుచున్నవి. ఉ. అవె. **asta,** గ్రీ. **oktō,** లా. **octō,** గాథి. **ahtau** ఇవి ద్వివచనరూపములు. అష్టాశబ్దములోని యన్త్యాకారము సప్తానిశబ్దముల ననుసరించి హ్రస్వమైయుండవచ్చును. అశీతిశబ్దమున నగపడకపోవుటచే అష్టశబ్దములోని త(ట)కార మేకోయొక ప్రత్యయమై యుండవచ్చును.

అష్టమ—జన్యభాషలలో రూపసాదృశ్యమగపడకపోవుటచే మాతృభాషలోని రూపమును సరిగా నూహించుట కవకాశములేదు. గ్రీకులాటిన్రూపములను బట్టి **oktōvo** యని యూహించినచో సంస్కృతాదిభాషలలోని అష్టమాది మప్రత్యయాన్తశబ్దములు సప్తమాదులననుసరించి వ్యవహారములోనికి వచ్చినవని చెప్పవలయును. ఉ. అవె. **astema,** గ్రీ. **ogdoos,** లా. **octōvos,** గాథి. **ahtuda,** లిథు. **aszmas.**

౧౦. నవ—అవె. **nava,** గ్రీ. **(en-)nea,** లా. **novem,** గాథి. **niun.**

నవమ—జన్యభాషలలోని రూపములను విమర్శింపగా మాతృభాషలో నేతదర్థకశబ్దము అ(-o) ప్రత్యయవిశిష్టముగాగాని, త(-to) ప్రత్యయవిశిష్టముగాగాని యుండినట్లు తెలియుచున్నది. ఆర్యన్శాఖాభాషలలోని మప్రత్యయాన్తశబ్దము అష్టమశబ్దమువలె సప్తదశమాదిమప్రత్యయాన్తశబ్దముల ననుసరించి వ్యవహారములోనికి వచ్చినట్లూహింపబడినది. ఉ. అవె. **naoma,** ప్రా. పెర్షియన్. **navama,** గ్రీ. **einatos,** లా. **nōnus,** గాథి. **niunda.**

౧౧. దశ.—అవె. **dasa,** గ్రీ. **deka,** లా. **decem,** గాథి. **taihun** (లిథు. **deszimt-**). (చూ. § ౧.)

దశమ.—జన్యభాషలలోని రూపములను బట్టి చూడగా మాతృభాషలో మ(-mo) ప్రత్యయాన్తశబ్దమును త(-to) ప్రత్యయాన్తశబ్దమునుగూడ వ్యవహార

ములో నుండినట్లు తెలియుచున్నది. ఉ. అవె. dasema, గ్రీ. dekatos, లా. decimus, గాధి. taihunda, లిథు. deszimtas.

౧౨. ఏకాదిసంఖ్యలను దశాదిసంఖ్యలకు జేర్చి చెప్పుటకు మాతృభాషలో నేకాదివాచకపదములును, దశాదివాచకపదములును వ్యస్తముగా ప్రయోగింపబడు చుండెను. సముచ్చయార్థకచకారము ప్రయోగింపబడు టయు (ఉ. వై. ఏకంచ వింశతిశ్చ, త్రయశ్చ త్రింశశ్చ, లా. qattuor et viginti) బ్రయోగింపబడకపోవు టయుగూడ గలదు. (ఉ. వై. త్రింశతం త్రీన్, లా. viginti quattuor). కాని యేకాదశాది యేకోనవింశత్యంతవాచకపదములు మాతృభాషలోనే సమాసములుగా నేర్పడినట్లు తెలియుచున్నది. ఆసంఖ్యలు చిన్నవగుటచే దద్వాచకపదములు తఱచుగా వ్యవహరింపబడు టయే దీనికి కారణమై యుండవచ్చును. ఏకాదశాది చతుర్దశాన్తపదములలో నేకాదిపదములు ప్రత్యయవిశిష్టములుగా నున్నవి; పంచదశాది యేకోన వింశత్యంతపదములలో బంచాదిపదములు ప్రాతిపదిక రూపమున నున్నవి. కాన నివి ముందు సమాసములుగా నేర్పడి యుండవలయును.

ఏకాదశాది యేకోనవింశత్యంతసంఖ్యలు పైవిధ ము సమాసములచేతనే కాక యితరవిధముల గూడ ...తృభాషలో బోధింపబడుచుండెను. ఉ. deka duo, ...ka treis, లా. decem duo, decem tres. వింశ ...్యాదిసంఖ్యల కవ్యవహితపూర్వమందుండు సంఖ్య ...ఋణాదిపదసహాయమునగూడ దెలియజేయబడుచుండెను. ... ఏకోనవింశతిః, ఏకాన్న వింశతిః, లా. ūn-de-viginti, ప్రా. ఇం. ān laes twentiz.

౧౩. ఏకాదశ—ఇందలి పూర్వపదము (ఏకా) వైదికపుంలింగశబ్దప్రథమైక వచనరూపమునకును, స్త్రీలింగశబ్దప్రథమైక వచనరూపమునకును సదృశముగా నున్నది. ద్వాదశశబ్దము ననుసరించి యిట్టిరూపము గ్రహింపబడి యుండవచ్చును. ఉ. గ్రీ. hen-deka, లా. ūn decim.

ఏకాదశ—ఏకాదశము యను శబ్దముకూడ గలదు. అవె. aeva-dasa, గ్రీ. heudekatos, లా. ūndecimus.

౧౪. ద్వాదశ—వై. దువాదశ, అవె. dva-dasa, గ్రీ. dō-deka, duō-deka, లా. duo-decim. ద్వా అనుపదము ప్రథమాద్వివచనము.

ద్వాదశ—ద్వాదశమ; ఇట్లే త్రయోదశాదులలో గూడ రెండుశబ్దములును వ్యవహారములో నున్నవి. అవె. dvadasa, గ్రీ. dōdekatos, duōdekatos, లా. duo-decimus.

౧౫. త్రయోదశ—త్రయః అనునది ప్రథమా బహువచనరూపము. గ్రీ. deka treis, లా. tredecim, ప్రా. హై. జ. drīzehan.

త్రయోదశ—త్రయోదశమ, అవె. thridasa, లా. tertus decimus.

౧౬. చతుర్దశ — భాషాన్తరరూపములనుబట్టి చూడగా చతుర్దశశబ్దమున బూర్వపదము పూర్వము చత్వారః అనురూపమున నుండినట్లు తెలియుచున్నది. ఆర్యభాషలలో దత్స్థానమున చతుర్ శబ్దము ప్రవేశించినది. ఉ. అవె. cathru dasa, గ్రీ. deka tettares, లా. quattuor decim, గాధి. fidvōr-taihun.

చతుర్దశ—చతుర్దశమ, అవె. cathru dasa, లా. quartus decimus.

౧౭. పఞ్చదశ—అవె. pancadasa, లా. quindecim, గాధి. fimf-taihun—షోడశ (షడ్దశ, షడ్డశ; చూ. § ౬) అవె. xsvasdasa, లా. sēdecim, ప్రా. హై. జ. sehs-zehan.—సప్తదశ, లా. septem decim—అష్టాదశ, (లా. duo-de-viginti) ప్రా. హై. జ. ahto zehan—నవదశ. ఏకోనవింశతి, ఊనవింశతి, ఏకాన్నవింశతి, లా. un-de-viginti, ప్రా. హై. జ. niun zehan.

పఞ్చదశ, పఞ్చదశమ, అవె. pancadasa—షోడశ, షోడశమ, అవె. xsvasdasa—సప్తదశ, సప్త

దశమ—అష్టాదశ, అష్టాదశమ, లా. duodevicesimus octavos decimus—నవదశ, నవదశమ, అవె. nava dasa, లా nonus decimus; ఏకోనవింశ, ఊనవింశ, ఏకాన్నవింశ, లా. undevicesimus.

౧౭. వింశత్యాది నవతిపర్యంతము లను దశాంక గుణితము లేకాదివిశేషణయుక్త దశవాచకపదములతో దెలియజేయబడుచుండెను. వింశతివాచకము ద్వివచనము గాను, త్రింశత్యాది వాచకములు బహు వచనముగాను నుండినవి. ఆర్యక్ శాఖాభాషలలో ద్వైరీతిశబ్దములలో వింశతిశబ్దముమాత్రము మిగిలియున్నది. త్రింశత్, చత్వారింశత్, పంచాశత్ శబ్దములు గుణవాచక స్త్రీలింగైక వచనశబ్దములు. ఈసంఖ్యలకు ద్వైవిధములగు బహు వచన శబ్దములు లోపించి యివి వ్యవహారములోనికి వచ్చినవి. షష్ట్యాది నవతి పర్యంతములు గుణవాచక తిప్రత్యయాన్తశబ్దములు—ఈసంఖ్యలకు పైవిధములగు విశేష్యవిశేషణఘటితరూపములు లోపించి యివి వ్యవహారములోనికి వచ్చినవి.

మాతృభాషలో నేకాద్యధికవింశత్యాదిసంఖ్యలను బోధించుటకు వ్యస్తపదములే వ్యవహరింపబడు చుండినట్లు తెలియుచున్నది. సమాసపక్షపాతముకల సంస్కృతభాషయందుమాత్రము సమస్తపదము లేర్పడినవి. త్రయోదశచతుర్దశమొదలగుశబ్దముల ననుసరించి వేదమున త్రయస్త్రింశత్ చతుస్త్రింశత్ మొదలగుశబ్దములు వ్యస్తపదములతోపాటుగ వ్యవహరింపబడనారంభించినవి. క్రమముగా నిట్టిశబ్దముల వ్యవహారము హెచ్చినది. వీనిలో నేకాదిశబ్దములుకూడ ప్రాతిపదికరూపముననే ప్రవేశపెట్టబడినవి. ఉ. ఏకవింశతి (ఏకాదశ), ద్వాత్రింశత్ (ద్వాదశ), త్రిషష్టి (త్రయోదశ). ఊనాదిఘటితరూపములు పూర్వమువలెనే వ్యవహరింపబడుచుండినవి. ఉ. ఏకోనత్రింశత్, ఊనత్రింశత్, పంచోనశతమ్, ఏకాన్నశతమ్.

౧౮. వింశతి—దీనిని 'విమ్ శతి' అని రెండు భాగములుగా విభాగముచేయవచ్చును. మొదటిభాగము జన్యభాషలలో విమ్, వ్ అనురూపముల నున్నది. ఇవి విశబ్దముయొక్క విభక్తిభేదములై యుండవచ్చును. ఈ విశబ్దము విషు, విష్వమొదలగుశబ్దములలోని విశబ్దముతో నభిన్నమైయుండవచ్చును. ఉభౌశబ్దములోని ఉశబ్దమేత చ్ఛబ్దజన్యము కావచ్చును. శతి యను రెండవభాగము నపుంసకలింగశత్ (Kot)శబ్దముయొక్క ప్రథమాద్వితీయా ద్వివచనరూప మని యూహింపబడినది. షష్టి సప్తత్యాదిశబ్దముల ననుసరించి సంస్కృతమున వింశతి శబ్ద మేకవచనముగా వ్యవహరింపబడుచున్నది. దీనికి విభక్త్యంతరములుకూడ చేర్పబడుచున్నవి. ఉ. వింశత్యా హరీణామ్, వింశత్యా హరిభిః. త్రింశత్యాదుల ననుసరించి దీనినుండి వింశత్ శబ్దముకూడ నిటీవల వ్యవహారములోనికి వచ్చినది. దీనికివిపరీతముగా వింశతిశబ్దము ననుసరించి త్రింశతిశబ్దముకూడ వ్యవహారములోనికి వచ్చినది. అవె. Visaiti, గ్రీ. Fikati, లా. viginti, గాథి. tvaitigjus, లిథు. dvideszimt.

వింశతితమ — అవె. visamstema, గ్రీ. fikastos, లా. vicesimus, vigesimus. వింశయను శబ్దము ఏకాదశాదుల ననుసరించి వ్యవహారములోనికి వచ్చినది. త్రింశ, చత్వారింశ, పంచాశ యనుశబ్దములు కూడ నిటులనే యుత్పన్నములైనవి.

౨౦. త్రింశత్—దీనిని త్రిమ్, శత్ అని రెండు భాగములుగా విభాగముచేయవచ్చును. ప్రథమభాగ. త్రిశబ్దభవము. వింశతిశబ్దములోని వింశబ్దము ననుసరించి త్రిశబ్దము త్రింశబ్దముగా మారియుండవచ్చును. లేక త్రింశబ్దముకూడ ప్రాచీనమైనదై యుండవచ్చును. రెండవ భాగము దశశబ్దముతో సంబంధించియున్నది (చూ. §౧౭). ఇది చత్వారింశత్, పంచాశత్ శబ్దములలోగూడ గనబడుచున్నది. అవె. thrisat, గ్రీ. triakonta, లా. triginta, గాథి. threis tigjus. వింశతిశబ్దము ననుసరించి త్రింశతిశబ్దము వ్యవహారములోనికి వచ్చినది.

త్రింశత్తమ—అవె. thrisata, గ్రీ. triakostos లా. tricesimus, trigesimus. త్రింశశబ్దము వింశ శబ్దమువలె నుత్పన్నమైనది.



చాముండీశ్వరి దేవాలయము మైసూరు

౨౧. చత్వారింశత్—వింశతిశబ్దములోని వింశ బ్దముననుసరించి సంస్కృతమున జత్వారిశబ్దము చత్వారిం శబ్దముగా మాఱినది. త్రింశత్ శబ్దము ప్రాచీనమైనచో నదికూడ నీపరిణామమునకు గారణమగును: చూ. అవె. cathwaresat, గ్రీ. tettara-konta, లా. quadrā-ginta, గాథి. fidvōr-tigjus.

చత్వారింశత్తమ— చత్వారింశఅనుశబ్దము వింశాదిశబ్దములననుసరించి యేర్పడినది.

౨౨. పఞ్చాశత్—వ్యస్తపదములతో దశాంక గుణితముల బోధించుకాలమునందలి త్రీ(త్రీణి)శతి యను రూపముననుసరించి పంచాశతి యనురూపమేర్పడి యందుండి పంచాశత్ అను దీర్ఘాన్తశబ్దఘటితరూపమేర్పడి యుండవలెను. చత్వారింశత్ శబ్దములోని చత్వారియను శబ్దముకూడ వ్యస్తపద ప్రయోగకాలపుదై యుండవలయును. త్రీశతియనురూపమునుండిపుట్టిన త్రీశత్ శబ్దము వింశతిశబ్దము ననుసరించి త్రింశత్ శబ్దముగా మాఱి యుండవచ్చును. (చూ. § ౨౦) అవె. pancā-sat, గ్రీ. pentē-konta, లా. quinquā-ginta, గాథి. fimf-tigjus—షష్టి, సప్తతి, అశీతి, నవతిశబ్దములు షష్, సప్త, అష్ట, నవశబ్దములకు తిప్రత్యయయోగము వలన నేర్పడిన గుణవాచకశబ్దములు. ఇట్టి శబ్దములు ఆర్యన్ శాఖాభాషలలోనే వ్యవహరింపబడు చున్నవి. (చూ. § ౧౮) అవె. xsvasti, haptāiti, astaiti, navaiti. మిగిలిన భాషలలో నీ సంఖ్యావాచకములు పంచాశత్సంఖ్యావాచకమువలెనే యున్నవి. సంస్కృతాశీతిశబ్దములోని 'అశీ' అనుశబ్దము ద్వివచనరూపమునియు, నందలి యీ కారము ద్వివచనప్రత్యయమనియు నూహింపబడినది. అష్టౌ, అష్టాయనునవికూడ ద్వివచనరూపములు. వీని యన్నిటికిని "రెండునాలుగుల"నియర్థముండవచ్చును.

పఞ్చాశత్తమ — పంచాశ యను శబ్దము వింశాది శబ్దముల ననుసరించి వ్యవహారములోనికి వచ్చినది. గ్రీ. pentē-kostos, లా. qinquā-gēsimus — షష్టితమ, సప్తతితమ, అశీతితమ, నవతితమ. భాషాన్తరములలో వీనిరూపములు పంచాశత్తమశబ్దరూపమువలెనే యున్నవి. సంస్కృతమున షష్ట, సప్తత, అశీత, నవతయను తప్రత్యయఘటితరూపములుగూడ గలవు. (చూ. షష్ఠ, సప్తథ §§ ౭,౮.)

౨౩. శత—ఇది మాతృభాషలో నపుంసకలింగశబ్దము-పదులసమూహమని శబ్దార్థము-అవె. satem, గ్రీ. hekaton, లా. centum, గాథి. hund, లిథు. szimtas.

శతతమ—అవె. satōtema, గ్రీ. hekatostos లా. centēsimns, లిథు szimtas. సంస్కృతమున సమాసములో శతయనురూపముకూడ నగపడుచున్నది. ఇది లిథుయేనియన్ భాషారూపమునకు సరిపడుచున్నది.

౨౪. ద్విశతాది నవశతపర్యంతముందు శతగుణితసంఖ్యలు మాతృభాషలో రెండువిధములుగా దెలుపబడుచుండినవి. ద్వేశతే, త్రీణిశతాని యను మొదలగు వ్యస్తపదములచేతనుగాని ద్విశతం, త్రిశతం అను మొదలగు సమస్తపదములచేతనుగాని యాసంఖ్యలు బోధింపబడుచుండినవి—మొదటిరీతి జర్మానిక్ బాల్టిక్- స్లావోనిక్ భాషలలోను, రెండవరీతి గ్రీక్ లాటిన్ భాషలలోను నగపడుచున్నది. ఆర్యన్ భాషలలో రెండువిధములగు ప్రయోగములును గలవు. ద్విశతీ, త్రిశతీ మొదలగురూపములు నవీనముగా నుత్పన్నమైనవి.

ద్విశతతమ, ద్విశత; త్రిశతతమ, త్రిశత మొ.

౨౫. సహస్ర — జన్యభాషలలో నీ సంఖ్యావాచకశబ్దములకు సాదృశ్యమగపడకపోవుటచే మాతృభాషలో నీసంఖ్య యెట్లు బోధింపబడినదో తెలిసికొనుటకు సాధ్యముకాదు. సం.సహస్ర. అవె.Ha-zanrem గ్రీ. Chellioi, Cheillioi. గ్రీకుశబ్దము సంస్కృతశబ్దములోని హస్రయనుభాగమునకు సదృశముగా నున్నట్లగపడుచున్నది. అట్లయినచో గ్రీకుభాషలోని Hekaton (ఒకనూరు) అనుశబ్దమువలె సంస్కృతములోని సహస్రశబ్దము 'ఒకవేయి' అనునర్థమును బోధించుశబ్దము కావచ్చును. లా. Mille, గాథి. Thusundi, లిథు. Tukstantis.

సహస్రతమ—గ్రీ. chiliostos, లా. millęsimus, లిథు. tukstantysis.

౨౬. వారార్థమున సకారాన్తావ్యయము లన్నిభాషలలోను నగపడుటచే మాతృభాషలోఁగూడ వ్యవహరింపబడియుండవలెను. ఉ. ద్విః, జై. దువిః, అవె. bis, గ్రీ. dis, లా. bis, గాథి. tvis—త్రిః, అవె. thris, గ్రీ. tris. —చతుర్, అవె. cathrus. కృత్వస్ ప్రత్యయాన్తశబ్దములుబాల్టిక్ స్లైవోనిక్ భాషలలోఁగూడ నగపడుటచే మిక్కిలి ప్రాచీనము లని యూహింపవచ్చును. ఏకవారం, ద్వివారం, త్రివారం మొదలగు వారాన్తశబ్దములు సంస్కృతమునందుమాత్ర మగపడుచున్నవి. చతుర్వాయ, త్రివృత్ మొదలగు మఱికొన్ని శబ్దములు వారార్థమున గలవు.

విభాగార్థమునసంఖ్యావాచకమునను వదించుటయే ప్రాచీనపద్ధతి-ఉ. జై. పఞ్చపఞ్చ (అయిదేసి) ఏకైకః.

ఏకశః, ద్విశః, శతశః మొదలగు శస్ ప్రత్యయాన్తావ్యయములుకూడ ప్రాచీనములవలె గనపడుచున్నవి—చూ. గ్రీ. hekas (ప్రత్యేకముగా) andra-kas (ఒక్కొకనిగా).

ఏకధా, ద్విధా, శతధా మొదలగు ధాప్రత్యయాన్త శబ్దములును, ద్వితయ, శతతయ మొదలగు తయప్రత్యయాన్తశబ్దములును, ద్వక, పంచక మొదలగు కప్రత్యయాన్తశబ్దములును సంస్కృతమునందే యగపడుచున్నవి.



D. R.

# 'వేనరాజు' విమర్శలు

జి. యస్. చౌదరి

'వేనరాజు' నాటకవిమర్శలు, 'ప్రజామిత్ర'లో శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారికి ఎవరిచేతనో వ్రాయబడ్డ అవకతవకఉత్తరం దానికి వారి జవాబులతో ప్రారంభమయినది. ఆ ఉత్తరములకు ప్రకటనార్హత గలదో లేదో పాఠకలోకమునకు విశదమే. అవి శ్రీ శివరామశాస్త్రిగా రేకారణముతో పత్రికకు బంపినారో, ఏకారణముతో 'ప్రజామిత్ర' ప్రకటించినదో చదువరులే ఊహించుకొందురుగాక!

ఆలేఖల ప్రకటనానంతరము 'ప్రజామిత్ర' 'వేనరాజు'నుగురించి ఒక పెద్దవిమర్శనను ప్రకటించినది. ఆవిమర్శనను అంతను విపులముగా చర్చించుటకు నేను పూనుకొనుట లేదు. ఆవిమర్శనలో చివర వేనరాజు నాటకము చదువదగినదేగాని ఆడదగినదిగాదని విమర్శకులు తేల్చినారు. ఆ నిర్ణయమును సహేతుకముగా చర్చించలేదు. ఏదైనా ఒకవిషయమును గురించి మనమొక నిశ్చితాభిప్రాయమును ప్రకటించునపుడు అది సహేతుకముగా నుండవలదా? అటుల లేనిచో అది విమర్శన యనిపించుకోదు. ప్రజామిత్ర విమర్శకుల నిర్ణయాన్ని సాహసమనాలి. అంతకన్నా వేరే జవాబు అనవసరము.

'నాట్యకళ' రెండవ సంచికలో శ్రీ సుర్రం సుబ్రహ్మణ్యంగారు వేనరాజును గురించి ఒక విమర్శన వ్రాసిరి. ఒకటిరెండుచోట్ల వారు పొరబడినప్పటికిని వారి విమర్శన సహేతుకముగా నున్నదని చెప్పదగును. వారి విమర్శనలోని 'పృథు' పాత్రను గురించి వ్రాసిన ఈక్రిందివాక్యములను చూడుడు:

"ఈనాటకమున పృథుపాత్రముమాత్రము దుర్గ్రాహ్యముగా నున్నది. పుట్టువునుబట్టి పృథు అబల. గోరూపయగు భూదేవి పురుషత్వమును పృథువునందు ఆవహిల్ల జేసినట్లు సంవిధాన మేర్పరుపబడినది." మరియొకచోట: "ఐనను చక్రవర్తులందు ప్రథముడైన పృథువునకు జన్మవలన స్త్రీత్వమారోపించుట న్యూనతాహేతు వగుచున్నది."

ఈపై నేనుదాహరించిన శ్రీ సుబ్రహ్మణ్యంగారి వాక్యములకు నాటకమునం దాధారము లేమియు గాన్పించవు. మీదుమిక్కిలి పృథువు పుట్టుకచేత మగవాడనియు, మగవాడని తెలిసినచో వేనుడు బ్రతుకనీయడనుభయముచే అంగరాజు పృథువును నిష్క్రంచుకి యధీనమున ఆడపిల్లగా పెంచెననియు నాటకమునందు గాన్పించుచున్నది. పృథువు అంగనాపూర్వత వేషమునందుమాత్రమేనని పాఠకులు తెలిసికొనగలరు. నాటకములోని యీక్రింది వాక్యములను చూడుడు:

వేన—అవునవును! నాతో గాదు! అంగనాపూర్వుడైన నీతో నభిసరించును.

పృథు—ఛీ! ఛీ!! నే నంగనాపూర్వుడను గాను. అంగనాపూర్వత నావేషమునందు మాత్రమే గలదు (వేనరాజు పు. ౧౧౫).

అంగ—.........పృథురాజు నీ యంతఃపురమున నిన్నాళ్లుండగా నతడు పురుషుడని నీవే తెలిసికొనలేకపోయితివి.

వేన—తెలిసికొనుట యెట్లు? అతడు నిష్క్రంచుకి యధీనములో చేరెను. నీవును సునీథయు నాడపిల్లగా పెంచిరి. అందరు నాడపిల్లయే యనుకొనిరి. నేను నట్లేయనుకొంటిని. ఒకవేళ నేను తెలిసికొంటి ననుకొమ్ము. దానివలన లాభమేమి?

అంగ—తెలిసికొన్నచో నీ విన్నాళ్లు పృథువును బ్రతుకనిత్తువా. (వేనరాజు పుట ౧౧౬)

ఈ పైవాక్యములు శ్రీ సుబ్రహ్మణ్యంగారి పొరపాటును దిద్దగలవు. అంతచక్కని విమర్శకులుకూడా పొరపాటుబడుట 'ప్రమాదో ధీమతామపి.'

ఇక మిగిలినవిమర్శన వైశాఖమాస భారతిలో శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణగారిది. వారివిమర్శన పెద్దత్రోవ బట్టినది. ఆంగ్ల బెంగాలీ భాషలలోని నాటకములను లక్ష్యములుగా తీసికొని వేనరాజును విమర్శించినారు. మనభాషలోనినాటకము నొకదానిని విమర్శించుచు దానిని ఆంగ్ల బెంగాలీభాషలలోని నాటకములతో బోల్చి వానివలె ఇది లేదనుట భావ్యము కాదు. పాశ్చాత్యులకును మనకును ఆచారవ్యవహారములలో కావలసినంత భేదము. వేర్వేరు దేశీయులకు వేర్వేరు లక్ష్యము లుండునని ఒప్పుకొనక తప్పదు. చిత్రకళవిషయములో పరిశీలించుడు. సారస్వతమందుగూడ అదేవిధముగా భేదము కాన్పించుచున్నది. నాటకరచనయందుకూడ మనము ఆంగ్ల సంస్కృత నాటకములను సరిగా చదివినచో భేదము తప్పక కాన్పించగలదు.

ఒక గ్రంథమును విమర్శించునపుడు అది ఏదేశమునకు ఏభాషకుచెందినదో ఆదేశముయొక్కయు,ఆభాషయొక్కయు గుణాగుణములను బట్టి విమర్శించుట సమంజసము. మనకు సంస్కృతనాటకములు ఆదర్శములుకాని ఆంగ్ల నాటకములు కావు. విమర్శకులు వేనరాజును సంస్కృతనాటకములతో పోల్చి విమర్శించినచో చాలా బాగుండెడిది. వారు తమవిమర్శనలో ఒకసంస్కృతకవినైనను పేర్కొనక పోవుటకు కారణము గ్రహించలేకయున్నాను. అందుకనియే శ్రీ సుబ్రహ్మణ్యంగారు భాసకవితో పోల్చి వేనరాజును బాగుగ గ్రహించినారు. శ్రీ జొ. స. గారు పరదేశకవులతో పోల్చుటచేత గ్రహించలేకపోయినారు.

శ్రీ. జొ. స. గారి విమర్శనలోని ప్రథమవాక్యములను చూడుడు: "మనుష్యజీవనము వ్యతిరేకశక్తుల కాటపందిరి. దివ్యశక్తి నెదురించు పైశాచికశక్తి కొంతకాలము దీనియందు విజృంభించును. తుద కిది తునకలు కాకమానదు." మరల నింకొకచోట "అసంభవవ్యతిరేకముల నన్నిటిని ఒకమూటగట్టి గ్రంథకర్త దానికి వేనుడని పేరుపెట్టినాడు." అని వ్రాసిరి. ఈ వాక్యములనుబట్టి వేనునిలోని వ్యతిరేకశక్తులు అసంభవవ్యతిరేకములని వారిఅభిప్రాయము. మానవజీవితమునందు వ్యతిరేకశక్తులకు తావున్నదని వారే సెలవిచ్చినారుగాన దానితో నాకు వివాదము లేదు కాని వేనునియందలి వ్యతిరేకశక్తులు అసంభవములా?

గ్రంథకర్తగారు ఆపాదమస్తకము దివ్యపురుషునివలె నుండువానినెత్తికి నాస్తికత్వమును దురంతదౌష్ట్యమును గట్టినారట! దివ్యపురుషత్వానికి నాస్తికత్వము అసంభవవ్యతిరేకమని వీరిఅభిప్రాయము. రష్యాలో నాస్తికమతమేగదా! అచ్చట దివ్యపురుషులు లేరా? అదియుగాక వేనుడు వీణవాయించునపుడు మాత్రమే దివ్యపురుషునివలె గానిపించును. అపుడే అతని ఆత్మలో దేవతలు నిలుచుచుందురు. మిగిలినసమయములందు వేనుడు వేనుడే. ఎంతక్రూరుడైనను ఒక్కొక్కసమయమందు చాలామంచివాడుగా కాన్పించవచ్చును. అందులో అసంభవ మేమియులేదు.

మహాగాయకుని, మహాశిల్పిని, సత్కవిని, గ్రంథకర్తగారు హృదయరహితుడైన కట్టిడిగా చేసినారట! అయితే గాయకులలోను, శిల్పులలోను, కవులలోను హృదయరహితులైన కట్టిడులు లేరనియా విమర్శకులయభిప్రాయము! మహాగాయకుడు తాను పాడుచున్నపుడు, శిల్పి తన శిల్పజ్ఞానము ప్రదర్శించునపుడు, సత్కవి కావ్యమును వ్రాయునపుడును గుణాఢ్యులు గాకపోవచ్చును. తదితరసమయములందు వారును సాధారణమానవులవంటివారేగదా! అట్టిసమయములందు వారు క్రూరు లెందుకుగారాదో తెలియకున్నది. గాయకులలోను, శిల్పులలోను, సత్కవులలోను నేరములుచేసి కారాగారశిక్ష ననుభవించినవారు లేరా? విమర్శకులు, అట్టివారిని చూచియుండకపోవుటచే వారి కసంభవమని తోచియుండవచ్చును. వేనునిగూడ గ్రంథకర్తగారు వీణవాయించునపుడు దివ్యపురుషునిగా చిత్రించి మిగతా సమయములందే అతనిని హృదయరహితుడైన కట్టిడిగా చేసినారు.

"పసివాండ్రను వలచుహృదయము రమ్యమైనది. ఇట్టిహృదయముచేతనే శ్రీధరభట్టనువానిని గ్రంథకర్త చంపించినాడు! ఇది గ్రంథకర్తగారిమీద మరియొక యభియోగము. ఇచ్చట వేనుడు

చంపినది పసివాడైన శ్రీధరభట్టునుగాదు; ఆజ్ఞాతిరస్కారముగావించిన క్షుద్రవందిని. తనయాజ్ఞాతిరస్కారము గావించనంతవరకు వేనునకు పసివారన్న అమిత ప్రేమయే. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడన్న ఎంత ప్రేమ! తన విరోధియైన విష్ణువును తనయాజ్ఞకు వ్యతిరేకముగా పొగడినపుడేగదా హిరణ్యకశిపునకును ఆగ్రహము వచ్చినది. అప్పుడు తనముద్దులకుమారు డని యైన పాటింపక మృత్యుదండన విధించినాడు. అతనికి కుమారునిమీద ప్రేమలేకయా? కాదు. తన యాజ్ఞాతిరస్కారము గావించినాడుగనుక. హిరణ్యకశిపుడు గొప్పతపస్సు చేసినాడు. గొప్పశివభక్తుడు. అట్టివాడు హృదయరహితుడై తనముద్దులకుమారునకు విషమునిచ్చి చంపయత్నించెనే! ఇది సంభవమేనా? అట్టి శివభక్తాగ్రేసరుడు హృదయరహితుడైన కట్టడియై పసిపాపను హింసించుట న్యాయమేనా? భాగవతగ్రంథకర్త వేనరాజుగ్రంథకర్తవలె అసంభవవ్యతిరేకములను మూటగట్టి హిరణ్యకశిపుడని పేరుబెట్టుటగాదా?

మహమ్మద్ బీన్ తుఘ్లక్ ఎంత మేధావి! అతడెటువంటి పిచ్చిపనులజేసి రాజ్యమును రాజ్యప్రజలను నాశముజేసినాడు. ఔరంగజేబు దైవభక్తుడేగదా. టోపీలుకుట్టుకొని అందుండివచ్చు నాదాయముతో తనజీవనము గడపుకొనువాడే! అంతదైవభక్తుడు నిరాడంబరజీవి తండ్రిని కారాగారమందుంచి మాయోపాయముచే సోదరుల జంపించినాడు. అంతకన్న అసంభవవ్యతిరేకములు వేనరాజునందు గలవా?

“వ్యతిరేకభావసంఘర్షణ మున్నప్పుడే ప్రతిబలశక్తులు పెద్దరూపులుదాల్చి కన్నులెదుట చూపట్టును. వాల్మీకి రావణునికెదుట రాముని, రామునికెదుట రావణుని నిలిపినాడు. రాముని కించుక యూడిగము చేసిన ఉడుతను రావణునితో బోర బురికొల్పలేదు......... కురుపాండవుల సంఘర్షణము భారతమును సృష్టించెను. వీరిలో నొక పక్షమువారు ఎట్టి ప్రాముఖ్యములేని యొక గొర్రెలమంద యగుచో నొక మహాకావ్య మొకటి సృష్టియయ్యెడిది కాదు. షేక్స్పియరుమహాకవి అయాగో ఘోరపిశాచమని ఎట్లు నిరూపింపగలిగినాడు? ఇతడు వంకాయవంటి ఒకక్షుద్రవందినిగాని, బీరకాయవంటి ఒక వినీతభట్టునుగాని ‘అయాగో’ ముందు నిలుపలేదు. పావనగుణసంశోభితయైన ‘డెస్డిమోనా’ను, మహానుభావుండైన ‘ఒథెల్లో’ను అయాగోనకెదుట నిల్పినాడు. తన మహానాటకములందు ద్విజకవి ఈనియమమును పాటించినాడు. ఆదర్శ కావ్యకర్తలు నరకమునకెదుట స్వర్గమును నిలిపినారు. దీని సంఘర్షణమే పఠితహృదయమును గాని, ప్రేక్షకుని హృదయమునుగాని బలముగా తట్టును. గ్రంథకర్త యీ విషయమును గుర్తింపలేదనుట స్పష్టవిషయము.” ఇది విమర్శకుని వాక్యములు.

ఈ పైవిమర్శన యంతయు వేనరాజునాటకమును సరిగా అర్థముచేసికొలేకపోవుటచే బయలుదేరినది. నాటకమునందు ‘గౌతము’ డను నొక వ్యక్తి కలడను విషయము విమర్శకునకు జ్ఞప్తియున్నట్లు తోచదు. వేనరాజునెదుట నిల్పినది గౌతమునిగాని క్షుద్రవందివినీతభట్టులను గాదు. అసలునాటకమునకు కథానాయకుడు పృథువు. పృథువు ధర్మరక్షకుడు. అప్పటిపృథువు పసివాడు గనుక, అతనికి బదులుగా గ్రంథకర్తగారు ధర్మపక్షవాదియైన గౌతముని వేనునకెదుట నిలబెట్టినారు. వేనుడు ఒకనూతనమతమును స్థాపించపూనుకొనినాడు. సనాతనధర్మములను త్రోసిరాజనినాడు. గౌతముడు సనాతన ధర్మపక్షపాతి. రెండుదేశములకు మధ్య యుద్ధము జరుగునపుడు ఆయాదేశముల రాజులు మాత్రమేగాక తదితరు లనేకమంది హతులయ్యెదరు. రామరావణసంగ్రామమందు రావణు డొక్కడే కాదు మరణించినది; సామాన్యు లెందరో హతులైరి. కురుపాండవులయుద్ధమునందు నంతియే గదా! రాజులతోపాటు సేనానాయకులును, సామాన్య యుద్ధభటులును కూడ తమ ప్రాణములను గోల్పోయెదరు. యుద్ధసమయమున నొకడు చావదగినవాడు కాదు, అవును అని విచారించవలనుపడదు. అడ్డముతగిలినవారినెల్ల నరకుటయే కత్తిపని. ‘వేనరాజు’నందు జరిగినది రెండుధర్మములమధ్య జరిగినపోరాటము. వేనుని మతప్రచారభావ

ములకు శ్రీధర, వినీతభట్టాదులు వ్యతిరేకముగా నడిచినారు. అందువలన వేనుడు వారికి మరణశిక్ష విధించినాడు. అంతియేకాని గ్రంథకర్తగారు శ్రీధరవినీతభట్టాదులను వేనునెదుట నిల్పి చంపించలేదు.

చాణక్యుడు గొప్పరాజనీతివేత్తగదా! తనకాలికి ముల్లు గ్రుచ్చుకొనగా నేమిజేసినాడు? ఆముల్లు నూడబెరికి, తనకు శత్రువులమీద గలకోపమునంతయు దానిమీదజూపి అరగదీసినాడు. ఇచట చాణక్యునెదుట కవి ముల్లును నిల్పినా డనదగునా? షేక్స్పియర్ మహాకవి కథానాయకుడైన హామ్లెట్ చే వృద్ధుడైన పొలోనియస్ను చంపించలేదా? హామ్లెట్ స్నేహితులైన 'రోజెన్ క్రాంజ్, గిల్డెన్ స్టరన్' లను గ్రంథకర్త చంపించలేదా? తనపినతండ్రియైన 'క్లాడియస్' మీద పగతీర్చుకొనుటయేకదా హామ్లెట్ ముఖ్యోద్దేశ్యము. అందుకొరకై మిగిలినవారినందరిని చంపుటెందులకు? వారందరు తనప్రయత్నమునకు అడ్డుతగులుచున్నారని తలంచియేకదా! 'ఒథెల్లో'లో డెస్డిమోనాహత్యతో నాటకము ఆగినదా? ఇయాగో తనభార్యయైన ఎమీలియాను చంపలేదా? హామ్లెట్ నాటకమందు హతులైనవారందరూ కథానాయకునకు తగినప్రత్యర్థులేనా? అశ్వత్థామ నిద్రబోవుచున్న ద్రౌపదేయులను హత్యయొనరించలేదా? వారు అశ్వత్థామకు సరియైనప్రత్యర్థులా? అది తన ఆగ్రహము పట్టలేక పిచ్చిలోచేసిన ఘోరకృత్యము. అశ్వత్థామ తక్కువవాడా? విమర్శకులు విమర్శించునపుడు పాత్రలకుతగినపాత్రలను తీసికొని పోల్చవలెను.

తరువాత "వేనుడు మాటెననగనే, వెనుకటి వేనుడు చచ్చెననవచ్చును. చచ్చినవానిచేయి ద్రెంపించుటెందులకు!" అని విమర్శకులప్రశ్న. విమర్శకులు గ్రంథకర్త పాశ్చాత్యగ్రంథకర్తలనియమములను పాటించలేదని వ్రాయుచు తామే పాశ్చాత్యవిమర్శకులనియమములను పాటించకపోవుట ఆశ్చర్యముగా నున్నది. పాశ్చాత్యవిమర్శకులు ఒకగ్రంథమును విమర్శించునపుడు ఆగ్రంథమంతయు తమనాలుకకొనమీద నుంచుకొనెదరు. శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణగారు వేనరాజు నాటకమును పూర్తిగా అవగతముచేసికొన్నట్లు గాన్పించదు. వేనుడు మాటినది తన ఆత్మలోనేగాని బహిరంగముగా గాదు. ఈమార్పు గౌతమునకు తెలిసినట్లు నాటకమునం దెచ్చటను గాన్పించదు. మీదుమిక్కిలి "వేనుని దక్షిణబాహువు వేనునికంఠమునుండి తెగిక్రిందబడును" అను బ్రాహ్మణశాపము గలదు. ఈవిషయములను వదరి "చచ్చినవానిచేయి ద్రెంపించు టెందులకు" అను ప్రశ్నను విసరిరి. వేనునిమార్పు గౌతమునకు తెలియక పోవుట, బ్రాహ్మణశాపము వేనునిచేయి ద్రెంపించుటకు కారణములని చదువరులు గ్రహింపగలరు. అది యటుండగా కవి, పురాణములోనికథ నాటకమల్లినాడు. ఆకథను తననాటకమునకు తగినంతమార్చినాడు. ఆమార్పుట పురాణకథలతో లగించుట ఎట్లు చేసెనో తెలిసికొన్నచో నీప్రశ్న పుట్టదు.

"నాటకమునకు వలసినతీవ్రభావము కథయందు కలదు. అద్దేసమయమున, నేకథాఘట్టమున, నెట్లు ప్రయోగింపబడవలెనో గ్రంథకర్త గ్రహించలేదు. వేనుడు తండ్రిని పదచ్యుతుని జేసినాడు. ఈమరంత క్రియయందు నాటకమున మంటలను పొగలనుచిమ్ము కథాంశముల నాతడు సృష్టించవలసినది." అని విమర్శకులు వ్రాసిరి. వేనుడు తండ్రినిపదచ్యుతిని జేసినది నాటకమునకు పూర్వము. ఈనాటకముయొక్క ఉద్దేశ్యము అంగరాజును మరల సింహాసనమం దుంచుట గాదు. వేనుని మతమునకు స్వస్తిచెప్పుటకు, ద్విజక తననాటకమందు పొగలను చిమ్మించుటచే 'వేనరాజు' గ్రంథకర్తగారుకూడ పొగలను చిమ్మించవలసియుండెడి దని విమర్శకులు శాసించుటలోని రసజ్ఞత ఏమిటో అదియునుగాక నాటకమునందు వేనరాజు తనతండ్రిని పదచ్యుతుని చేయలేదు. అంగరాజు మరల తాను రాజ్యమునకు రావలెనని ప్రయత్నమూ చేయలేదు. అట్టితరి నాటకమున పొగలుచిమ్ముఘట్టమున కవసరము గాన్పించదు. వేనునినూతనమతముమీదనే అందరును తమ దృక్పథమును నిల్పినారు. ఆమతమునకు స్వస్తిచెప్పి ధర్మమును పునరుద్ధరించుటయే నాటకముఖ్యోద్దేశ్యము. అందులో కవి జయపతాక మెత్తినాడని ఢంకామీద

దెబ్బకొట్టి చెప్పవచ్చును. నాటకమునందు భూదేవి వేనరాజులతో కవి పలికించిన పలుకులను గమనింపుడు.

భూదేవి—వేనరాజు మతమువంటి దుష్టమతములు వచ్చుచునే యుండును; పోవుచునే యుండును. పైని నిప్పులు ముట్టించి తగులఁబెట్టునే గాని యీ లోపలి నిత్యమై పసిమికల యీయంకురములకుఁ జేటే లేదు.

వేను— ఈ యంకురముల పసిమి నిజముగా నెన్నటికిఁ జావదు. నేను కాచినయెండకే మాడని యీ పసిమి సనాతనమైనది. నాకే తెలియలేదు. (వేనరాజు పుట ౧౪౧.)

ఇక పిశాచముల వృత్తాంతము: "నిజమైన పిశాచములకు ఆదర్శనాటకకర్తలు అరనిముసమునేపు రంగస్థలిపై చోటొసగిరి." ఈఆదర్శ నాటకకర్తలు ప్రపంచమునకంతను ఆదర్శనాటకకర్తలా? లేక విమర్శకులకేనా? హామ్‌లెట్‌కు తండ్రినీడను షేక్స్పియర్ నిముసకాలము చూపినాడట! అరనిముసమల్లా షేక్స్పియర్ వరకు వచ్చుసరికి నిముసమైనది. నాటక రచయితలు స్వాతంత్ర్యము దీసికొనుటకు ఆదర్శకుడు షేక్స్పియరు మాత్రమే కాదు. ఒక నాటకకర్త తన నాటకమందలి పాత్రలను ఎందుకు సృష్టించెనో తెలిసికొనవలెను. 'వేనరాజు' లోనిపిశాచములు వేనునకు తప్ప తదితరులకు గాన్పించవు. వేనరాజు స్వభావమునందు సహృదయత, క్రూరత కలసియున్నవి. క్రూరత్వమును వేనరాజు తనమతవ్యాప్తికై ఎరువుదెచ్చుకొనినాడు. స్వభావముచేతనే వేనరాజు క్రూరుడైనచో పిశాచములు గాన్పించెడివేకావు. పాపభీతి గలిగి తన క్రూరత్వమును విమర్శించుకొనుటయే పిశాచములుగా వేనునకు తోచెను. హామ్‌లెట్‌లోవలె ఒక విషయమును చెప్పుటకు గాదు. "పెక్కురంగములందు వేనరాజుదయ్యములతో దీర్ఘప్రసంగములు సలిపినాడు. కళ, అందును నాట్యకళ Sense of Realism ను అపేక్షించును. ఇది 'వేనరాజు' లో ఒప్పినది కాదు." అని విమర్శకులు వ్రాసిరి. షేక్స్పియర్‌లోనిదయ్యము నిజమైనది (Real). అందుకనియే ఆఘోస్టు పరులకు గూడ గన్పించును. అందుచేత ప్రపంచకదృష్టిలో Unreal. వేనరాజుదయ్యములు వేనునకే కనిపించును. ఇవి యితరులు చూడలేరు. అందుచేత షేక్స్పియర్ Ghosts వంటివి కావు. ఇవి Physical గా లేవు. మానసికమైనవి. అందుచేత Real. real అనగా Artisticaly real. విమర్శకులు Sense of Realism ఒప్పలేదన్నారు. ఒప్పని దెవరికో పాఠకులు నిర్ణయింతురుగాక!

విమర్శకులు వేనరాజుపాత్రపోషణమందే గ్రంథకర్త అపజయము పొందెనని వ్రాసిరి. 'ప్రజామిత్ర' లోని విమర్శన చదివినచో ఆ అనుమానము తీరగలదు. వీరివిమర్శయందు కలఅన్ని దోషములు నేనెత్తిచూపించలేదు. పృథువుపురుషుడగుటచేత కార్డీలియా, జహనారాలతో పోలికయెట్లు? శ్రీ విశ్వనాథసత్యనారాయణగారి ఏగ్రంథమైనను ఒకటికి పదిసార్లు చదివిననేగాని సరిగా తెలియవు. తొందరపడి విమర్శ వ్రాయరాదు. విమర్శ వ్రాయకముందు అది ప్రకటించకముందు బహువిషయపరిజ్ఞానముండవలె. శ్రీ సత్యనారాయణగారు సంస్కృతనాటకములలోని తత్త్వమంతయు నెరిగినవారు. వారివేనరాజునుగూర్చి యొకపండితుని అభిప్రాయమును జెప్పి యీవ్యాస మింతటితో ముగించెదను. "ఈనాటకమునందు కాళిదాసునందలి భావసౌకుమార్యము, విశాఖదత్తుని ప్రజ్ఞాకల్పనము, భవభూతిరచనా వైదుష్యము గలవు. తర్కవేదాంతశాస్త్రములమర్మ మింత తెలిసివ్రాయుట యీకవికే చెల్లినది."

---


ఇంత యెండ మండిపోతూంటే
యెక్కడికెళ్లారు?
నాన్నగారు యింట్లో వేరంటే
మీకు కాదూ!
ఇంత యెండ మండిపోతూంటే మీరెందుకొచ్చారు?
KSB



దేహసౌందర్యము, గానమాధుర్యము



ప్రతిబింబము, లాల్ బాగు, బెంగుళూరు.

62

# మన యాహారము

గోటేటి జోగిరాజు

౨

శ్రీ భావసంవత్సర ఫాల్గునమాస సంచికయందలి యేడవ వ్యాసమున క్షీరద్రవ్యముల యాహారయోగ్యతను గూర్చి వ్రాయబడెను. ఇందు పండ్లయాహారపు విలువనుగూర్చి వ్రాయబడును.

## ౭. పండ్లు

మానవకోటి కాహారముగ నుపయోగించువస్తువులలో నిపుడు వండి తినదగిన తృణధాన్యములు, కాయధాన్యములు మొదలగు దినుసులే ప్రధానముగనున్నను ఒకానొకకాలమున స్వతస్సిద్ధముగ బెరుగుచుండిన పండ్లే ప్రాధాన్యతను వహించియుండెననుటకు సందేహము లేదు. * ఇపుడుకూడ మానవుని యారోగ్యమునకు గొంతవరకైనను పండ్ల నాహారముగ గొనుట యావశ్యకమని శాస్త్రజ్ఞు లెంచుచున్నారు. పత్రికలయందీటీవల నీవిషయమై పలువురు తరుచు వ్రాయుచుండుటచే నిచట నంతగా విస్తరించి వ్రాయనవసరములేదు.

పాశ్చాత్యులు పండ్లయొక్క విలువను గుర్తించి తమదేశములందు పండ్లంతగా నుత్పత్తిగాకపోయినను పలుకాలదిమైళ్లదూరమునుండి వానిని తెప్పించుకొని విస్తారముగ దినుచున్నారు. ఈదేశమునందో, విశేషశ్రమపడనవసరములేకయే ఆయాకాలములందు ఫలించు వివిధజాతుల పండ్లను విరివిగ నుత్పత్తిచేసికొన వీలు గలిగియున్నను ప్రజలను పీడించుచున్న యజ్ఞానము వలనను దారిద్ర్యమువలనను వారలలో నూటికొక డైనను ప్రతిదినమును నేదైన నొక పండును దినగలుగకున్నాడు. ఆహారమున పండ్లయొక్క విలువనుగూర్చి ప్రజలలో ప్రబోధము గలిగించి ఫలకృషికి తగిన ప్రోత్సాహము నిచ్చుటవలన నిప్పటికంటె హెచ్చుమంది పండ్లను దిని యారోగ్యముగ నుండునటుల జేయవలయును.

చెన్నపురిరాజధానిలో సముద్రపుమట్టమునగాని, కొంత యున్నతముగల ప్రదేశములందు గాని పెరుగు ముఖ్యఫలజాతులు ఈక్రింద అకారాదిగ పేర్కొనబడును.

అంజూర, అనాస, అరటి, అవకేడో, ఈడి, ఈత, కమలా, క్రమక్, కాకిపండు (Diospio so Kaki, కొబ్బెర, ఖర్జూర, ఖర్బూజా, గంగరేగు, గులాబీజామి) జంబుమలాకా, జామి, జీడిమామిడి, డురియన్, తర్బూజా, తాటి, తీయనారింజ, తీయనిమ్మ, దానిమ్మ, దోస, ద్రాక్ష, నల్లజామి (Purple guava), నారింజ, నేరేడు, పంపరపనస, పల్మాస్, పాల, పీచ్, పుచ్చ (తర్బూజా), పూతిక, పెద్దవాక (Carissa grandiflora) బేరి, బొప్పాయి, మంగుస్థాన్, మామిడి, రాచయుసిరి, రామాఫలం, రేగు, లకోటా (Loquat), లాంగ్యాట్ (Langeat) లిచ్చీ (Lichee), వెలగ, సపోటా, సీతాఫలం, సీమరామాఫలం (Chrimoya), సీమరేగు, సీమవంగ, సీమజామి (Fujoa sellowiana).

పైనపేర్కొనబడిన ఫలజాతులలో నరటి ప్రధానమైనదని చెప్పవచ్చును. ఇటీవల నీతోటలు 'కంపెనీ పద్ధతి' యనబడు నూతనవిధానమున విరివిగ పెంచబడుచుండుటచే చాలమంది కీపండ్లు చౌకగ లభించుచున్నవి. ఉత్తరసర్కారులలో మామిడిపండ్లు కూడ విరివిగ నుత్పత్తి యగుచున్నవి. కొబ్బెర సామాన్యముగ చమురు దినుసుగ గణింపబడుచున్నను, నిది (ముఖ్యముగ లేతకాయ) ఫలజాతిగ పెంచదగి యున్నది. నారింజగణము నందలి

* "Like the anthropoid ape he (man) is mainly fungivorous. The natural food of man (i. e.) the food to which he is mainly adopted, consists of fruits, nuts, green leaves and roots." S. M. Whitaker-Nutrition abstracts and reviews Vol.3, No 3389

జాతులును, సపోటాయును, తెలుగుజిల్లాలలో ప్రాముఖ్యమును గలిగియున్నవి. ఇటీవల జామితోటలు గూడ విరివిగ పెంచబడు చున్నవి. సముద్రప్రాంతము లందు జీడిమామిడితోటలు మెండుగ పెంచబడుచున్నవి. అనాస సింహాచలపుకొండపైమాత్రమే విరివిగ పైరుచేయ బడుచున్నది. ద్రాక్షకూడ నిల్లై కొన్నిప్రత్యేకస్థలము లందుమాత్రము పైరగుచున్నది. సీమరేగు బేరీ ఇవి కొంత యున్నతములుగల చోట్లనే పెరుగుచున్నవి. సీతాఫలం, రామాఫలం, వెలగ మొదలగు కొన్నిజాతులు స్వతస్సిద్ధముగ పడిమొలచిన చెట్లనుండియేకాని, అల్ప శ్రమతో గాని పెరుగుచున్నవి. ఇదిగాక కేవలవన్యస్థితి యందు లభించు క్షుద్రఫలజాతులుకూడ చాలగలవు.

ఇట్లు వివిధపరిస్థితులందు పెరుగు ననేకజాతులు గలిగియుండుటచే నీరాజధానియందు అన్నికాలములందును ఏవో కొన్నిజాతులపండ్లు లభించుట కవకాశము గలిగియున్నది. అరటి, కొబ్బెర, నారింజ, తీయ నారింజ, సపోటా, బొప్పాయి, జామ, ద్రాక్ష, యివి కొంచెమించు సంవత్సరము పొడవునను లభించుజాతులు. తక్కినవి కొన్ని కొన్ని యొక్కొక్క కాలమునందు మాత్రము లభించును. క్రిందిలేఖాసూచిక (చూ: సూ. ౧.) ఆయాజాతులు అల్పముగను, మధ్యమముగను, విరివిగను, లభించుకాలములను సూచించును.

పండ్లసంఘట్టనమున నీరే ప్రధాన భాగము. సామాన్యముగ నాయాజాతుల కండ లేక రసమున నూటికి ౭౫ - ౯౦ పాళ్లు నీరే. తక్కిన ౧౦ - ౩౫ పాళ్లలో కర్బనోదజనితము మెండు. ఇది బాగుగపండిన పండ్లలో చాలభాగము వివిధములగు శర్కరలరూపమున నుండును. పండ్లయందలి శర్కరాభేదములలో ఖండశర్కర (Sucrose), ఫలశర్కర (Fructose) ద్రాక్షశర్కర (Glucose) ఇవి ముఖ్యములు. పండ్లలో మాంసకృత్తులు స్వల్పము. చమురు మరింతస్వల్పము. ఖనిజములుకూడ స్వల్పమనియే చెప్పవచ్చును. చాలజాతులలో కొద్దిగొప్ప యమ్లపదార్థముకూడ జేరియుండును. ఇది పచ్చికాయలందు హెచ్చుగనున్నను అవి పండిన వెనుక చాలజాతులలో తగ్గిపోవును. పండ్లలో విటమినులు ముఖ్యముగ C హెచ్చుగనుండును. ఇతరాహార ద్రవ్యములలో లోటుగా నుండునట్టియు, ఉన్నను ఉడికించుటవలన సులభముగ నశించునట్టియు విటమిను C లభింపజేసికొనుటకే పండ్లను తప్పక తినవలసియుండును. ఈ క్రింది పట్టికలో (చూ: సూ. ౨.) నాయాజాతుల పండ్లసంఘట్టనమును తెలుపు అంకెలు లభించినంతవరకు సంగ్రహించి వ్రాయబడెను.

పై పట్టిక యందలి యంకెలు చాలవరకు Popenoe's 'Manual of Tropical Agriculture' నుండియు, Col. Mc Carrison గారి 'Food' అను గ్రంథము నుండియు, American Red Cross Society వారి 'Food and Nutrition' అను గ్రంథము నుండియు గ్రహించి లెక్కింపబడినవి. కొన్ని పండ్లవిషయమున ఒకరు వ్రాసినయంకెలు మరియొకరు వ్రాసినయంకెలకు సరిపోవు. ఆయాపండ్లజాతుల సంఘట్టనము, అవి పెరిగిన ప్రదేశమునుబట్టియు, పరిస్థితులనుబట్టియు, ఫలించినకాలమునుబట్టియు, పరీక్షించినప్పటి పక్వస్థితినిబట్టియు మారుచుండవచ్చును. ఒక్కొక్క జాతియందలి వివిధరకముల సంఘట్టనలయందు గూడ వ్యత్యాసము లుండవచ్చును. కావున మనము తిను పండ్ల యొక్కవిలువను సరిగా తెలిసికొనవలెనన్న ఆయాప్రాంతములందు విస్తారపరిశోధన జరుగవలసియున్నది. అయినను పై పట్టికయందలి యంకెలు ఆయాజాతుల ఆహారపు విలువను కొంతవరకు సూచించును.

పైపట్టికలలో కొబ్బెర (సగము ముదిరినది) యు, అవకేడో యను విదేశీయఫలమును, ఇంధనశక్తియందు (అనగా శరీరమునకు బలము నిచ్చుటలో) అగ్రస్థానము వహించుచున్నవి. వీనిని సామాన్యముగ పండ్లుగ పరిగణింపదగియున్నను, చమురుదినుసులవలె హెచ్చుబలము నిచ్చుటచే వానివలె స్వల్పముగ దినదగును.

సామాన్యముగ లభించు తక్కిన ఫలజాతులలో అరటి, గంగరేగు, తాటి, సీతాఫలం, పనస ఇవి బలమైనవి. వీని యింధనశక్తి తినదగిన భాగమున (అనగా

## కొన్ని ముఖ్యజాతుల ఫలములు లభించుకాలమును దెలుపు లేఖాసూచిక

| ఫలజాతి | జనవరి | ఫిబ్రవరి | మార్చి | ఏప్రిల్ | మే | జూన్ | జూలై | ఆగస్టు | సెప్టెంబరు | అక్టోబరు | నవంబరు | డిసెంబరు | పూచినది మొదలు ఫలించుటకు పట్టుకాలము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | | | | | నెలలు |
| అరటి | | | | | | | | | | | | | 2–4 |
| కొబ్బెర | | | | | | | | | | | | | 10–12 |
| నారింజ | | | | | | | | | | | | | 7–10 |
| తీయ (బత్తాయి) నారింజ | | | | | | | | | | | | | 7–10 |
| సపోటా | | | | | | | | | | | | | 4–5 |
| బొప్పాయి | | | | | | | | | | | | | 6–8 |
| జామి | | | | | | | | | | | | | 2–3 |
| కమలా | | | | | | | | | | | | | 8–10 |
| సీమవంగ | | | | | | | | | | | | | 1–1½ |
| రామాఫలం | | | | | | | | | | | | | 4–5 |
| పుచ్చ | | | | | | | | | | | | | 2–2½ |
| పనస | | | | | | | | | | | | | 6–7 |
| గులాబీజామి | | | | | | | | | | | | | 1–1½ |
| సీమమామిడి | | | | | | | | | | | | | 1½–2 |
| మామిడి | | | | | | | | | | | | | 4–5 |
| తాటిముంజలు | | | | | | | | | | | | | 2–2½ |
| తాటిపండ్లు | | | | | | | | | | | | | 6–7 |
| మంగుస్తాన్ | | | | | | | | | | | | | 6–7 |
| అనాస | | | | | | | | | | | | | 4–5 |
| నేరేడు | | | | | | | | | | | | | 1½–2 |
| సీతాఫలం | | | | | | | | | | | | | 3–4 |
| రేగు | | | | | | | | | | | | | 3–4 |
| ద్రాక్ష | | | | | | | | | | | | | 3–4 |

వరా: ——— ఇట్టి పూర్తిగీత ఆయాజాతులపండ్లు విస్తారముగ వచ్చునని సూచించును.

- - - - - ఇట్టి గీత పండ్లు మధ్యమముగ వచ్చునని సూచించును.

......... ఇట్టి చుకల్లగీత పండ్లు కొలదిగ వచ్చునని సూచించును.

## సూచిక ౨. కొన్ని ఫలజాతులసంఘటనమును దెలుపు పట్టిక

| వరుససంఖ్య | పండుజాతి | ఔన్సుకు గ్రాములు: మాంసకృత్తులు | ఔన్సుకు గ్రాములు: క్రొవ్వు | ఔన్సుకు గ్రాములు: కర్బనోదకములు | మొత్తపు యింధనశక్తి (Total calories) | మొత్తపు ఖనిజపదార్థములు నూటికి—పాళ్లు | 100 పౌనుల తూనికగల మనిషికివలయు పరిమితిలో 1ఔన్సునందుగలపరిమితి-నూటికి—పాళ్లు: ఖటికము | భాస్వరము | ఇనుము | విటమినుల పరిమితి: A | B | C | షరా |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | కొబ్బెర (సగముముదిరినది) | 1,00 | 8.10 | 4.75 | 96 | | 0.4 | 3;0 | 0.3 | | | | |
| 2 | అవకేడో | 4.77 | 7.14 | 2.14 | 91 | 1.22 | | | | | | | |
| 3 | అరటి | 1.41 | 0.17 | 6.29 | 32 | 0.95 | 0.5 | 0.9 | 1.5 | × | × | × × | ఖండశర్కర మిగుల తక్కువ |
| 4 | గంగరేగు | 0.43 | 0.06 | 7.62 | 32 | 0.73 | | | | | | | 40%ఖండశర్కర |
| 5 | డురియన్ | 0.69 | ? | 7.11 | 31 | 1.24 | | | | | | | |
| 6 | సీమరామాఫలం (Cherimoyer) | 0.55 | 0.04 | 6.81 | 29 | 0.66 | | | | | | | 33% పిండిపదార్థము 45% నారపదార్థము |
| 7 | తాటిపండు (గుజ్జు) | 0.26 | 0.09 | 6.56 | 28 | 1.25 | | | | | | | |
| 8 | సీతాఫలం | 0.46 | 0.16 | 5.81 | 26 | 0.67 | | | | | | | |
| 9 | నల్లజామి (Purple guava) | 0.26 | 0.24 | 5.43 | 26 | 0.77 | | | | | | | 35% పిండిపదార్థము 35% నారపదార్థము |
| 10 | పనస | 0.43 | 0.13 | 4.62 | 22 | 0.93 | | | | | | | |
| 11 | లిచ్చి | 0.34 | ? | 5.05 | 22 | 0.54 | | | | | | | |
| 12 | జామి | 0.23 | 0.28 | 4,06 | 20 | 0.67 | | | | | × | × | ఖండశర్కర మిగుల తక్కువ |
| 13 | దానిమ్మ | 0.16 | 0.09 | 4.92 | 20 | 0.73 | | | | | | | కాని 20%పిండిపదార్థమును |
| 14 | తాటిపండు (రసము) | 0.15 | | 4.53 | 19 | 1.18 | | | | | | | 40%నారపదార్థమునుగలవు |
| 15 | మామిడి | 0.13 | 0.02 | 4.11 | 18 | 0.36 | | | | × | | × | చాలవరకు ఖండశర్కర |
| 16 | సపోటా | ? | ? | 4.20 | 18 | 1.10 | | | | | | | సగము ఖండశర్కర |
| 17 | కాకిపండు(Diospiros kaki) | 0.12 | ? | 4.32 | 18 | 0.41 | | | | | | | |
| 18 | ద్రాక్ష | 0.17 | 0.03 | 3.96 | 17 | | 0.3 | 0.6 | 1.0 | | × | V. L. | |

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 19 | గులాబీజామి | 0.24 | 0.05 | 3.82 | 14 | 0.29 | | | | | | | |
| 20 | పెద్దవాక (Carissa grandiflora) | 0.17 | 0.30 | 3.87 | 16 | 0.43 | | | | | | | |
| 21 | సీమరేగు (Apple) | 0.09 | 0.06 | 3.54 | 15 | | 0.3 | 0.3 | 0.6 | | × | × | |
| 22 | లకోటా (Loquat) | 0.10 | 0.02 | 3.50 | 14 | 0.33 | | | | | | | ఖండశర్కర మిగుల తక్కువ |
| 23 | మంగుస్థాన్ (Mangosteen) | ? | ? | 3.9 | 14 | ? | | | | | | | |
| 24 | బొప్పాయి | 0.15 | 0.01 | 3.24 | 13 | 0.60 | | | | × | × | × × | ఖండశర్కర మిగుల తక్కువ |
| 25 | తీయనారింజ | 0.25 | 0.03 | 2.69 | 12 | | 2.0 | 0.5 | 0.4 | × | × | × × × | |
| 26 | పంపరపనస | 0.20 | 0.06 | 2.96 | 12 | 12 | 1.2 | 0.5 | 0.8 | × | × | × × × | |
| 27 | అనాస | 0.11 | 0.09 | 2.75 | 12 | ? | 1.1 | 0.8 | 1.4 | | | × × | |
| 28 | సీమజామి (Fejioa sellowiana) | 0.25 | 0.07 | 2.28 | 10 | 0.56 | | | | | | | 20% ఖండశర్కర 40% నార పదార్థము |
| 29 | లాంగ్సాట్ (Langsat) | 0.34 | ? | 1.77 | 9 | ? | | | | | | | |
| 30 | జంబుమలాకా | 0.06 | 0.01 | 2.03 | 9 | 0.13 | | | | | | | |
| 31 | బేరీ (Pear) | 0.09 | 0.03 | 2.29 | 9 | ? | | | | | × | × | |
| 32 | క్రమల్ | 0.28 | 0.22 | 1.39 | 9 | 0.42 | | | | | | | |
| 33 | తర్బూజా (Water melon) | 0.11 | 0.06 | 1.90 | 8 | ? | | | | | | × | |
| 34 | సీమవంగ (Tomato) | 0.20 | 0.03 | 1.27 | 6 | | 0.7 | 0.7 | 1.00 | × × | × × × | × × × | |
| 35 | డబ్బ | 0.14 | 0.14 | 0.38 | 5 | ? | 1.1 | | | × | × | × × × | |

తొక్క, గింజలు వగైరాలను వదలివేసె తక్కిన భాగమున) ఔన్సుకు ౨౨ మొదలు ౩౨ వరకుగలదు. జామి, మామిడి, ద్రాక్ష, గులాబీజామి, సీమరేగు, బొప్పాయి, నారింజజాతులు అనాస యివి మధ్యమబలము నిచ్చునవిగ పరిగణింపబడును. కాని యింధనశక్తి ఔన్సుకు ౧౨ మొదలు ౨౦ వరకు గలదు. జంబుమలాకా, జేరీ, క్రమక్, తర్బూజా, సీమవంగ, దబ్బ యివి స్వల్పబలము నిచ్చునవి. వీని యింధనశక్తి ఔన్సుకు ౧౦ కి లోపుగ మాత్రమే గలదు.

మొదటితరగతిపండ్లలో మాంసకృత్తులు తక్కిన వానిలోకంటె కొంత హెచ్చుగ గలవు. అరటిపండు నం దివి సమాన-ఇంధనశక్తి నిచ్చు చేబియ్యమునందు కంటెను, గోధుమ మొదలగు నితర తృణధాన్యములందు కంటెను హెచ్చుగగలవు. కావున అపక్వాహారముపై నాధారపడువారి కీయరటిపండ్లు తృణధాన్యములకు బదులుగ నుపయోగింపదగినది. ఒకయకరమున నుత్పత్తియగు నరటిపండ్లు (కర్పూర చక్కెరకేళీ) ఒక యెకరమున నుత్పత్తియగు వడ్లకంటెను, గోధుమలకంటెను ౫ రెట్ల మనుష్యుల కాహారముగ సరిపోవును. కావున నరటిపండు పండ్లన్నిటిలోను సులభముగ పండింపదగినదియు బీద సాదల కందుబడిలోనుండునది యనియు చెప్పవచ్చును. సీతాఫలము, గంగరేగు, పనస యిందుకూడ మాంసకృత్తులు పరిగణింపదగినంత గలవు. తక్కిన వానిలో నతిస్వల్పము.

కొబ్బెరను, అవకేడోను వదలినచో తక్కిన జాతులలో దేనియందును, పరిగణింపదగినంత చమురు లేదు. ఈవిషయమున జామి కొంత మెరుగయినను అందలి గింజలయందే యీచమురు విస్తారముగనుండుటచే నది శరీరమున కంతగా నుపయోగించుననితోచదు.

పండ్లయందు నిలువయగు భాగము అందలికర్బనోదజనితములే. వానియింధనశక్తి చాలవరకు వీనిపరిమితి ననుసరించియే యుండును. కొన్నిపండ్లయందలి కర్బనోదజనితము చాలవరకు ఖండశర్కరగ నుండును. ఉ: మామిడి. కొన్నిటిలో నిది మిసులతక్కువగనుండి, ఫలశర్కర, ద్రాక్షాశర్కర యివి విస్తారముగ నుండును. ఉ: అరటి, బొప్పాయి. మరికొన్నిటిలో కొంత భాగము ఖండశర్కరయు, కొంతభాగము యితరశర్కరలు నుండును. ఉ: సపోటా, గంగరేగు. మొత్తము మీద ఖండశర్కర హెచ్చుగగల పండ్లకంటె నిది తక్కువగనుండి యితరశర్కరలు హెచ్చుగనున్న జాతులపండ్లెక్కువ యాహారయోగ్యములుగ నెంచబడుచున్నవి. కొన్నిపండ్లలో శర్కరలేగాక కొంత పిష్టపదార్థమును నారపదార్థమునుకూడ నుండుటగలదు. ఉ: జామి. ఇందు నూటికి సుమారు ౨౦ పాళ్లు పిష్టపదార్థమును ౮౦% నారపదార్థమును గలవు. కావుననే జామిపండ్లితరపండ్లంత సులభముగ జీర్ణముకావు.

ఆయాజాతులందుండు శర్కరల స్వభావమును బట్టి అతిమూత్రవ్యాధిగలవారికి కొన్నిజాతులు మరికొన్నిటికంటె హెచ్చు అనుకూలములుగ నుండును. ఖండశర్కర హెచ్చుగనున్నవానికంటె, ద్రాక్షశర్కర హెచ్చుగనున్నవానికంటె ఫలశర్కర హెచ్చుగనున్నవి ఈవ్యాధిగలవారి కెక్కువ యనుకూలములు గనుండును. అరటిపండు, మామిడిపండు నందుకంటెను, సపోటాపండునందుకంటెను మొత్తపు శర్కర హెచ్చుగనున్నను, ఈరెంటికంటెను, అరటిపండే అతిమూత్రవ్యాధిగలవారి కనుకూలము. ఆయుర్వేదవైద్యులు అరటిపండును ఈ వ్యాధిగ్రస్తుల కిచ్చుమందుల కనుపానముగ నిచ్చుటగూడ గలదు. ఈ వ్యాధిగలవారు శర్కర హెచ్చుగలపండ్లను దినుట సాధ్యమైనంతవరకు తగ్గించి, అది తక్కువగనుండు జాతుల దినుట మంచిది. ఇందుకు సీమవంగ, జేరీ, జంబూమలాకా, దేశవాళీ నారింజ యివి శ్రేష్ఠములు.

ఆయాజాతుల పండ్లయందలి ఖనిజద్రవ్యములను గురించి తగినంత పరిశోధన జరిగియుండలేదు. పైపట్టికయందు చూపబడిన మొత్తపుఖనిజములపరిమితి కొంతవర కీవిషయమును దెలిపినను, శరీరమునకు వలయు ముఖ్యద్రవ్యములగు ఖటికము, (సున్నము) స్ఫురము, ఇనుము వీనిపరిమితి దేనియందెంతగలదో తెలిసికొన వీలులేదు. ఈవివరములు కొన్నిజాతుల విషయమున

మాత్రమే లభించినవి. మొత్తపు ఖనిజద్రవ్యము పరిమితిలో, తాటిపండు, సపోటా, అరటి, పనస, గంగరేగు, దానిమ్మ, జామి యివి మిన్నయని తెలియుచున్నది. సమానయింధనశక్తిగల పరిమితులనుబట్టి లెక్కకట్టునో, నారింజజాతులు, బొప్పాయి, అనాస, సీమవంగ, ఖనిజములను హెచ్చుగ నొసగుజాతులుగ పరిగణింపవచ్చును. ఆయాఖనిజముల పరిమితి తెలిసినజాతులలో సున్నము (ఖటికము) నారింజజాతులలోను, అనాసపండ్లయందును సీమవంగయందును హెచ్చుగ గలదని తేలుచున్నది. స్ఫురము అరటి, ద్రాక్ష, నారింజజాతులు అనాస, సీమవంగ, వీనిలో హెచ్చుగ గలదు. ఇనుము అనాస, సీమవంగ, అరటి, ద్రాక్ష, వీనిలో హెచ్చుగ గలదు. వివిధజాతులపండ్లను దినుచో మొత్తముమీద అన్నియు జేరి శరీరమునకు గావలసిన ఖనిజముల నొసగగలవు.

విటమినులపరిమితిగూడ అన్నిజాతులపండ్లకును నిర్ణయింపబడియుండలేదు. నిర్ణయింపబడినవాని విషయములలోగూడ భేదాభిప్రాయములు ప్రచురింపబడి యున్నవి. అన్నివిటమినులును హెచ్చుగ గలపండు సీమవంగ. తక్కినవానిలో కొన్నిటియందు A, B లు కొన్నిటిలో స్వల్పముగను C హెచ్చుగను నుండును. ఉ: నారింజజాతులు, బొప్పాయి, అనాస, అరటి. మరికొన్నిటియందు, ఈ C కూడ స్వల్పముగనుండును. ఉ: మామిడి, సీమరేగు, ఈవిషయమయి, యీదేశమున నింకను విస్తారముగ పరిశోధన జరిగినగాని నిజస్థితి తేలదు.

పండ్లరసమునందు జీర్ణముకాని పదార్థమేమియు నుండకపోవుటచే పండ్లకంటె రసముయొక్క యింధన శక్తి హెచ్చు. క్రింది నాల్గుజాతులవిషయమున నీభేదము చూపబడెను. పండ్లరసమున మాంసకృత్తులును, చమురును కొంచెమించు శూన్యమనియే చెప్పదగును.

| | పండ్లు | రసము |
|---|---|---|
| సీమరేగు | ౧౬ | ౧౫ |
| ద్రాక్ష | ౨౪ | ౧౬ |
| తీయనారింజ | ౧౫ | ౧౨ |
| అనాస | ౨౪ | ౧౨ |

ఈ వ్యాసమును ముగింపకముందు యెండించిన పండ్లనుగురించి కొంత వ్రాయదగును. సామాన్యముగ నిట్టిపండ్లలో మనకు లభించునవి, ద్రాక్ష, ఖర్జూర, అంజూర, ఆలుబుఖరా వీనికి చింతపండుకూడ జేర్పవచ్చును. ఇది తక్కినవానివలె నట్లె తినబడకపోయినను వివిధరూపములుగ నాహారమున జేరుచున్నది. ఇటీవల అరటిపండ్లను కూడ యెండించుచున్నారు. ఈక్రింద ఆయాజాతులసంఘట్టనము తెలుపబడును.

కొన్ని ఎండించిన పండ్లసంఘట్టనమును దెలుపు పట్టిక

| వరుససంఖ్య | జాతి | ఔన్సుకు గ్రాములు: మాంసకృత్తులు | చమురు | కర్బనోదకములు | ఉష్ణాంశములు | 100 పౌ. తూకముగల మనిషికివలయు పరిమితిలో 1 ఔ. నకుగల పరిమితి%: ఖటికము | స్ఫురము | ఇనుము | విటమినులు: A | B | C | షరా |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ద్రాక్ష | 0.75 | 1.00 | 22.0 | 100 | 3.90 | 4.00 | 13.20 | | × | | |
| 2 | ఖర్జూర | 0.50 | 0.07 | 22.75 | 102 | 2.80 | 1.20 | 5.70 | | × | | |
| 3 | అంజూర | 1.14 | 0.10 | 21.40 | 92 | 7.60 | 2.80 | 6.40 | × | × | | |
| 4 | ఆలుబఖారా | 0.54 | — | 17.4 | 72 | 2.70 | 2.60 | 6 70 | | × | | |
| 5 | చింతపండు | 1.12 | 0.26 | 11.47 | 52 | ? | ? | ? | × | × | | |
| 6 | అరటి | 4.38 | 0.55 | 20.44 | 105 | 1.62 | 2.93 | 4.88 | | | | |

ఎండిన అరటి, ద్రాక్ష, ఖర్జూర, అంజూర, యివి యించుమించుగ తృణధాన్యములతో సమానబలము గలవి. ఆలుబుఖారా, చింతపండు వీనియందు సారము తక్కువ. అన్నిటియందును కర్బనోదజనితములే ప్రధాన ద్రవ్యము. అరటిలో మాత్రము మాంసకృత్తులు కూడ కొంతవరకుండును ఖనిజములలోనున్నను. అంజూర యందును ఇనుము ద్రాక్షయందును హెచ్చుగ గలవు. అన్ని విషయములయందును ఎండుపండ్ల కంటె తాజా పండ్లు శ్రేష్ఠము. పండ్ల నెండించుటవలన వానివలన మనకు లభింపదగు ముఖ్యమగు విటమిను C చాలవరకు నాశన మగును. కావున సాధ్యమగునంతవరకు తాజా పండ్లనే యుపయోగించుట మంచిది. అయినను, పర్యట నము చేయువారు స్వల్పపరిమితిలో నిముడ్చుకొని వంట లేకుండ భోజనము సమర్చుకొనుట కీయెండబెట్టినపండ్లు సహాయపడును.

పండ్లనుమాత్రమే తిని జీవింప వీలగునా యని కొంద రడుగుదురు. పూర్వకాలమున ఋషులు స్వత స్సిద్ధముగ అడవులందు బెరుగుచుండిన కందమూల ఫలా దులను దిని జీవించుచుండిరని చెప్పుటకు నిదర్శనములు గలవు. ఇపుడు మనము పెంచు పండ్లయొక్క సంఘట్ట నమును గురించియు ఆహారయోగ్యతను గురించియు యింకను పూర్తిగ పరిశోధన జరిగినగాని పై ప్రశ్న కుత్తరము చెప్పుటకు వీలులేదు. కాని యింతవరకు జరిగిన పరిశోధనలనుబట్టి యూహించినచో కేవలము పండ్లు మాత్రము తినుచో ఆహారమునందు కొన్ని లోపములు గలుగునని తోచును. కొబ్బెర, అరటి, గంగరేగు, సీతాఫలం, రామాఫలం మొదలగు వానిని తినుచో, శరీరమునకు వలయు మాంసకృత్తులు, చమురు, కర్బనోద జనితములు, అనుకూలము లగు ప్రమాణములుగ లభించినను, ఖనిజద్రవ్యములు లోటు పడును. ఈపండ్లను అందలి ఖనిజములు శరీరమునకు సరిపోవునంతపరిమితిగా తినుచో అవసరముగు నింధన శక్తి నిచ్చు పండ్లకంటె హెచ్చుగ దినవలసియుండును. కావున జీర్ణముకావు. పండ్లను ప్రధానఆహారద్రవ్యముగ నేర్పరచుకొని కొన్నిపాలను, స్వల్పముగ వరితవుడును గాని గోధుమపొట్టునుగాని వానితోపాటు ప్రతిదిన మును పుచ్చుకొనుచో నీఖనిజద్రవ్యములోలుండదురు నూరుపౌనుల తూనికగలిగిదినమునకు ౮ గంటలు నడక వంటి పనిచేయుమనిషి దినమునకు ౧౦-౧౨ అరటి పండ్లు (౩౬ ఔన్సులతూనికగలవి) ను, ½ సేరుపాలు గాని ఆపాలతో తయారుచేసిన పెరుగుగాని, ౨ ఔన్సులు వరితవుడుగాని గోధుమ పొట్టుగాని పుచ్చు కొనిన సరియయిన యాహారమగును. లేకరి యిట్లు చాలకాలమునుండి తిని యారోగ్యముగ పనిచేయగలుగు చున్నాడు. కొందరు అరటిపండ్లు కొబ్బెరమాత్రము తిని యారోగ్యముగ నున్నవారు గలరని వినుదుము. కొందరు కొబ్బెరను మాత్రమె తిని జీవించువారు గల రనివిందుము. కొందరు పండ్లను పాలను మాత్ర పుచ్చుకొని జీవించుచున్నట్లు విందుము. కాని యిప్పటి వరకు జరిగిన శాస్త్రపరిశోధనలనుండియు లేకరి యను భవమునుబట్టియు, నిట్టి యాహారము లోపభూయిష్ఠ ముగ నుండుటచే నట్లు కొంతకాలము తినుచుండినచో ఆరోగ్యము చెడుట కవకాశముగలదని హెచ్చరింప వలసియున్నది. మన మెట్టియాహారమును బుచ్చుకొన్నను, అందు శరీరమునకువలయు, మాంసకృత్తులు, చమురు, కర్బనోదజనితములు, ఆయాఖనిజములు అనుకూలమగు ప్రమాణములుగ నుండుటయేగాక అందు A, B, C, D విటమినులుకూడ తగినంత యుండవలయునని జ్ఞాపక ముంచుకొనవలెను. శాస్త్రీయముగ ఈవిషయములను గమనింపక స్వాభావికాహారము పేరునగాని అపక్వా హారముపేరునగాని తోచినట్లెల్లగాని, ఒకరు చెప్ప నట్లెల్లగాని యాహారమును మార్చుటవలన ప్రమాదము సంభవింపవచ్చును.

---



కృష్ణ ఏకాదశి

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

# అంబీగదేవుని ఓరుగల్లు శాసనము

గో. రాఘుధాసు

వైశేషికతో భారతి 7 మార్చి 1935 సంపుటములో 427 వ పుట మొదలు నొకవ్యాసము ప్రచురమై యున్నది. ఇందు శాసనపు ప్రతిబింబము గూడ నిచ్చియున్నారు. ఈశాసనమునే S. I. I. Vol. VII లో No. 733 గా ప్రచురించిరి. ఈరెండిటిలో కొన్ని యక్షరములు భేదముగా చదువబడియున్నవి. ఆభేదములలో మొదటిది శాసనకాలము. సంవత్సరము రెండింటిలో నొకటే; మాసముకూడ నొకటియే. వచ్చినభేదమల్లా తిథివారములలో. చరిత్రవిషయమై యింత పట్టుదలైనవి గావు గాని భారతిలో వ్రాసినవారు వీటివిషయమై యింతపట్టుదలతో వక్కాణించుటచే నా యుద్దేశము స్పష్టపఱచు చెప్పనవసరము గలిగినది.

శాసనపరిశోధకసంఘమువారు తిథి ౧[౩] గా జదివిరి. రెండవయంకెను 'సమకోణ హద్దుల' మధ్య నుంచుటచే నది సంశయాత్మక మని స్పష్టపడుచున్నది. భారతియందు నీతిథినే 10 యని ధైర్యముగా జెప్పిరి. తరువాతియక్షరము భారతిలో వ్రాసినవారి సూక్ష్మబుద్ధికి 'స'వలె గన్పించినదిగాని మాకు మాత్రము ఏవిధముగా పరిశీలించిననూ 'వ'గానే గన్పట్టుచున్నదే. 'శు'యని చదివినవారికిగూడ సంశయము తీరక 'వ' అంటె 'వడ్డవారము', అంటే శనివార మవుతుందని దిగువ Foot note లో చెప్పియున్నారు. వడ్డవారమని శనివారమున కేభాషలో వాడెదరో చెప్పరైరి. సంస్కృతాంధ్రోద్రతంబళి బంగాళభాషలలో వాడరని నేను నిశ్చయముగా జెప్పగలను. ఈభాషల నిఘంటువులం జూచితి. నాకు కనిపించినవారినెల్ల నడిగితి.

స్థూలసూక్ష్మదృష్టులచే నగపడు 'వ' తరువాతి నిలువుగీత ఉకారసంజ్ఞగా 'వ'ను 'మ'గా మార్చవచ్చును. అలాగైన 'మ' మందవార మగును. పురుషోత్తమదేవగజపతుల పోతవరం రాగిపత్రాలలో కూడ నిట్లే 'మ'వారము చెప్పవలసిన స్థానమందున్నది. అది మందవారమని ఫ్లీటుదొరగారు చెప్పిరి. తిథివార నక్షత్రములు సరిపోవుచున్నవి. ఇచ్చటను మందవారము తిథికి సరిపోవుచున్నది. 'మ' యనగా మంగళవార మని కూడ అగును.

'ప్రమాదిసంవత్సర మాఘ శు ౧[౩] వ|' యని శాసనమం దున్నది. ఇది శా. శ. 1381 మాఘ శు. 13 మంగళవారమున కనగా క్రీ. శ. 1460 జనవరి 26 మంగళవారము. మాఘ శు. దశమి యనే చదివిన క్రీ. శ. 1460 జనవరి 23 శనివారము. అంతేగాని భారతిలో నిచ్చినట్లు క్రీ. శ. 1459 ఫిబ్రేవరు 1 శుక్రవారమునకు సరిపోదు. ఏలయన శా. శ. 1381 క్రీ. శ. 1459-1460. చైత్రాదియైన శాలివాహనసంవత్సరము క్రైస్తవమాన మార్చి-ఏప్రిల్ నుండి యారంభమగును. మాఘమాసము పదునొకండవమాస మగుటచే ఇంగ్లీషు నెలలలో జనవరు ఫిబ్రేవరుకు సరిపోవుచున్నది. మాఘశుక్లము జనవరు మూడవవారమునుండి యారంభము. కావున భారతిలో జెప్పబడిన క్రైస్తవమానతారీఖు పొరబడినది. శుక్రవార మసలే సరిపోదు. తిథివారములు చరిత్రాంశములకు నవసరము లేదు. క్రీ. శ. 1460 జనవరులో ఓరుగల్లు కోట గజపతిరాజులు పట్టుకునిరన్నచరిత్రకు చాలదా?

మెకెంజీ మాన్యుస్క్రిప్టులో వ్రాసియున్న శాసన మీశాసనమునకు భిన్నమని భారతిలో వ్రాసియున్నది. ఇంతవరకు శాసనపరిశోధకసంఘమువారుగాని, తదితరులుగాని ఓరుగల్లుకోటలో మరియొకశాసనమును గనిపెట్టలేదు. మెకెంజీ దొరగారు వ్రాసిన వ్రాతలు జనులనుడివినవాక్కులే గాని ప్రమాణసందిష్టములు గావు. అట్టివాఙ్మూలములు ప్రమాణములుగా

1. E. I. Vol. XIII. No. 12.

భావించనోపునా ? మరియు నందులో జెప్పిన దశమి శుక్రవారము లెఖ్ఖకు సరిపోదు. ఈయంశము మీద వక్కాణించియే యుంటిని.

ఇక శాసనములో పేర్కొనబడిన పురుషులు- కపిలేంద్రగజపతి ప్రధానప్రభువు. వీరివిషయమై తరువాత జెప్పెద. తరువాతినామములు శాసనపరిశోధక సంఘమువారు 'కుమారుండు ఈచ్చరదేవుండు మాధవ మహాపాత్ళ్రుండని' యిద్దరున్నట్లు చదివిరి. భారతిలో 'కుమారుండు అంబ్బీరకుమారదేవ మహాపాత్ళ్రుం డని యొక్కరే యున్నట్లు చదివిరి. కపిలేంద్రగజపతిగారి కుమారుండు 'అంబీరరాయి' యనువా రొక్కరున్నట్లు ఫెరిస్టాచెప్పెను కాని 'బుర్హానీమజారు'[2] అను డక్కను చరిత్రలో జెప్పబడలేదు. 'భ్రమరవర' యను పదమునకు మహమ్మదీయులు 'అంబీర' యని చెప్పిరనియు కపిలేంద్రులపుత్రులైన 'పురుషోత్తము' నకు మరియొక నామము 'భ్రమరవర' యని యున్నదని M. M. Chakravarti గారు వ్రాసిరే[3] గాని వారు చేసిన పొరబాటులలో నిదియొకటి. 'భ్రమరవర' యను బిరుదు కపిలేంద్రులకే యుండెను. పురుషోత్తమ గజపతుల శాసనములు సుమారు ఇరువదింటిని, వీరు వ్రాసిన గ్రంథములలో నాశ్వాసాంతగద్యలను సుమారారింటిని, వీరిపుత్రులైన ప్రతాప రుద్రగజపతులచే వ్రాయబడిన సరస్వతీ విలాసము వ్యవహారకాండయొక్క ఆరంభమందు జెప్పిన వంశావళి చూచితిని గాని యెందును 'భ్రమరవర' యను నామము పురుషోత్తమగజపతుల కున్నట్లు కన్పించలేదు. దీనినిబట్టి చరిత్రకు తెలియని కొమారు 'డంబీరదేవ' యను నొక డుండియుండ వచ్చునని యూహింపవచ్చునా ?

ఈశాసనమందు చెప్పిన 'అంబీరకుమారదేవు'నకు మహాపాత్రుండని బిరుదున్నది. రాజపుత్రులకు మహాపాత్రుండని బిరుదుండదు. పురుషోత్తమగజపతిగారి కుమారుండైన ప్రతాపరుద్రగజపతులు చిన్ననాడు కూర్మాంలో నుండియున్నట్లు అచ్చుపడున్న శాసనము (S. I. I. Vol. V, No. 1152) వలనను, వీరువ్రాసిన శ్యైనికశాస్త్ర[4] మను గ్రంథమువలనను తెలియవచ్చుచున్నది. అప్పటిలో వీరు రాజకీయవ్యవహారములు చక్కబెట్టుచున్నను వీరికి మహాపాత్రులని బిరుదులేదే! మహాపాత్ర శబ్దమున కర్థమేమనగా:-పాత్రుడంటే చిన్నసైన్యమున కధిపతి; మహాపాత్రుడంటే పెద్ద సేనానాయకు డన్నమాట. ఇంతకు పెద్దవారైన 'కుమారమహాపాత్రు' లని చెప్పబడును. ఇచ్చట 'కుమార' యనుపదమునకు 'పుత్రుడ' ని యర్థముగాను. కుమారస్వామి (స్కందుడు) యనియనగా కురస్వామియంత సైన్యాధిపతియని యర్థము. కావున 'అంబీరదేవుడు' కపిలేంద్రదేవ ముఖ్యసైన్యాధిపతిగా నేర్పడెను. ఇంక యితరశా- ములను పరిశీలింతము,

S. I. I. Vol. VI No. 1088 లో అంబీరదేవకుమారమహాపాత్రుండు సూర్యవంశజులైన పంపుదేవమహాపాత్రులకుమారుండు శకవర్షంబులు 1381 అగునేంటి మిధున శు 10 ఆదివారమునాండు సింహాచల స్వామిసన్నిధియందు నిత్యమును వీణాగానము సలుపుటకొక దానము స్థాపించినట్లున్నది. దీనివలన క్రీ. శ. 1459 జూ౯లో సూర్యవంశజులున్ను, పంపుదేవమహాపాత్రుల పుత్రులైన 'అంబీరదేవకుమారమహాపాత్ర' లనే యొకయోధుడున్నట్లు తెలియుచున్నది. కృష్ణజిల్లా యెనికిపాడుగ్రామంలో నున్న శాసనమందు

2. J. A. S. B. Vol. LXIX Part I p. 34. 'భ్రమరవరరాయ' యను నామము కపిలేంద్ర మహారాయలకే చెందినట్లు 'గోపినాథపురశాసనము' (J. A. S. B. Vol. LXIX Part I) లో నున్నది. ఈబిరుదు పురుషోత్తమగజపతికిగాని, ప్రతాపరుద్రదేవ గజపతికిగాని యున్నట్లు నిదర్శనములులేవు. ఫెరిస్టాపేర్కొనిన అంబీరరాయి యెవరో ముందుచెప్పెద.

3. I. A. Vol. XXVIII.

4 Bibliotheca Indica: A Collection of Oriental Works, A. S. B. New Series No. 1252.

(M. E. R. 1913. No. 157) కుమారయనుపదము 'అంబీర'కుముందు వ్రాసియుండుటచే శాసనపరిశోధక సంఘమువారు పొరబడి కపిలేంద్రులకుమారు డంబీర మహాపాత్రులని వ్రాసిరి. ఇటువలెనె బెజవాడతాలూకా జక్కింపూడిశాసన 5 మందు బేర్కొనబడిన 'అంబీర దేవుని' గూడ దలంచిరి. ఈ మూడింటియందు జెప్పబడిన 'అంబీరదేవు' వక్కరే. వీరు కపిలేంద్రగజపతులు నమ్మిన సైనికులలో నొకరు. కపిలేంద్రగజపతి విజయనగరముపై దాడివెడలుచు కృష్ణానదికి దక్షిణముగానున్న దేశమును జయించుటకు నీయంబీరదేవకుమారమహాపాత్రులను బంపినట్లు, వీరు దక్షిణసముద్రము పర్యంతము నాదేశమును జయించినట్లును అన్నవరతామ్ర శాసనము (ఆంధ్రపత్రికయుగాదిసంచిక 'ప్రభవ')లో నిట్లుచెప్పియున్నది:

ప్రసహ్య కర్ణాటమహీపతేః పురీ
న్నిరుధ్య విద్యానగరీం నిజైర్బలైః,
సమున్నతం మానమివోచ్ఛ్రియం కరం
సమాదధే కర్కశచక్రవిక్రమః.
కుమారహంవీర విభు ర్యదాజ్ఞయా
విజిత్య కాత్స్నాంత దిశం ప్రతాపవాన్,
అశోధయ చ్ఛాత్రవశోణితేక్షితా
కృపాణికాం దక్షిణసాగరాంబుషు.

ఇందులోకూడ హంవీరశబ్దమునకు బూర్వమందు 'కుమార' శబ్దము ఛందస్సుకొరకు కుంచబడినది. యోధుడనే దాని యర్థము. పుత్రుడనియర్థము చెప్పగూడదు.

ఈ యంబీర కుమార మహాపాత్రుల కుమాళ్లు 'దక్షిణకపిలేశ్వర కుమారమహాపాత్రులు. వీరు మన్నూరు శాసనములలో(M. E. R. 1919 Nos.51 &92)హం. బీరభోగమను భోగమును దేవాలయములందు శా. శ. 1386 తారణసం|| మిథున శు. 3 లక్ష్మీవారము పుష్యమీనక్షత్రమందు స్థాపించినట్లున్నది. తండ్రిపేరున దేవునకు భోగమేర్పరుపబడినట్లుండుటచే యీదినమందే అంబీరదేవకుమారమహాపాత్రులు పరలోకప్రాప్తులైనట్లు తోచుచున్నది. ఈదక్షిణ కపిలేశ్వర కుమార మహాపాత్రుల నామమునుజూచి యిది కపిలేంద్రులవారి యొక పేరని యపోహపడిరి.6 అంబీర దేవకుమార మహాపాత్రులు క్రీ. శ. 1464 జూన్ 7 లక్ష్మీవారమందు పుష్యమీ ప్రయుక్తకాలమందు మృతినొందిరి.

ఓరుగల్లు కోటశాసనమున జెప్పబడినవారు గజపతి కపిలేంద్రదేవ మహారాయలకుమారుం డొకడున్ను, అంబీరదేవ కుమారమహాపాత్రుం డొకడున్ను, జన యిద్దరుగలసి కోటపట్టుకున్నట్లు ఒకరిచదువువలన దేలుచున్నది. శాసనపరిశోధకశాఖవారి చదువువలన గజపతి కపిలేంద్రమహారాయలకుమారుండైన ఈశ్వరదేవుండు ఒకరు మాధవమహాపాత్రుడనే మరియొక యోధునితో గలసి వోరుగల్లుకోటను బట్టుకొనినట్లు బోధపడుచున్నది. ఈరెండు చదువులలో 'గజపతికపిలేంద్ర మహారాయల కుమారుండు, అంబ్బీరదేవ కుమారమహాపాత్ర' లన్నదే శాసనములో నున్నట్లు నాకంటికి గనబడుచున్నది. అంబీరకుమారమహాపాత్రులు జయించినకోటలలో వోరుగల్లుకోట యొకటని యీశాసనమువలన దేలుచున్నది.

ఓరుగల్లుకోటను అంబీరదేవకుమారమహాపాత్రులు క్రీ. వె. 1460 జనవరు మాసాంతమందు స్వాధీనము జేసుకున్నట్లు యీ శాసనము స్పష్టపరచుచున్నది. కొండవీటిసీమకు పాలకుడు గాణదేవురౌతురాయ ప్రభువున్నట్లు క్రీ. వె. 1455 సం.ప్ర కొండవీటి తామ్ర శాసనము7 తెలుపుచుండగా క్రీ. వె. 1460 లో అంబీర దేవమహాపాత్రుండు కొండవీటిసీమలోనున్న ఓరుగల్లును పట్టుకొనవలసిన యగత్య మెట్లుగలిగెనని యూహ పుట్టవచ్చును. క్రీ. వె. 1455—1460 కి మధ్యను నాగాణ

5. M. E. R. 1913. No. 143.

6 History of Orissa, by R. D. Banerjee Vol. 1 p. 294 and M. E. R. 1919. p. 106 para 47.

7. I.A. Vol. XX Nov. 1891 p. 390 ff.

దేవుడు మృతినొందియుండవచ్చును. అప్పటికి దక్షిణ మండలిని జయించి దానికి ప్రభువైయున్న అంబీర దేవుడు కొండవీటిసీమనుగూడా పాలింప నియుక్తులై యుండవచ్చును.

దక్షిణకపిలేశ్వరకుమార మహాపాత్రుడు మొదట కొండవీడు, దండపాటమునకు పాలకుడుగానుండి తరువాత కొండవీడు, కొండపల్లి, అద్దంకి, వినుకొండ, దండపాడు, పడైవీడు, వలిదిలంపట్టు-ఉసావడి, తిరునారూరు, తిరుచినాపల్లి, చంద్రగిరి ప్రదేశముల నన్నిటిని గలిపి యేలినట్లు మన్నారుశాసనములలో గలదు.8 ఈశాసనపుతారీఖు క్రీ. శ. 1464 జూన్ 7 లక్ష్మీవారమని పైని జెప్పియేయుంటిని. ఈరోజుననే వీరితండ్రిగారైన అంబీరదేవకుమారమహాపాత్రులుపరలోకగతులగుటంజేసి దక్షిణకపిలేశ్వరకుమారమహాపాత్రులు కావేరీనదివరకున్న దేశమునకు బాలకులైరి. గాణదేవరౌతరాయమహాపాత్రుడు పోయినవెనుక కొండవీడుకొండపల్లులకుమాత్రమే యీదక్షిణకపిలేశ్వర మహాపాత్రులు పాలకులుగానియోగింపబడి, తమతండ్రిగారైన యంబీరదేవకుమారమహాపాత్రులు మృతినొందగానే వారి రక్షణలోనున్న దక్షిణదేశమునుగూడ వీరికే వప్పజెప్పినట్లు గన్పించుచున్నది. దీనిని బట్టి యీయంబీరదేవునియందు కపిలేంద్రగజపతి మహారాయల కెంతనమ్మకము విశ్వాసమున్నదో మనకు దెలియుచున్నది. అందుచేతనే వారి కుమాళ్లను కృష్ణమొదలు కావేరీవరకు నున్న దేశము నంతను ఒప్పజెప్పిరి. ఈదక్షిణకపిలేశ్వరకుమార మహాపాత్రులుగూడ నట్టిదయకు కృతజ్ఞులై శత్రువులనుండి దేశమున కెట్టిభయము లేకుండ గాపాడిరి. వీరిభయము వల్లనే సాళువనరసింగరాయ లుదయగిరి కొండవీటిదేశములను జయించలేకపోయిరి. భామినిసుల్తాను క్రీ. శ. 1470లో వీరి మృతవార్తను11 విని తెలంగదేశము వారికి స్వాధీనమైనటుల సంతోషించిరి.

అంబీరదేవకుమారమహాపాత్రులు తమకు తమ ప్రభువునందుగల భక్తివిశ్వాసములను జూపుటకై తమ పుత్రులకు తమప్రభునామమును 'కపిలేశ్వర' యని పెట్టిరి. దక్షిణదేశమునకు ప్రభువగుటచేతను 'దక్షిణ కపిలేశ్వరు' లైరి. మహాయోధులుగావున 'దక్షిణ కపిలేశ్వరకుమార మహాపాత్రు'లని పేరు వహించిరి. వీరు తమతండ్రినామమును, హిందూ ఆచారరీతిని తమ పుత్రులకు బెట్టిరి. క్రీ. శ. 1471 లో రాజమహేంద్రవరముపై దాడివెడలిన ఓఢ్రసైన్యమున కధిపతిగా ఫెరిస్టాచెప్పిన 'అంబీరరాయి' యీ దక్షిణకపిలేశ్వరకుమారమహాపాత్రుల కుమారుండే. ఈ యంబీరకుమారమహాపాత్రులే కృష్ణదేవరాయలు కొండవీడుపట్టుకున్నప్పుడు పట్టుపడినట్లు జెప్పబడినది. ఇదియ యంబీరదేవకుమారమహాపాత్రుని (I) యొక్కయు, వారివంశముయొక్కయు నేటివరకు దొరికిన చరిత్ర. ఈకుటుంబముయొక్క ధైర్యస్థైర్యపరాక్రమము కృష్ణానదికి దక్షిణముగానున్న ప్రదేశమును కపిలేంద్ర గజపతి జయించి విజయనగరరాజుల నదుపుమీఱ నుంచగలిగె. విజయనగరరాజ్యచరిత్ర పరిశోధకులైతేనేమి వోరిస్సాగజపతులచరిత్రశోధకులైతేనేమి యింతవరకు నీయంశములను గుర్తించలేదుగదా, గజపతులచరిత్ర యందు చాలాపొరపాట్లు చేసియుండిరి. వాటిని నివర్తించుచు ప్రమాణజనితమైన చరిత్రమును వ్యాసముగా నిటుపైన వ్రాసెద.

---

8. M.E.R. 1919. p. 106. para 47.

9. A little known chapter of Vijayanagar History, P. 54.

10. గజపతి కపిలేంద్రమహారాయలే యీ సంవత్సరమందు చనిపోయిరని యింతకుముందు వారపోహపడిరి. ఇదియథార్థముగా నపోహమేయని కపిలేంద్రుల చరిత్రలో జూపెద.

# ప్రాంతబండి

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

(మాఘశుద్ధదశమి - జన్మదినము)

ఇంక నన్నేల నీ విందు నిల్పితివి ?

* * * *

నలువదియేండ్లనాంటి దీబండి ;
చక్రాలు సగమయ్యె నడలెను కుసులు
"ఏకీలు కాకీలు" ఎడమయిపోయె
నమలిమ్రింగంగలేవు నడు మెత్తలేవు,
నాల్గడుగులమేర నడవలే వెడ్లు ;
ఈబడుగెడ్లతో ఈబొక్కిబండి
ఎటుతోలుకొనిపోవ నెంచినావయ్య ?

* * * *

తొలుత నెన్నెన్నోతప్పులు చేసినాను,
బండి నాదని యెంచి భ్రమపడినాను ;
నాటుత్రోవల నెడ్లు నడిపించినాను ;
తప్పుత్రోవలం బెట్టి దాంటించినాను ;
తరికాక నే బండి యరిగిపోయినది ;
అరిగిపోయినబండి నెత్తేగిచూచితిని ;
ఆబండిపైని ని న్నరసిచూచితిని
బండి నీదనుమాట పరికించినాను,
పొరపాటు నాదంచు పోల్చుకొన్నాను.

అరిగినబండి నీ కప్పగించితిని,
తోలుకొమ్మని కీలుచెప్పితిని
పొరపాటు మన్నించి దరినిల్చినావు,
బండితోల్కొనిపోవం బనిపూనినావు.

ఈముసలెడ్లతో ఈప్రాంతబండి
"ఏలాగొ, ఓలాగు" ఈడ్పించుకొంచు
చీమ గంగాయాత్ర చేసినరీతి
సాగించుచున్నావు—చాలదా యింక

* * * *

త్రోవ కన్పడరాదు—త్రోపు మెండయ్యె
ఏడకుం బోవుటో యెఱుంగరాదయ్యె
ఇంక నన్నేల నీ విట్టు లీడ్చెదవు ?

* * * *

చాలకాలము యాత్ర సాగింప నీకుం
దలంపున్నం దొలుతనే తలంపలేదేమి ?
నాదికా దీబండి నీదన్నమాట
నే నెఱుంగనివేళ, యేల నాచేత
తోలించినావు ?—నన్ లాలించినావు ?
పాలించినావు ?—నన్ దూలించినావు ?
తూలిపోయితి నేను, నాలోపమేను
కూలిపోయెను బండి; సోలి యీయెడ్లు
వ్రాలిపోయెను—కుసుల్ వ్రేలిపోయినవి.
ఈయెడ్లతో నింక నీబండి యెట్లు
సాగించుకొందువు ? చాలింపరాదె ?

* * * *

* * * *

ఈబండి తోలి నే నేగుచున్నపుడు,
ఈబండి గట్టిగానే యున్నయపుడు,
నలుగెలంకుల కేగి ననుపుంజెందితిని.

చూడఁగలంతయుఁ జూచితి నపుడు;
చేయఁగలంతయుఁ జేసితి నపుడు;
పాటలుపాడుచు బండితోలితిని,
కోటలుపేటలు దాటించుచుంటి;

* * * *

బండి ప్రాఁతయిపోయె, బడుగు నేనైతి;
నలసిపోయితిని; నా కాయూసమయ్యె
ప్రాఁతబం డిపుడు నీపాలు చేసితిని,
ఈడ్డిలంబడుచున్న యీప్రాఁతబండి
నీవు తోలిననేమి, నేఁదోలనేమి?
ఎవరుతోలిన నిప్పు డేమి లాభంబు?
నాదికా దీబండి, నీదేను;—నిజము—
తోలువాఁడవు నీవె—దొరతనంబార
నేలువాఁడవు నీవె—యీబండి యెక్కి—
పోవువాఁడనె నేను—పొరపాటుకతన
నేను దోలితిఁగాని,—నీపనే యద్ది—
నలువదియేఁడేండ్లనాఁటికి—నేఁటి
కీబండిపైనుండ నిచ్ఛగలించె;
ప్రాఁతబండిని దోలు రోఁత నీకేల?
ప్రాఁతబండిని బోవు రోఁత నాకేల?
నాకేల నీకేల యీకానిరోఁత?
విఱుఁగఁగొట్టుము బండి—వెత లేదునాకు—
తరినోర్చుకొమ్ము, నన్ దరిఁజేర్చుకొమ్ము,
నాకువ ద్దిఁక బండి, నీకును వద్దు;
ఈప్రయాణము మన కింకఁ జాల్చాలు.
ఇంటిపట్టుకుఁ బోయి యింపుగా నుంద
మీవు నేనొకచోటనే యుండవచ్చు;
ఈబండి యొకమూల కీడ్చిపై చెదము,
నీవు నే నింటిలో నిల్చియుండెదము.

* * * *

ఇంక నన్నేల నీవిందు నిల్పెదవు?

* * * *

* * * *



# రసాయన శాస్త్రము : చారిత్రికము

తుప్పా ప్రసన్నాంజనేయులు

రసాయనశాస్త్రము — ఈపద మీనాటిభారతీయునిచెవికి క్రొత్తగాతోచకతప్పదు. కెమిస్ట్రీ యనునవి దీనికి సరియైనయాంగ్లపదము. ఇది రసాయన శాస్త్రమును తెలుపుటకు యూరపు ఖండమునందంతటను వాడబడుచున్నది. మనదేశమునందైనను ఆంగ్లభాష నభ్యసించిన విద్యార్థులకు కెమిస్ట్రీయనుపదము పరిచితమైనంత రసాయనపదము పరిచితము గాదు.

ప్రస్తుతకాలమున నీరసాయనపదము మనదేశమున పల్లెటూళ్లయందు వైద్యప్రచారముచే జీవించు శివార్చకులు, వైఖానసులు మొదలగు అల్పసంఖ్యాకులయందు శాగియున్నది.

ఇది కాలముచే గలిగిన విపరీత పరిస్థితి. ఏలనన మనపూర్వులు రాసాయనిక పరిశోధనల ౪౦౦౦ సం. లకు పూర్వమే ప్రారంభించియుండిరనుటకు చాలా నిదర్శనములు గాన్పించుచున్నవి. చారిత్రికపరిశోధన ద్వారా ఈవిషయమున మనకు తెలియవచ్చు కొన్ని విశేషముల నీక్రింద నుదాహరించుచున్నాను.

నవీనపాశ్చాత్య రాసాయనిక మతాభివృద్ధికిమూలభూతమైనది ప్లిని (Pliny) మొదలగు మధ్యయూరపీయపండితుల వ్రాతలును, పారశీక దేశపు వైద్యులసంప్రదాయములును. ప్లినీప్రభృతులు తమ యనుభవములను పారశీక వైద్యప్రవర్తకులనుండి గ్రహించిరి. ఈ వైద్యప్రవర్తకులకు 'ఆల్ కెమిస్టు' (Alchemists) లనునామము పశ్చిమఖండమునందంతటను సుప్రసిద్ధమైయున్నది.

ఆల్కెమిస్టులు గనులయందు దొరకు వివిధములగుపదార్థముల నెరిగియుండిరి. కొంతవరకు వీని యన్యోన్యసాంకర్యముచే గలుగుపదార్థములను, వాని గుణవిశేషములను నెరిగియుండిరి. వీరియందు ప్రధానుడు 'జీబరు' అనునాతడు. అతడు తనకాలపు రాసాయనికద్రవ్యముల శుద్ధులనుగూర్చియు, పుటముబెట్టుట మొదలగు రాసాయనికసంస్కారములగూర్చియు విస్తారముగ వ్రాసియుండెను. ఆల్కెమిస్టులకు వారిపూర్వము ప్రబలియున్న గ్రీకువేదాంతులు విద్యాదాతలని పాశ్చాత్య పండితుల యభిప్రాయము. 'ఆల్కెమీ' యనుశబ్దము యొక్క వ్యుత్పత్తి యీవిషయమును సూచనచేయుచున్నది. 'ఆల్కెమీ' యనునది యరబ్బీపదము. ఇందు 'ఆల్' అను ఉపసర్గకు అది (The) యనునిర్దేశము మాత్రమే యర్థము. 'కెమీ' యనుపదము 'కిమో' (Cheo to drop) యను క్షరణార్థక గ్రీకుధాతువునుండి వ్యుత్పన్నమైనది. కెమిస్టుఅనగా మంచిరసమును పిండువాడు అని అర్థము.* ఆల్కెమిస్టులు ఖనిజములగు ద్రవ్యముల నోషధులరసములతో గలిపి వండి యౌషధముల తయారుచేయుచుండెడివారు. అందుచే వీరికీనామము సిద్ధించెను.

ఆంగ్లచారిత్రకు లిట్లు వ్రాయుచున్నారు :

"గ్రీకులు ప్రయోగము (Experimental work) నందుకంటె మతవాదము (Theory) నందు మిక్కిలి యభిరుచిగలవారు. వీరు అణువులు, వానిగుణవిశేషముల గురించి యనుమానసాధ్యములగువాదముల గల్పించుచుండిరి. వీరు తమయనుభవముల లోహకారులు, రంగ్రేజులు మొదలగుశిల్పులనుండి గ్రహించుచుండిరి....... వీరు తమమతసిద్ధాంతముల నెవ్వరినుండి గ్రహించిరో వారినామములుగాని, చరిత్రలుగాని మనకు తెలియవచ్చుట లేదు. వీరికాలము క్రీ. పూ.

* ఈయర్థము యూరపునందు ౧౭-వ శతాబ్దమువరకు ననువృత్తమైనది.

'A chemist is one who imitates Nature in separating the pure juice from the dross and filth for the use of Medicine.'—Thomson.

౬౦౦ సం. నుండి సుమారు ౧౦౦౦౦ సం. లని నిర్ణయింపవచ్చును."

న్యాయమగుపరిశోధకదృష్టి నొకింత నిగిడించినచో గ్రీకుమతకర్తలు ప్రాచీనభారతీయుల ననుకరించి యుండిరని స్పష్టముకాగలదు. వనౌషధులరసములనుండి యౌషధముల తయారుజేయుట భారతీయులకు వేదకాలమునందే తెలిసియుండెనని సోమసంధానము మొదలగు కర్మలవలన తెలియవచ్చుచున్నది. పాదరసము పురుషవీర్యమనియు, గంధకము స్త్రీవీర్యమనియు పురాణములయందు వర్ణింపబడినది.* ఈనిర్వచనము పారదమాయవిద్యుత్కు (Electro-positive) మనియు, గంధకము వ్యయవిద్యుత్కు (Electro-negative) మనియు జెప్పుటకు తుల్యముగా నున్నది.

ప్రాచీనులు రసశబ్దముచేత ప్రధానముగ పాదరసమునే గ్రహించిరి. వైద్యమునందు వీరు ఇతర లోహవికారములనుగూడ వాడియుండిరి.† మరియు వీటినన్నిటిని వీరు రసములనియే వ్యవహరించిరి. పాదరసము దాదాపు అన్నిలోహములతోడను మిశ్రణముచెందునని వీరికి తెలిసియుండెను. అందుచే సామాన్యముగ ప్రతి రసప్రక్రియయందును వీరు పాదరసమును వాడుటగలదు. రససిందూరము ($Hg_2O$) రసకర్పూరము (Hgcl) రసభస్మము ($Hgcl_2$) మొదలగు ముఖ్యౌషధములు పారదసంకరములు. అందుచే వీరు పారదమును ప్రధానరసముగా నెంచిరి.

రాసాయనికపరిభాషను ప్రథమమున సోమనాథుడను పండితుడు అనుగతముగా నొనర్చినట్లు రస రత్న సముచ్చయ మను గ్రంథమువలన తెలియవచ్చు చున్నది. సోమనాథుడు 'రసశాల' యనుపదమును Laboratory యను నర్థమునందు వాడియున్నాడు. రసశాల నెట్టిపరిసరములందు నిర్మించవలసినదియు, ఎట్లునిర్మించవలసినదియు, దానియందుపకరణముల నుంచవలెనదియు నతడు విధించెను. సోమనాథపండితుడు సుశ్రుతునకును, వాగ్భటునికిని మధ్యకాలమునందున్నట్లు తెలియవచ్చుచున్నది. సుశ్రుతుడు దివోదాసుని శిష్యుడని ఆయుర్వైదిక పరిశోధకులు నిర్ణయించుచున్నారు. కృతయుగమునాటి ధన్వంతరియే దివోదాసుడను పేరుతో కాశిరాజయ్యెనని పురాణములు చెప్పుచున్నవి. పురాణములు పరీక్షిత్తుని కాలమునుండి యతని పౌత్రుడను శతానీకుని కాలమువరకును జెప్పబడినవి. కావున సోమనాథ పండితుడు ౩౦౦౦ సం. ల నాటి వాడని యూహింపవచ్చును. అనగా గ్రీకు రాసాయనికులకు ౫౦౦ సం. లు పూర్వమువాడు.

---

* "ప్రచ్యుత శ్చర మోధాతుః గృహీతం శూలపాణినా;
... ... ... ... ... ... ...
బహిః క్షిప్త స్తథా సోఽపి పరిదందహ్యారూపయా;
సంజాతా స్తన్మలాధానాత్ ధాతవ స్సిద్ధిదాయకాః;
... ... ... ... ... ... ...
రసనా త్సర్వధాతూనాం రసఇత్యభిధీయతే."
ఇతి రసరత్నసముచ్చయే వాగ్భటః.

"కరుణాత్మా మహాదేవః పార్వతీవల్లభ శ్శివః;
తతః శంభోశ్చ్యుతం రేతో గృహీతం వహ్నినాముఖే;
క్షిప్తం తేన చతుర్దిక్షు క్షమాయాం తత్పృథక్ [పృథక్;
విహోత్పత్తి స్సమాఖ్యాతా పారదస్య మనీషిభిః"
ఇతి ఆయుర్వేదే.

"శ్వేతద్వీపే పురాదేవ్యా స్త్రీరే క్షీరపయోనిధేః;
క్రీడంత్యా స్సఖిభి స్సార్థ మభవ త్ప్రస్రుతం రజః;
... ... ... ... ... ...
తతో దేవగణై రుక్తం గంధకాఖ్యో భవత్వయమ్."
రసరత్నసముచ్చయే. వాగ్భటః.

సృష్టిపరిణామము దేవతలనబడు అతివాహిక జీవులచే నెరవేర్పబడునను దృష్టితో పైవిషయములు గ్రహించవలయును.

† "హైమం వ్యోషయుతం త్రిదోషశమనం రాప్యేన పిత్తామయం, తామ్రేణాపి కఫామయాంశ్చ వివిధాన్ శూలాన్ జయే ల్లోహతః; నాగేనాపిజయేచ్చ వంగసహితం మేహాంశ్చ వజ్రామృతం, హేమగ్రాసనివృత్త చంచలగుణ శ్శుద్ధో నివృత్తోరసః."
—ఇత్యాయుర్వేదే.

ఆయుర్వేద ప్రవర్తకులయందు మరొకసంప్రదాయము గలదు. వీరియందు ప్రథముడు ఆత్రేయుడను ఋషిపుంగవుడు. ఈతనిపిమ్మట నీపరంపరయందు ప్రాధాన్యము వహించినది అగ్నివేశుడును, అతని తరువాత చరకుడును. *ఈ రెండు సంప్రదాయముల వారును రెండువిధములను రసప్రయోగముల ప్రవర్తింపజేసిరి. ఇందు మొదటి సంప్రదాయమువారు ప్రధానముగ ఖనిజరసముల (Inorganic Substances) ప్రయోగించుచున్నారు. రెండవ సంప్రదాయమువారు ప్రధానముగ వృక్షరసముల (Organic Substances) ప్రయోగించుచున్నారు. చరకుడు మహాభాష్య కారుడగు పతంజలియే యని ప్రామాణికులు తలచుచున్నారు. చరకుడను మహాయోగి పతంజలియై జన్మించెనని మరికొందరు తలంచుచున్నారు. † (ఈవిషయమున విస్తరము భావప్రకాశికయందు చూడనగును) పతంజలి మహాముని నందుల ము (క్రీ. పూ. ౮౧౩) వాడని ప్రామాణికులచే నిర్ణయింపబడినది. కావున చరకాచార్యుడును దాదాపు ౩౦౦౦ సం. ల నాటివాడని తలంచవచ్చును.

ప్రాచీనుల సృష్టివాదములలో పాశ్చాత్యాణువాదము (Atomic Theory) తో నెక్కువసాదృశ్యము గలది న్యాయవాదము. దీని కారంభవాదమనియు పేరుగలదు. ఈ వాదముప్రకారము ప్రతిపదార్థమును కొన్ని యవిభాజ్యములగు పరమాణువులయొక్క సంయోగముచే నేర్పడుచున్నది. ఈవాదమునకు సూత్రకారుడు గౌతముడు. ఈ శ్రీరామునకు సమకాలికు డగుటచే ౫౦౦౦ సం. లకు పూర్వుడని చెప్పవలయును. గౌతముని తరువాత కాణాదుడు వైశేషికవాదమనుపేరుతో న్యాయవాదమును ప్రతిసంస్కరించెను. పిమ్మటవాత్స్యయనుడను మునిపుంగవుడు న్యాయసూత్రములకు భాష్యమొనరించెను. వాత్స్యాయనుడు, గోనర్దీయుడు (మహాభాష్యకారుడు) మొదలగువారి నెత్తి వ్రాసియుండుట చేతను, పాటలీపుత్రముయొక్క నాగరకతయొక్క ప్రశంసచేసియుండుటచేతను చంద్రగుప్తునికాలమునాటి వాడని నిశ్చయింపవచ్చును (క్రీ. పూ. ౩౨౦).

క్రీ. పూ. ౩౨౬-వ సం.న గ్రీకువీరుండగు అలెగ్జాండరు క్రమమున నీజిప్టుపర్షియా దేశముల జయించి మనదేశమునందు సింధునదీతీరమువరకును తన సామ్రాజ్యమును విస్తరింపజేసెను. సింధునదికి తూర్పున మగధసామ్రాజ్యము సుస్థిరమై యుండెను. మగధరాజులు తమకాలమున ప్రపంచమున కంతకును నాగరకతయందును, సైన్యకౌశలమునందును మిన్నలై యుండిరి. అందుచే నలెగ్జాండరు పంజాబును దాటివచ్చుటకు సమర్థుడు గాకపోయెను. పిమ్మట నతడు తనసేనాధిపతులలో సెల్యూకస్ అనునతని మనదేశమున నతని ప్రతినిధిగా నుంచి వెడలిపోయెను. సెల్యూకస్ కొంతకాలమునకు మగధ చక్రవర్తి యగు చంద్రగుప్తునితో యుద్ధముచేసి యోడిపోయెను. ఈయుద్ధఫలితముగ సెల్యూకస్ తన కుమార్తెను చంద్రగుప్తున కిచ్చి వివాహమొనర్చెను.

పైచారిత్రకవిషయములనుబట్టి క్రీ. పూ. ౩౨౦ సం.ల నుండి గ్రీకుభారతసభ్యతలకు బాగుగ సమావేశము కలిగెనని తెలియగలదు. చంద్రగుప్తుని రాజధాని యగు పాటలీపుత్రమునందు గ్రీకులకు నేర్చుకొనదగిన విషయములు చాలా యుండెను. ఈవిషయములు గ్రీకురాయబారియగు మెగస్థనీసుచే వ్రాయబడిన 'ఇండికా' యను గ్రంథమున వర్ణింపబడియున్నవని చారిత్రికులు చెప్పుచున్నారు.

---

* "విఘ్నభూతా యదారోగాః ప్రాదుర్భూతాః శరీరిణామ్,
అథ మైత్రీపరః పుణ్య మాయుర్వేదం పునర్వసుః.
శిష్యేభ్యో దత్తవాన్ షడ్భ్యః (అగ్నివేశాదిభ్యః."
[చ. సూ. ౧ అ.

† "పాతంజల మహాభాష్యచరక ప్రతిసంస్కృతైః,
మనోవాక్కాయ దోషాణాం హర్త్రేఽహిపతయే నమః." ఇతి చక్రదత్తః.
"అథర్వాన్తర్గతం సమ్య గాయుర్వేదంచ లబ్ధవాన్,
ఏకదా సమహీవృత్తం ద్రష్టుం చరఇవాగతః"
భావప్రకాశికాయాం.

రాసాయనికచారిత్రికులు గ్రీకువేదాంతులు తమ వాదముల నెచ్చటనుండి గ్రహించినదియు బాగుగా తెలియవచ్చుట లేదని వదలివేసినకథను పైచారిత్రిక విషయములతో జోడించినచో కథామాలిక పూర్తికాగలదు.

శాస్త్రదృష్టిచే నొక విషయము విమర్శింప దగియున్నది. భారత ఋషి పుంగవులలో పరమ ప్రాచీనులు ప్రయోగముకంటె మత వాదమునకే యెక్కుడుగౌరవ మొసంగియుండిరి. వీరివేదాంత నిష్ఠయే దీనికి ముఖ్యకారణము. బంగారు, వెండి, రాగి యనుఉత్తమలోహములను వీరు హిరణ్యములని వ్యవహరించిరి. * ఉత్తమ యౌగికానుభవము గలిగియుంటుటచే వీరు వీనియణువులం దాయవిద్యుదావేశము (Positive Eletrical Charge) హెచ్చుగాగలవని గ్రహించిరి. తర్కపరిభాషయందు వీని నాకరజ తేజస్సులని చెప్పుచున్నారు. వీనిని గంధకాదులతో గలపి పుటముబెట్టుటచే నివి భస్మమగుననియు, నట్టి ప్రక్రియ హింసాత్మకమైనదనియు వీరు తలంచిరి. † హింసయైనను ఉత్తమపరిణామమునకై వినియోగింపబడినచో నధర్మముకాదని ప్రాచీన ధర్మసిద్ధాంతము. అందుచే వైద్యమున కావశ్యకమైనంతవరకు రసమారణము దోషముకాదనియే శుశ్రుతాదులు రసౌషధము గూడ విధించిరి.

గంధకముతో సాంకర్యము (Combination) జెందినరసములు మృతి జెందు ననుఅభిప్రాయము పారశీకులను ఆల్ కెమిస్టులవరకు ననువృత్తమాయెను. అందుచే మధ్యఖండమువారు గంధకమును 'సుల్ వరి' యని పిలచిరి. 'సుల్ వరి' యనుశబ్దము 'శుల్బవైరి' యను సంస్కృతశబ్దమునకు వికృతి. ఈవికృతినుండియే ప్రస్తుతము యూరపునందు వాడబడుచున్న 'సల్ ఫర్' (Sulphur) యను శబ్దము నిష్పన్నమైనది.

గ్రీకువేదాంతులు వాదప్రియులు. అందుచే వీరు తమకుగలిగినహిందూదేశసంపర్కముచే మతవాదమునే వృద్ధిచేసుకొనిరి. పారసీకులు స్వభావముచే వీరికంటె నిష్ఠురులు. గ్రీసుదేశమునకును భారతదేశమునకును మధ్య నుండుటచే నారెండుసభ్యతలకు గలిగినసంపర్కము వీరియందు కొంతసంస్కరణమొనర్చెను. భారతీయులకువలె నహింసాతత్వము వీరికి రుచింపదు. వీరుశీఘ్రముగ రసప్రయోగములయందు ప్రావీణ్యమును గడింపసాగిరి. క్రమక్రమముగ వీరు అనేకఖనిజముల భూగర్భమునుండి ప్రకాశింపజేసిరి. ఈఖనిజములనుండి లోహములను తయారుచేయుటను వీరు కనుగొనిరి. వీరిలోహకారకమునందు ముఖ్యమైనది రాగి. ఈవిషయము 'నామలింగాను శాసన' మున సూచింపబడినది. ‡ ఆల్కెమిస్టులు గంధకమును 'సుల్ వరి' యనుటయు నీవిషయమును స్పష్టముచేయుచున్నది. అమరసింహుని కాలమునకు హిందూదేశమ బౌద్ధమతము పూర్తిగా ప్రబలియుండెనని నామలింగానుశాసనమునందలి బుద్ధదేవకీర్తనము తెలియజేయుచున్నది. బౌద్ధమత మహింసాతత్వ ప్రధానమైనదగుటచే, బౌద్ధమత ప్రచారకులచే నాకాలమునకు తలలెత్తుచున్న రసప్రయోగాంకురములు విచ్ఛిన్నములాయెను. ఆకాలమునుండియు రసప్రయోగముల నభివృద్ధిచేయుబాధ్యత విధివశముచే పారశీకులదాయెను. భారతదేశమున మగధరాజ్య మంతరించుకాలమునకు ముసల్ మాన్ భాస్కరుడు మధ్యాహ్నరేఖ నధిష్ఠించెను. వీరిసామ్రాజ్యశాఖలు తూర్పున హిందూదేశము వరకును, పశ్చిమమున నైరోపాఖండమునందలి స్పేను

* Periodic System, Group I, Sub-group B.

† ఈప్రవాద మిప్పటికిని ప్రబలియున్నది. కాని గంధకాదులుచే మూర్ఛ జెందినరసము పంచమిత్రములతో నూదబడినచో పునరుజ్జీవింపబడునని వాగ్భటునిచే వర్ణింపబడినది.

‡ "......................అథతామ్రకమ్,

శుల్బం మ్లేచ్ఛముఖం ద్వ్యష్టవరిష్ఠోదుంబరాణిచ."

నామలింగాను శాసనమ్. వై. వ.

మ్లేచ్ఛముఖ శబ్దమునకు లింగాభట్టీయము:—

'మ్లేచ్ఛదేశే ముఖ్యత్వాత్ మ్లేచ్ఛముఖం.'

దేశము వరకును వ్యాపించెను. రాసాయనిక చారిత్రకు లిట్లు వ్రాయుచున్నారు:—

"ముసల్మాను సామ్రాజ్యమున పశ్చిమతమభాగము స్పేను. ప్రప్రథమమున రసాయనశాస్త్రాంకురము స్పేనునందే నాటబడినది. ముసల్మానుపాలకులచే పోషింపబడి స్పేనునందు రసాయనశాస్త్రము చక్కగా ప్రబలుచుండెను. క్రీ. శ ౭౩౨ సం. న ముసల్మానులకు 'చార్లెసు' చే గలిగిన పరాజయము యూరపునందు రసాయనశాస్త్ర వ్యాప్తిని భంగపరచినది. క్రీ. శ. ౧౪౯౨ వరకు స్పేనునందు ముసల్మానులయాధిపత్యము సంపూర్ణముగ నష్టముగాకున్నను నాకాలపు రాజకీయ వాతావరణము శాస్త్రాభివృద్ధికి సహకారి కాలేదు. స్పేనుదేశమునుండి రసాయనశాస్త్రము యూరపు ఖండమున క్రమక్రమముగ వ్యాపించెను. మధ్యయూరపియను రాసాయనికులు తాము ముసల్మానులకెంతయు కృతజ్ఞులమని ప్రకటించుచున్నారు. పారసీకులు తమవిద్యాఋణమును గ్రీకుల కంగీకరించవలసియుండియు నట్లు చేయుటలేదు. గ్రీకు ప్రాతపుస్తకములను యూరపియనులు తర్జుమాచేసిన పిమ్మటనే గ్రీకులద్వారా ముసల్మానులకును, వారినుండి మనకును రసాయనశాస్త్రము లభించినదని తెలియవచ్చినది."

పారసీకులు తమవిద్యాఋణమును గ్రీకుల కంగీకరించుట లేదనువిషయము పరిశోధకులు కొంత పరికించవలసియున్నది. అలెగ్జాండరు దండయాత్రచే పారసీక సింధుదేశములు తాత్కాలికముగమాత్రమే యవనాధిపత్యమున నుండెను. అలెగ్జాండరు మరణానంతరము యవను లాతనిసామ్రాజ్యమును నిలువబెట్టజాలకపోయి. క్రీ. పూ. ౫ వ శతాబ్దమునుండి క్రీ. శ. ౨-వ శతాబ్దమువరకు హిందూదేశమున ప్రసిద్ధమగుసామ్రాజ్యములు ప్రబలియుండెను. క్రీ. శ. ౭ వ శతాబ్దమునుండి ౧౫-వ శతాబ్దమువరకును ముసల్మానుసామ్రాజ్యము వృద్ధిజెంది యూరపునందు చాలభాగము నాక్రమించుకొనియుండెను. ఈవిషయములనుబట్టి యథార్థమును విచారించి చూడ గ్రీకులును, ముసల్మానులును స్వతంత్రముగనే భారతీయుల ననుకరించియుండిరని చెప్పుట సమంజసముగా తోచుచున్నది. నైసర్గికముగ ముసల్మానుల రాష్ట్రములు గ్రీకుదేశమునకును, భారతదేశమునకును మధ్యగా నున్నవి. కావున వారికి గ్రీకులతో పరిచయము చేసుకొనుట ఎంతసులభమో భారతీయులతో పరిచయము చేసుకొనుటయు నంతేసులభము. మరియు గ్రీకుప్రాముఖ్యము క్రీ. పూ. ౫౦౦ సం. ల నుండి క్రీ. శ. ఒకటిరెండు శతాబ్దములకంటె వ్యాపించియుండలేదు. భారతదేశమున మగధగుప్తసామ్రాజ్యములు క్రీ. పూ. ౫౮౨ (బింబిసారుడు) లకు అనిర్ణీతపూర్వము నుండి క్రీ. శ. ౨-వ శతాబ్దమువరకు వ్యాపించియుండెను. కావున విద్యావ్యాపారముల వృద్ధిజేయుటకు గ్రీకులకంటె భారతీయులకే యెక్కువ యవకాశములు గలిగియుండె నని నిశ్చయింపవలెను. అందుచే ముసల్మానులు తమకు ప్రాచీనులు, సమకాలీనులు నగుభారతీయులనే యనుకరించియుందురు.

ఇందుకు మరొకనిదర్శనము గానవచ్చుచున్నది. రసరత్నసముచ్చయమున వాగ్భటు డీక్రింది ద్రవకర (Flux) పదార్థములను పేరుకొనుచున్నాడు:

"గుడగుగ్గులుగుంజాఽజ్యసారఘైః టంకణాన్వితైః ;
దుర్ద్రావాఖిలలోహాదేః ద్రావణాయ గణో మతః."

ఇందు టంకణము (వెలిగారము) ద్రవకర ద్రవ్యముగా జెప్పబడినది. దీనిని ఆల్కెమిస్టులు 'బురక్' అని వ్యవహరించిరి. ఈబురక్ శబ్దమునుండియే బోరాక్సు (Borax) అను ఆంగ్లపదము నిష్పన్నమైనది. బోరాక్సు యొక్క ఖనిజము యూరపియనుపారిభాషికులచే 'టిన్కల్' (Tinkal) అని పిలువబడుచున్నది. ఈశబ్దము పైన జెప్పబడిన 'టంకణ' శబ్దమునుండి నిష్పన్నమైనట్లు స్ఫుటముగా గానవచ్చుచున్నది. ఈశబ్దము యూరపియనులను గ్రీకులద్వారా చేరియుండవచ్చును. వెలిగారమనుపదార్థమును భారతీయులు ద్రవకరమనియు, టంకణమనియు పిలుచుచుండిరి. దానిని ముసల్మానులు 'బురక్' అనియు, గ్రీకులు 'టిన్కల్' అనియు అనుకరించియున్నట్లు స్పష్టమగుచున్నది. కావున ముసల్మానులు

గ్రీకులకు ఋణస్థులను వాదము యథార్థముకాదని నిర్ణయ మగుచున్నది. మరియు గ్రీకులకును భారతీయులే విద్యా దాతలని స్పష్టమగుచున్నది.

క్రీ. శ. ౭-వ శతాబ్దమున శ్రీహర్ష సామ్రాజ్యము విచ్ఛిన్నమాయెను. అయినను భారతదేశమున విద్యా వ్యాపారములకు భంగము కలుగునంతటి యుపద్రవ ములు కలుగలేదు. రాజపుత్రులు, చాళుక్యులు, చోళు లును స్వతంత్రముగ దేశమును పాలింపజొచ్చిరి. వీరిరాజ్య ములయందును శిల్పములు, కళలు పోషింపబడుచుండెను. కాని ౧౨-వ శతాబ్దాంతమునకు మనదేశము స్వాతం త్ర్యమును గోల్పోయి పూర్తిగా మహమ్మదీయుల యధీనమాయెను.

౧౩-వ శతాబ్దమునుండి ౧౫-వ శతాబ్దమువరకును రసాయనశాస్త్రప్రచారమున నాల్కెమిస్టులు ప్రాధా న్యము వహించియుండిరి. ఆకాలమునకు యూరపు ఖండమునందలి ప్రజలయందు నూతనోద్బోధము గలిగి రాజకీయస్వాతంత్ర్యమును స్థాపించుటకై కృషిజేసి సఫల మనోరథులైరి. అప్పటినుండి యూరపియనులు శాస్త్ర పరిశోధనల కట్టుబాటుగా జేసి శాస్త్రముల వృద్ధి గావించియున్నారు. వీరు ప్రథమమున గ్రీకులలిఖిత గ్రంథముల తర్జుమాచేసుకొని వారిమతవాదముల, నాకె మిస్టులప్రయోగములతో జోడించి శాస్త్రమున కనుగత మగురూపమును సమకూర్పగల్గిరి. అయినను ౧౭-వ శతాబ్దమువరకును రసాయనశాస్త్రము వైద్యశాస్త్ర మున కంగభూతమై యప్రాధాన్యమునే వహించెను.

౧౮-వ శతాబ్దమున పరాసుశాస్త్రజ్ఞుడగు ఆం టోని లారెంట్ లెవాయిశీరుకాలమునుండి రసాయన శాస్త్రము నూతనస్వరూపమును దాల్చెను. ఇతడు దాహప్రక్రియ (Burning) యొక్క యాథార్థ్యమును, సప్రయోగముగ నిరూపణచేసెను. ప్రాణవాయువును, కంజవాయువును తత్త్వము (Elements) లని నిరూ పించి వానికి నామకరణము చేసెను.

తరువాతశతాబ్దములయందు రసాయనశాస్త్ర మునకు మంచివాతావరణ మేర్పడెను. అనేకమంది శాస్త్రజ్ఞులు (యూరపుఖండమునం దన్నిభాగముల యందును) అనేకములగు క్రొత్తక్రొత్తతత్త్వముల కను గొనిరి. ఈ క్రొత్తయావిష్కరణములు వైద్యశాస్త్ర మునకుకంటె నెయ్యిరెట్లు ఇతరవ్యాపారముల కుపయో గింపబడెను. పలువురు క్రొత్తయావిష్కరణములవలన ధనవంతులు కాజొచ్చిరి. వర్తకులును ప్రభుత్వాధికారు లును రాసాయనికపరిశోధనల ప్రోత్సహించుచుండిరి. రసాయనశాస్త్రాభివృద్ధి క్రమమున మొక్కలై, మానై, కాలక్రమమున బహువిధముల ఫలకారియయ్యెను.

నూతనావిష్కారములలో ప్రధానమైనవి ౯౨ తత్త్వములయొక్క 'కల్పసమవాయ' (Periodic System) ప్రతిపాదనము, హ్రస్వకిరణములు (X-rays) కిరణకప్రచారము (Radio-activity) యని సంక్షేప ముగ చెప్పవచ్చును.

యూరపుఖండమునందు శాస్త్రాభివృద్ధి గత శతాబ్దమునం దభిక్రమిత వేగముతో (accelera speed) ప్రసరించెను. ఇందుకు ముఖ్యకారణము, యూ రపియను శాస్త్రజ్ఞులలో నంతర్జాతీయ వైషమ్యములు లేకుండుటయే. ఆంగ్లపరాసు జర్మన్ భేదములు శాస్త్ర జ్ఞులదృష్టిని వక్రముజేసియుండలేదు. యూరపియను శాస్త్రజ్ఞులందరును గలసి యంతర్జాతీయశాస్త్ర సమితి నొకదాని నేర్పరచిరి. ఏశాస్త్రజ్ఞుడైనను క్రొత్త విషయమును కనుగొనినచో నాతడావిషయమును దాచిపుచ్చక శాస్త్రీయవార్తాపత్రికాముఖమున ప్రక టించును. దానిని నానాదేశీయ శాస్త్రజ్ఞులు సప్ర యోగముగ పరిశీలించి రుజువైనచో దాని నాశాస్త్రం జ్ఞుని నామముతో నంకితముజేసి సర్వసమ్మతముగ నంగీక రింతురు. అంతర్జాతీయ సమితి యప్పుడప్పుడు సమా వేశమై నూతనావిష్కారముల నన్నిటి ననుగతములజేసి శాస్త్రమునందు జేర్చుచుండును.

ఈవిధముగ పాశ్చాత్యులచే నూతనోన్మేషమును బొంది రసాయనశాస్త్రము ఈకాలమునకు మన కాంగ్లే యులద్వారా ప్రాప్తించినది. ఈశాస్త్రము నిప్పుడు మనము పరాయినిగా నెంచనవసరములేదు. ఈ రాసా-

యనిక భారతి మనస్వాతంత్ర్యముతోపాటు మనలను ౧౭ వ శతాబ్దమున వీడి పారశీకుల నాశ్రయించి, వారి వద్దనుండి కాలక్రమమున యూరపియనులజేరి యీనా డాంగ్లరూపముతో మనను జేరవచ్చినది. ఈమె క్రొత్త రూపమును జూచి మనము బెదరిపోక యీమెకు మనము తిరిగి గీర్వాణపు మేలిదుస్తులనొసగి భారతభారతినిగా జేసుకొనవలయును. ఎనిమిదిశతాబ్దములనాటి బాధ్యత యీనాటికంటె మించినబరువుతో భారతయువకునిపై వచ్చి వ్రాలినది. దీని నీతడు భారతీయప్రతిష్ఠకు కొరత పడకుండునట్లు సమర్థించుగాక.

---



# మలాకా

బి. సుబ్రహ్మణ్యం

## ౧

"మలాకాకు నాథుడులేడు. దానికి దిక్కులేదు. అది ఏకాకిగా ఉన్నది." ఆదేశము ఇంగ్లీషువారికి లోనయిన మొదటిరోజుల్లో మలాకా పేరు విన్నప్పుడల్లా యిట్టి అభిప్రాయాలే ప్రతిభారతీయుడి మనస్సులోనూ దాన్ని గురించి బయలుదేరుచుండినవి. క్రీ. శ. ౧౮౨౬ లో బ్రిటీషుసామ్రాజ్యములోని యొకభాగ మయినది. ఈకాలంలో దీనిపూర్వచరిత్ర తెలిసినవారు బహుకొద్ది మంది మాత్రమే కలరు.

పూర్వము మలయాధీశుల యధీనమున నుండి తరువాత పోర్చుగీసు, డచ్చి, ఇంగిలీషువారి యాక్రమణమునకులోనై అనాదిప్రసిద్ధిగల యీమలాకా పాశ్చాత్త్యులతో వ్యాపారమందు చాలముందుకు వచ్చియుండినది. కాని సింగపూరు అభివృద్ధికి రావడము మొదలయినప్పటినుంచి మలాకా పడిపోవడము తటస్థించినది. అది ప్రస్తుతము ఎట్టిప్రాముఖ్యము లేకుండా తన పూర్వపు ప్రభను తలచుకొంటూ పడియున్నది.

ఆద్వీపకల్పమందలి యితరపట్టణము లనేకముల వలె నిదికూడా బాగుగానిర్మింపబడినది. కాని యిందులో యిరుకైన చిన్నవీధులు ఎక్కువగా ఉన్నవి. ఇక్కడి శీతోష్ణస్థితి రమ్యముగా నుండును. దీని చుట్టుపట్టుల రబ్బరుతోటలు విశేషముగా నున్నవి. పెద్దపెద్ద స్టీమర్లు ఇక్కడికి రావడములేదు. సామాన్యమైన చిన్నచిన్న ఓడలు మాత్రము అప్పుడప్పుడు వస్తూఉంటాయి. అందువల్ల ఇక్కడ జీవమే లేనట్లు కనుపిస్తున్నది. వ్యాపారములో కూడా దీని ప్రాశస్త్యము ఇప్పుడు తగ్గిపోయినది.

మలయాలో ఉండే ధనవంతులగు చైనావారు కొందరు మలాకాలో ఉన్నారు. కనుక దీనిని "నిర్వ్యాపారులగు ధనవంతుల నివాసభూమి" యని చెప్పవచ్చును. వీరికి మలయాలో గొప్పవర్తక మున్నది కాని మలాకాలోమాత్రము వీరు వ్యాపారము చేయడము లేదు. ఈకోటీశ్వరులందరు హీరెనువీధిలో నివసించుచున్నారు. ఈవీధిఅంతా అచ్చము చైనాదేశములోని ప్రదేశములవలె తయారైనది.

## ౨

క్రొత్తగా యిక్కడికి వచ్చేవాడు ఈవూరు చూడగానే దీని పూర్వపు ఔన్నత్యాన్ని వెంటనే గ్రహించగలడు.

పోర్చుగీసువారి శిథిలావశేషములలో వారిసెంటు జాన్, సెంటుపాలుకోటలు ఊరిదగ్గర ఉన్నకొండల పైన నేటికిని నిలిచిఉన్నవి. ఈకొండలపైనుంచి చూచినట్లయిన ఈదేశము ఎంతరమణీయమైనదో వెంటనే తెలియగలదు. సెంటుపాలుకోటలో శిథిలమైనదొక గుడి గలదు. గోవాకు కొనిపోవుటకు పూర్వము కొంతకాలమచట సెయింటు ఫ్రాన్సిసు జేవియరుగారి మృతకళేబర ముంచబడియుండినది.

సెయింటుఫ్రాన్సిసు జేవియరు జెసూటుమత ప్రవక్త. అతడు ఉత్సాహవంతులగు కొందరు యువకులతో బయలుదేరి ౧౫౪౨ లో గోవాకువచ్చినాడు. ఇక్కడ క్రీస్తుమతాన్ని వ్యాపింపజేయవలెనని అతని అభిప్రాయము. గోవానుంచి, కొన్నాళ్లయినతర్వాత, తనగమ్యస్థానమయిన దూరదేశము చైనాకు బయలుదేరినాడు. ఈసముద్రయానము బహుకష్టములకు లోనయినది. దారిలో మలాకాలోదిగి అక్కడ ఉన్న పోర్చుగీసు గవర్నరు సహాయముతో చైనాకు పోవలెనని యీాయన అనుకున్నాడు. చైనాకు పోవడము చాల అపాయకరమని యెంచి పోర్చుగీసు గవర్నరు ఎట్టిసాహాయ్యము చేయకపోవడమే కాకుండా జేవియరు అనుచరులనుకూడ పోకుండా చేసినాడు. ఎందుకూ జంకనటువంటి జేవియరుమాత్రము సింగపూరుకు బయలుదేరినాడు. తనకు ఏలాటిసహాయమూ చేయనందుకు






1. చైనావారి శ్మశానము.   2. జేనియరుబంట.   3. ఓడలరేవు.   4. కేంద్రకారాగారము.

చాల కుపితుడై జేవియరు సింగపూరుకు బయలు దేరుతూ, సముద్రములో సగము మునిగియున్న ఒక కొండదగ్గరకు వచ్చి 'మలాకా నాశనమైపోవుగాక' అని శపించినాడని యిక్కడ అందరు నేటికిన్ని చెప్పుకుంటూరు. అప్పటినుంచే మలాకాకు క్షీణదశ ప్రారంభించినది. సముద్రములో నప్పుడప్పుడు మునిగిపోవుచుండు కొండ అప్పటినుంచి ఎప్పుడు నీట పూర్తిగా మునుగక ఉన్నదట. దీనిపేరు జేవియరుబండ. ఎంత పెద్ద అలలు వచ్చినా ఇది మునిగిపోదు.

సింగపూరునుంచి జేవియరు చైనాకు బయలు దేరినాడు. కాని చైనాలో అడుగుపెట్టకపూర్వమే సెయింటుజాను అనేద్వీపములో ౧౫౫౨ లో జేవియరు చనిపోయినాడు. అతనిశవాన్ని వెంటనే మలాకాకు తెచ్చినారు. అక్కడి సెయింటుపాలుచర్చిలో కొన్నాళ్లు ఉంచి తర్వాత ౧౫౫౩ లో గోవాలో పెద్దగోరీలో శవాన్ని పాతిపెట్టినారు.

ఏటిప్రక్కనగల యీపాతచర్చి బాగుగ కట్టబడినది. ఇది డచ్చివారికాలమునాటిది.— అది మరమ్మత్తయి నేటికి వెలయుచున్నది.

## 3

ఇచ్చటిజనసంఖ్య షుమారు ౩౫,౦౦౦. ఇక్కడ మతవైషమ్యాలు లేవు. ఇక్కడ మలయావారు, చైనావారు, భారతీయులు, అక్కడక్కడ కొందరు యూరోపియనులు గలరు.

"మలాకా చెట్టియార్లు" అనేవారు కొంతమంది యిక్కడ ఉన్నారు. దక్షిణభారతదేశములో నాట్టుకోటిసెట్లు అనేవారే యిక్కడా ఉన్నారు. మలాకాసెట్లకు వీరికి ఏమి సంబంధము లేదు. మలాకాసెట్లు అనేవారు ఇక్కడ అనాదిగా ఉన్నారు. బహుశా ద్వీపాంతరవాసము విధింపబడి యిక్కడికి పూర్వము వచ్చినవారి సంతతివారై యుండవచ్చును వీరంతా. వారి ఆచారాలు, సంప్రదాయాలు మొదలయినవంతయు హైందవుల ననుసరించినవే. వారి పేర్లుకూడా దాక్షిణాత్యులపేర్లే. కాని వారు భారతదేశపు భాషలను మాట్లాడుటలేదు. కొద్ది మార్పులతో వీరంతా మలయా దేశభాషనే మాట్లాడుతున్నారు. వారిలోకూడ అంతర్వర్ణవివాహాలు ఇప్పుడిప్పుడు బయలుదేరుతున్నాయి. వారి ప్రస్తుతస్థితి చాలా బాగున్నది. తమ పూర్వస్థితి శోచనీయముగ ఉండినదనే తలపు వారికి లేనేలేదు. అచట ఉండే యితర అన్ని జాతులవారికి ఉండే హక్కులు వీరికి ఉన్నవి.





తాతా ఇంస్టిట్యూట్ ముందువైపు, బెంగుళూరు.

"సాహసే లక్ష్మీః"

(అనువృత్తము)

దివాకర్ల శారదామణి

## ౧౦

### మఱల నెంతదారుణము!

మఱునాటి మధ్యాహ్నమున నేను నాభర్తగారి వస్తువులను కొన్నిటిని సవరించుచుండగ నొకపెట్టెయందు హేమగారు వ్రాసిన మరణశాసనము నాకంటబడెను. పట్టాభిరామయ్యగారి మాటలు నామనస్సుననుండుటచేత నేను దానిని మిగుల శ్రద్ధతో జదివితిని. అందు చాలసంగతు లుండెను. "నామరణానంతరమున పదిలక్షల విలువయైన నాయావదాస్తిని నాప్రియ కుమారుడైన రాజశేఖరరావు తనపుత్ర పౌత్రపారంపర్యముగ ననుభవించవలెను." అనియుండెను. మఱియు భర్తగారి జన్మదివసము 1909 వ సంవత్సరము ఆగస్టు 15 వ తేదీ యనియు దానియందుండెను. మరణశాసనమున,— "రాజశేఖరరావు తనజీవితవ్యాపారములలో సత్యధర్మశౌచాది సద్వర్తనములుకలిగి యెల్లప్పుడు నన్ని విషయములలోను తన్నుగన్నతండ్రియొక్క పవిత్రాదర్శమును మనఃఫలకమున నుంచుకొని సర్వదా ప్రవర్తింపవలయునని నే నభిలషించుచున్నాను." అని వ్రాసియుండుట నాకు చిఱునగవు బుట్టించెను.

ఆనాటి సాయంకాలమున నాభర్తగారీక్రింది విధముగ తంతివార్త నంపిరి:

"నేను రాత్రి వచ్చుసప్పటికి ఆలస్యమగును. ప్రసాదరావుగారిప్పుడిక్కడ నున్నారు. నాకన్న ముందు నీవద్దకు వచ్చెదరు."

ఆనాటిరాత్రి 9 గంటలగుచుండగ ప్రసాదరావుగారు వచ్చిరి. ఆయన "ఇదేమిటికి? ఇంకనూ రాకపోవుట నాకాశ్చర్యముగ నున్నది. నేను సాయంకాల మయిదు గంటలకు వచ్చాను." అప్పుడు నేవకు డొకటెలిగ్రాము పట్టుకొని వచ్చెను. అది అడ్వొకేటు పట్టాభిరామయ్యగారునాభర్తగారిపేర రాజమండ్రి ఇచ్చిన తంతివార్త. నాభర్తగారక్కడనుండి బయలుదేరి వచ్చుటచేతగాబోలునువారినేవకు లెవ్వరో తిరుగ దానిని కాకినాడ పంపిరి.

"మీరిచ్చిన తంతివార్తను గూర్చి — నేను పూర్తిగా స్టేటుమెంటు ఇస్తాను. రాత్రి 10-30 లకు తయారగును. గాంధీనగరమున నాబసకు రండి. రేపు రిజిస్టరు చేయించవచ్చు—

పట్టాభిరామయ్య."

ప్రసాదరావుగారికి మిక్కిలి యాశ్చర్యముగ నుండెను.

"ఏమిది? నాకేమీ బోధపడకుండావుంది. పట్టాభిరామయ్యగారితో రాత్రి మాట్లాడవలసియున్నదని నాతో చెప్పేరు. డాక్టరురంగా ఇంకా కొందఱు డాక్టర్లు అక్కడఉన్నారు. ఈటెలిగ్రాము ఇక్కడకు రావడం చూడగా వారు ఇది రాజమండ్రీలో ఇచ్చునప్పటికే రాజశేఖరరావుగారక్కడనుండి బయలుదేరి ఉండాలి. అవతల వర్షం కురుస్తోంది. ఏమైనా ఒకసారి పట్టాభిరామయ్యగారి ఇంటికి వెళ్లిచూద్దాము."

మేము కారులో బయలుదేరి గాంధీనగరమునకు వచ్చితిమి. ఆయి ల్లే వీథిలో నెచ్చటనున్నదో ప్రసాదరావుగారికి సరిగ జ్ఞాపకములేదు. ఇంటిముఖద్వారము ఉత్తరాభిముఖముగ నున్నదని వారు భావించిరి. కాని ఆవైపునకు కారుద్రిప్పిచూడగా నది దొడ్డిగుమ్మముగా కానవచ్చెను. డ్రైవరును వారు వెంటనే కారునాపి వేయమనిరి. మేమిరువురమును కారునుండి దిగితిమి. కారును మాకింకను ఆవలకు దోడ్కొనిపోవలసినదని వారాజ్ఞాపించిరి. నన్నుజూచి "ఆదొడ్డిగుమ్మమువద్ద ఏదో కారొకటి ఆగియున్నట్లు ఎర్రటిలైటు కనుపిస్తోంది. ఎందుకువచ్చి అక్కడఆగిందో!" ఆకారువద్దకు వచ్చి చూచితిమి. అది నాభర్తగారి కారే. కాని అందెవ్వరును లేరు.

"చిత్రంగావుంది. మీరు ఇక్కడ వుండండి." అని వారు సమ్మమువద్దకు వెళ్లి బలముగ దానినొక్కయూపుయూపి దొడ్డిలో ప్రవేశించిరి. వారిచేతనున్న ఎలక్ట్రిక్ కిరణప్రసారమున వారు తొందరగ బోవుచుండిరని నాకు కానవచ్చెను. వారు హఠాత్తుగా నాగిపోయి క్రిందకువంగి అచ్చటబడియున్న ఒకమనుష్యుని పరీక్షించుచుండిరి. నేనాసమ్మమువద్ద నుండజాలక తక్షణమే వారియొద్దకు వచ్చిచూచితిని. ఆమనుష్యుని చేతియొద్ద నున్న ఒక రివాల్వరును తీసి వారు పరీక్షించి నేను వచ్చులోపలనే తమ జేబులో నుంచుకొనిరి. ప్రసాదరావుగారిచేతి విద్యుత్కాంతి ఆమనుష్యుని ముఖముపై బ్రసరించెను. నా కాకాశము విఱిగి మీద బడినట్లయ్యెను.

"హా! హా! ఘోరం!—నాథ ర్తగారే? ఏమిది. ప్రాణముతో నున్నారా! కాక—"

"అమ్మా రాజశేఖరరావుగా రెందువల్లనో నిశ్చైతన్యమున పడిపోయి యున్నారు. కాబట్టి మీరాందోళన పడవద్దు.—కాని ఏదో దారుణం జరిగుంటుంది. మీరు నిశ్శబ్దంగావుండి నేను చెప్పినట్లు చేయాలి. లేకపోతే ముందు నాపుట్టి మునిగిపోతుంది. ఈయనకేదో మత్తుమందో, మఱేమో ఇచ్చివుంటారు. మీరీయనను కారువద్దకు తీసుకువెళ్లడానికి నాకు సహాయం చెయ్యాలి. ఈటార్చి తీసుకొనివెళ్లి మనంవచ్చిన రోల్సు కారును యింటిముందుకు తీసుకొనిపోయి ఆపమని డ్రైవరుతో చెప్పిరండి. నేను ఇక్కడనే వుంటాను."

నేను వారు చెప్పినట్లు చేసితిని. మేమిరువురము చైతన్యశూన్యులైపడియున్న నాథర్తగారిని రోడ్డు ప్రక్కనున్న కారువద్దకు తీసుకువచ్చి అందు కూర్చుండబెట్టితిమి. తరువాత ప్రసాదరావుగారే మా యింటి కాకారును నడుపింప నారంభించిరి. వారు మిగుల నిర్మానుష్యముగనున్న మార్గమున కారును నడిపించి నడుమ సామర్లకోటకాలువమార్గమున కారును ద్రిప్పి కాలువవద్ద కారునాపి నాథర్తగారి జేబులలో నున్న రుమాలు నీవలకు దీసి దానిని నీటుముంచి నాకందించిరి.

"దీనితో వారిముఖం ప్రక్షాళితమగునట్లు కడగండి. అలాచేస్తే మనం ఇంటికి వెళ్లేటప్పటికి వారికి తెలివొస్తుంది."

ఆయనచెప్పినట్లు కారు మాయింటిముందు వచ్చి ఆగునప్పటికి నాథర్తగారికి కొంచెము తెలివివచ్చెను. అయినను వారు మిగుల నిద్రవలన బద్ధకముతో నున్నట్లు తూలిపోవుచుండిరి. కారునుండి దిగవలసినదని ప్రసాదరావుగారు వారిని హెచ్చరించిరి. మేమంతశ్రమలేకుండ వారిని లోనికి దీసికొనిపోయి పరుండజేసితిమి.

"ఆయనకింకను చాలబద్ధకముగా నున్నది. ఇక్కడికివచ్చితినని కూడ తెలుసుకోలేనంత చైతన్యశూన్యులై యున్నారు. ఒక గంటలో బాగా తెలివివస్తుంది ఈలోగా మఱల ఒకసారి పట్టాభిరామయ్యగారి యింటికి పోయి చూచివద్దాము. వస్తారా?"

మేము మఱల పట్టాభిరామయ్యగారి ఇంటికి వచ్చి చూచితిమి. వారియింటివద్ద వాకిటనున్న నౌకరు మమ్ములను జూచి "దయచేయండి బాబు! తమరు వస్తారని, వస్తే లోనికి రానియ్యవలసిందని మాబాబుగారు చెప్పేరు. రండి బాబు. మీరు వచ్చేవఱకు ఎందుకూ కూడ తమగది తలుపు తియ్యవద్దని చెప్పేరు. అది వారికి మామూలు."

"అవుతే మేమే అగదిలోకి వెళ్లి ఆయనను కలసికొంటాము.—ఈహాలు చీకటిగావుందేమి?"

"బాబు! హాల్లో దీపంవుంటే వారికి చికాగ్గా వుంటుంది. ఎలక్ట్రిక్ లైటు వేస్తానుండండి—అదే మాబాబుగారి గది. వ్రాసుకుంటూ కూచున్నారు. దయచెయ్యండి బాబు!"

తలుపువద్ద ప్రసాదరావుగారు.

"అమ్మా మీరు ధైర్యంగావుండి చూడగలిగితే రండి.—ఇందులో చాలఘోరం చూడబోతారు."

నేను సమ్మతించితిని. తలుపు తెఱచి ప్రసాదరావుగారు వెంటనే మూసివేసిరి.

"చూడండి! పాపం ఆయన చచ్చిఉన్నాడు.—మోహనరావుహత్యతరువాత ఇది రెండవహత్య."

పట్టాభిరామయ్యగారి మూర్తి కుర్చీలో మిగుల భయంకరముగ నాకు కానవచ్చెను. వారితల ఎదుట టేబిలు మీదనున్న అట్టపై వ్రాలిపోయియుండెను. ముందున్న బ్లాటింగ్ కాగితపు అట్ట రక్తమయమై యుండెను. వారు వ్రాయుచున్న కాగితముకూడ రక్తసిక్తమై యుండెను. వీపుపై రివాల్వరుతో నెవ్వరో వెనుకనుండి కొట్టినట్లు గాయముండెను. కొయ్యబారిపోయిన వారి కుడిచేతియందు వ్రాయుచున్న కలమట్లేయుండెను. మేము పట్టాభిరామయ్యగారి కుర్చీకి వెనుక పార్శ్వమున నిలువబడి కాగితమునకు పైభాగమున వ్రాయబడియున్న ఈక్రింది పంక్తులను చదివితిమి: ౫వ పేజీ

"—ఇట్టిపరిస్థితులలో నాక్లయంటు కోరిన సంగతులను తెలుపకుండ నుండజాలకపోతిని. అంతవఱకు మహాభయంకరమగు ఆవ్యాధియొక్క చిహ్నము లెవ్వియు కనుపించియుండలేదు. కాని—" అంతటితో రామయ్యగారి వ్రాత కాస్వాసాంతమైపోయెను.

ప్రసాదరావుగారు ముందుండవలసిన నాలుగు పేజీలను చూడగోరి అంతటను వెదకిరి. ఎచ్చటను లేవు. పట్టాభిరామయ్యగారు నాటిరాత్రి తయారుచేయుదుమని చెప్పిన అస్టాట్యుటరీ స్టేట్‌మెంటునందలి కడమ భాగమంతయు మాకు దొరకకుండ మాయమైపోయెను. ఎంతధైర్యముగనుండ నూహించినను నాకీ హత్యాదృశ్యము రణకంపమును కలుగజేసెను. హృదయమునదేదో పీకినట్లుండుటచేత నచ్చట నొకకుర్చీపై కూలబడితిని.

ప్రసాదరావుగారు నాయవస్థను గమనించి తమ పరిశోధనమును ముగించిరి. అవ్వల తోట వైపునకు తెరువబడియున్న గవాక్షమును మూసివైచి నన్ను తీసికొని గదిఈవలకువచ్చి తలుపులకు తాళము వేసిరి.

నేవకునిబిలిచి సూక్ష్మముగ తాము జూచిన దారుణమును వానితోచెప్పి 'ఇంట మఱెవ్వరును లేరా?' అనియడిగిరి.

"బాబు! చిన్నబాబుగారు భార్యతో చెన్నపట్నం వెళ్లారు; రేపుదయం వస్తారు." అని వా డేడువ నారంభించెను.

"ఏడుస్తే వినియోగం లేదు—" అని మాకారుడ్రైవరును పిలిచి సమీపమున పోలీసులైనుల వద్దనున్న ఇన్‌స్పెక్టరును తోడ్కొనిరమ్మని ఉత్తరువుచేసిరి.

కొంతసేపటికి ఇన్‌స్పెక్టరు వచ్చెను.

"ఇన్‌స్పెక్టరు! ఈపట్టాభిరామయ్యగారు స్టాట్యుటరీ స్టేట్‌మెంటొకటి తయారుచేయుచున్నట్లు నాకు తెలసినది. ఆసందర్భంలో ఇక్కడకు వచ్చాను—ఈకేసు నీవుచూడు. నేనువచ్చి చూసేటప్పటికి ఆయన చంపబడిఉన్నాడు. ఆయన స్టేట్‌మెంటు మొదటి నాలుగు పేజీలు లేవు. మిగిలిన సంగతులన్నీ నీవే కనిపెట్టు." అని గదితలుపు తెఱచి చూపించిరి.

ఇన్‌స్పెక్టరు గది నాలుగువైపులను పరీక్షించెను. పట్టాభిరామయ్యగారు వ్రాసికొనుచున్న కుర్చీచెంత తనకాలికేదో వస్తువు తగులుటచేత ఇన్‌స్పెక్టరు వంగి దానినందుకొనెను. నేను నిర్ఘాంతపోతిని. అది నా భర్తగారుపయోగించు వెండిసిగరెట్లపెట్టె. "ఏమిది? దీనిపై యస్. ఆర్. అను అక్షరములున్నవి?" ప్రసాదరావుగారు "పరీక్షలో అది నాచేతినుండి క్రిందపడిపోయింది. కారునుండి దీని నిచ్చటకు తెచ్చితిని. కారు రాజశేఖరరావుగారిది. ఈవెండిపెట్టెయు వారిదే. 'డ్రైవింగ్‌వీల్'నకు చేరువ ఒక కేన్‌వస్ బేగ్‌లో ఇది ఆయన ఎప్పుడూ వుంచేస్తారు." అని వారు దానినందుకొని తమ జేబులో నుంచుకొనిరి.

హత్యావిషయకమగు వార్త అక్కడ చుట్టుప్రక్కల యిండ్లకు వ్యాపించుటచే కాబోలు కొందఱు జనులు వచ్చి వాకిటమూగిరి. ప్రక్కయింటియజమాను డొకడు తనదొడ్డినుండి ఏమోవినినట్లు, చూసినట్లు చెప్పుచుండెను. ప్రసాదరావుగారతనిని పరీక్షించిరి.

"మీకేమి కనుపించింది?"

"ఆకిటికీ కెదుట మాదొడ్డియందుంటిని. మొదట ఆగవాక్షంలో ఎవరో కూర్చున్నట్లనుకొన్నాను. తరువాత 'సైలెన్సరు' (శబ్దనిరోధకసాధనము) తో ఉపయోగింపబడిన పిస్తోలుచప్పుడువలె వినుపించింది. అప్పుడు నే నాగవాక్షమున కెదుటలేను. కొంచెమావలి

తిక్కగ నుంటిని. అంతలో నెవ్వరో వీధిదొడ్డిలో నడచి యావలకు బోయినట్లు, వారిగేటు వేసినట్లు కనుపించింది."

తరువాత ప్రసాదరావుగారు రోకకారుమీదను, నేను మొదట తీసుకొనివచ్చిన రోల్సుకారుమీదను బయలుదేరి మాయింటికి వచ్చివేసితిమి. అప్పటికింకను నాభర్తగారికి మెలకువ రానేలేదు.

వారిని శయనింపజేయుటకుముందు నేను చిలుకకొయ్యకు తగిల్చియుంచిన వారి కోటునంత ప్రసాదరావుగారు పరీక్షించిరి. లోపలిజేబులలో బాగుగ సీలు చేసియున్న కట్ట యొకటుండెను. ప్రసాదరావుగారు బొమలు ముడిచివైచి దానిని విప్పిరి. దానిలో రమారమి ఒక వంద నూరు రూపాయిల సరియైన క్రొత్త నోట్లుండెను.

తరువాత ప్రసాదరావుగారు నాభర్తగారిని కదిపి చూచిరి. ఆయన మిగుల చికాకుతో కన్నులను విచ్చిరి. మరల మూసికొనిరి. ప్రసాదరావుగారు ఎలక్ట్రిక్ లైటును దీసి దానిని నాభర్తగారి కండ్ల యెదుట నుంచిరి.

"ఏమి టీగొడవ?—"

"నిక్షేపంవంటి నా బ్రతుకును గోదావరిలో కలిపేసినావయ్యా! ఒక్క ఏడాదిలో నేను పెన్షను తీసుకొని హాయిగనుండిపోవలసినవాడను. ఇప్పుడు నా ఉద్యోగ యూడిపోవుటకు సిద్ధంగావుంది నా బ్రతుకిట్లు పరశురామప్రీతి యగుటకు ఈనాటి తమచర్యలే మూలమని తెలుసుకోండి. నాఉద్యోగం తగులడ్డమేకాకుండా మీదయవల్ల నేను కృష్ణజన్మస్థానానికి కూడా పోయే యోగ్యత తటస్థించేలాగుంది."

"జాతే ఇదేం గ్రహచారం?— నేను కాకినాడవచ్చాను?"

"మీకేం బాబు మహారాజులు! మీఇంట్లో బంగారం ఎప్పుడూ కుళ్లిపోతూవుంటుంది. ఎక్కడకు వచ్చినా హాయిగా కూర్చోడం నిద్రపోవడం, కంటె మీకు వేరేపనిలేదు. మీసహవాసాలవల్ల ఏమయినా వస్తే మాకు ముందు ఉద్యోగాలూడిపోతాయి—అమ్మా, ముందొక కప్పుకాఫీ ఘాటుగా చేయించి పట్టుకురండి. అప్పు డీయనకు సంగతులన్నీ బోధపడుతాయి."

కొంతసేపటికి నేను కాఫీ తయారుచేయించి పైకిపట్టుకొని వచ్చితిని.

"నాచేతులు కట్టివేశారు." అని నాభర్తగారనుచుండిరి.

"ఏ మాలోచన చేశారేమిటి?" అని నే నడిగితిని.

"రాజశేఖరరావుగారికి గొప్ప ఒరిజినల్ ఐడియా ఒకటి తట్టింది. వెంటనే సమీపంలో వున్న పోలీసు స్టేషనుకు వెళ్లి తానే ఈరెండుహత్యలును జరిగించినట్లు ప్రకటనచేస్తామని చెప్పేరు. కాని అలాచేయడంవల్ల తమ భార్యను, ఈజిల్లా పోలీసుసూపరెంటెండెంటును ఇంప్లికేట్ చేయవలసివస్తుందని మిక్కిలి దయతో లాంటిపరిస్థితులని గమనించి ఊరుకున్నారు:— ఇప్పుడు డాక్టరు రంగాగారిని వెంటనే కబురుచేయండి. అత్యావశ్యకమైన పనివుండి రాజశేఖరరావుగారు తీసుకు రమ్మనమని చెప్పినట్లు కారుపంపండి. నే నిక్కడ ఉన్నట్లు ఆయనతో చెప్పవద్దని డ్రైవరుతో స్పష్టంగా చెప్పండి.'

డాక్టరుగారు వచ్చునప్పటికి నేను క్రిందనుండి వారిరాకకై ప్రతీక్షించుచుంటిని. ఆయన వచ్చినప్పుడు తానే వారితో సంభాషింతుననియు, కావున మీ రేమియు మాట్లాడవలదనియు ప్రసాదరావుగారు నాతో చెప్పియుండిరి.

"ఏమమ్మాయి, ఇంతఅర్జెంటుగా కబురుచేశారు! రాజశేఖరరావుగారు వచ్చారాయేమి?— ఎప్పుడు వచ్చారు? ఎలావచ్చారు? నేను నిద్రబోతూవున్నా. మీడ్రైవరు జలగలా పట్టుకొని వచ్చేవరకు వదలి పెట్టలేదు,— నాకు తలనొప్పిగాకూడా వుంది."

అంతలో ప్రసాదరావుగారక్కడకు వచ్చిరి. ఆయన నవ్వుచు 'జాతే డాక్టరుకే తలనొప్పి వచ్చిందీ!

తెల్లవారేసరికి నాకు తప్ప మిగిలిన మీకందరికీ తల నొప్పులు వచ్చితీరుతాయి'.

"ఓహో! సూపరెంటెండెంటుగారా! ఇంత రాత్రివేళ ఇక్కడ వుండిపోయినారేమి?—" అని చెప్పుచు నాథర్తగారు మధుసేవా సక్తులైన డాక్టరు గారికి ఇంకను వారిస్నేహితుల నిమిత్తమై ఏర్పాటుచేసి యుంచిన ఒకబల్లవద్దకు వెళ్లి అక్కడ నొక మీట (స్ప్రింగ్) నొక్కిరి. వెంటనే రంగురంగుల మధుద్రవములుంచిన సీసాలు(cellarette)బల్లపైతేలుచుకొనెను.

"కూర్చోండి ప్రసాదరావుగారు! ఇది రాజశేఖరరావుగారి ఇల్లైనా ఇది నాస్వంత గృహంలాగే చూసుకొంటున్నాను. విజయలక్ష్మి సాక్షాత్తు నా పుత్రికారత్నం---- అవుతే మీ రేంతాగుతారు చెప్పండి?"

"నాకు అనెస్టువాటరే (ద్రోహముచేయనినీళ్లు) ల. కిప్లింగ్ వ్రాసినట్లు నేను స్లాటరు (హత్య)చేయ తూవున్నప్పుడు, నేను చేసేపని వాటరుతోనే జరిపిస్తాను."

డాక్టరునవ్వుచు "జొతే ఈరాత్రి మీ రెవ్వరిని స్లాటర్ చేస్తారేమిటి?" అనియడిగెను.

"అదే యింకానిశ్చయం చెయ్యలేదు. ముందు మీరుతాగి ఇలారండి."

డాక్టరుగారుముఖము ముడిచి ఒకగ్లాసు విస్కీత్రాగి వచ్చికూర్చుండిరి.

"పాపం! పండువంటి ముసలి వాడిని—ఎడ్వొకేటును హత్యచేశారని మీ కు తెలుసుననుకొంటాను. నేటిరాత్రి తొమ్మిది గంటలకు వ్రాసికొనుచుండగా కాల్చివేయబడెను."

"ఎంతదారుణం! పట్టాభిరామయ్యగారా! ఎంత ఘోరం!"

"పట్టాభిరామయ్యగారని నేను చెప్పలేదే? మీ కెట్లుతెలిసింది? కాని అట్లు చంపబడింది పట్టాభిరామయ్యగారే. ఆహంతకుడిని ప్రక్కయింటివాడు చూసినట్లు చెబుతున్నాడు. కాబట్టి ఇప్పుడు ఎరెస్టు చెయ్యడానికి—"

డాక్టరుగారి ముఖము వివర్ణమైపోయెను.

"మనుష్యులని కాదు. ఐడిల్ రూమర్లు (నిరర్థకమైన వదంతులు) పుటుతూ వుంటాయి. వాటిని ఎరెస్టు (అడ్డగించుటకు) చేయుటకు మీతో చెప్పేది యేమంటే— ప్రసాదరావుగా రీరాత్రి పట్టాభిరామయ్యగారి యింటికి వెళ్లారని— ఇలాంటివార్తల కేమయినా అవకాశం ఉండకుండా చెప్తున్నాను." అని ప్రసాదరావుగారు మిక్కిలి యసందర్భముగ పలికిరి.

"ఎంతఘోరం!"

"అవుతే రాజశేఖరరావుగారిని మీరెక్కడ వదిలేశారు చెప్పండి?"

"రాజమండ్రీలో వారియింటివద్ద. - తాను అర్జెంటుగా పోవలసి వుందనీ, పట్టాభిరామయ్యగారిని చూడవలసివుందనీ చెప్పేరు. నేను ముందు బయలుదేరి నా కారులో వచ్చేశాను."

"అవును రాజశేఖరరావుగారు తిన్నగా ఇక్కడకు వచ్చారు. కాని ఏమో మిక్కిలిజబ్బుగా ఉన్నట్లు కనుపించేరు. ఆయనను నేను సమాధానపెట్టి ఇంట్లోవుండమని వారిభార్యతో పట్టాభిరామయ్యగారి ఇంటికి వెళ్లి చూశాను. అక్కడ ఆయన చచ్చిఉన్నాడు."

"ఆయన ఎలా చచ్చియున్నాడు?"

"దౌర్జన్యంలో ఆరితేరినహంతకులు వట్టి కథలలోతప్ప తమ ఆయుధాలను హత్య జరిగినచోట ఉంచేసిపోరు. అయినా రేపు ఉదయం తోటంతా బాగా పరీక్షచేసి చూస్తాము."

"ఇదే నాకు కథగావుంది. అవుతే నన్నిప్పుడేమి చెయ్యమంటారు?"

"మీరు డాక్టర్లు. హియోసిన్ (Hyoscin), మార్ఫైన్ (morphine) ఈరెండుని సబ్క్యుటానియస్‌గా (subcutaueously) ప్రయోగించేయబడినప్పుడు దానికి విరుగుడేమో సెలవియ్యండి.—ఆహా!

సబ్‌క్యుటానియస్ అన్నమాట మహామనోహరంగా వుంది!"

"దీన్నే తెలియనివాళ్లు ప్రైవేట్ ప్లీజ్ అంటారు."

"నేనంత తెలియనివాడను కాను. అయినా నేను కూడ అల్లే అంటాను."

"మీ కేవిఋను కావాలో నాకు తెలియకుండా వుంది. అవి సరిగా యిస్తే అపాయంలేదు."

"ఓహో! క్వాలిఫైడ్ డాక్టర్లు మీరు సెలవిస్తున్నారు!"

"మీతాత్పర్యం నాకు బోధపడకుండావుంది. నాకంటె క్వాలిఫైడ్ డాక్టరు మరి ఎవ్వరూ లేదు. మీరూ నేను క్రాస్‌పర్‌పసెస్ (వ్యర్థమైన ఎదురెత్తుల మీద) నడుస్తున్నాం. ఔతే నేను రాజశేఖరరావు గారికి విషంపెట్టానంటారా ఏమిటి?"

"సంగతులే విషమించిపోతున్నాయి. విషం పెట్టడంకన్నా, కొంప కగ్గిపెట్టడంకన్నా దారుణమైన పనులే జరిగిపోతున్నాయి. కాబట్టి మీరింతటితో రాజశేఖరరావుగారి సంబంధం వదులుకొంటే క్షేమంగా ఉండగలరు. — ఇంతస్పష్టంగా చెప్పవలసినందుకు నాకు కష్టంగావుంది."

"మీరు చెబుతూన్నమాట నాకొక్కటి తెలియకుండా వుంది. మీరీజిల్లాలో పోలీసు శాఖను పరిపాలిస్తూవున్నారు. కాబట్టి మీకేమన్నా, ఏమిచేసినా చెల్లుతుంది. ఇప్పటి సందర్భంలో లేనిపోనివన్నీ నాకంఠంమీదకే తెచ్చి చెబుతున్నారు. అందుచేత ఇప్పుడు నేను తప్పనిసరిగా ఆత్మరక్షణం చేసుకొనితీరాలి. కాలిక్రింద పెట్టి త్రొక్కుతూంటే ఆఖరుకి క్షుద్రమైన పురుగుకూడా పీకీవదలి పెడుతుంది. రాజశేఖరరావుగారికి నేనేదో పరమశత్రుడ నన్నట్లు మీరు భావిస్తున్నారు. ఇన్నాళ్లు నేనాయనను ఎంత పూసుకొని వస్తున్నానో మీకు తెలియదు. ఇప్పుడు చెబుతా వినండి. రాజశేఖరరావుగారు తానే మోహనరావును చంపినట్లు స్పష్టంగా నావద్ద ఒప్పుకున్నారు. ఇప్పుడు నేనీవిధంగా వ్రాసియిస్తే పోలీసుశాఖాధికారులు మీరేంచేస్తారో చెప్పండి?"

"ఏంచేస్తానా?—వెంటనే నిన్ను ఎరెస్టుచేసి జెయిలుకి పంపిస్తాను. 50 రూ. ల నోటు నీవద్దనుంచి పోయిందని మా ఇన్‌స్పెక్టర్లే పట్టుకొన్నారు. రేపు సాయంత్రం ఈపాటివేళకు నీమీద ఇలాంటివి రెండు మూడు నాకు దొరికితీరుతాయి.—కాబట్టి కొంచెం బుద్ధిగా మసలుకో. ఈదొంగనోట్లు, ఈహత్యలు, ఈఘోర్జరిచేసిన దినచర్యలు, ఎవరు సృష్టిస్తున్నారో ఎవరు చేస్తున్నారో, వీనికంతకి సూత్రధారులెవ్వరో, నాకెప్పటికీ తెలియదనుకుంటున్నావు. నేను తలచుకొంటే— రంగాచారీలవంటి వాళ్లు వందమందయినా నిన్ను కాపాడలేరు. రాజశేఖరరావుగారి లక్షలలో కొన్ని దొరక వచ్చునని మీరు తంత్రాలు పన్నుతున్నారు. కాని నాకంఠంలో ప్రాణముండగా అలాగ జరగదు. అను మానంమీద నిన్నీక్షణమే జెయిలుకి పంపగలను— విడిచిపెడుతున్నాను. నడు వింక."

"మీరు చాలనిర్దయత్వం వహించారు. నేనే పాపం ఎఱుగను. రేపు కలెక్టరుగారికి విన్నపం చేస్తాను."

"కలెక్టరు వద్దకు వెళ్లినా, ఏమైనా సరిపత్రి పిటిషను లిచ్చినా చచ్చావనే నమ్ము."

అని ప్రసాదరావుగారు పలికి నాభర్తగారి యొద్దకు వెడలిపోయిరి. నేనును వారు సంభాషణమును ముగించుచుండిరని కనిపెట్టి ముందుగనే గదియావలకు వెడలిపోతిని. డాక్టరుగారు చాలతడవ వచ్చుట రిచ్చవడి కూర్చుండి సేవకుని బంపి నాతో సంభాషింప ప్రయత్నించెను. ఆయనను తక్షణమే పంపించివేయవలసినదని నాభర్తగారు తమమాటగా సేవకుల కాజ్ఞాపించిరి.

ప్రసాదరావుగారు తమజేబునుండి కాగితముతో చుట్టబడియున్న ఒకవస్తువు నీవలకు దీసిరి. అదే సగము కాల్చబడియున్న సిగరెట్టు. దానిలోనుండి సన్నని ఈనువలె నున్న ఒకపదార్థము నీవలకుదీసిరి. "ఇది తామురెక్క వచ్చిన కారులో కనుపించింది. మీరు కాలుస్తూన్న సిగరెట్టులోనికి దీట్లు వచ్చినదో నాకాశ్చర్యంగావుంది.

ఇది హియోసిన్ అనుదానియొక్కయు, మార్ఫైన్ అను దానియొక్కయు రాసాయనిక మిశ్రమము. దీనిమహిమ వలననే రాజనుంద్రీయందు తమయింటివద్ద కారునెక్కి వచ్చుచుండగా బహుశః యింటికావలిగేటువద్దనే మీరు చైతన్యశూన్యులై పడిపోయియుంటారు. తరువాత మిమ్ములను కారులోనెక్కించుకొని వచ్చి పట్టాభిరామయ్యగారి దొడ్డిలో పడుకోబెట్టి హంతకులు నీవద్ద రివాల్వరునుంచి వెళ్లిపోయి యుంటారు. ఈరాత్రి శాంతంగా మీరు నిద్రపొండి. రెండురోజులలో హంతకులు దొరికిపోతారు. శెలవు."

## ౧౧

## పాపము పండినది

మఱునాటి యుదయమున నేను బి. యే. పరీక్షలో ప్రథమశ్రేణియం దుత్తీర్ణురాలనైతినని నాకు తెలిసివార్తవచ్చెను. మానసము డోలాందోళితమైన్న సందిగ్ధసమయమున నేనట్లు కృతార్థురాలనైతి న్న వార్త నాకు సంపూర్ణమను నానందమును కలిగింపలేదు. కాకినాడయందలి నామిత్రురాండ్రును, చిన్ననాటి సహాధ్యాయినులును నావద్దకు తండోపతండములుగవచ్చి నన్నభినందింప నారంభించిరి.

మధ్యాహ్న సమయమున ప్రసాదరావుగారి యింటి యాడువాండ్రు వచ్చి నన్ను తమయింటికి బిలుచుకొనిపోయిరి. ఒకగంటవఱకు నేనచ్చటనే గడుపవలసినదాననైతిని. ప్రసాదరావుగారి యింట నొక గదిలో నేను ఎనిమిదేండ్లవారి చిన్నకొమరితతో నేదో మాట్లాడుచు గూర్చుంటిని.

కొంతసేపటి కావలిగదివద్దకు బోయి చూడగా నచ్చట ప్రసాదరావుగారు రంగాచారితో నేదో ముఖ్యమగు సంగతిని గూర్చి ప్రసంగించుచున్నట్లు నాకు కానవచ్చెను. రంగాచారి యేదో నాభర్తగారిని గూర్చి చెప్పుచుండెను. వారికి నేను కనుపించకుండ నీక్రింది సంభాషణము వింటిని:

"ఇదిగో రాగిరేకులతో చేయబడిన బ్లాకులు. అచ్చుయంత్రముతో నివన్నియు తోటలోని పాడు బావియందు నాకు దొరకినవి. రాజశేఖరరావుగారు తమ గృహమును సోదా చేయుదురని ముందుగ నూహించి వీనినానూతియందు బారవేసిరి వారట్లు పారవేయునపుడు తోటమాలియు నింకను నొక మనుష్యుడును చూసినట్లు సాక్ష్యమును పట్టుకొంటిని. అచ్చుగొట్టిన నోట్లను కొన్నింటిని తగుల బెట్టి వారానూతిలో కలిపివేసిరి. సగం కాలియున్న నోట్లముక్కలందులో నాకు దొరికినవి. చూడండి."

"రాజశేఖరరావుగారాయింట క్రొత్తగ బ్రవేశించిరి. అందులో గోడలోనున్న ఒకరహస్యగృహమున నీయచ్చుయంత్రం ఉండని మోహనరావు వ్రాసిన ఉత్తరమునుబట్టి కదా నీ వక్కడకు వెళ్లేవు! మోహనరావునకు రాజశేఖరరావన్న గిట్టదు. పైగ క్రొత్తగ నారంరోజులయి ఆయింట బ్రవేశించిన రాజశేఖరరావు గోడలోనున్న ఆగది ఎట్లాచేయించుకొన్నాడు? దొంగనోట్లు కొన్ని మాసములనుండి మనకు దొరుకుతున్నాయి. ఆయింట చాలకాలమునుంచి దొంగనోట్లు తయారగుచుండియుండవలెను. — అవుతే, నీభార్య లెఖ్ఖలలో నుండునట్లు ఇంపీరియల్ బ్యాంకిలో నీవిచ్చిన ఇరవైవంద రూపాయలనోట్లును సరిగా గవర్నమెంటువారి టంకసాలలో తయారుచేయబడినవే యని నేను భావించవచ్చుననుకొంటాను."

"ఒక ఇరవై వందరూపాయిలనోట్లా! తమరు సెలవిచ్చేసంగతి నాకు బోధపడకుండావుంది. క్షమించండి."

"ఆనోట్లనంబర్లన్నీ నేను నోటు చేసుకున్నాను. అవి డాక్టరు రంగాగారి బ్యాంకినుంచి వచ్చాయి. నీభార్య ఎకౌంటులోకి చేరాయి. నా కాశ్చర్యం వేసింది. ఏదైనా పేటెంటు మెడిసిన్ (రిజిస్టరు చేయబడినమందు) తయారుచేసే గ్రేండ్ ఐడియా (గొప్ప ఊహ) డాక్టరుకి రెండువేలు తీసుకుని అమ్మేశావేమో యని ఊహించాను. అలాకాకుండా ఈరెండువేలున్నూ వట్టి బహుమానంగా తీసుకొన్నయెడల అది పోలీసు చట్టాలకు వ్యతిరేకమని స్పష్టంగా నీవు తెలుసుకోవాలి,

ఆ రెండువేలు విలువచేసే ఏవస్తువు నీవు డాక్టరుకి దఖలు పరిచేవో చెప్పు. పదహారేళ్లనుంచి గవర్నమెంటు నీకు జీతంఇస్తున్నారు. కొన్నాళ్లకు పెన్షన్ ఇస్తారు. బుద్ధిగా నౌఖరీచేస్తే నీకివి శాశ్వతంగా ఉంటాయి. ఈనౌఖరీకి నువ్వు తిలోదకా లొదులుకుని డాక్టరు చేతి కింద రెండువేలకు నౌఖరీకి కుదురుకుంటే నీవంటి మూర్ఖుడెవడైనా ఉంటాడేమో చెప్పు?—ఇప్పుడీ బ్లాకులు ఈఅచ్చుయంత్రం వీటిని గూర్చి ఏంచేస్తావు?"

"నే నొకరిపోర్టు తయారుచేశాను. చిత్తగించండి."

"కొంచెం ఆగు. ఈవస్తువులన్నీ నీ వొకతోటంగా ఒకబావిలో పట్టుకొన్నట్లు వ్రాస్తే అందరికి భద్రము. అలాకాక నీవు అనవసరంగా రాజశేఖరరావుగారిని గూర్చి కల్పన లేమయినా చేసివుంటే నీరిపోర్టు వేస్టు పేపర్ బేస్కెట్‌లోకి వెళ్లిపోతుంది. అందుచేత జాగ్రత్తగా ఆలోచించుకో."

"రిపోర్టు సరిగా వ్రాసిఉండను. ఇంకొకటి తయారుచేస్తాను.."

"రంగాచారి! నీవిప్పుడెంతజాగ్రత్తగా వుంటే అంతమంచిది. పోలీసువారి రూల్సు నేనుకూడ అతిక్ర మించుతూనే ఉండవచ్చు. అందుచేతనే కాబోలు నీలాగ జన్మం అంతా రూల్సుకు వ్యతిరేకంగా పోయే వాళ్లంటే నాకు కనికరంతోస్తోంది.—రాజశేఖర రావుగారంటే ఒకమనీ మేకింగ్ ప్రాపొజిషన్ (ధనా ర్జనకొకసాధనము)గా డాక్టరుచూస్తున్నాడు. డాక్టర్ని మనీమేకింగ్ ప్రాపొజిషన్‌గా నువ్వాలోచిస్తున్నావు. ఇలాంటి వెర్రివెర్రి ఆలోచన లింతటితో కట్టిపెట్టు. ఇరవైనాలుగు గంటల్లో నీఆశలు, డాక్టరాశలు అడుగంటి తీరుతాయి."

నే నచ్చట నిలువక వేరొకగదిలోనికి వచ్చి కూర్చుంటిని. కొంతసేపటికి ప్రసాదరావుగారు వచ్చి "రంగాచారితో చిన్ననాటకం ఆడవలసివచ్చింది. అది మీరు ప్రేక్షకులై చూచి ఆనందించినట్లున్నారు. మోహనరావు చచ్చిపోయిననాటిరాత్రి కుక్కను వదల్చుకొన్న తరువాత రంగాచారిఇంటికిపోయి నాడట. రంగాచారి అప్పుడు కాకినాడలో ఉన్నాడు. మోహనరావారాత్రే తాను మీయింట్లో ఏవో చూశానని, వెళ్లి సోదాచూస్తే పట్టుబడిపోతాయని ఒక ఉత్తరం కాకినాడ రంగాచారి పేర వ్రాశాడు. రంగాచారి కావుత్తరం కొంచెం ఆలస్యంగా అందినది. ఏవేవో పట్టుకువచ్చినాడు. ఐనా మీరు మరేమీ ఆందోళన పడకండి." అని చెప్పిరి.

వారియింట మఱికొంతసేపు కూర్చుండి తరువాత నేను మాఇంటికి వచ్చివేసితిని. ఆహా! ఎట్టిసంబంధమును లేని ప్రసాదరావుగారికే ఇంత నిర్వ్యాజానురాగ మున్నప్పుడు, ధర్మపత్నినగు నాకు వారిపై నెంత ప్రేమయుండవలెను! అని భావించితిని.

*　　*　　*　　*

"నాభర్తగారికి పిచ్చియున్నదా?"

"..............."

"చెప్పండి. ఇన్నాళ్లూ మీరొక కపటనాటక మాడుతున్నారుకాని ఇకసాగదు. ఆయనను వెంటనే సురక్షితమైనచోట వుంచి చికిత్స చేయించవలసి వుందా? చెప్పండి."

"ఇదెక్కడిప్రశ్న! — ఔతే మనకందఱకు పిచ్చ లేదూ! ఆయన కదో ధోరణి."

"కాదు. గోడమీదపిల్లి వాటంగా జవాబుచెప్పకండి. నేనడిగిన ప్రశ్నకు సరిగా సమాధానం ఇవ్వండి. ఉంటే ఉన్నదని చెప్పండి. లేకపోతే లేదని చెప్పండి."

"ఆయనశరీరస్థితి ఆయనకు సంబంధించింది, ఆయన అనుజ్ఞలేనిదే నే నేమీ చెప్పలేను."

"ఆయనశరీరస్థితి నాకూ సంబంధించిందే. ఆయన కష్టసుఖాల్లో సమభాగినురాలను నాకే ఆయన శరీరస్థితితో నిమిత్తం లేదని చెప్తారుకాబోలు!"

"ఈసంగతి మీనాయనగారికి తెలుసుకాబట్టి ఆయన్నే అడుగు."

"నేను మిమ్మల్ల నడుగుచున్నాను. మీరు నాకు యుక్తసమాధానం చెప్పండి.—లేనియెడల వెంటనే

# మధుర స్వదేశీ యెగ్జిబిషను నందలి



"అమృతాంజనండిపో" వారి ప్రదర్శనము

అమృతాంజనం డిపోవారి ప్రదర్శన శాలలు




కాన్పూర్




అజ్మీరు

దయచేసి ఇకముందెప్పుడు మాగుమ్మము తొక్కి ఈవలకు రాకండి."

"అమ్మాయీ, నీవింత పట్టుపట్ట కూడదు. అందులో నే నన్నివిధాలా నీకు తండ్రివంటి—"

"నేనేమీ బాలికనుగాను. నన్ను మీరేమీ అదల్చివేయవద్దు. మీరు నేనడిగినదానికి సమాధానం చెప్పండి."

"ఇంత అతిశయం—"

"ఆహా! ఈరోజు నాకతిశయం కొంచెం హెచ్చుగానే ఉంది. ఇన్నాళ్లు నాకు కళ్లుమూసుకుపోయి మీచేష్టలు కనిపెట్టలేకపోయాను."

ఓహో! అంతవరకు వచ్చిందా?—అయితే చెబుతానుండు.— రాజశేఖరరావుగారికి మన స్తిమితం కు. ఆయనతండ్రి పట్టియున్మత్తుడని, ఆయునన్మాదం నే నిందు ప్రాణాలు తీసేసేవాడని నీకు తెలిసేవుం ఆయనతల్లికి, తాతకి పిచ్చి. ఇలాగ వాళ్ల వంశే తరతరాలనుంచి ఉన్మాదం పీడలాగ పట్టుకొని ఉంది. నేననడం ఎందుకూ, గొప్పగొప్ప డాక్టర్లంతా ఈవ్యాధి ఏవంశంలోనైనా సాంక్రామికంగా ఉండిపోతుందని, పైకి ఒకప్పుడు కనిపించకపోయినా ఒక్కసారి పాలపొంగులా వచ్చితీరుతుందని చెప్పేరు. దీని మహత్వంవల్ల నే నీభర్తగారు మోహనరావును ఆవిధంగా హత్యచేశారు. నిన్న పట్టాభిరామయ్యగారినికూడా తప్పక మీఆయనే హత్యచేసివుంటారు. ఇక ఊరుకుంటే లాభంలేదు. చేతులు కాలిపోయిన తరువాత చేసేదేమీ లేదు."

అంతలో నాభర్తగా రాగదిలోనికి వచ్చిరి. "ఏమయ్యా, డాక్టరు, లెక్చెరిస్తున్నావు!"

"ఇయ్యక తప్పిందికాదు. మీఆవిడ పట్టుకుని వదలిందికాదు. కాబట్టి ఎందుకైనా మంచిదని చెప్పేస్తున్నాను.—నిన్నరాత్రి జరిగిన హత్యనుగూర్చి లోకులంతా కావల్లా కూస్తున్నారు. ఇదంతా మీమతిభ్రమవల్ల జరుగుతున్న దారుణమే అని నిజం ఎప్పటికైనా తెలిసితీరుతుంది."

"అందర్నీ నేనే చంపేస్తున్నానంటావా ఏమిటి?"

"ఆహా! ఈరెండుహత్యలు మీచేతనే జరిగాయి. నేను ప్రత్యక్షంగా చూసినట్లు చెప్పగలను."

"నా మనస్సాక్షికి విరుద్ధంగా—నా పంచేంద్రియజ్ఞానానికి విరుద్ధంగా నేనలా ఊహించలేను."

"మీ పంచేంద్రియసాక్ష్యాన్ని బట్టి వెళ్లేబదులు యం. బి. పి. యం. లు చదువుకొన్న మమ్మల్నందరినీ బంగాళాఖాతంలోకి తోసేస్తేమంచిది."

"అవుతే ఏమంటావో చెప్పు?"

"లక్షణాలింతస్పష్టంగా కనుపిస్తూవున్నపుడు మీరు ముందే జాగ్రత్తపడి ఆస్తికంతకు మీభార్యను నిర్వాహకురాలిని చేసి మీరేదయినా సురక్షితస్థానంలో ఉండి చికిత్సపొందుతే మంచిది. ఆమె చక్కబెట్టుకోలేనియెడల జనార్దనరావుగారు, నేను ధర్మకర్తలుగా వుండి వ్యవహారం నడిపిస్తాం. మీరు ఆస్తి విజయలక్ష్మిగారిపేర వ్రాసియివ్వండి."

"ఆరి! నిన్ను తగలెయ్య! నీమనస్సులో ఎంత ఊహవుంది?"

"తమరు శాంతంగా ఆలోచించండి. అట్టే ఎక్సైటు (ఆగ్రహించ) కాకండి."

అప్పుడు నేను "మీరేవో పెద్దయెత్తులమీద నాచేత నాటకం ఆడిద్దామని చూస్తున్నారుకాని వారు ఆస్తి నాపేర వ్రాసిఇచ్చుటకు నేనెంతమాత్రం అంగీకరించను. ఇంతకు నా ఒప్పుదలమీదకదా మీరు దీనికంతటికి నిర్వాహకుల మనిపించుకోగలరు? మీరేవో లక్షణాలని చెబుతున్నారు. అవేం లక్షణాలో చెప్పండి." అని డాక్టరు నడిగితిని.

"ఒకటా రెండా?— ఎన్నని చెప్పను? ఆయన రూపులో, చూపులో, నడకలో, తలపులో, మాటలో — సమస్తచర్యల్లోను ఈయన సామాన్య మానవుల వంటివాడుకాడని ఋజువుచేయతగిన లక్షణాలెన్నైనా ఉన్నాయి. అయితే డాక్టర్లకళ్లకిగాని అవి సూక్ష్మంగా కనుపించవు."

"అయితే ఈలక్షణాలన్నీ ఘనవైద్యులకెంవటికీ కనుపిస్తాయంటారు! మెంటల్ కేసుల్లో స్పెషలిస్టులని జగద్విఖ్యాతిపొందిన డాక్టరు యస్. యస్. సర్కారు గారికీ, డాక్టరు టి. యస్. మెహతాగారికీ, డాక్టరు వరదాచారిగారికీ—వీరందరికీ తెలుస్తాయా చెప్పండి!"

"ఆహా! నిస్సంశయంగా వారందరికీ చూపించి నీభర్తగారి కిలాంటి లక్షణాలున్నాయని సర్టిఫై చేయించగలను."

"మీ కంత శ్రమవద్దు. ఈ డాక్టర్లంతా ఈ ఉదయమే ఇక్కడికి వచ్చారు. నిన్ననే టెలిగ్రాముల మీద పిలిపించాను. ఈరోజు ఉదయం వారందరు ఏరోప్లేన మీద ఈవూరు వచ్చారు. నాభర్త గారికి ఉన్మాదలక్షణాలేమీ లేవని రూఢిగా వ్రాసియిచ్చారు. ఇదుగో చూడండి. దీనికి వ్యతిరేకంగా మీరింకా పిచ్చి ఉన్న దంటారా?"

డాక్టరు నిర్ఘాంతపోయి కొంతసేపటికి—"వీళ్లంతా గొ వాళ్లే కావచ్చు. అయి కేసు గతి ఏమీ తెలియదు. మోహనరావును ఆయన హత్య




"చేత నొక యువకుడు పొడవుగలిగి, లావైన 'అహం:స్తా

చేసినసంగతి వాళ్లకెంతమాత్రం తెలియదు. పైగా నిన్నరాత్రి జరిగిన దారుణం వాళ్లకు తెలియదు. ఈయనను చాలకాలం పరీక్షించి తెలుసుకొన్నవాడను నేను. కాబట్టి నేనే చెప్పాలి. మోహనరావు హత్యచేయబడ్డట్లు, వెంటనే ఉదయంలేచి రక్తపుగుడ్డలలో ఉన్న ఈయనను చూసినట్లు చెప్పిఉంటావనుకో. అలా చెబితే ఈడాక్టర్లేమని ఉంటారు?"

"ఓహో! ఇంత తెలిసినవాడవు ఆయన ఆగుడ్డలతో అక్కడికెలావచ్చాడో నీవే చెప్పాలి."

"కథ అడ్డంగా తిరిగి ...ంది. కాబట్టి యింక ఇలాగ ...ల్లో గుద్దులాడితే ఏమీ ...ంలేదు. రాజశేఖరరావుగారు! మిమ్మల్ని నేనింక వదిలివేస్తాను. మీకు సంపూర్ణంగా మనశ్శాంతి కుదిరే ఉపాయం ఒకటి నావద్ద ఉంది. ఒక ౨౦వేలు ఇస్తే ఆరహస్యం మీపరంచేసి నేను వెళ్లిపోతాను. ఇదంతా రిడిక్యులస్ (హాస్యాస్పదము)గా వున్నట్లు



రోకలితో వెనుకవైపునుండి వచ్చి"

మీకుతోస్తుంది. కాని మీమనస్సు కికయేవిధమైన తొందరలు, యెట్టి విచారం లేకుండా చెయ్యగలను. మీకు క్రొత్త మోస్తరైన 'ఔట్ లుక్' వచ్చి తీరుతుంది మీరు వెంటనే నిర్ధారణ చేసిచెప్పండి."

"నువ్వింత దురాశాహతకుడవని ఇంత తుచ్ఛుడవని నేను కలలోకూడ అనుకోలేదు. ఇన్నాళ్లు నన్ను మోసంచేసి ఇన్ని నాటకాలాడేవు. ఇంక నా కొంపలోకి రాకు. నీకపటవేషాలకి ఆశ్వాసాంతమైపోయింది. నడువు!" అని నాభర్తగారు క్రోధతీవ్రమున కన్నుల నిప్పులురాలునట్లు చూసి కుర్చీనుండి లేచిరి.

డాక్టరు తనయాట లిక సాగివచ్చుటలేదని పూర్తిగా తెలుసుకొని ఉద్వేగముగా లేచి గదితలుపుల వద్దకు బోయి వానిని దీసి మజల నంతలో నేమనుకొనెనోగాని మావైపునకు దిరిగి ఏదో పలుకబోవుచుండెను.

చూచుచుండగా మహాభయంకర మగు చర్య యొకటి మాకన్నుల బడెను. ఆ బీభత్సమగు దృశ్య మింకను నాకన్నుల కట్టినట్లే యున్నది. రూపమెత్తి వచ్చిన మహిషాసురమర్దనివలె కనులు దెఱచునప్పటికి సరస్వతి మా కగుపించెను. ఆమె యెట్లు గొట్టినదో యేమోగాని చేత నొక యడుగు పొడవుగలిగి, లావైన 'అమాంధస్తా' రోకలితో వెనుకవైపునుండి వచ్చి డాక్టరురంగాతల నొక్క వ్రేటుతో పగులునట్లు కొట్టెను. దెబ్బతినుటయే తడవుగ మహాభయంకరముగ బొబ్బరించుచు డాక్టరు ముందునకు బోరలపడిపోయెను.

"చావు, చావు! మోహనరావును చంపేశావు. నిన్ను నేను చంపకుండా ఉంటానా?" అని యామె డాక్టరును ద్రొక్కుచు చేతిలోనున్న ఆభయంకరసాధనముతో నాతని తలను చితుకబొడుచుచుండెను. ఆమె పగ తీరకపోవుటచేగాబోలు ఆమె క్రోధోన్మాదమున 'కోరిమోలనస్'పై నెక్కిన 'అఖిడియస్' వలె డాక్టరుదేహమును ద్రొక్కివేయుచు పాముతలను చితుకగొట్టినట్లు అతనిని చావమోదుచుండెను. అంతలో రిచ్చవడియున్న మా సేవకులువచ్చి రక్తమయమై యున్న యామెను బట్టుకొనిరి. వారామెను పట్టుకొనుచుండగా ప్రసాదరావుగారు సహిత మచ్చటికి వచ్చిరి. నా రీల వేసి వాకిటనిలిచియున్న పోలీసుజవాన్ల ద్రను పిలిచి సరస్వతిని పట్టించిరి.

ఆమె తనవాఙ్మూలము మిట్లు చెప్పదొడగెను:

"మోహనరావును వీడే హత్యచేశాడు. మొట్టమొదట విజయలక్ష్మిమీద మావాడికి వలపు పుట్టేటట్లు చేసి ఆమెను తప్పకుండా పెండ్లిచేయిస్తానని చెప్పేడు. మావాడు మోసపోయి ఆమెమీద మోహంగావుండి తుదకు రాజశేఖరరావుగారితో ఆమెకు పెండ్లిజరిగినా ఆమెవెనక పిచ్చియెత్తినట్లు తిరిగేవాడు. అప్పుడు విజయలక్ష్మివద్దకు వెళ్లకూడదని, వెళ్లినట్లయితే ప్రమాదముందనీ ఈడాక్టరు చెప్పేవాడు. మావాడు వినుపించుకోలేదు. ఆరోజురాత్రి రాజశేఖరరావును హత చెయ్యవలెనని సంకల్పించుకొని మావాడు పిస్తోతీసుకువెళ్లాడు. వెళ్లేముందు నాకు ఉత్తరం వ్రా తనకేమైనా ప్రమాదం జరిగేయెడల నేను ప. కోవలసిఉంటుందనీ వ్రాశాడు. ఆరాత్రే డా. మావాడిని హత్యచేశాడు. వాడిని చంపినవిధంగానే నేనూ వీడిబుఱ్ఱ పగులగొట్టి చంపేను. వాడిని అనాథని చేసి చంపేస్తే వదలిపోతాడనుకున్నాడు. ఈకాలంలో ఆడాళ్లు కలెక్టర్లనీ, గవర్నర్లనీ కూడా లక్ష్యంచెయ్యకుండా చంపెయ్యడానికి సిద్ధపడుతూవున్నప్పుడు నేను నాకొడుకుచావు తెలిసికొని ఊరుకోలేకపోయాను."

ప్రసాదరావుగా రామెను తీసుకుపొండని తమ భటుల కాజ్ఞాపించిరి. ఆమెనుదీసుకొనిపోయినతరువాత ప్రసాదరావుగారు బీభత్సముగ రక్తసిక్తమై యున్న డాక్టరుదేహమును పరీక్షించిరి. జేబులలో కొన్నికాగితము లుండెను. వానిని దీసిచూచిరి.

అవి పట్టాభిరామయ్యగారు తమవాఙ్మూలమున వ్రాసియుంచిన మొదటి నాలుగుపత్రము లని మేము తెలిసికొంటిమి. అందు ముఖ్యముగ నీదిగువ వాక్యములు నాభర్తగారికి మిగుల నాశ్చర్యమును బుట్టించెను:

"వెంకటరంగయ్యగారికి రాజశేఖరరావుగారు స్వయముగ పుత్రులుకారు. వారి పెదతండ్రిగారి కొమా

రుడైన వేఱొక వెంకటరంగయ్యగారు కలకత్తా విశ్వవిద్యాలయమున నధ్యాపకులుగనుండియుండిరి. ఆవెంకటరంగయ్యగారికి రాజశేఖరరావుగారు ౧౮౯౯ వ సంవత్సరము ఆగష్టు ౧౧ వ తేదీని జన్మించిరి. ఆయనపుట్టిన కొంతకాలమునకు తల్లియు, తరువాత రెండేండ్లకు తండ్రియు పరలోకగతులగుటచేత నప్పుడు రంగూనులో వ్యాపారముజేయుచున్న వెంకటరంగయ్యగారి కప్పగింపబడిరి."

"ఆహా! రాజశేఖరరావుగారు మీరెంత మోసపోయినారు! మిమ్ములను గన్న తల్లిదండ్రుల కెట్టియున్మాదమును లేనేలేదు." అని తమ యాశ్చర్యమును ప్రకటించుచు ప్రసాదరావుగా రనిరి.

"ఇదేమో చిత్రంగా ఉంది. తరువాయి చెప్పండి." అని నాభర్తగా రనిరి.

"మొదటినుండియు వెంకటరంగయ్యగారు రాజశేఖరరావుగారిని తమపుత్రులవలెనే మిగుల గారాబముగ పెంచిరి. ఆయన తమపెదతండ్రిగారి మనుమలని చెప్పుకొనుటకు వెంకటరంగయ్యగారి కెంతమాత్రము ఇష్టముండకపోవుటచేత నాసంగతిని వారు మిక్కిలిరహస్యముగ నుంచుచువచ్చిరి. వారిధర్మపత్ని వలన వారికి సంతానములేకపోవుటచేత ఆమెయు రాజశేఖరరావుగారిని తమపుత్రులవలెనే పెంచుకొనుట కిష్టపడెను. కాని ఆకస్మికముగ నామె మరణించుటచేత వెంకటరంగయ్యగారు సరస్వతి యనునొక కన్నడస్త్రీని చేరదీసిరి. ఆమెవలన మోహనరావను నొకకుమారుడు వారికి పుట్టెను. ఆకాలముననే వారికి పిచ్చియెత్తినది. అది వారికి తమతల్లినుండియు, ఆమెకు తన పుట్టినింటివారినుండియు సంక్రమించెను. మోహనరావెవడో రాజశేఖరరావుగారికి కూడ తెలియనంత రహస్యముగ వెంకటరంగయ్యగారు దాచియుంచిరి. పుట్టినవెంటనే వానిని నాయొద్దకు బంపివేసి నావలననే అతని సంరక్షకులకు ధనము బంపి కాకినాడయందును, బెంగుళూరునందును వానిని జదివించిరి. అట్లు పంపివేసినతరువాత మరల వానినెన్నడును చూచియుండకపోవుటయేగాక అతడు తమపుత్రుడని యెవ్వరికిని దెలియకుండ నుండునట్టి మరతుమీద మోహనరావునకును, వానితల్లికిని ప్రతినెలయు గొంతసొమ్మిచ్చు నేర్పాటు చేసియుండిరి. తప్పక మోహనరావునకు అభయంకరమగువ్యాధి పట్టుకొనునట్లు నాకు తోచెను. వెంకటరంగయ్యగారు చనిపోయినతరువాత నే నీసంగతి పలుమార్లు సరస్వతితో చెప్పితిని.

ఈరహస్య మిట్లే యుంచవలెనని వెంకటరంగయ్యగారి యూహ. కాని పరిస్థితులు విషమావస్థకు వచ్చుచున్నవని గ్రహించి నాక్లయంటు రాజశేఖరరావుగారి మనశ్శాంతికి తోడ్పడగలవని నే నీ వాఙ్మూలమిచ్చుట కొప్పుకొంటిని."

## ౧౨

## ఆహా, నాతండ్రి!

ప్రసాదరావుగారు జరుపవలసినరీతిగా డాక్టరు శవమును పరీక్షచేయించి మాయింటినుండి దానిని తీసుకొని వెడలిపోయిరి. తరువాత రాత్రిపదిగంట లగుచుండగా ప్రసాదరావుగారు తిరిగి మాయింటికి వచ్చి "రాజశేఖరరావుగారు లేరా?" అని యడిగిరి.

"లేరు. ఇంకా భోజనమునకైన రాలేదు. ఎక్కడికివెళ్లిరో ఏమో తెలియకుండావుంది."

"ఎప్పుడిలాగే జరుగుతుంది. పోలీసునౌఖరీలో ప్రవేశించిందిమొదలు ఎవరినోఒకరిని ఎరెస్టుచెయ్యడానికి వెళ్లినప్పుడల్లా 'ఇంట్లోవాళ్లులేరండీ! ఎక్కడికో వెళ్లారు. ఏమయ్యారో మాకుతెలియదు.' అని చెబుతూంటారు.

"అయితే రాజశేఖరరావుగారిని ఎరెస్టు చెయ్యడానికి వచ్చారా ఏమి చెప్పండి?"

"లేదు కాని, ఆయన చేసేపనులకు మరొకడైతే" చాలరోజులక్రిందటనే ఎరెస్టు చేసిఉంటాను. ఇన్నాళ్లు ఆయన ఏమీ నేరం చెయ్యలేదు గాని ఈ రాత్రి బుద్ధిపూర్వకంగా ఈనోట్లసృష్టి చేస్తూవున్న మారీచుడిని ఎబ్‌స్కాండ్ (పాటిపోవునట్లు) అవునట్లు

సహాయంచేశారు. ఈరాజశేఖరరావుగారివల్ల కాని లేక పోతే నాకీపాటికి విజయం చేకూరి ఉండేది."

"దొంగనోట్లెవ రచ్చువేస్తున్నారో మీకు తెలిసిందా?"

"ఆహా తెలిసింది. కాని పక్షి పారిపోతూ వుంటే నేనే చూసి ఊరుకోవలసింది. కారణం రాజశేఖరరావుగారు."

"ఆయనేమి చేశారు?"

"పులినోటికండను దాని కండకుండా చేసినట్లు ఈకలియుగ విశ్వామిత్రుడిని మా కండకుండా తమ కారులో కూర్చోబెట్టుకుని ఏ యేనామో తీసుకు పోయారు."

"నేను నమ్మలేకుండా ఉన్నాను."

అంతలో నాభర్తగారచ్చటకు వచ్చిరి. ప్రసాదరావుగా రాయనను జూచి "మాకు మంచి పరాభవం చేశారు. ఇన్ని సంవత్సరాలనుంచి నేను పోలీసుశాఖలో ఉద్యోగం చేస్తున్నాను. ఎప్పు డీవిధంగా స్నేహితుల చేతనే అవమానం పొందలేదు. నాకు 'కామన్‌సు' అంతగాలేదుగాని స్ట్రాంగ్ సెన్సు ఆఫ్ డ్యూటీఒకటి కొంచెం హెచ్చుగా ఉంది.—మీరు నేను చెప్పేమాటలకు 'శభాస్' అనాలిగాని ఏమీ అడ్డురావద్దని ప్రార్థిస్తున్నాను. ఈదొంగనోట్లతో మీకు జోక్యం ఉందని రంగాచారి మిమ్మల్ని అనుమానించడం మొదలుపెట్టినప్పటినుంచి మధ్య నాగ్రహచారం కాలిపోతూవచ్చింది నేను చేస్తున్న పనులన్నీ రంగాచారిగాని, తదితరులుగాని కనిపెట్టి గవర్నమెంటుకు కప్పకు తెలియజేస్తారో అని నాకు సందేహం కలిగేటట్లు జరిగింది. ఇక రెండే ళ్లెందైనా గడుపుకుంటే నాకు నాపెన్‌షన్ వచ్చేస్తుంలా. కాని నాలో వున్న 'సెన్స్ ఆఫ్ డ్యూటీ' నన్ను వెంటనే రాజీనామా దాఖలుచేసుకోమని చెబుతోంది. కాబట్టి వెంటనే ఆలాగుజరిగిస్తాను. భగవంతుడిచ్చిన బుద్ధి, దాన్నిబట్టి వచ్చిన అనుభవం సరిగా వినియోగించుకుంటే నాకెక్కడనో ఒకచోట బ్రతుకుగడవక పోదు."

"మీ కెరీర్ పాడుచేసుకోకండి. మీ బ్రతుకు నావల్ల నే పాడైనదని నాకు స్పష్టంగా తెలుసుకాని—"

"మీరు కాదు, ఆభగవంతుడే ఇలా చేశాడు. నిన్న రాత్రే నాకు డాక్టరుమీద, మీమామగారిమీద అనుమానం తట్టింది. డాక్టర్ను బుద్ధిపూర్వకంగా వదలివేశాను. జనార్దనరావుగారిని మీచేతుల్లో దాటించేశారు. ఇక అందుగూర్చి మిమ్మల్నేమీ ప్రశ్నించను. కాని వీళ్లిద్దరు ఇన్నాళ్లు మాకన్నులకు గంతలు కట్టేసి ఈదొంగనోట్లు అచ్చువెయ్యడం—వాటితో దేశమంతా ఒకనాటకం ఆడడం అదే నాకు ఆశ్చర్యంగా వుంది. మీసంబంధమును చూసి నేను మొదట అనుమానించలేక పోయాను."

నాకు మిన్ను విఱిగి మీదబడినట్లయ్యెను.

"అట్లయిన ఈదొంగనోట్లు మా తండ్రిగా తయారుచేయించిరాఏమి?" అని మిగుల నుద్వేగము నంటిని.

"ఆహా, నిస్సంశయముగ — డాక్టరు చ తరువాత డాక్టరింటికి వెళ్లి అంతా పరీక్షచేసిచూశాను. అక్కడ మీతండ్రిగా రాయనపేర మద్రాసునుండి వ్రాసిన కొన్ని ఉత్తరము లగుపించాయి. అందు కొన్ని సంకేతాక్షరము లుండెను. మొదట అవి నాకు సరిగా బోధపడలేదు గాని వెదకగా వెదుకగా ఆసంకేతాక్షరముల యర్థమున్న గ్రంథమొకటి వారి ఇనుపపెట్టెయందుండెను. దానిసహాయమున వారి రహస్యములను నేను భేదింపగలిగాను. రాజమండ్రియందు మీ గుండిన ఆ గృహమునందే వా రీదొంగనోట్ల నచ్చువేశారు. డాక్టర్ల భార్య కమలాంబ చాలనోట్లమీద డాక్టరుగారి స్టాంపు గొట్టినదట. వాని నన్నింటిని ఆయన తగులబెట్టినాడు కాని ఒక రూ ౫౦ ల నోటుపైన స్టాంపట్లే యుండిపోయి మా ఇన్‌స్పెక్టర్లకి దొరికింది. ఆ యచ్చును గూర్చిన సర్వకార్యములను కాలక్రమమున మీనాయనగారు డాక్టరు కప్పగించారు. రకరకాలనోట్లు కొన్నివేలచ్చువేసినతరువాత ఆయచ్చుయంత్రమును తదితర పరికరములును గోదావరిలో పారవేయవలెనని వారు మొదట నిర్ణయించుకొనిరి. మీ కాయింటిని డాక్టరు

రంగాయే కుదిర్చిఉంచాడు. అన్నట్లు మఱచినాను. రాజమండ్రీలో మీ నాయింటిని ఏవో క్రొత్తపేరులమీద తీసుకొన్నారు. డాక్టరు దురాశాహతుడగుటచేత ఈ దొంగనోట్లన్నియు రాజశేఖరరావుగారే సృష్టించినట్లొక కపటనాటక మాడదలచి మీ నాయనగారితో తాను అచ్చుయంత్రమునకు సంబంధించిన పరికరములన్నింటిని రాత్రివేళ గోదావరిలో బారవేసితినని మీతండ్రిగారికి విశ్వాసము కలుగునట్లు చెప్పి ఆయింటిని రాజశేఖర రావుగారి వశమగునట్లు చేసెను. తరువాత రాజశేఖర రావుగారెప్పుడో ఆ అచ్చుయంత్రమున్న స్థలమును గనిపెట్టి దానిని పరీక్షించుచుండగా మోహనరావా సంగతిని గనిపెట్టి రంగాచారి కాసంగతి తెలియునట్లుత్తరము వ్రాసెను."

"ఆహా ఎంతపని చేశారు!"

నాతండ్రిగారట్టి సాహసమొనర్చియుండిరని విశ్వసింపలేకపోతిని. చూచుచుండగా నాకన్నుల నుండి నీరువచ్చెను. నన్నంత గారాబముగ పెంచిన తండ్రి! ఈ డాక్టరుతో జేరి తుదకు నాబ్రతుకెంత యధోగతి పాలుచేయుటకు సిద్ధమయ్యెను. ఎవడైన కన్నతండ్రి యిట్లుచేయునా?—అంతలో నాకు స్ఫురణకు వచ్చెను.

"ప్రసాదరావు గారు, క్షమించండి. మీకు తెలియునో లేదో! జనార్దనరావుగారు నాకు పినతండ్రి. నాతలిదండ్రులు నాచిన్నతనముననే మరణించినారు. నాతండ్రిగారు తమ యాస్తినంతయు తమ్మునకప్పగించి నా కున్నతవిద్య నొసగవలసినదని చెప్పిరి. పసితనముననే వారు గతించిపోయినను మాపినతండ్రిగారు నన్ను తమగర్భవాసమున బుట్టిన పుత్రికకంటె మిగుల ప్రేమించి పెద్దదానిని జేసిరి. అందువలన వారు నా కెప్పుడును వందనీయులే." అని కన్నీళ్లతో నంటిని.

ప్రసాదరావుగారంతట సంభ్రమోచితముగ నన్నాశ్వాసించి తాము వెడలిపోయిరి.

"ఎంతాశ్చర్యంగా వుంది. అయితే ఈదొంగ నోట్లు మానాన్నగారే తయారుచేశారా?"

"ఆహా ఆయనే తయారుచేశారు. ఈసంగతి స్పష్టంగా తెలిసినప్పటినుంచి నాకు మహాశ్చర్యంగా ఉంది. ఆయన స్వయంగా ఒప్పుకున్నారు. వ్యాపారమున వారికి మిక్కిలి నష్టము వచ్చినదట. అప్పుడీ డాక్టరు ప్రోత్సాహంవల్ల ఇద్దరు కలిసి నోట్లచ్చువేశారట."

"అయితే మానాన్నగారిప్పుడేమయినారు?"

"ఏవిధంగానో అమెరికాకుపోయి అక్కడ జీవించవలెనని వారియూహ. ప్రసాదరావుగారాయనను బట్టుకొనుటకై మనుష్యులను పంపేరు. వారాసంగతి ముందు తెలిసికొని యెవ్వరికీ తెలియకుండా మన యింటికి వచ్చి సంగతి నాకు విశదమయ్యేటట్లు చెప్పేరు. అప్పుడు నువ్వు మేడమీద ఉన్నావు. నీకేమీ చెప్పవద్దని కోరుటచేత నేను వెంటనే కారు ఆర్డరుచేయించి రెండవకంటివానికి తెలియకుండా మీనాన్నగారిని యానాం పంపించివేశాను."

"ఆహా ఎంత దుర్గతిపట్టినది!"

"'సాహసేలక్ష్మీః' అనే ఉత్తమాదర్శం నాకీవిధంగా వక్రమార్గంలో పెట్టి సూక్ష్మంగా కోటీశ్వరులైపోవచ్చునని ఈయెత్తు యెత్తారట. ఆసాహసంతోనే డాక్టరు అన్నిదారుణాలు చేశాడని మీనాన్నగారు చెప్పేరు. ఈహత్యలన్నీ డాక్టరొక్కడే చేశాడు. మీనాన్నగారికేమీ తెలియదు."

"రాజమండ్రీలో నోట్లు మీరే అచ్చువేస్తుండగా—"

"అలాగా! అది చూసినతరువాత నేనా నువ్వన్నావిధంగా - పలుకరించావు!— అప్పుడే నాకా అచ్చుయంత్రం కనిపించింది. నా కాశ్చర్యంవేసి అక్కడి సాధనములతో యంత్రం తిప్పిచూశాను. దానినిబట్టి ఈకలియుగ విశ్వామిత్రుడను నేనే యని భావించావు కాబోలు. శబాస్."

(సంపూర్ణము)

---



నర్తకి

—తోట వెంకటేశ్వరరావు.



భారతీయనర్తకి 'ఇష్వాని గుల్బనో'



వెనుకటి మైసూరి మహారాజా శిలావిగ్రహము, లాల్ బాగు, బెంగుళూరు.

# తుమ్మెదపాట

మం. వేంకటశర్మ

తుమ్మెదననివచ్చి తుమ్మెదా ఇంత
దుడుకుచేసెదవేమె తుమ్మెదా

అవశకునంబుగా తుమ్మెదా నీవు
అరవకపోపోవె తుమ్మెదా

చీకొట్టినను పోక తుమ్మెదా నిల్చి
బూకరించెదవేమె తుమ్మెదా

తప్పతాగితివేమొ తుమ్మెదా వట్టి
తందనాలాడేవు తుమ్మెదా

శాంతిభంగముచేసి తుమ్మెదా ఏల
[illegible]ాలుతిందువే తుమ్మెదా

పాటపాడెదనని తుమ్మెదా మొగ
మాటపెట్టెదవేమె తుమ్మెదా

నీపాటవినుటకు తుమ్మెదా నీవు
ఏపాటిగాణవే తుమ్మెదా

ఉల్లకుట్టుగ పాడ తుమ్మెదా పెద్ద
ఝిల్లికవౌదువె తుమ్మెదా

మాటిమాటికి నీవు తుమ్మెదా రోత
పాటలుపాడకె తుమ్మెదా

ఝంఝుమ్మనుచువచ్చి తుమ్మెదా ఏదో
సోదిచెప్పెదవేమె తుమ్మెదా

ఝుమ్మన్ననీపాట తుమ్మెదా చెవులు
దిమ్మెలెత్తించునే తుమ్మెదా

తెయ్యనియాడేవు తుమ్మెదా అంత
ఒయ్యారమెందుకే తుమ్మెదా

అందచందాలుంటె తుమ్మెదా ఎంత
అదిరిపడిపోదువే తుమ్మెదా

ఎగిరిపాటెందుకే తుమ్మెదా నీకు
నగుబాటుకేకాదె తుమ్మెదా

కలహంసనెదిరించి తుమ్మెదా తొల్లి
కాకమేమయ్యెనే తుమ్మెదా

ఆగడమెందుకె తుమ్మెదా వట్టి
బేగడవేకాదె తుమ్మెదా

మరియాదమీరితే తుమ్మెదా నీదు
మానమునిలువదె తుమ్మెదా



నీగుట్టు నీమట్టు తుమ్మెదా నీవు
దాగినాదాగవే తుమ్మెదా

నీపుట్టునీపట్టు తుమ్మెదా నీదు
నిజమెవ్వరెరుగరే తుమ్మెదా

గట్టివాయి నిన్ను తుమ్మెదా రట్టు
పెట్టెదచూడవే తుమ్మెదా

నిన్ను నీవెరుగవే తుమ్మెదా మున్ను
నీచంపుపురుగువే తుమ్మెదా

పుట్టుకమరచిన తుమ్మెదా నీదు
పోడిమేమందునే తుమ్మెదా

జననమెచ్చోటనే తుమ్మెదా నీకు
మనికియెచ్చోటనే తుమ్మెదా

చిన్నినీబొజ్జకు తుమ్మెదా కలిగె
శ్రీరామరక్షని తుమ్మెదా

పొట్టచేతబట్టి తుమ్మెదా లేచి
పోతివిగదె తుంటతుమ్మెదా

కన్నవారిపేరు తుమ్మెదా నీవు
కలనైనతలతునే తుమ్మెదా

ఒక్కతెరువు పుట్టి తుమ్మెదా వేరే
యొకతె పేర్కొందువే తుమ్మెదా

నీచబుద్ధివిగదే తుమ్మెదా నిన్ను
జూచితే పాపమే తుమ్మెదా

పుట్టినవారిల్లు తుమ్మెదా నీకు
పూజ్యముకాదటె తుమ్మెదా

కన్నవారిని విడిచి తుమ్మెదా వేరె
కడపెక్కిబతికేవె తుమ్మెదా

నినుగన్నవారిపై తుమ్మెదా ఇంత
నెనరుమాలితివేమె తుమ్మెదా

సోదరులనుబాసి తుమ్మెదా లేచి
పోదురే కడుపుకై తుమ్మెదా

పొట్టకులేకను తుమ్మెదా తోడ
బుట్టువులుండంగా తుమ్మెదా

దట్టవై మెక్కుతు తుమ్మెదా మొండి
కట్టవైబతికేవె తుమ్మెదా

తల్లియింటింటను తుమ్మెదా తిండి
కల్లాడుతున్నదే తుమ్మెదా

రామరామరామ తుమ్మెదా నల్లి
రాయివై పోతివె తుమ్మెదా

తల్లినివిడిచిన తుమ్మెదా నీకు
ధర్మముతెలియునా తుమ్మెదా



కడుపుకైలాసమై తుమ్మెదా బంధు
గణముగణింపవె తుమ్మెదా

పితరులవిడిచిన తుమ్మెదా నీకు
ఇతరులులక్ష్యమా తుమ్మెదా

పితరులవిడిచిన తుమ్మెదా పుట్ట
గతులున్నవా నీకు తుమ్మెదా

తల్లి నేచినవాడు తుమ్మెదా పిన్న
తల్లిని బ్రోచునా తుమ్మెదా

నీజన్మమును రోసి తుమ్మెదా నీవు
నీవారి నెడబాసి తుమ్మెదా

సంకరమైనావె తుమ్మెదా నీకు
సరస మెట్లబ్బునే తు...

జాతినీతిలేక తు... నీకు
రీతేడవచ్చునే తు...

ఎగ్గుసిగ్గులు లేని తు... బుద్ది
బుగ్గైనదేమె ఓ తు...

నిలువెల్లమలినమె తు... ఇంత
నియతిలేదేమె ఓ తు...

కుజనసంగతి నీకు తు... నైజ
గుణమైనదేమె ఓ తు...

మధుపానముచేసి తు... ఒళ్లు
తెక్కియుందువె తు...

వయ్యారికని తు... పెక్కు
జీవుల మిరిగేవే తు...

విటపాళితోగూడి తు... నీవు
విడువకతిరిగేవె తు...

లతకూనలనుబట్టి తు... చాలా
రాపిల్లిపెట్టెవె తు...

పుష్పవతులగూడి తు... ఎంతో
పొంగుతుతిరిగేవె తు...

పుష్పరజంబుతా తు... మేన
పులుముకుతిరిగేవె తు...

అడవిడొంకలలోను తు... దేవు
లాడుతుందువె పాడు తు...

రసికత్వమటుయిది తు... మడ్డి
కసుమాలజాతివే తు...

వంచకమతివేమె తుమ్మెదా బహు
చంచలమతివే ఓ తు...

పాంథగణంబుల తు... చాలా
బాధించుచుందువె తు...

చండాలిసంసర్గ తు... నీకు
సంప్రదాయముకాదె తు...

తమ్ములయిళ్లలో తు... మధు
ధనముహరింతువె తు...

కువలయాలయములు తు... నీవు
కొల్లలాడేవె ఓ తు...

మరువాడలనుజేరి తు... ద్రవ్య
మరిమురిగొందువే తు...

పద్మినులందరు తు... నిన్ను
బందీనిచేతురె తు...

చంద్రసూర్యులునిన్ను తు... పట్టి
సంకెళ్లువేతురే తు...

కుమతివైననీకు తు... మేలు
గుణమెట్లుతెలియునే తు...

కనకము కనకమే తు... నీకు
కంటకమయ్యెనే తు...

కనకమువిడిచితే తు... దండి
తనమెట్లునిలుచునే తు...

సంపంగిపుష్పము తు... పుష్ప
జాతిరత్నముకాదె తు...

సంపంగివాసన తు... నీకు
సహ్యముకాదటె తు...

శర్మదసుమములు తుమ్మెదా చారు
చాంపేయములుకావె తు...

నర్మదములుకావె తు... నీకు
మర్మభేదకములె తు...

చందమామసొగసు తు... పంక
జము సహింపదుగాక తు...

అఖిలలోకముచూచి తు... మెచ్చి
ఆనందమొందదె తు...

కోయిలగానము తు... ఎంత
హాయిగానుండునే తు...

పలుగాకికాకికి తు... అంత
ప్రాణసంకటమేమె తు...

పందిమెచ్చదుగాక తు... నరులు
పన్నీరువాడరే తు...

తిరిపగొట్టువుగాన తు... దాని
నెరతనమెరుగవె తు...

నీకు నచ్చదుగాక తు... మేలు
నీవుమెచ్చవుగాక తు...

నీవుమెచ్చనివిరులు తు... ఎల్ల
తావులవెలయవె తు...

జగముమెచ్చినవిరులు తు... నీకు
వెగటయ్యెనటె పాపి తు...

నీపాపమదగాక తు... ఏమి
లోపమె దానికి తు...

తిండికద్దని నీవు తు... ఒళ్లు
తెలియకతుళ్లేవె తు...

ఊరేమిపేరేమి తుమ్మెదా నీదు
ఊర్జితమేమె ఓ తు...

పరపిండజీవివె తు... నీదు
పరువుతెలిసికోవె తు...

కుక్షింభరివెనీవు తు... పెద్ద
అక్షయ్యపాత్రవె తు...

ఇల్లిల్లుతిరుగుతు తు... కడుపు
మళ్లించుకొందువె తు...

తొల్లిశంకములోను తు... నీవు
దొర్లుతుంటివికాదె తు...

నడమంతరపుసిరికి తు... ఇంత
మిడిసిరాలెదవేమె తు... —

దోసకారితులువ తు... మాం
వేసాలువేతువే తు...

మారుపేరులచేత తు... నీవు
మసలుతుందువుకాదె తు...

భ్రమలమారిమాయ తు... జగము
భ్రమగొల్పజూతువే తు...

వేసాలుమార్చితే తు... వన్నె
వాసివచ్చునంటె తు ..

గ్రాసాలుగలిగితే తు... లేని
గారవమబ్బెనే తు...

చీమకొండెక్కితే తు... ఘనత
యేమైనవచ్చునే తు...

కోతికొమ్మెక్కితే తు... మంచి
ఖ్యాతిగడించునే తు...

కోడిక్రొరెక్కెతే తుమ్మెదా               లేని
గొప్పప్రాప్తించునే తు...

సాని గడెక్కితే తు...                    మంచి
సంసారి సరియౌనె తు...

గువ్వగూడెక్కితే తు...                   దాని
గోడిపోడెచ్చునే తు...

గూబగుడెక్కితే తు...                    వేల్పు
కొలుపులుగలుగునె తు...

పేను నెత్తెక్కితే తు...                  మంచి
పెద్దరికమబ్బునే తు...

నల్లి గద్దెక్కితే తు...                   దొడ్డ
నాథుడవునటె తు...

...నుగు నెక్కితే తు...                   మావ
టీడు రేడౌనటె తు...

తొత్తెన్నినగలున్నా తు...                 దొడ్డ
దొరసాని యౌనంటె తు...

భాగ్యముకలిగితే తు...                   బంటు
ప్రభువు కాగలడటె తు...

కంచరగాడిద తు...                       చూడ
మంచిగుర్రంబౌనె తు...

ఈగ డేగౌనటె తు...                      మూగ
వాగీశుడౌనటె తు...

తొండమున్నంతనే తు...                   అల్ల
దోమ సామజమౌనె తు...

దోమయేనుగనంటె తు...                   జగము
తుప్పన నుమ్మదె తు...

తన్నులుతినితిని తుమ్మెదా               పూలు
తరువైన కంకేళి తు...

తనతొంటివైఖరి తు...                    మదిని
తలచునే యెపుడైన తు...

అలసిరిమంతుడు తు...                    దుర్మ
దాంధకారముగప్పి తు

అద్దరేతిరి కాడ తు...                   గొడుగు
అడిగినట్టున్నదె తు...

సిందుకుడెపుడైన తు...                   తొణక
నేర్చునే సుంతైన తు...

వెలితికుండవుకాన తు...                  సారె
తొలికేవు కులికేవు తు...

వింగడముగ నీవు తు...                    విర్ర
వీగేవు తూగేవు తు...

ద్విజుడనైతినని తు...                    అడ్డె
తెగసాగబోకె ఓ తు...

ద్విజులేడ నీవేడ తు...                   పాడా
వేదాలు తెలియవె తు...

ద్విజపదసంపద తు...                     అంత
తేలికైనదికాదె తు...

ప్రతిజీవికబ్బదే తు...                    అంత
పైపైనిలేదే ఓ తు...

ద్విజవాచ్యులందరు తు...                 ద్విజులు
నిజముగానగుదురె తు...

ద్విజధర్మమెరుగని తు...                  నీవు
ద్విజుడంటె చెల్లునే తు...

బ్రహ్మనిష్ఠ లేక తుమ్మెదా ద్విజ
పట్టమెట్లబ్బునే తు...
ధర్మనిష్ఠ లేక తు... ద్విజ
తత్త్వము కోరుకునే తు...
సత్యనిష్ఠ లేక తు... ద్విజ
సరణిలభించునే తు...
శమదమాదులు లేక తు... ద్విజ
సంజ్ఞ సిద్ధించునే తు...
అజుడు ద్విజుండట తు... అమ్మ
తాంశుడు ద్విజుడట తు...
కర్మణాద్విజుల ట తు... బ్రహ్మ
క్షత్రియశూద్రులు తు...
ద్విజకర్మ మెరుగవు తు... నీవు
ద్విజుడ వెట్లవుదువె తు...
నీవు ద్విజుడనంటే తు... చీమ
నిరసించితుమ్మెదె తు...
పద నీవే ద్విజుడైతే తు... సకల
పశువులు కావ లె తు...
బళి నీవే ద్విజుడైతే తు... ఎల్ల
పాములు కావ లె తు...
కీటకంబులెల్ల తు... ద్విజ
కోటులు కావ లె తు...
అండజంబులెల్ల తు... ద్విజ
మండలములు కావె తు...
నామసామ్యముం లె తు... లక్ష
ణాలెట్లువచ్చునే తు...

పాకశాసనుడు తుమ్మెదా శచీ
భర్త కాగలడ లె తు...
గంగాధరుండెల్ల తు... అల్ల
గౌరీశుడగున లె తు...
వంశీధరుండైతే తు... కృష్ణ
భగవానుడగున లె తు...
అవగుణముంటేనే తు... గుణికి
సవతు కావచ్చునే తు...
ఏకాక్షుడైతేనే తు... యక్ష
లోకేశ్వరుండౌనె తు...
పొట్టేలు నెక్కితే తు... అగ్ని
భట్టారకుండౌనె తు...
తల్లి నిజంపితే తు... జా...
దగ్ని కాగలడ లె తు...
గురుతల్పచరుడైతే తు... సుధా
కరుడు కాగలడ లె తు...
బాబు నెదిర్చితే తు... భక్త
ప్రహ్లాదుడవున లె తు...
నిద్రాణులను జంపి తు... ద్రౌణి
కుద్దిరావచ్చునే తు...
అన్నను తెగజూచి తు... అల్ల
అర్జునుడౌనె ఓ తు...
కొంపలుగాల్చితే తు... గాలి
కొడుకు తానవున లె తు...
మత్స్యాంకుడైతేను తు... నవ
మన్మథుడవున లె తు...

హాలాహలిలోలుడు తుమ్మెదా　　రేవ
తీలోలుడవునటె తు...

గోంగళిపురుగులు తు...　　సీతా
కోకచిల్కలుకావె తు...

సీతాకోకచిల్క తు...　　చిల్క
జాతికిచెందునే తు...

చిలుకనిపిలిచితే తు...　　ఆకు
చిలుక రాచిలుకౌనె తు...

చిల్కచిల్కంటేను తు...　　వడ్ల
చిల్క రాచిలుకౌనె తు...

పులిపులియంటేను తు...　　ఈగ
పులిపులియౌనటె తు...

పులిపులియనగానె తు...　　గూన
పులి పులియవునటె తు...

మణిపేరుగలదని తు...　　కీట
మణి మణియవునటె తు...

సింహాసనానటెకుక్క తు...　　గ్రామ
సింహనామముచేత తు...

గొడుగన్నమాత్రాన తు...　　కుక్క
గొడుగు గొడుగౌనటె తు...

కొడుకుకొడుకంటేను తు...　　పనస
కొడుకు కొడుకౌనటె తు...

తల్లితల్లంటేను తు...　　సవతి
తల్లి తల్లవునటే తు...

మామమామంటేను తు...　　చంద
మామ మామవునటె తు...

భామభామంటేను తుమ్మెదా　　గొల్ల
భామ భామవునటె తు...

పెట్టుపేరులవల్ల తు...　　నీదు
పెంపుసొంపారునే తు...

సిరియబ్బెననినీకు తు...　　ఇంత
గరువముపనిలేదె తు...

నీసంబరంబంతా తు...　　పట్టి
మీసాలపై తేనె తు...

చిగిరింత సిరియెంత తు...　　నీదు
వగరెంత పొగరెంత తు...

ఓడలుబళ్లౌనె తు...　　బళ్లు
ఓడలైపోవునె తు...

జగమింద్రజాలమె తు...　　దాని
జాడగ్రహింపవె తు...

ఈవిశ్వమంతాను తు...　　దేవ
దేవునిసత్రమె తు...

విశ్వసత్రమందు తు...　　సదా
విందులునడుచునె తు...

పూర్ణమైనదిసుమ్మి తు...　　అన్న
పూర్ణసత్రంబిది తు...

ఈమహాసత్రాన తు...　　ఎవరి
కేమీలోపములేదె తు...

విశ్వదాతతాను తు...　　ఎల్ల
వేళ నేమరకను తు...

వేయికన్నులతోను తు...　　చూచి
వేచికాపాడునె తు...

అల్పజీవికైన తుమ్మెదా సదా
ఆహారమొదవునె తు...

అల్పజీవులకైన తు... జీవ
యాత్రలునడుచునే తు...

శ్రీరామచంద్రుడు తు... సర్వ
శ్రేయోదాయకుడె తు...

ఆమహాత్మునివల్ల తు... నీకు
ఆమెత లబ్బెనే తు...

ఆమేలు మరచుట తు... నీకు
నేమముగాదె ఓ తు...

ఇల్లారమ్మంటేను తు... నీవు
ఇల్లాక్రమించేవే తు...

చల్లచల్లగవచ్చి తుమ్మెదా ఇల్లు
గుల్లచేతువుగదె తు...

తిన్నింటివాసాలు తు... నీవు
తెగి లెక్కపెట్టేవే తు...

ఇస్సిరోసీచర్య తు... ఎంత
హేయమైపోయెనే తు..

చీపాడునైజపు తు... లేచి
పోపోవె చీపోవె తు...

ఝంకారమేటికే తు... నీకు
హాంకారమేటికే తు...

చండితనముమాని తు... మంచి
సాధువై బ్రతుకవే తుమ్మెదా.

---



కల్లోలము



‘ తాతా ’ శిలావిగ్రహము

(తాతా ఇన్స్టిట్యూట్, బెంగుళూరు)

# భారత సినిమారంగము – స్త్రీలు

ఏ. వి. సీతారామయ్య

ప్రపంచంలో యెచ్చటనయినా ఫిలుముకుగల పేరు యెక్కువగా అందులోనటించిన కథానాయికవలననే వస్తుంది. ఒక్కొక్క సినిమారాణి పేరు చెప్తేచాలు: తక్కినవటు లెవరైనాసరే, డైరెక్టరెవరైనా సరే, జనం తండోపతండాలుగా వచ్చి పడ్తారు. అందువలన ఫిలింయొక్క జయాపజయాలు యెక్కువగా కథానాయికమీదనే ఆధారపడ్తాయి. కనుకనే కథానాయికను ఎన్నుకునే సందర్భంలో పాశ్చాత్యఫిలింకంపెనీలవారు అంతపరిశీలన చేస్తారు.

ఇక మనదేశంలోమాట :

హైందవసినిమారంగంలో పాల్గొనుచున్న స్త్రీలలో యెక్కువమంది చాలతక్కువ సాంఘికస్థానము నుండి తీసుకోబడినవారు, ముఖ్యంగా వ్యభిచారిణుల నుండి. దీనికి కారణం ప్రస్తుతం ఫిలిములు తయారుచేసే కంపెనీలలోని పరిస్థితులు. ఈ 'స్టూడియోల' లో చదువుకొనినవారు తక్కువ. 'కల్చర్' గలవాళ్లు బహుకొద్ది. 'టెక్నిక్' (శాస్త్రము) నైపుణ్యనేగాక నటించువారిలోగూడ పురుషపాత్రలు ధరించువారు గూడ చాలతక్కువస్థానమునుండి తీసుకురాబడినవారు; కేవలము విగ్రహము, కంఠములమీదనే యెన్నుకొనబడి సినిమారంగమునకు ప్రాప్తించినవారు. నాట్యరంగము మీదకంటె సినిమారంగమున స్త్రీ పురుష నటులు ఎక్కువకాలము ఎక్కువదోస్తీగా ఒకరితోనొకరు మెలగవలసిన అవసర ముంటుంది. ఈపరిస్థితులలో చదువుకొని సంస్కారులైన స్త్రీలు మన సినిమారంగమునకు వచ్చుట చాలకష్టము. ఇది నాస్వంత యభిప్రాయమేగాక పదిహేను ఇరవై సంవత్సరములనుండి మనదేశపు సినిమారంగమునందు వివిధశాఖలలో పని చేయుచు అపారమైన అనుభవమును గడించిన పెద్దమనుష్యుల యభిప్రాయములు. ఆ కారణముచేత స్టూడియోలలోని ఉద్యోగియులను చేర్చుకొనుటలో విద్యాసంస్కారము గలవారిని చేర్చుకొని, స్టూడియోలలోని నైతికప్రమాణమును హెచ్చుచేసి, అచ్చటి పరిస్థితులను బాగుగా మార్చవలసిన బాధ్యత స్టూడియోస్వంతదారులయందు ఎంతేని కలదు.



నూర్జిహాన్
(ముగ్ధ)

మన సినిమారంగములోని స్త్రీలు ఎక్కువమంది నాట్యమే వృత్తిగా పెట్టుకొనిన భోగకాంతలను మాట అందరికి విశదమే. అందువలన వారిని ఆకారణముచేతనే దూరముగా నుంచవలయు ననికాదు నా యభిప్రాయము; కళోపాసకులు ఎచ్చటివారైనను గౌరవార్హులే. మనదేశములోని కళాభివృద్ధికిని, కళాజీవనమునకును భోగకాంత యెక్కువగా తోడ్పడిన సంగతి నేను మరచిపోలేదు. 'యాంటీనాచి' రిఫార్మర్లు ఏమని నప్పటికీ భోగకాంత లేగనక మనదేశంలో లేకపోయి

నట్లయితే హైందవనాట్యము, సంగీతము, అభినయము మనదేశమునకే గాక ప్రపంచమంతటికినిగూడ లేకుండ నష్టమై పోయేది. ఇప్పటికిని ప్రాచీనహైందవ నాట్య విజ్ఞానమును వారే కాపాడుకున్నారంటే అతిశయోక్తి లేదు. కారణం ఏ ఉదయశంకరో, ఏ మేనకాదేవియో నాట్యకళోపాసకులున్నారంటే వారి నాట్యకళావిజ్ఞానం ఎందరికి అందుబాటులో వుంది? అందువలన ప్రజాబాహుళ్యంలో ప్రాచీననాట్యకళా సంప్రదాయములను ఇంకను ప్రచారమునం దుంచి మన నాట్యకళా వైభవమును నాట్యకత్తెలే కాపాడుకున్నా రనవలసి వచ్చినది. అందుకు వారిని అభినందించక తప్పదు.



రోజీ
(అనుకంప)

ఇక వారే సినిమారంగానికి ప్రస్తుతపరిస్థితులలో అవసరముగాదు. కాని పంకిలమునందు దొరకిన కమలమును శుభ్రపరచిగాని యెట్లుపయోగించుకొనమో ఆ విధముగనే ఈ నాట్యకత్తెలనుగూడ సినిమారంగమున తీసికొనుముందు కొంచెముసంస్కారము కలుగజేయుట అవసరము; లాభప్రదము. దానికిగాను మనపటమునకు యెన్నుకొనినకాంతను తగినంతవిద్యాగంధమిచ్చి సినిమా శాస్త్రమునందు తగినంతవిజ్ఞానమిచ్చి పాశ్చాత్యదేశములందలి, ఆధునికనవనాగరికసినిమారాణుల వేషధారణ యందలి నేర్పు, శరీరసౌష్ఠవమును గాపాడుకొనుట యందలి జాగ్రత, జ్ఞానోపార్జనయందలి వారి నిరంతర కృషి, దుస్తులను వేసుకొనుటయందలి చాకచక్యము మొదలైన సినిమానటికి కావలసినవిషయములనుగురించి బోధించవలెను. పటమునకు కావలసినకాంతలను యెన్నుకొనునపుడు దాదాపు ఒకసంవత్సరమైన ముందే యెన్నుకొని ఈపనికి పూనుకోవాలి. పాశ్చాత్యసినిమారంగములోమాదిరి సంవత్సరములతరబడి నటీమణులను పోషించి పెంచి విద్యచెప్పించి గొప్పవారిని చేసి మంచి కళను ప్రదర్శింపజేయ గల ఆర్థికపరిస్థితులు మన సినిమా వర్తకుల కుండకపోవచ్చు. కాని నటుల నెన్నుకొనిన పదిహేనురోజులలో పటమారంభించి రెండునెలలలో పటము అవకతవకగా పూర్తిచేసి, 'ఇది తెలుగువారి పటము. కనుక మీరందరు దీని నభిమానించవలెను' అని కోరుటయు, 'ఇదేమి ఇటువంటిఅప్రయోజకపు నటీమణుల నేరితిరి' అని అడిగిన 'మీకేమి తెలియును, పరిస్థితు లెట్లున్నవో? ఇంతకంటె మంచినటీమణులు దొరకుట అసాధ్యము' అని జవాబిచ్చి ఏపదివేలఖర్చుతోనో లక్షలరూప్యములు, ప్రజల పౌరాణికభక్తి దేశాభిమానముల నాధారముచేసికొని సంపాదింపబూనుట ప్రేక్షకులు మన్నించదగినది కాదు; మన్నించరు.

అందువలన సరియైన ప్రమాణపటములు తయారు చేయవలెనన్నచో నటులను కనీసము ఒకసంవత్సరము వరకు ముందైనను యెన్నుకొని సరియైనతరిఫీయతు నిచ్చి వారిని 'కెమేరా' ముందు నిలుపవలెను. లేదా విద్యావతులైనస్త్రీలను ఎన్నుకొని కొద్ది తరిఫీయతుతో పటములను తీయుటకు బూనుకొనవలెను. దీనివలన ఎక్కువ ధన మొసగవలసిన యవసర ముండవచ్చును. కాని అప్పుడుగాని చక్కనిపటములు బయటపడవు.

చాలసమయములలో నటులను, అందున ముఖ్యముగా నటీమణులను ఫిలిములను తయారుచేయు స్టూడియోస్వంతదారు, లేక పెట్టుబడిదారే యెన్నుకొనును. అతడు ఏమార్వాడీవాడో, ఏగుజరాతీవాడో అయివుండవచ్చును. నటులు ఏ తెలుగువారో, ఏ అరవ

వాంగో అయివుండవచ్చును. కాని నటీమణుల నెన్నుకొనుట ఆతనియిష్టము ననుసరించి, ఆతనియొక్క ఉద్దేశముల ననుసరించి. ఒకానొకపాత్రకు ఆమెన్నుకొనబడిన నటి తగియుండునా, ఆమె మనసులోనున్న ఉద్దేశములను 'భావప్రకటన' తో బహిర్గతము చేయగలదా, (మైక్రోఫోనునకు తగియుండు) కంఠమాధుర్యముగలదా, వస్తుతః ఆమెకు నాట్యకళయందు అభిరుచి గలదా యనువిషయములు ఒకపాత్రకు ఒకనటిని ఎన్నుకొనుటలో ప్రధానాంశములైనను ఫిలింస్వంతదారుని



సీతా ఖోటె

(పవిత్రత)

కివిఅన్నియు పట్టవు. 'ఆమె అందముగ నున్నదా?' యనిదే ప్రశ్నించును ఫిలిందారుడు. 'అందముగా నున్నది' యనుజవాబు వచ్చినమోతల ఎడ్వాన్సుయిచ్చి 'బుక్' చేయుటయే. నాట్యకళయందేమాత్రమును అభిరుచిలేని [illegible] పెద్దమ్మయైనను యిబ్బందిలేదు.

నిజంగా సృష్టిలోని సౌందర్యమందలి ఆపేక్ష, ఆదర్శప్రాయమైన హైందవసౌందర్య ప్రకటనాభిలాష ఫిలింలు తయారుచేయువారు కలిగియుండుట సంతసించవలసిన విషయమే కాని అసలునందున్న పరిస్థితులను బట్టి అసలు ఈచిత్రపటములుతీయువారిలోచాలామందికి 'సౌందర్య'మనగా సరియయిన అభిప్రాయ మున్నట్లు తోచదు. మనము ప్రాపంచికజీవనములో అందముగా జూచు వ్యక్తులు వారి ఛాయలను గ్రహించు 'కెమెరా' దృష్టిలో అందముగా నుందురను నమ్మకము లేదు. అనేక కారణములచేత మనకు కొందరు అందముగా కానబడుదురు. 'కెమెరా'కుమాత్ర మట్లుగాదు. దానికన్న అతి తీక్ష్ణమైనది. ముఖ్యముగా పాత్రధారిణికి ముఖ-కవళిక అవసరము. దానినే cut of the face అంటారు. తరువాత భావప్రకటన కనుగుణంగా (Expressive) వుండాలి. సౌందర్యంలో ఎక్కువగా కృత్రిమమైన దానికంటె స్వభావసిద్ధమైనది వుండుటయవసరము. అందమైననటిని ఎన్నుకొనినతరువాత చూడవలసిన మరొక ముఖ్యవిషయము వున్నది. ఒకనటి అందమైనదే కావచ్చును. కాని తాను నటించు పాత్రయొక్క వాతావరణమును తన రూపముచేతనే ప్రకటించగల ఆకార ముండవలయును. ఒకస్త్రీ అందగత్తెగా నుండి పోకిరీభావమును స్ఫురింపచేయును. మరొకతె అందగత్తెగా నుండి మాతృభావ ముదయింపజేయును. మాతృభావ ముదయింపజేయవలసిన పాత్రకు మొదటియామె పనికిరాదు. అట్లే వగలమారిపాత్రకు రెండవరకపు అందకత్తె పనికిరాదు. చలాకీయైన పాత్రకు చురుకైన అందముండవలె. వినయపూరితమైనపాత్రకు సౌమ్యమైన అందముండవలె. ఒక అందగత్తెను చూచిన ఓరచూపుచూడ బుద్ధి పొడమును. మరొక అందగత్తెనుచూడ నమస్కరించ బుద్ధి పొడమును. పాత్రధారుల నెన్నుకొను (Casting) డైరెక్టరునకు ఈవిషయమున అందములోని ఆ సూక్ష్మ

తారతమ్యము తెలిసియుండవలయును. ఇటువంటి సందర్భములో మన సినిమాపటములను గురించి చూచిన కథలా పౌరాణికగాథలు. అందలి స్త్రీపాత్రలా పరమపతివ్రతామతల్లులు. వేయునదా ఆధునికనవనాగరికతాసంప్రదాయానుకరణవిజ్ఞానమాత్రావశిష్టులైన భోగకాంతలు !! పాత్రధారణమా పౌరాణికముగాక నవీనపద్ధతి. అందువలన మొదలునందే పాత్రపోషణలో విఘాతము కల్గుచున్నది. కథ కాయువుపట్టులోనే యిట్లగుచున్నచో ఇంక చెప్పవలసినదేమున్నది?

ఫిలిం తయారుచేయువానికి తనపటముయొక్క జయాపజయములు తనకథయందుపయోగింపబడు కథానాయిక, తక్కిన స్త్రీపాత్రల సౌందర్యముమీదనే ఆధారపడియుండు నను అభిప్రాయము గలదు. ఈ విషయము కొంతవరకు సత్యమే. అందమైనకథానాయిక జనము నాకర్షించును. కాని ఆమెధరించు పాత్రయొక్క ఔచిత్యమునకు తగినసౌందర్య మామెయొద్ద నుండవలెను. ఈ విధముగా ఫిలిం తయారుచేయువారు చేయు తప్పిదమును, నేను కలకత్తాలోని స్టూడియోలను చూడబోయినపుడు అచ్చటి ఒకసుప్రసిద్ధ ఫిలింవర్తకునితో సంభాషించినపుడు కనుగొంటిని. ఆతనిస్టూడియోలో తయారైనపటము ఒకటి ధనార్జనలో అపజయముపొందినది. దానికి కారణమేమని నే నాతని నడిగితిని. ఆపటమునకు అందమైనస్త్రీలను జతపరచక నటులను ఎన్ను డైరెక్టరు (Casting director) నష్టముదెచ్చినాడని వాదించినాడు. కాని నిజముగా పాత్రలన్నియు ఔచిత్యమునకు తగిన సౌందర్యవతులే ధరించిరి. పటము పాడైపోవుటకు అసలుకారణము డైరెక్టరు తెలివితక్కువగాక మరొకటి కాదు. హైందవపౌరాణికగాథ. పటము తెలుగులో. డైరెక్టుచేసినది కథ సరిగా తెలియక, భాష అసలే తెలియని ఒక కాబూలీసాహెబు. అందువలన సౌందర్యవతులైన స్త్రీలు లేకపోవుటచేతనే పటములు పాడైపోవుచున్నవి అనుకొనుటలో యిటువంటి విశేషములు కొన్ని జరుగుచుండును. ఫిలిమునకు కావలసిన విద్యాసంస్కారము, రూపసంపదగల స్త్రీలు దొరకకపోరు కాని ప్రస్తుత సినిమాపరిశ్రమ యొసగు లాభనష్టములనుబట్టి, స్టూడియోలలోని జీవనమునుబట్టి వారు యెక్కువ ధనమును, హక్కులను కోరుదురు. ఇప్పుడు 'బుక్' చేయబడుచున్నవారిలో యెక్కువమంది అటువంటివి కోరరు. ధర చౌక. అందుబాటులో నుందురు. అందువలన సరియయిన పరిశోధనతో, తగు ధనవ్యయముతో, స్టూడియోజీవన సంస్కరణముతో విద్యాగంధము, రూపసంపద గల్గిన 'సొసైటీ' స్త్రీలు సినిమారంగమున ప్రవేశించి హైందవ సినిమారంగమును ఉత్కృష్టదశకు తేగలరనుటకు సందియము లేదు.



సులోచన

(కామో ద్రేకము)

దీనికి ఫిలింవర్తకులు (Producers) ఒక ఆటంకము చెప్పవచ్చును. ఈవిధముగ యెక్కువ ధనమిచ్చి నటులను, చాలమంది ప్రజలు చూచుట కవకాశముగల హిందీపటములతో జేయవచ్చునుగాని (నిజమునకు వాటియందైనను పరిస్థితులు అధోగతిలోనే వున్నవి) దేశ

# 'సక్కుబాయి' సినిమా చిత్రములు



౧. దాసరి కోటిరత్నం - సక్కుబాయి



౨. చోప్పల్లి సూర్యనారాయణ భాగవతులు - శివయోగి



3. సూరవరపు వెంకటేశ్వర్లు - అత్తగారు

భాషలలో తయారగు తెలుగు, తమిళము మొదలగు టాకీలలో అంతఘనము వెచ్చించితిమేని మాకునష్టము కాదా యని వారనవచ్చును. హిందీపటములలో కొన్నిటికంటె యెక్కువఘనమును సేకరించిన తెలుగుపటము లున్నవి. సరియైన పద్ధతులమీద తయారుచేయబడినవి. అందువలన వ్యాపార విషయకమగు నాఆటంకము చెల్లదు. ఇక కొందరు వర్తకులు అసలు దేశభాషలలోని పటములకు రూపవతులైన స్త్రీలే దొరకరని అందురు. హిందీప్రజలలోమాదిరి రూపసులు, సంస్కారిణులు దక్షిణదేశభాషాప్రజలలో లేరని ఒక ఫిలింవర్తకుడు, కొన్ని తెలుగుతమిళపటములను తయారుచేసినవాడు నాతో ఘంటాపథముగ వాదించగల్గినాడు. దుర్గాబాయిఖోటెవంటినటిని దక్షిణదేశమందు చూపించగలరా యని ప్రశ్నించుటకు సైతము వెనుదీయలేదాతడు. దుర్గాబాయి కిచ్చుపటమునకు రూ. ౨౦౦౦. ఆపైనగూడ యిచ్చుటకు సిద్ధపడియున్నయెడల దుర్గాబాయివంటి నటీమణులు మా దేశమునందు సైతము గలరని నేను చెప్పితిని. ఉదాహరణకు మన తెలుగుసినిమాస్త్రీలలో యింతవరకు రూ. ౨౦౦ లు పైగా పుచ్చుకొనినవారున్నట్లు కనబడదు. రూ. ౨౦౦౦ లు యిచ్చునపుడు ప్రసిద్ధయైన నటి బయటకు రాకుండునా ?

తరువాత: స్టూడియోలలో పనిచేయు నటులు మున్నగువారే, ప్రస్తుతస్టూడియోజీవనము గౌరవసంప్రదాయములకు సంబంధించిన కుటుంబస్త్రీలు వచ్చుటకనువుగ లేదని అభిప్రాయపడుచున్నారు. ఎచ్చటనో ఒక ప్రసిద్ధనటీమణి కిచ్చు ప్రత్యేకసౌకర్యములుగాక మొత్తముమీద సినిమాజీవనమున సంస్కరణ కెంతేని అవకాశము గలదు. అట్లుచేయక ఎన్నిదినములైనను యిదేవిధముగ పరిస్థితులను సాగనిచ్చినయెడల బాగుచేయుటకు వీలులేని స్థితి హైందవసినిమారంగమునకు తప్పక పట్టగలదు.

కాని ఇంతమాత్రముచేత మన హైందవసినిమారంగమున సంస్కారిణులైన సంప్రదాయకుటుంబస్త్రీలు, చదువుకొనిన నటీమణులు, జ్ఞానవంతులైనవారు లేరని నామతము గాదు. అంతకంటె సత్యదూరము వేరొకటియుండదు. తమయొక్క అపారకళోపాసనచే అనన్యకీర్తిని హైందవసినిమారంగమునకు గడించిన నటీమణులలో అటువంటివారు లేకపోలేదు. కాని వారు బహుకొద్దిమందిమాత్రమే. ఫిలింవ్యాపారమందలి వివిధశాఖలలో పనిచేయుచు శ్రీమతి దుర్గాబాయిఖోటే నెరిగినవారనేకులు ఆమెయొక్క గుణములను, ప్రవర్తనను, విద్యాశక్తినిగురించి మిక్కిలి ప్రశంసించియున్నారు. "మనదేశములో సినిమారంగమందున్న స్త్రీలకు ఏమాత్రమైనగౌరవ ముండినయెడల అది దుర్గాబాయివంటి నటీమణికూడ రంగమం దుండుటచేతనే యని చెప్పవచ్చును." అని ఫిలింవ్యాపారమందు షుమారు ఇరువదిసంవత్సరములనుంచి పనిచేయుచున్న ఒకగొప్ప ఉద్యోగి నాకు చెప్పినాడు. అటువంటివా రెంతమంది మనసినిమారంగమునన్నారు ? మనఫిలిములు పాశ్చాత్యఫిలిములతో తులతూగవలెనన్నచో దుర్గాబాయివంటి నటీమణులకొరకు వెదకవలెను.

చదువుకొనిన స్త్రీలు సినిమారంగమున జేరుటకు ఏణాక్షిరామారావుకన్య (ఇప్పుడు శ్రీమతిభవానీపతి) దారిచూపినది. కాని హైందవ సినిమాకళ దురదృష్టవశమున నిప్పు డామె యింతత్వరలోనే రంగమునుంచి విరమించినది, తన కళాప్రతిభను మరగుపరచి. ఆమెతరువాత లాహోరునందలి దేశసేవికయగు శ్యామజుట్షీకన్య సినిమారంగమందు ప్రవేశించినది. కాని వినదగినంతవిషయము ఆమెను గురించి వినవచ్చుటలేదు. అచ్చటచ్చట విద్యావతులైన నటీమణులు సినిమారంగమున ప్రవేశించుట వినుచునే యున్నాము. కాని వారియొక్క కృషి మనకెక్కువగా లభించుటలేదు. అందువలన వారి యభిరుచికి, జీవనమునకు, గౌరవమునకు తగు స్టూడియోజీవన మమరుటలేదా యను సంశయము కల్గుచున్నది. అట్లగునేని వారికి తగినట్లు స్టూడియోజీవనమును మార్చి వారికి అనుకూలవాతావరణమును సమకూర్చవలసిన బాధ్యత స్టూడియోస్వంతదారులవిగ

నాధారపడియున్నది. లేదా వారి కింకను తగు అవకాశములను, సౌకర్యములను యిచ్చి ప్రోత్సహించి వారిని ఆకర్షించవలయును. అప్పుడుగాని మనఫిలిములు గూడ ప్రపంచసినిమారంగమున ఉన్నతస్థానమును బడయజాలవు. ప్రపంచమందలి అన్నితావులను హైందవ ఫిలిములకుగూడ గౌరవము గల్గించిన హిమాంశురాయి, శ్రీమతి దేవికారాణి, బర్వ్యాక్ రాజకుమారి మొదలగు వారికి హైందవులు కృతజ్ఞులు. అట్లనే సులోచన, గోహర్ మున్నగువారుగూడ హైందవ సినిమాకీర్తికి వందనీయులు.

---

# మాయామహత్త్వము

శ్రీ విక్రమదేవ వర్మ

శాస్త్రవిజ్ఞాని-డార్విను జడమునుండి
యెలుక జనియించె నని నమ్మె దృఢముగాను.
జయయుతుండు-ధీరుఁడు-నెపోలియను మూషి
కమును గనినంత నే భీతిఁ గలఁగుచుండె.
పండితప్రవరుఁడు-గేటె పణ్యవీథి
వేఁపిఁ జూచినంతన కడు బెదరుచుండె.
జితవిరోధియౌ మార్లలు షేకు పిల్లిఁ
జూచినంత నె మిక్కిలి స్రుక్కుచుండె.
ఇలఁ బ్రసిద్ధిఁగాంచిన రాణి-యెలిజబెత్తు
చావనెడిమాట వినినంత జడియుచుండె.
కవులలోమేటి-బైరను భువిని ప్రేత
చయము గలదని నమ్ముచు జంకుచుండె.
దివ్యమగువక్త-బ్రాడ్లా సుధీవరుండు
జగదధీశుండు లేఁడని చాటుచుండె.
హింసవలదనుగాంధి దా నియ్యకొనియెఁ
గూల్చుటకు రోగపీడితగోవు నకట!
ప్రమకు మాఱుగా నిటువంటిభ్రమ గలుగుట
మాయయొక్క-మహత్త్వమె మదిఁదలంప.

---

# పార్లమెంటరీ విధానం-డిక్టేటరు షిప్పులు

శ్రీ క. రామగోపాలరావు

ప్రజాస్వామిక ప్రభుత్వపు ముఖ్యస్వరూపమైన పార్లమెంటరీవిధానంలో- స్వతస్సిద్ధంగానై తేనేం, మారిన పరిస్థితులవల్లనై తేనేం- బయలుపడిన లోపాలను కొన్నిటిని మొదటివ్యాసంలో టూకీగా తెలుసుకున్నాం. కాని ఈ నూతనపరిస్థితుల నెదుర్కొనడానికి తగినరీతిని ఈవిధానాన్ని సంస్కరించడానికి ప్రయత్నాలు జరగకపోలేదు. ఉదాహరణలు చూడండి : ఏఐదేళ్లకో ఒకసారి ఎన్నుకోబడే ప్రతినిధుల అభిప్రాయాలు కాలక్రమాన్ని తారసిల్లే నూతనవిషయాల్లో ప్రతిసందర్భంలోనూ ప్రజాభిప్రాయంలో ఏకీభవించకపోవచ్చు ననేది ఒకలోపం అని ఇదివరకు తెలుసుకున్నాం. దీనికి ఉపాయంగా పార్లమెంటులో ప్యాసయి శాసనాలుగా మారడానికి ముందు ప్రతిబిల్లూ దేశంలో ఉన్న ప్రజలందరియందు ఓటుకి పెట్టవచ్చు (obligatory Referendum), లేదా కొంతమంది-ఒకనిర్ణీత సంఖ్యగల-ప్రజలు ఏదైనా ఒకప్రత్యేకవిషయాన్నిగురించిన 'బిల్లు'ని ఈవిధంగా ప్రజానిర్ణయానికి తీసుకురావలసిందిగా పార్లమెంటును కోరినమీదట అల్లా చెయ్యొచ్చు (optional Referendum). దీనికి తోడుగా, ప్రజలు తమ అవసరాల్ని తామే సిద్ధింపజేసుకోడానికింకో పద్ధతుంది: ఒకనిర్ణీత సంఖ్యగల ప్రజల తమంతటతామే ఒక బిల్లు తయారుచేసి దేశీయులందరిముందట ఓటుకి పెట్టమని పార్లమెంటుని కోరవచ్చు (Initiation). అల్లా ఓటుకి పెట్టినమీదట ప్రజామోదం పొందితే ఆబిల్లు శాసనమై అమలులోకొస్తుంది. ఈ రెండుపద్ధతులూకూడా 'స్విట్జర్లాండు' దేశంలోనూ, అమెరికారాష్ట్రాలు కొన్నింటిలోనూ ఆచరణలోఉన్నాయి, కాని వీటిని ఇతరదేశాలన్నిటిలో ప్రవేశపెట్టడానికి వీటిలోఉన్న లోపాలే ఆటంకం. బహుజన సంఖ్యగల దేశాలలో ఈవిధంగా ప్రజలందరిముందటా ఓటుకి పెట్టడం కష్టం. చాలా కాలవ్యయం, ధనవ్యయంకూడా అవుతుంది. పోనీ కొన్ని ముఖ్యవిషయాల్లోనైనా అల్లాచెయ్యకూడదా అంటే ఒకప్రత్యేకవిషయం ముఖ్యమా, కాదా అనే సమస్య నిష్పాక్షికంగా నిర్ణయించేదెవరు? అదీగాక ఇతర లోపాలుకూడా ఉన్నాయి: ప్రజలలో- సామాన్యపరిస్థితులలో- ముఖ్యాతికమూడుపాళ్లు రాజకీయవిషయాల్లో శ్రద్ధవహించరు. (ఎలక్షన్లలో నూటికి ఎంతమంది ప్రజలు వివిధదేశాల్లో తమవోటింగు హక్కు ఉపయోగించుకుంటున్నారో సంఖ్యలు గమనిస్తే తెలుస్తుంది. సరాసరిని ఈ సంఖ్య50%అని చెప్పవచ్చు.) అదీగాక ప్రజలందరూ విద్యావంతులై ఒకశాసనం యొక్క మంచిచెడుగులు గ్రహించగలిగినవారై తేనే గాని ఈపద్ధతి నిష్ప్రయోజనం. ఐనా, సాధారణ విషయాలలోతప్ప సైన్యం యుద్ధం ప్రత్యేకపరిశ్రమల అభివృద్ధి విధానాలు మొదలైన క్లిష్టవిషయాలు జనసామాన్యానికి అర్థంకావు. అందుచేత వాటిని గురించి జనసామాన్యం సముచిత నిర్ణయం ఇవ్వలేదు. ఇంకొక లోపం ఏమిటంటే, అమెరికారాష్ట్రాలలోకి మల్లే పార్టీకక్షలు, పార్టీప్రాబల్యం అధికంగాఉంటే ఆయా పార్టీల పలుకుబడి ఇందులోకూడాపనిజేసి తత్ఫలితంగా తేలిన నిర్ణయాలని నిజమైన ప్రజాభిప్రాయాలు కాకుండా చేస్తుంది.

ఇంకొకలోపం తీసుకుందాం: వివిధ ప్రాంతాల నించి ప్రాంతానికొకరుచొప్పున ప్రతినిధుల నెన్నుకోడం (Territorial or single-member Constituencies); దీనికిబదులు 'కొన్ని వేలప్రజల కొకప్రతినిధి' (proportional representation)అనేపద్ధతి వివిధభేదాలతో వివిధదేశాలు అనుకరించాయి. ఇందులో ఒక్కొక్కభేదానికీ ఉన్నప్రత్యేకలోపాలే కాకుండా పార్లమెంటులోకి వచ్చే పార్టీల సంఖ్య ఆచరణ సౌలభ్యానికి మించిపోయింది: మళ్లీ ఒక్కొక్క పార్టీలోనూ పూర్వపక్షంవారూ (Right wing), మితవాదులూ(centre), తీవ్రవాదులూ (Left) అనేకక్షలు.

ఈసందర్భాలలో ఏప్రభుత్వమైనా పార్లమెంటులో 'మెజారిటీ' సంపాదించుకోవాలంటే వివిధకక్షులసమ్మేళనం కావాలి. వివిధకక్షుల సమ్మేళనమంటే ఆయా పార్టీనాయకుల ప్రాబల్యం అధికం కావడం. ఏఒక్క పార్టీ అసంతృప్తిపొందినా ఆప్రభుత్వం అంతా కూలిపోవడం సంభవిస్తుంది. అంటే నిర్వాహకవర్గం, లేక మంత్రివర్గం బలహీనమై 'దినంగడిస్తే దీర్ఘాయుష్ష'నే పద్ధతికొస్తుంది. ఫ్రాన్సు దేశం ఇందు కుదాహరణ. ఇల్లాగే తదితరలోపాల విషయంకూడా.

ఈవిధంగా పార్లమెంటరీ విధానంలో ఉన్న లోపాలు సవరించడాని కుద్దేశింపబడిన నూతన సంస్కరణాలలోనే క్రొత్త క్రొత్తలోపాలు గర్భీభూతమై ఉన్నాయి. అందుచేత అసలు ప్రజాస్వామిక ప్రభుత్వ తత్త్వమే మారా లేమో అనే భావం బయలుదేరింది. చిరిగిపోయినప్పుడల్లా క్రొత్తకుట్లు కుట్టుకుంటూ ఈ పార్లమెంటరీ అతుకులకోటు వేసుకోడంకన్నను దాన్ని విసర్జించి ఇంకోనూతన పరిధానం తయారు చేసుకోడం మేలుకాదా అని నవీన తత్త్వజ్ఞుల వాదన.

అల్లాఅని ఈనవీనతత్త్వజ్ఞులంతా 'ఇదేమార్గం' అని ఒకటే తరణోపాయం సూచించారా అంటే లేదు. వారిలో అనేకభేదవిభేదా లున్నాయి. కాని, ఆకక్షులన్నింటినీ రెండు ముఖ్యతరగతులుగా విభజించవచ్చును :

(1) తీవ్రవాదులు: కాలక్రమాన్ని, శాంతయుతంగా, మార్పులుచేసుకోడంలో వీరికి నమ్మకంలేదు. ఏదో రూపంగా వీరందరూ పశుబలంమూలాన్నే తమ కార్యసిద్ధి చేసుకునేందుకు వీరిసంకల్పం. ప్రస్తుతప్రభుత్వ విధానం మధ్యతరగతులవారి హస్తగతమై (bougeois) పాటకజనులు బీదతరగతులు- వీరి సౌఖ్యాలు చూడక పోడంచేతా, తదితరకారణాలచేతా పూర్తిగానేలమట్టం చెయ్యబడాలని వీరి ఉద్దేశం. ఇందులో కొందరు అన్నిలోపాలకీమూలకందమైన 'స్వంతఆస్తి'(Capitalism) అనేది లేకుండా చేస్తేనేగాని తరణోపాయం లేదంటారు (Communists). మరికొందరు పరిశ్రమాగారాల్లోనూ అక్కడా కాయకష్టంవల్ల జీవించే పాటకజనులు పనులు మానెయ్యడం (Strike)'ఫాక్టరీ' యంత్రాలు పనిచెయ్యకుండా మరలు పాడుచెయ్యడం (Sabotage) మొదలైన విధానాలచేత దేశమంతటా పరిశ్రమలు స్తంభింపజేసి, ఆప్రాబల్యంవల్ల తామే అధికారం హస్తగతం చేసుకోవాలంటారు (Syhdicatists). ఇంకాకొందరు 'మధ్యతరగతులదైతేం, పాటకజనులదైతేం ప్రభుత్వమన్న తర్వాత వ్యక్తిని నిర్బంధించడం తప్పదు. అందుచే ప్రభుత్వవిధానమే అనవసరం: లోకనిందకి జడిసి వ్యక్తులు సరిగ్గానే నడుచుకుంటార'ని వాదిస్తారు (Anarchists).

(2) ఇక రెండవతరగతివారి సంగతి: ఉన్న సాంఘికవిధానాన్ని పూర్తిగా పెల్లగించకుండా అవసరమైనంతవరకు మార్పుచేసి పరిపాలన సాగించడం వీరిపద్ధతి. ప్రస్తుత జర్మనీ, ఇటలీ, టర్కీ మొదలైన దేశాల నియంతల నీతరగతిలో చేర్చవచ్చును. అమెరికా ఇంగ్లండు మొదలైన పార్లమెంటరీ దేశాలలో జరుగుతున్న పరిణామాలుకూడా స్వల్పభేదాలతో ఇందులోకే వస్తాయి.. ఇంతవరకూ ఏదేశంలోనూకూడా పూర్తిగా ఆచరణలో పెట్టబడని శ్రేణికవిధానం (guild Sccialism) కూడా ఈకక్షకే చెందుతుంది. ప్రస్తుతంమల్లే కాకుండా ప్రతివృత్తికీ ప్రాతినిధ్యం ఇచ్చి కేవల రాజకీయ సమస్యలు నిర్ణయించడాని కిప్పటి పార్లమెంటుని నియమించి పరిశ్రమలకీ వృత్తులకీ సంబంధించిన విషయనిర్ణయంకోసం- ఆవిషయాల్లో సంపూర్ణాధికారంతో- ఒక ప్రత్యేక పార్లమెంటు (guild Parliament) ఏర్పరచడమే ఈ విధానంయొక్క ప్రధాన తత్త్వం.

ఈ విధానాలన్నిటినీగూర్చి చర్చించడం మన ప్రస్తుత విషయాని కనావశ్యకం. మనకి కావలిసిన 'డిక్టేటరుషిప్పుల' పూర్వాపరాలు వ్యక్తపరచగలవనే ఉద్దేశ్యంతోనే వీటిని పైనసూచించాను. పూర్వవిధానాన్ని సంస్కరించడానికి బయలుదేరిన వివిధ పద్ధతులలో

ఈ 'డిక్టేటరుషిప్పుల' తత్త్వంకూడా ఒకటని తెలుసుకుంటే విషయం సుబోధకం అవుతుంది.

వివిధ దేశాలలోని డిక్టేటరుషిప్పుల చరిత్రలూ ఇతరవ్యాసాల మూలంగా పాఠకులకు కాని కిదివరకే విదితం. అందుచేత, ఆవిషయమై విపులీకరించడం అనవసరం. ఈ డిక్టేటరుషిప్పులలోని రకాలూ, వాటి తత్త్వం టూకీగా విమర్శిస్తూ, గతవ్యాసాంతమున సూచించబడిన ప్రశ్నలకి సమాధానం ఇయ్యడానికి యత్నిస్తాను.

ఈ సర్వాధికారపదవులు నూతనపరిణామాలా? అంటే 'ఔను' 'కాదు' అనికూడ సమాధానం చెప్పొచ్చు. దేశం అరాజకమైపోయిన పరిస్థితులలో తన సైన్యబలంచేత, ప్రతిభచేత ఒకయోధుడు అధికారం హస్తగతంచేసుకుని నిరంకుశుడుగా పాలించడం లోకచరిత్రలో క్రొత్తవిషయంకాదు. అల్లా లభించి, స్థిరీకృతమైన అధికారాన్ని ప్రజాక్షేమంకోసం సద్వినియోగంచేసినవారూ, స్వలాభపరులై దుర్వినియోగంచేసినవారూ కూడా ఉన్నారల్లాంటి నిరంకుశప్రభువులలో. ప్రజాస్వామిక ప్రభుత్వానికి ప్రాతిపదిక ఐన గ్రీసుదేశం (ముఖ్యంగా 'ఏథెన్సు'), అంతకుపూర్వమే నిరంకుశపాలనకి (Tyrannies) లోనయింది. తరువాత కొంతకాలంపాటు ప్రజాస్వామికప్రభుత్వాన్ని అనుభవించి మళ్లీ రోమక సామ్రాజ్యభాగమై తన స్వేచ్ఛ గోల్పోయింది. అల్లాగే 'రిపబ్లికు'గా ఉన్న రోము పట్టణం 'సీజర్ల' పరిపాలనకాలంలో బహుళవ్యాప్తి చెంది అప్పటికి యెరుకలోఉన్న ప్రపంచాన్నంతా లోబరుచుకున్న సామ్రాజ్యమైంది. ఇల్లాగే 17, 18 వ శతాబ్దాలలో బయలుదేరిన నిరంకుశ ప్రభువులుకూడా (Benevolent despots) తమ తమ ప్రజలక్షేమం తమ తమ రాజ్యాలు పెద్దవిచేసుకోడంలో నిరాటంకంగా సైన్యబలాన్ని ఉపయోగించడం- ఇవే తమవిధులుగా, తమమాట కెదురు లేకుండా పాలించారు. అందుచేత ప్రజాస్వామిక ప్రభుత్వంగల దేశాల్లోగాని అల్ప సంఖ్యాకులైన ధనవంతుల పలుకుబడి ఎక్కువగానో తక్కువగానో చెల్లుతున్న దేశాలలో (Oligarchies) గాని అరాజక పరిస్థితులవల్ల అవసరం ఏర్పడినప్పుడు ఉన్నప్రభువు నిరంకుశుడవడం, లేక, ప్రభుత్వకుటుంబానికి చెందని యోధానుయోధుడెవరైనా తన ప్రతిభాబలంచేత సర్వాధికారికావడం క్రొత్తవిశేషం కాదు. ప్రభుత్వకుటుంబానికి చెందకుండా కేవల ప్రతిభచేత పైకొచ్చినవారికుదాహరణగా 'నెపోలియన్'ని చెప్పవచ్చు.

ఇంకొకవిషయం: ఈడిక్టేటరుషిప్పులలో దేనిలోనూ కూడా పూర్వమున్న పార్లమెంటుని సంపూర్ణంగా తొలగించలేదు. ఎన్నికలఫలితం తమకి వ్యతిరేకంకాకుండా నడిపించినా, పూర్వవిధానాన్ని మార్చి ప్రతిపరిశ్రమకి కొందరు ప్రతినిధులని (డిక్టేటరు ఇదివరకు నిర్ణయించిన లిస్టులోని పేర్లఅంగీకారం సూచించడమే ఈ'ఎన్నిక' ఐనప్పటికీ) 'ఎన్నుకోడా'నికి వీలుచూపించినా, ఇల్లాఏర్పడిన సభకైనా సలహా ఇవ్వడంకంటె ఎక్కువ నిర్ణయాధికారం లేకుండా జేసినా, ఎన్నితికమకలు పెట్టినా, ఎన్నిక పార్లమెంటు- ప్రజాభిప్రాయం అనేభావం పూర్తిగా విసర్జించబడలేదు. 'నేనేదేశం. దేశమే నేనని' 14 వ లూయీ ప్రభువులాగు బహిరంగంగా చాటి ప్రజాభిప్రాయంతో నిమిత్తంలేకుండా పాలిస్తాననడానికే డిక్టేటరూ సాహసించలేదు. 'ఐతే ఇదా ఈడిక్టేటరుషిప్పులలో ఉన్న నూతనాంశం?' అంటే, కొంతవరకు ఔననవచ్చును. కాని, చరిత్రకు తెలిసిన నిరంకుశ ప్రభువులుకూడా తమపూర్వం ఉండే సంస్థలను పూర్తిగా విధ్వంసంచెయ్యలేదు. నామమాత్రంగానైతేనేం ఉంచారు నిజానికి సర్వరోమకసామ్రాజ్యానికీ చక్రవర్తి తానే ఐనా, అల్లా అని కిరీటం ధరించి సింహాసనమెక్కలేదు 'సీజరు'. పేరుకి మాత్రం అతను పూర్వపు 'కాన్సలో'గానే ఉన్నాడని చెప్పవచ్చు. 'సెనేటు' అనే దేశంలోని పెద్దలసభని రద్దుచెయ్యలేదు. అతని వీరకృత్యాలకు మెచ్చి 'సెనేటు' కిరీటం మొసగదలచిందని ఆహ్వానించే కుట్రదారులు తుదకతన్ని హత్యచేసారు. 'నెపోలియన్' కూడ అధికారం అంతా తనహస్తగతమైనా, పేరుకొక సభని

ఏర్పరచాడు. కాని దాన్ని రెండు భాగాలుగా విభజించి, ఒకదానికి విషయాలు చర్చించడమే కాని వాటిమీద ఓటుచెయ్యడానికి అధికారం లేకుండానూ, రెండవదానికి విషయాలమీద 'ఓటు' చెయ్యడమేగాని చర్చించడాని కధికారం లేకుండానూ చేసి, అంత్య నిర్ణయాధికారం తనచేతుల్లోనే పెట్టుకున్నాడు. ఇల్లాగే, ఇతర నిరంకుశ ప్రభువుల విషయంకూడాను. అందుచేత 'పార్లమెంటరీ రూపం' మాత్రం ఉంచి పరిపాలించడంలో కూడా ఆధునిక 'డిక్టేటరుషిప్పులు' నూతన పరిణామాలు కావని తోస్తుంది.

వివిధ దేశాలనీ అల్లకల్లోలంచేసి, ఇటువంటి 'సర్వాధికార' పదవులవసరం చేసిన పరిస్థితులు పూర్వపు 'నిరంకుశ' పాలకుల విషయంలో మల్లే రాజకీయసంబంధమైనవి కావు. ఆర్థికసమస్యల పర్యవసానాలని ఈడిక్టేటరుషిప్పుల నూతనత్వం ప్రతిపాదింపవచ్చు. యుద్ధ సమయాల్లో తాత్కాలింగా యుద్ధమంత్రి పరిషత్తుల (War cabinets) సర్వాధికారం ఏర్పడి, వ్యక్తి స్వాతంత్ర్యం అరికట్టబడడం 'పార్లమెంటరీ' దేశాల్లో కూడా అనుమాయితే అన్నవిషయం క్రిందటి వ్యాసంలో సూచించాను. అందుచేత ఆర్థికసంబంధమైన చిక్కుల మూలాన్ని బయలుదేరడమే ఈ డిక్టేటరుషిప్పులలోని క్రొత్తతనం అనడం సహజంగా కనిపిస్తుంది. కాని ఆర్థికం, రాజకీయం అని పరిస్థితులను విభజించడం దుర్లభం. ఒకటి రెండు ఉదాహరణలు చూద్దాం! రోమను రిపబ్లికు తుదిరోజులలో జయింపబడిన క్రొత్తరాజ్యాలు (Provinces) పరిపాలించడానికి నియమింపబడిన సేనానాయకులు, ఆయాదేశాలలోని ప్రజలని పీడించి వసూలు చేసినధనం, తమ పదవులు నిలబెట్టుకునే నిమిత్తం రోముపట్టణప్రజల 'ఓట్లు' సంపాదించడం కోసం, జనసామాన్యం ఆనందం కోసం దున్నల పోట్లాటలనీ, మనిషీ - సింహం పోట్లాటలనీ వినోదాలు కల్పించడంకోసం విరజిమ్మేవారు. ఈవిధంగా నీతి బాహ్యమై పోవడంచేతనే 'రిపబ్లికు' సీజర్ల కాలంలో అంతమై నిరంకుశుడైన చక్రవర్తి పరిపాలనక్రింద సామ్రాజ్యంగా ఏర్పడింది. దీనికి కారణం ఆర్థికమా, రాజకీయమా? అల్లాగే పరాసువిప్లవ విషయం కూడా. ఇచ్చుకోగలిగిన జమీందారులు, మఠాధికారులు పన్ను లియ్యనక్కరలేని అదృష్టవంతులై (Privileged classes), ఇచ్చుకోలేని బీదజనులమీదే పన్నుల భారమంతా పడడం, జమీందారుల హద్దుమీరిన స్వేచ్ఛావృత్తి ప్రజలకడుపులు కాలుస్తున్నా రాజు వారిని సంస్కరించలేకపోడం, 'రూసో' 'వోల్టేర్' 'డిఅలంబర్టు' మొదలైన విజ్ఞానవంతులు తమతమ వ్రాతలద్వారా ప్రజల నికృష్టస్థితికి కారణమైన సంస్థల లోపాలు వెలిబుచ్చి స్వేచ్ఛాసిద్ధాంత తత్త్వం బోధచెయ్యడం మొదలైన కారణాలవల్లనే పరాసువిప్లవం ఏర్పడింది. ఆవిప్లవంలోని అరాజకంలోంచే నెపోలియన్ సర్వాధికారం రూపుదాల్చింది. ఈపరిణామానికి కారణం రాజకీయమా, ఆర్థికమా? ఇదమిత్థమని నిర్ణయించి చెప్పడానికి వీలులేదు.

ఈవిమర్శనవల్ల మనకి రెండు ముఖ్యవిషయాలు తెలుస్తున్నాయి. ఒకటి, ఈడిక్టేటరుషిప్పులు కేవల నూతన పరిణామాలు కావని. రెండు చారిత్రకదృష్టిలో విచారిస్తే ఈ డిక్టేటరుషిప్పుల తత్త్వం ఎటువంటిదో కూడా కొంతవరకు బోధపడింది.

ఇంక, ఈడిక్టేటరుషిప్పుల తత్త్వాన్నిగురించిన విషయాలు తెలుసుకోవాలంటే వాటిలో ఉన్నరకాలు ఏదేశంలో ఏవిధంగా వ్యక్తమౌతున్నదీ గమనించాలి; ఏరకంక్రింద పరిపాలన ఎల్లాఉన్నదో, ఏవిధానం ఎంతవరకు ప్రజాభిప్రాయానికి బాధ్యతని అంగీకరిస్తున్నదో అన్నవిషయాలు కూడా అప్పుడే తెల్లమౌతాయి.

ఆర్థికదుస్థితివల్ల ఏర్పడిన క్లిష్టసమస్యల్ని పార్లమెంటరీ విధానం - ఇదివరకున్న స్వరూపంతో - ఎదుర్కొనజాలదని పూర్వ వ్యాసంలో తెలుసుకున్నాం. అటువంటి సమస్యల్ని ఎదుర్కోవాలంటే 'ఎవరికివారే యమునాతీరే'గా ఊరుకోడం, ఒకరు ఔనన్నది ఇంకొకరు కాదనడంచేత కాలయాపన, వస్తువుకి మొత్తంమీద ఉన్న చెల్లుబడికీ, మొత్తంమీద అయే ఉత్పత్తికీ సంబంధం లేకుండా పోవడంచేత దేశమొత్తం

మీద కలిగేనష్టం - ఇవన్నీ కూడా అరికట్టబడాలి. వివిధవ్యక్తులకీ, వివిధ ప్రాంతాలకీ, వివిధ పరిశ్రమలకీ ఒకవ్యక్తితో ఇంకొక వ్యక్తికి, ఒక ప్రాంతంతో ఇంకొకప్రాంతానికి, ఒకపరిశ్రమతో ఇంకొకపరిశ్రమకి ఉన్న అవినాభావసంబంధం, ఐక్యత, వ్యక్తీకరించబడాలి. అంటే యీ బహుత్వంలోవున్న ఏకత్వం ప్రస్ఫుటంకావాలి. ఇందుకు ఆర్థికంగా దేశం మొత్తానికంతా వర్తించే 'ప్లాను' రాజకీయంగా వివిధ శక్తులనీ ఏకతోముఖంగా ప్రవహింప జేయగలందుకై అధికార కేంద్రీకరణం, 'డిక్టేటరుషిప్పు' ఇవిరెండూ అవసరం. ఒక్క చిన్న ఉదాహరణ చూస్తే ఈఅధికార కేంద్రీకరణానికీ 'ప్లాను'కీ ఉన్నసంబంధం గోచరిస్తుంది.

పదిమంది కిటికీలు, ఇంకొకపదిమంది తలుపులు, వేరొకపదిమంది ద్వారబంధాలు ఇల్లాగే ఇంటికి కావలసిన వస్తువులన్నీ తలోపదిమందీ చేస్తున్నారనుకుందాం. కాని తలుపులుచేసేవారితో ద్వారబంధాలు చేసేవారికి గాని, వీరిద్దరితో గోడలుకట్టేవారికి గాని, ఈవిధంగా ఒకపనిచేసేవారితో ఇంకొకపనిచేసేవారికి ఎటువంటి సంబంధం లేదనుకోండి. ఫలితం ఏమవుతుంది? ఇల్లు తయారవుతుందే అనుకుందాం. అల్లా తయారైన గృహం ఎల్లావుంటుందో వేరే చెప్పనక్కరలేదు. 20 ద్వారబంధాలుంటే పదమూడుతలుపులే ఉంటాయి. తాపీమేస్త్రీ పెట్టిన గోడలలో కిటికీలకోసం విడిచిపెట్టబడిన స్థలానికీ, అసలు తయారైన కిటికీలకీ పొత్తుకుదరదు; గోడలకీ పైకప్పుకీ సంబంధం ఉండదు!

ఇక్కడ లోపంఏమిటి? ఒకపనిచేసినవారికీ, ఇంకొక పనిచేసినవారికీ సంబంధం లేకపోవడమే-అంగీకారం లేకపోవడమే. ఇదిరెండువిధాలుగా ఉండవచ్చు. 1 లక్ష్యశూన్యత, అంటే తమతమ పనులవల్ల తయారుకాబోయే ఇల్లు ఎటువంటిదో ఈవివిధ తరగతుల పనివారికీ అసలు తెలియకేపోవచ్చు. 2. లక్ష్యభేదం లేక ఏకలక్ష్యశూన్యత. అంటే, తయారయే ఇల్లు ఎటువంటిదో ప్రతితరగతి పనివారికీ ఊహఉంది. కాని, ఒక తరగతివారనుకున్నదానికీ, ఇంకొకతరగతివారనుకున్నదానికీ సంబంధంలేదు. ఇల్లు ఈవిధంగా ఉంటుంది కదా అని తన అభిప్రాయంప్రకారం తాపీమేస్త్రీ గోడలుకట్టాడు. ఈవిధంగా ఉంటుందికదా అని తమ అభిప్రాయం ప్రకారం ఇంకోజట్టువారు ద్వారబంధాలు చేసారు. ఇల్లాగే ఇతరతరగతులుకూడా తమతమ అభిప్రాయాలకి సరిపోయేటట్టు తమతమ వస్తువులు తయారుచేసారు. ఒకరి అభిప్రాయాన్ని బట్టి ఇంకొకరు తమ అభిప్రాయం దిద్దుకోడానికి వివిధతరగతులనీ సమీకరణంచెయ్యగలిగేశక్తి లోపించింది. కాబట్టి లక్ష్యశూన్యత వల్లనైతేం, లక్ష్యభేదం వల్లనైతేం మొత్తంమీద సిద్ధించిన ఫలితంమాత్రం అసంతృప్తికరంగా ఉందని వ్యక్తమౌతోంది. అందుచేత ఇల్లు సరియైనది తయారవాలంటే లక్ష్యం ఒకటికావడమే (ప్లాను ఉండడమే) కాకుండా, ఆలక్ష్యాని కనుగుణంగా వివిధతరగతుల కార్యక్రమాన్ని దిద్ది తీర్చగలిగిన ఒక సమీకరణశక్తి, లేక కేంద్రాధికారికూడా అవసరమని సుస్పష్టమౌతోంది. దేశమొత్తానికీ ఉదాహరణ సరిపెట్టి చూస్తే, అటువంటి ఏకలక్ష్యమే 'ప్లానింగు' యొక్క ముఖ్యోద్దేశం. సర్వతోముఖమైన దేశీయశక్తులనీ, పరిశ్రమలనీ, సమస్యలనీ ఆలక్ష్యాని కనుగుణంగా విమర్శిస్తూ నడిపించగలిగిన కేంద్రనిర్వాహకుడే డిక్టేటరు.

డిక్టేటరనగానే మనకి ముస్సోలినీ, హిట్లర్, కెమల్ పాషా-వీరి పేర్లే జ్ఞాపకంవస్తాయి. కాని ఇటలీ, జర్మనీ, టర్కీ దేశాలు మాత్రమే డిక్టేటరుషిప్పులక్రింద ఉన్నాయని ఎంచడం పొరబాటు. ప్రజాప్రతినిధులైన శాసనసభ్యుల అభిప్రాయానికి వ్యతిరేకంగా నిర్వాహక వర్గం ఒక్కక్షణమైనా నిలవలేకపోడమే పార్లమెంటరీ విధానానికి ఆయువుపట్టనదగిన సిద్ధాంతం. ఒకవేళ అమెరికాలోలాగు నిలిచినా, తమ అభిప్రాయం శాసనరూపంగా అమలులోకి రాకపోడంచేత నిర్వాహక వర్గం (Executive) కంటె ప్రజాప్రతినిధి వర్గమే (Representative assembly) ప్రాముఖ్యత వహించి బాధ్యత చేకూరుస్తుంది. ఈవిధంగా ప్రజాప్రతినిధివర్గం యొక్క అభిప్రాయాలతో నిమిత్తంలేకుండా నిర్వాహకవర్గం (ఏకసంఖ్యాకమైనా స్వల్పసంఖ్యాకమైనా)

తన ఉద్దేశాల్ని అమలులో పెట్టగలిగిన ప్రతిదేశంలోనూ కూడా ఏదోరూపంగా, ఏదోపేరుతో డిక్టేటరుషిప్పు ఉందని గ్రహించాలి. అల్లా అమలులో పెట్టగలిగిన కాలం ఐదేళ్లు కావచ్చు, పదేళ్లుకావచ్చు, కాలనియమమే లేకపోవచ్చు. అందు కుపయోగించే విధానాల్లో తరతమభేదాలుండవచ్చు. ఆనిర్వాహకవర్గం కేవల పశుబలంమీదే ఆధారపడి ఉండవచ్చు, లేక తనకి సహ్యమనీ అవసరమనీ తోచినంతవరకు ప్రజాభిప్రాయాన్ని కూడా 'సలహా' చెయ్యవచ్చు. కాని అటువంటి నిర్వాహకవర్గం ఉన్నంతసరకు ఆదేశం 'డిక్టేటరుషిప్పు' క్రిందే ఉందని చెప్పాలి.

ఈ విషయాలు జ్ఞప్తియం దుంచుకుని పైన సూచించిన తరతమభేదాలనిబట్టి ప్రస్తుతం వివిధదేశాల్లోనూ ఏర్పడివున్న ఈసర్వాధికారపదవుల తత్త్వం విచారిద్దాం.

లక్షణభేదాల్ని బట్టి ఆధునిక 'డిక్టేటరుషిప్పు'లను మూడు ముఖ్యతరగతులుగా విభజించి యోచించవచ్చును.

(౧) పూర్వమున్న పార్లమెంటరీ విధానాన్ని కొంతవరకు మార్చినా, ప్రజాభిప్రాయాన్ని త్రోసిపుచ్చకుండా, ప్రజాప్రతినిధులసహాయంతోటే నిర్వాహకవర్గం పనిచేసే దేశాలు. ఇవి తాత్కాలికాలు మాత్రమేననే అభిప్రాయంతోటి దేశపరిస్థితులు బాగు చెయ్యడానికి వీటి ఆవశ్యకత గ్రహించినజనసామాన్యం ఈసర్వాధికారానికి ఒకవిధంగా అంగీకరించడమే వీటి ముఖ్యలక్షణం. ఇంగ్లండులో ఏర్పడిన జాతీయప్రభుత్వాని కర్థం ఇదే. దేశాన్ని ఎదుర్కొన్న ఆర్థిక సమస్యలు సకాలంలో పరిష్కరించాలంటే 'పార్టీ'పొరపులు లేకుండా ఏకలక్ష్యంతో, ఏకతోముఖమైన కార్యదీక్షతో నిరాటంకంగా పనిచెయ్యగల నిర్వాహకవర్గం అత్యావశ్యకం అని ఆంగ్లేయప్రజలు గ్రహించారన్నమాట వారిపార్టీల సమ్మేళనం ద్వారా. ఒక ఐదేళ్లపాటు తమ కార్యక్రమాన్ని ఎట్టి ఆటంకం లేకుండా సాగించి నిరుద్యోగం, వర్తకమాంద్యం, పరిశ్రమలు వెనకబడడం, ఇతరదేశాలపోటీ, దేశంలోని పనివాళ్ల జీతాలు మొదలైన దేశీయసమస్యల నెదుర్కొనడానికి నిర్వాహకవర్గానికి అపూర్వావకాశం కలిగించారన్నమాట.

ఆర్థికపరిస్థితులవల్ల దేశాన్ని ఎదుర్కొన్న క్లిష్టసమస్యాపరిష్కార మనే ఏకలక్ష్యంతో ఈ జాతీయ ప్రభుత్వం చేసిన కార్యాలన్నీ విపులంగా తెలుసుకోడం ఇక్కడ అసంభవం అయినా, టూకీగా పేర్కొంటాను. దేశీయనాణెమైన పౌండును బంగారుప్రమాణాన్నుండి తొలగించి, అంటే అంతర్జాతీయ మారకపు పరిస్థితులతో దానికుండే సంబంధాన్ని విడగొట్టి దేశీయావసరాల కనుగుణంగా పౌండువిలువ మార్చుకోడానికి స్వతంత్రత సంపాదించింది. అందువల్ల ఆవిలువని తగ్గించి (అంటే దేశంలోని ధరలు పెంచి) పరిశ్రమల్ని ప్రోత్సహించడానికి సావకాశం ఏర్పరచింది; తదనుగుణంగా సాధ్యమైన తక్కువ వడ్డీరేట్లవల్ల పరిశ్రమలూ, నిరుద్యోగం,వర్తకవ్యాపారాలు చాలవరకు లాభంపొందగలిగాయని గత డిశంబరు 22 వ తారీకున బ్రిటిషుఆర్థిక నీతిని వ్యక్తపరుస్తూ ఆర్థికశాఖాధ్యక్షుడైన చాంబర్లేను గారు వాక్రుచ్చారు. ఇదివరకు ఎక్కువ వడ్డీలమీద తీసుకున్న జాతీయఋణాలు ఈవిధంగా తక్కువవడ్డీకి మార్చడం (Conversion) వల్ల మొత్తం మీద ఏడాదికి 37 మిలియనుపౌన్లు ఆదాయమైందనీ, లండనువడ్డీరేటు తగ్గడంవల్ల ఆస్ట్రేలియామొదలైన వలసరాజ్యాలుకూడా తమతమ జాతీయఋణాలవిషయంలో లాభం పొందాయనీ, 'బ్యాంకరుల పరిశ్రమాభివృద్ధి కంపెనీ' (Bankers' Industries Improvement Co.) 'ఇండస్ట్రీస్ లిమిటెడ్' అనేపేర్లతో తక్కువ రేట్లమీద అప్పు లివ్వడాని కేర్పడిన ఈరెండు ముఖ్యసంస్థలనుండా బ్రిటిషు పరిశ్రమలు చాలాసహాయం పొందాయనీ, స్వల్పవడ్డీలకి లభించిన ధనంతో స్థానిక సంస్థలు నిర్వహించిన నూతనగృహనిర్మాణాది కార్యక్రమంవల్ల నిరుద్యోగుల సంఖ్య తగ్గింపబడిందనీ— ఈవిధంగా జాతీయప్రభుత్వంవల్ల కలిగిన అభ్యుదయ ఫలితాలుకూడా విపులీకరించాడు చాంబర్లేను మంత్రి.

అల్లాగే అమెరికాదేశం విషయంకూడా. కాని, అమెరికారాజ్యాంగంలో బ్రిటనులోలేని నూతనాంశం ఒకటుంది—శాసనసభ్యులవలెనే ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రెసిడెంటు తనయిష్టంవచ్చిన వారితో నిర్వాహకవర్గం ఏర్పరచవచ్చు. అతను కోరినవిషయం శాసనం చెయ్యడానికి శాసనసభ నిరాకరించినా అతను తనపదవికి రాజీనామా యివ్వనక్కరలేకుండా, తన నియమిత కాలం నాలుగేళ్లపాటూ పదవిలో ఉండవచ్చు. నిర్వాహకవర్గం నిరంకుశం అయిపోతుందేమోననే భయంచేత (శాసనంచేసేవారూ దాని నమలులో పెట్టేవారూ వేరుగా ఉంచబడకపోతే తాము చెయ్యదలచిన పనల్లా శాసనంచేసేసి నిర్వాహకవర్గం నిరంకుశమౌతుందనే సిద్ధాంతానుసరణంగా) మొట్టమొదటి రాజకీయప్రణాళికానిర్మాతలీ కట్టుబాటు చేశారు. కాని, దేశంలో ఉన్న 'రిపబ్లికన్' 'డిమోక్రటిక్' అనే రెండుపార్టీలలో ప్రెసిడెంటు ఒకపార్టీవాడై, శాసనసభ్యులింకొకపార్టీవారైతే, అతను కోరింది వారు శాసనంచెయ్యక, వారు శాసనంచేసింది అతను సరిగ్గా అమలులోపెట్టక, కార్యకరణంలో తికమకలేర్పడ్డం సంభవిస్తాయి. కాని, ప్రస్తుతం రూజువెల్టు సభాపతీ, శాసనసభాకూడ 'డిమోక్రటిక్' పార్టీకే చెందడంచేత ప్రజల తిరుగుబాటు తప్ప వేరు ఆటంకం లేకుండా రూజువెల్టు తనకార్యక్రమాన్ని కొనసాగించడానికి వీలేర్పడింది. అందుచేత తనపదవికాలం నాలుగేళ్లూ పరిసమాప్తి అయ్యేవరకూ ఆతని అభిప్రాయం నిరంకుశంగా చెల్లుతుందన్నమాట.

పారిశ్రామికమాంద్యం, నిరుద్యోగం మొదలైన ఆర్థికసమస్యాపరిష్కారమే అమెరికాలోకూడా లక్ష్యం. అందుకోసమై ఆచరణలో పెట్టబడుతున్న కార్యక్రమమే జాతీయాభ్యుదయ శాసనం (National Recovery Act), వ్యవసాయదారుల అభివృద్ధికొరకు శాసనాలు (Farm Acts), బ్యాంకింగుపద్ధతులు సవరించడానికి శాసనాలు (Banking Acts) మొదలైన చట్టాలుగా రూపుదాల్చింది. ఈకార్యక్రమాన్ని అవిచ్ఛిన్నంగా కొనసాగించే నిర్వాహకవర్గమే తనసలహా సంఘం (Brain Trust) తో కూడిన రూజువెల్టు సభాపతి.

ఈయనకి పూర్వం అమెరికా ప్రెసిడెంటయిన హూవరు వ్యక్తివాదంలోవాడు (Individualist); అంటే, ఏవ్యక్తి మంచిచెడ్డలు ఆవ్యక్తే చూసుకోవాలిగాని ప్రభుత్వం జోక్యం కలుగజేసుకోకూడదని యీ సిద్ధాంతం. దానిప్రకారం సంఘమనేది ఎవరిపురోభివృద్ధికోసం వారే తమ శక్తివంచనలేకుండా ప్రయత్నించుకునే వ్యక్తుల కూటమి అయిన రణస్థలి. అంతేగాని, ఒక ఉత్కృష్ట లక్ష్యానుసారంగా తల్లక్ష్యసాధనకార్యక్రమంలోని వివిధ భాగాలుగా వివిధ వ్యక్తులు తమజీవితక్రమాల్ని అనుశాసించుకునే సహజ సంపూర్ణస్వరూపం (Harmonious whole) కాదు. ఈవ్యక్తులపోరాటంలో శక్తి ఉన్నవాళ్లు నిలుస్తారు; లేనివారు రాలిపోతారు. అల్లాంటి శక్తిమంతులే ఉత్తములు (The fittest are the best) అనే దురభిప్రాయంతో ఈసిద్ధాంతం సంఘంలోని ఆంతరంగికైక్యాన్ని గ్రహించలేకపోయింది. అటువంటి సిద్ధాంతానికి చెందినవాడవటంచేత, పనివాడికి ఎంతకూలి దొరుకుతున్నదీ, అసలు పని ఉన్నదీ లేనిదీ, ఇటువంటివి వ్యక్తి తనశక్త్యనుసారం నిర్ణయించుకునే విషయాలేగాని ప్రభుత్వం జోక్యం కలుగజేసుకోకూడదనే ఉద్దేశ్యంతో నిరుద్యోగ సమస్యాపరిష్కారం కల్పించుకోలేదు. అయినా అప్పటికా సమస్య ఇంత తీవ్రరూపంకూడా దాల్చలేదు. వర్తకమాంద్యంవల్ల నిరుద్యోగం అధికమై, పరిశ్రమల సరుకులికి చెల్లుబడిలేక పరిస్థితులు క్లిష్టతరమైన సందర్భంలో అనూనధైర్యోత్సాహాలతో పనికి పూనుకున్నాడు. నూతన సభాపతి రూజువెల్టు. అతనికార్యక్రమం అమలులోకొచ్చి అమెరికా అంగీకరిస్తోందంటే, పైన వివరించిన వ్యక్తివాదం వెనకబడి సమిష్టివాదం- సాంఘికవాదం- అమెరికాలోకూడా అవసరంగా పరిగ్రహించబడిందన్నమాట.

రూజువెల్టు సభాపతి కార్యక్రమం ఎటువంటిది? బ్యాంకింగుశాసనాలవల్ల అవకతవక బ్యాంకులు

(Mushroom banks) ముందువెనుకలు చూసుకోకుండా అప్పులిచ్చి దివాలాలుతీసి, ప్రజల విశ్వాసాన్ని భంగంచేసి యితరబ్యాంకులకికూడా అపాయ మాపాదించకుండా కట్టుదిట్టాలు చెయ్యడానికి యత్నించాడు. ప్రతిపరిశ్రమనీ ఒకకార్యక్రమం ప్రకారం (Ccdes) అనుశాసించి "ఎక్కువకూలి, తక్కువగంటలపని" అనే సిద్ధాంతం అనుసరించడంవల్ల క్రొత్తవారికి పని కల్పించకలిగి నిరుద్యోగసమస్య నెదుర్కొన్నాడు. వ్యవసాయదారులకి కూడా తన వివిధశాసనాలవల్ల సహాయం కల్పించాడు; డాలరు నాణెపు విలువ తగ్గించడం వల్ల ధరలుపెంచి దేశంలోని పరిశ్రమలకీ ఇతరదేశాల నాణెములకంటె డాలరు విలువ తగ్గించడంవల్ల (Devaluation) అమెరికాయొక్క దేశాంతరవర్తక వ్యాపారాలకీ సదుపాయం కల్పించాడు. వేలకొద్దియకరాలభూమిని అడవిగామార్చి వర్షాధారవిధానం మార్చడానికి కూడా వెనుకంజవెయ్యలేదు.

కాని, ఇంగ్లండులోగాని, అమెరికాలో గాని ఈనూతన కార్యక్రమం ప్రజ లందరి అంగీకారాన్ని పొందిం దనడానికి వీల్లేదు. అల్లా పొందితే ఇవి సర్వాధికారపదవు లనిపించవేమోకూడ. విమర్శకులు, ఇదంతా పొరబాటని ఎదురుతిరిగేవారూ ఎక్కడా ఉన్నారు. ఉదాహరణగా అమెరికావిషయం తీసుకుంటే, 'ఎక్కువకూలి, తక్కువగంటలపని' అనే సిద్ధాంతం పాటకజనులకి మేలుచేకూర్చినా, పారిశ్రామికాధిపతులైన పెద్ద పెట్టుబడిదారులకి తాత్కాలిక నష్టమాపాదించడంచేత వారికక్షకి గురయింది. ఏకారణంచేతనైతేం, ఫోర్డు మోటారు పరిశ్రమకి సంబంధించిన ప్రణాళికమీద సంతకం పెట్టనన్నాడు. సంఘంలోఉన్న జనసామాన్యపు పరిస్థితులు బాగుచెయ్యడాని కుద్దేశింపబడిన ప్రతి విధానంకూడా ఆ సంఘంలో ఇదివరకు ప్రత్యేక హక్కులూ, సౌకర్యాలూ అనుభవిస్తున్న భాగ్యవంతుల ప్రతిఘటన నెదుర్కొనక తప్పదు. వారితో వాదించి నచ్చజెప్పడం కష్టం. వారి అభిప్రాయాలు క్రమంగా మారుకుంటూ కావలసిన అభ్యుదయాన్ని కల్పించేటప్పటికి కొన్నిదశలు గడుస్తాయి. అందుచేత కొంత నిర్బంధం ఉపయోగించాలిసొస్తుంది సకాలంలో పని జరగాలంటే. ఆవిధంగా తాము దేశాభ్యుదయకరాలని తలచిన కార్యక్రమాలని-ప్రతిఘటన లక్ష్యపెట్టకుండా- నిర్బంధపూర్వకంగా అమలులో పెట్టడమనే లక్షణంచేతే పార్లమెంటరీదేశాల ప్రస్తుత పాలనాక్రమంకూడా సర్వాధికారపదవులలోని తరగతికే చెందుతుందని చెప్పవలసి వచ్చింది.

(౨) పూర్వసాంఘికవిధానాన్నే సంపూర్తిగా తుడిచిపెట్టివేసి, నూతనసామ్యవాదతత్త్వాన్ని అమలులో పెట్ట యత్నిస్తున్న రష్యాదేశం ఇంకొక తరగతికిక్టే టరుషిప్పుకి చెందుతుంది. స్వంత ఆస్తి అనేది లేకపోవటం, నిర్ణీతసాంఘికకార్యక్రమంలో ప్రతివ్యక్తీ తనశక్తి ననుసరించి పనిచెయ్యడం, తన అవసరాన్ననుసరించి తత్ఫలితం పంచుకోడం (Work according to ability and pay according to need) ఈ సిద్ధాంతానికి మూలకందాలు. కాని, ఇది ఆశయంమాత్రమే; దాని నమలులోపెట్టడం సుకరమైనకార్యం కాదు. తన పనివల్ల వచ్చే ఫలితం పూర్తిగా తనకే చెందనప్పుడు వ్యక్తి తనశక్తిసామర్థ్యాలను దాచుకోకుండా పనిచెయ్యడానికి ప్రోత్సాహం ఉంటుందా? అదీగాక, ఏవ్యక్తి అవసరాలు ఎటువంటివో, ఎంతవరకు తీర్చదగినవో నిర్ణయించే దెల్లాగ? అనే సందేహా లనేకం బయలుదేరుతాయి.

స్వంతఆస్తిఅనేది ఉండటంవల్లనే సంఘంలో భాగ్యవంతులనీ, బీదలనీ తరగతులేర్పడ్డాయి. డబ్బు అనేది లేనిరోజుల్లో పాడి, పంట, అలంకారాలు మొదలైనవి స్వంతఆస్తిగా ఉన్నప్పటికీ, ఇవి కాలక్రమాన్ని శిథిలమైపోయే వస్తువులవటంచేత తరాలకొద్దీ వాటిని కూడబెట్టుకోటం సాధ్యంకాదు. కాని, నాణెములు కనిపెట్టబడడంతోటే ఈవిధంగా కొనుబడిశక్తిని తరాలపాటు కూడబెట్టుకుని స్వంతఆస్తిగా వ్యక్తులు వంశపారంపర్యంగా అనుభవించడానికి ఎక్కువ వీలుకలిగి, ధనవంతులు, ధనహీనులు అనే భేదం నిత్యం అయిపోయింది. లాస్కీచెప్పినట్లు కొంత ఆర్థికసమత్వం లేనిదే రాజకీయంగా స్వేచ్ఛ అనేది

దుర్లభం. సంఘజీవితం అనేది అందులో అల్పసంఖ్యాకులైన భాగ్యవంతులఅభ్యున్నతికోసమేకాక ప్రతి వ్యక్తియొక్క ఆత్మోన్నతికి సహాయపడవలసిన వ్యవస్థ అవడంచేత భాగ్యవంతుల ప్రాబల్యాన్ని అరికట్టడం అత్యవసరం. అయితే వివిధమానవుల శక్తిసామర్థ్యాలూ, అర్హతలూ సమానంకామకదా. అంటే, లాస్కీ యీవిధంగా సమాధానం యిస్తున్నాడు. జీవితానికి అత్యవసరమైన తిండి, గుడ్డ, తలదాచుకోడానికి గృహం. ఇవి ప్రతివ్యక్తికీ లభ్యం అయేవరకూ అధికసామర్థ్యార్హతలని అధికంగా బహూకరించడం అసంభవం. ఈ జీవితావసరాలైనా లేకపోతే వ్యక్తి సంఘంలో తననిధులు నెరవేర్చలేకపోవడమేకాక, అస లతని మానవత్వమే కొరవడుతుంది. ఈవిధంగా ప్రతివాడి జీవితావసరాలకీ తగినసదుపాయం లభించినతర్వాత మిగిలితేనే అర్హతనిబట్టి ఎక్కువగా బహూకరించడం సాధ్యమవుతుంది. మనసంఘంలో మాత్రం ఒకప్రక్క కూడుగుడ్డలు లేక మలమలమాడేవా రుండగానే, ఇంకొక ప్రక్క సర్వసౌఖ్యాలూ అనుభవిస్తున్న భాగ్యవంతులున్నారు. ఇదిమాత్రం దుర్భరమైన పరిస్థితి. ప్రభుత్వం ధనశక్తిని — కేవల ధనాధికారంచేత కలిగే ప్రాబల్యాన్ని — అరికట్టాలి; లేకపోతే, ఆ ధనశక్తి ప్రభుత్వాన్ని అరికడుతుంది.

దీన్నిబట్టి రష్యాదేశం అనుకరింప యత్నిస్తున్న తీవ్రవిధానానికీ, 'స్వంత ఆస్తి' అనే సంస్థని ఉంచినా దాన్ని తగిన అనుజ్ఞలలో ఉంచాలనే మితవాదానికీ ఉన్న తారతమ్యం బోధపడుతుంది.

కొన్నిశతాబ్దాలనుంచి 'ఇదినాది అదినీది' అనే అహంభావానికి అలవాటుపడ్డ మానవస్వభావాన్ని ఒక్కసారిగా మార్చివెయ్యాలంటే మాటలతో జరిగే పనికాదు. తనబాగుకోసమే పనిచెయ్యటం, తత్ఫలితమంతా తనపాలే బడుతుంది అనుభవించడాని కన్న భావాని కలవాటుపడ్డ మానవుడు ఒక్కసారిగా సంఘస్వరూపాన్ని అవగాహనచేసుకుని, సాంఘికాభ్యున్నతికోసం తన శక్తివంచనలేకుండా పనిచెయ్యడమే తన జీవిత పరమావధి అనే నూతనలక్ష్యాన్ని బోధపర్చకోడం కష్టం; అందుచేతనే రష్యాలోకర్షకులు మొట్టమొదటే 'లెనిన్' విధానాని కడ్డుతగిలారు. బలవంతం చెయ్యగా మే మసలు వ్యవసాయమే చెయ్యమని కట్టు కట్టారు. తరువాతతరువాత ఈభూమి నాది, దీని ఫలసాయం నేనే అనుభవించాలి అనే భౌతికసంబంధాన్ని తొలగించడంకోసం ఒకచోటివారి నింకొకచోటికి మార్చి వ్యవసాయం చెయ్యమని కొంతజయం సాధింపజూచాడు 'స్టాలిన్.' ఇల్లా ఒక్క భూమివిషయంలోనే కాక ఇతరవిషయాల్లోకూడా చాలా ప్రతిబంధకాలు కలిగాయి. ఈ అహంభావానికంతా మూలకందం కుటుంబమే కాబట్టి ఆసంస్థనికూడా విచ్ఛిన్నంచేసే ఉద్దేశంతో శిశువులని తలిదండ్రులదగ్గిర ఉండనీక ప్రభుత్వ శిశుసంరక్షణాలయాల్లో నూతన సిద్ధాంతాలననుసరించి పెంచడానికి యత్నిస్తున్నారు. ఈవిధమైన రష్యాకార్యక్రమంలో అనేకమైన పొరబాటు లుండవచ్చు. కాని వారి ఆశయం ఉత్కృష్టమైనదని ఒప్పుకోక తప్పదు. ఆ ఆశయం సిద్ధించడంలో ఉన్న ఆటంకాలు తొలగించడానికి నిస్సంశయంగా నిర్బంధం ఉపయోగిస్తున్నారు రష్యాడిక్టేటరులు. సంఘస్వరూపాన్నించి భిన్నమైన వ్యక్తిస్వరూపమే లేదని వారి అభిప్రాయం.

(3) పూర్వసంస్థల స్వరూపంలో మార్పు లేకుండా, సైన్యబలసమేతుడైన ఒకవ్యక్తి ప్రతిభవల్ల నూతన సమస్యల నెదుర్కోడానికి యత్నిస్తున్న ఇటలీ, జర్మనీ, టర్కీ మొదలైనదేశాలు వేరొకతరగతి డిక్టేటరుషిప్పుకి చెందుతాయి. 'పర్దా' తొలగించి, వేషధారణం మొదలైనవాటిల్లోకూడా పాశ్చాత్యనాగరికత ప్రవేశపెట్టి, తనకి వ్యతిరిక్తులైనవారినల్లా నిర్బంధించి బాధించడానికైనా వెనుదీయకుండా, అపూర్వమైన సాంఘికవిప్లవాన్ని సంఘటింపజేసాడు టర్కీలో కెమల్ పాషా. నిరంకుశమైన తన ఆధిపత్యంక్రిందనే పార్లమెంటరీ విధానం ప్రవేశపెడదామని యోచించగా ఆవిధానసంప్రదాయా న్ననుసరించి ఉండవలసిన ప్రభుత్వప్రతికక్షుల పార్టీ తీసుకోడాని కెవరూ సాహసించలేదుట. అప్పుడు తన కక్షకి చెందిన

వారి నే ఆ పని కూడా చేస్తూండమని నియోగించాలి సొచ్చిందిట! ఈ విధంగా పూర్వసంస్థలలో చాలా మార్పుకలిగినా, రష్యాలో వలె సామ్యవాద సిద్ధాంతం యిక్కడ యేమాత్రం లేదు. అమెరికా యింగ్లండులలో లాగు ప్రజాప్రతినిధుల ప్రాబల్యమూ లేదు. కాని, ఇటలీ జర్మనీలలోవలె సైన్యబలసమన్వితుడైన ఒకవ్యక్తి నిరంకుశత్వం ఇక్కడకూడా ఉండటంచేత టర్కీని పైరెండుతరగతుల్లోనూ కాక ఈ తరగతిలో చేర్చవలసి వచ్చింది.

ఇటలీలో ప్రచారంలో ఉన్న 'ఫాసిస్టు' సిద్ధాంతతత్త్వం 'రోకో', 'బార్నిస్', 'గినీ' ప్రభృతులు వ్యక్తపరచి సమర్థించడానికియత్నించారు. ఆసిద్ధాంతం "వ్యక్తికొరకే సంఘం" అనేదానికి వ్యతిరేకంగా 'సంఘంకొరకే వ్యక్తి' అని ప్రతిపాదిస్తుంది. వ్యక్తికీ, వ్యక్తుల సముదాయానికీ కూడా అతీతమైనది జాతీయసంస్థ. ఆసంస్థ ప్రస్తుతం జీవించియున్న వ్యక్తుల సముదాయమేకాక, భూతభవిష్యద్వర్తమాన తరముల నిరంతర సంవిధానక్రమం. అందుచేత జాతీయజీవిత పథాన్ని నిర్ణయించడానికి ప్రస్తుతం ఉన్న సంఘం అసమర్థం. "జనసామాన్యం తమంతట తామై ఒక ఏకాభిప్రాయానికి రావడానికి అసమర్థులు. తమ తరఫున మాట్లాడగల ప్రతినిధులను సరిగా ఎన్నుకోడానికి మరీ అసమర్థులు. అందువల్ల కేవల భ్రాంతిమూలకమైన 'జనాభిప్రాయ' మనేదానిమీద ఆధారపడడంవల్ల ప్రభుత్వప్రధానసమస్య ఎన్నటికీ పరిష్కారం కాదు. రాజ్యాంగానికి ముందుత్రోవచూపి నడపగల సరియైన వ్యక్తుల నేరుకోడంలోనే ఆ సమస్యా పరిష్కారం ఇమిడి ఉంది." ఇవి మసోలినీ వాక్కులు.

ఈసిద్ధాంతాల నమలులోపెట్టడంలో 'ఫాసిస్టు' పార్టీయే మసోలినీచేతిలోని ముఖ్యసాధనం. పూర్వపు సంస్థలుమాత్రం అల్లాగే ఉంచబడ్డాయి పేరుకి — రాజున్నాడు, రెండుశాసనసభ లున్నాయి, మంత్రివర్గ మంది—కాని వాటికార్యాల్లో, జీవంలో మార్పులు కలిగాయి.

ప్రతి వృత్తికీ ఒక్కొక్క సంఘం ఉంది (Corporation). దేశమొత్తంమీద ఈ సంఘాలన్నీ మొత్తం వెయ్యిమంది ప్రతినిధుల నెన్నుకుంటాయి (ఈఎన్నికలలోకూడా 'ఫాసిస్టు' ప్రాబల్యంమీదే జరుగుతాయని వినికిడి). ఈ వెయ్యిమందిలో నుంచీ ఫాసిస్టుపార్టీచేత—అంటే మసోలినీచేత ౨౦౦ మంది గ్రహించబడతారు. అంటే పెద్దపెద్ద వృత్తిసంఘాల నుండి 'ఫాసిస్టుమహాసభ' (fascist grand council) చేత ౨౦౦ మంది పేర్లు ఏరుకోబడతాయన్నమాట. ఈవిధంగా ఎన్నుకోబడినలిస్టు మొత్తంగా దేశీయులందరి ముందట ఓటుకి పెట్టబడుతుందిట. వారు ఆ లిస్టు తమ కంగీకారమా కాదా అనే సంగతి సూచించవలసిందే తప్ప అందులోని ప్రత్యేకవ్యక్తుల అర్హతానర్హతలు విమర్శించడానికి హక్కులేదు. దీన్లోని సత్యాన్ని మసోలినీ ఈవిధంగా స్పష్టీకరించేసాడు— "ఫాసిస్టుమహాసభ పేర్కొనడంతోటే శాసనసభ్యుని ఎన్నికపూర్తయిందని చెప్పొచ్చు. పూర్వపు మాయ 'ఎలక్షను' విధానాల్లోమల్లే ప్రతినిధుల నెన్నుకోమని కాదు ఓటర్లు కోరబడేది. జాతీయశక్తులనన్నిటినీ తనలో కేంద్రీకరించుకోగలిగిన ఫాసిస్టుమహాసభ చేసిన ఎన్నికను అభినందించమనే వారుకోరబడుతున్నారు. ఈవిధమైన అంగీకారం ప్రత్యేకవ్యక్తులకికాక మొత్తం లిస్టంతకీ చెందుతుంది. ఆ లిస్టులోని వివిధనామాలు ఏదో ఒకరాజకీయాశయాన్ని వ్యక్తీకరించే సూచనలు మాత్రమే (The names are only the expression of a political trend)."

ఈవిధంగా సమావేశపరుపబడ్డ సభ దేశీయపరిశ్రమాది ముఖ్యవిషయాలలో 'సలహా' ఇస్తుంది. కేవలం నిర్వాహకవర్గంచేత (అనగా మసోలినీచేత) నియమించబడ్డ (Nominated) రెండవసభ (Senate) యుద్ధవిషయాలు, సైనికవిషయాలు, ఇతరదేశాలతో సంబంధబాంధవ్యాలు మొదలైనవిషయాలు చర్చిస్తుంది. (కాని 'సెనేటు' ని రద్దుచెయ్యాలని ఈమధ్యనే ఫాసిస్టు మహాసభలో సూచనలు జరుగుతున్నాయిట)

ప్రస్తుతార్థికసమస్యల నెదుర్కొని, అన్ని విధాలా జాతీయాభ్యుదయాన్ని పెంపొందించడమే ఫాసిస్టుడిక్టేటరుషిప్పుయొక్క ఆశయం. అందుకొరకు అనుసరించే కార్యక్రమం, పైన వివరించిన విధానాలూ గమనిస్తే ఫాసిస్టుపద్ధతులకి వ్యతిరేకులైన వారిని బలవంతంగా అణగదొక్కి అయినా, కార్యక్రమం కొనసాగించడాని కీపార్టీ మస్సోలినీ ఆధిపత్యం క్రింద కృతనిశ్చయమైం దని తెలుస్తుంది. వార్తాపత్రికల్ని వశంచేసుకుని, ప్రతికక్షులను నిర్బంధించి, తుదకు ఇతరదేశీయులు బసచేసే హోటలు మేనేజర్లని కూడా బలవంతపెట్టి, ఫాసిస్టుపార్టీ తనకనుకూలంగా ప్రచారం సాగిస్తూ, వ్యతిరేకాభిప్రాయాల్ని అణగద్రొక్కుతోం దని తెలియవస్తోంది.

అనుసరించేది నిర్బంధవిధానమైనా 'ఫాసిస్టు' డిక్టేటరుషిప్పు ఇటలీకేమీ మేలు చేకూర్చలేదని తలంచడం పొరబాటు. దేశాభ్యుదయకరాలైన కార్యాలనేకం చేస్తున్నాడు మస్సోలినీ — రోంపినేలలను సేద్యభూములుగామార్చి, ఇదివరకునుంచి కుప్పనూర్ప కాలంలో పనికోసమై ఇతరదేశాలకి పోవలసినవారికి దేశంలోనే వ్యవసాయవృత్తి కల్పించాడు. అనేకవిధాలుగా పూర్వ రోమకసామ్రాజ్య దినాల్లో ఇటలీఅనుభవించిన ఉచ్చదశని జ్ఞప్తికిదెచ్చి, యువకులలో దేశభక్తిని పురికొల్పుతున్నాడు. పరిశ్రమలకి వీల్లు కల్పించి దేశసౌభాగ్యానికి తోడ్పడుతున్నాడు. ఇతరదేశాలతో క్రొత్తఒడంబడిక చేసుకుని ఇటలీయొక్క అంతర్జాతీయ సభ్యతని ఇనుమడింపజేస్తున్నాడు. దేశీయులలో-పాఠశాలలలో పత్రికలలో — అన్నివిధాలా జాతీయావేశాన్ని పురికొల్పి క్రొత్తసేనలని సమకూరుస్తున్నాడు.

ప్రస్తుతం జర్మనీలో హిట్లరు నాయకత్వంక్రింద ప్రచారంలోఉన్న నాజీపద్ధతి పైన వివరించిన ఫాసిస్టు సిద్ధాంతపు రూపాంతరమని చెప్పవచ్చు. 'వర్సేల్సు' ఒడంబడిక ఫలితంగా విజయులైన దేశాల కక్షవల్ల అన్నివిధాలా పతనంపొందిన జర్మనీదేశ సభ్యతని పునరుద్ధరించడానికే అతని ప్రయత్నం. హిట్లరుపద్ధతులు ఫాసిస్టుపద్ధతులకంటెకూడా తీవ్రతరాలని చెప్పవచ్చు. తన కార్యక్రమానికి భిన్నులని తోచినప్పుడు తనపూర్వ సహాయుల్నికూడా నిర్దాక్షిణ్యంగా తుదముట్టించడానికి సంకోచించలేదు. ఇతరదేశాలన్నీ తమతమ మారణ సాధనా లభివృద్ధిచేసుకుంటున్నప్పుడు ఒక జర్మనీని మాత్రమే పూర్వపు ఒడంబడికకి కట్టిపెట్టి ఆహక్కు నిరాకరించడం అన్యాయమని జాతిసమితికి రాజీనామా యిచ్చాడు జర్మనీతరపున. అనేక సూక్ష్మోపాయాల చేత మారణసామగ్రిని అభివృద్ధిపరుస్తూ ఏఘడియలోనైనా మళ్లీయుద్ధానికి సంసిద్ధంగా చేస్తున్నాడు జర్మనీని. దేశానికి ఆయువుపట్టనదగిన ఆర్థికవ్యవహారాలు ఇతరజాతికి చెందినవారిచేతిలో ఇమిడిఉండడం ఎప్పటికేనా ముప్పమేనని యూదుల్ని బాధపెట్టి దేశాంతరాలు పట్టించాడు.

ఇంతవరకు, వాటివాటి లక్షణాల్నిబట్టే, ప్రధాన సిద్ధాంతాన్నిబట్టే సర్వాధికారపదవుల ముఖ్యతరగతుల్ని విచారించాం. ధనాన్నిబట్టి సంఘంలో ఏర్పడిన బీద, గొప్ప (లేక పాటకజనులు, పెట్టుబడిదార్లు) అనే ప్రధానతరగతులలో ఎవరిప్రాబల్యం ఏయే డిక్టేటరుషిప్పుల క్రింద అధికంగా ఉందనికూడా యోచించవచ్చు. ఈదృష్టిలో విచారిస్తే, ఎంత అరికట్టబడినా అమెరికా ఇంగ్లాండు దేశాల్లో ధనవంతుల ప్రాబల్యమే ఎక్కువని చెప్పవచ్చు. అధికధనవంతులూకాక, ధనహీనులూ కాక సామాన్యకుటుంబీకు లనదగిన మధ్యతరగతుల చేతులలోకే రాజకీయాధికారం సంక్రమిస్తున్నప్పటికీ, బీదలైన పాటకజనుల హస్తగతం యింకా కాలేదు. రష్యాదేశంలో బీదలైన పాటకజనులదే అధికారం అన్నమాట నిజం. కాని, అది సంఘంలోని ఒక్కతరగతి యితరులమీద చెలాయిస్తున్న నిరంకుశత్వమేనని యితర పాశ్చాత్యదేశాలు చేసే విమర్శన మాత్రం సరియైనదికాదు. ఎందుచేతనంటే, శక్తిసామర్థ్యాలున్న ప్రతివాడూ ఏదోవిధంగా కాయకష్టం చేస్తాడు. తత్ఫలితంగా దేశమొత్తంమీద చేకూరిన వృద్ధిని సంఘానికి చెందిన ఒకమెంబరుగా (అవసరాలన

మించకుండా)పంచుకుంటూడు. ఇందువల్ల పెట్టుబడిదారు, 'పాటకజనము' అనేవి వేరువేరువ్యక్తులతో కూడినరెండు చిన్న తరగతులు కావనీ, ఆవ్యక్తులకే చెందిన ద్వివిధ వ్యవస్థలనీ బోధపడుతుంది. ఈవిధంగా తరగతులనేవే లేనప్పుడు ఒకతరగతివారు మాత్రమే యితరతరగతులకి చెందిన జనాన్ని (అంటే భాగ్యవంతుల్ని) అణగద్రొక్కుతున్నారనడం పొరబాటు. మానవు లందరిలోనూ ఉన్న సంపాదనేచ్ఛ (Gregariousness) నే రహస్యాలో అణగద్రొక్క యత్నిస్తుంది. ప్రత్యేకవ్యక్తుల నిర్బంధం ఇందుకు సాధనం మాత్రమే. ఆ ఆశయం సిద్ధించాలంటే తప్పనిసరియైన తాత్కాలి కోపాయం మాత్రమే.

పెట్టుబడిదార్లకీ (Capitalists) పాటకజనులకీ, (Labour) లేక ధనవంతులకీ, ధనహీనులకీ ఉన్న నిరంతరవైమనస్యాన్ని కొంతవరకు అనునయించడానికి ప్రయత్నిస్తున్నాడు ఇటలీలో మసోలినీ. పైన చెప్పిన విధాన్ని వృత్తిసంఘాలకి (Corporations) దేశీయ శాసనసభలో ప్రాతినిధ్యం యివ్వడంలో ప్రతివృత్తి సంఘానికి అధికారులైన పెట్టుబడిదార్లకే కాక పాటకజనులకికూడా ప్రతినిధుల్ని ప్రసాదించాడు. కాని, ఇటలీలో (చాలామట్టుకు జర్మనీ, టర్కీలలో మల్లేనే) యీవృత్తిసంఘాలకీ, ప్రతినిధులకీ, శాసనసభకీ కూడా అతీతమైనది 'ఫాసిస్టుమహాసభ.' మసోలినీ దానినాయకుడు, నియంత. అందుచేత నిజానికి ఇటలీలోని కార్యవిధానాన్నంతా అనుశాసించేది అతని మేధస్సే, అతని ప్రతిభే. ఆవిధంగానే జర్మనీలో హిట్లరు; టర్కీలో ముస్తాఫాకెమాల్.

ఈ డిక్టేటరుషిప్పులు మొత్తంమీద విచారిస్తే పొడకట్టే రెండుమూడు విషయాలు గమనించాలి. పూర్వపు నిరంకుశప్రభువులకిమల్లే ఈ డిక్టేటర్ల విషయంలో వారి సర్వాధికారాన్ని ప్రోత్సహించేది స్వలాభపరాయణత్వంకాదు; ధనసంపాదనేచ్ఛ కాదు; మానవులవడంచేత వారి పదవిని; గౌరవాన్ని కొంతవరకు అనుభవిస్తున్నా కేవలం అధికారవాంఛే వారి కార్యకలాపానికంతా మూలకంద మని చెప్పడానికి వీల్లేదు. హిట్లరుకి పెళ్లి లేదు. దేశానికంతా సర్వాధికారైనా తానొక కమ్మరివానికొడుకు నన్నసంగతి మర్చిపోకుండా సాధారణకుటుంబీకుడిమల్లే నిరాడంబర జీవనం చేస్తున్నాడు మసోలినీ. అమెరికా, ఇంగ్లండు దేశాల్లోనైనా ప్రజాభిప్రాయం ప్రభుత్వ చర్యల్ని నిత్యం విమర్శించగలగడంచేత కేవలం ధనంకోసంగాని, అధికారవాంఛ తీర్చుకోడానికిగాని ఉన్నతపదవు లుపయోగించబడవు.

నిరంతరంగా సాగుతున్న ప్రపంచపరిణామంలో యీసర్వాధికారపదవు లేస్థానం ఆక్రమిస్తాయి? ఇవి తాత్కాలికసమస్యల నెదుర్కొనే తాత్కాలిక విధానాలు మాత్రమేనా? లేక, ఇకముందు దేశీయ జీవితాల్ని అనుశాసించగలిగిన నిత్యసంస్థలా? అనే ప్రశ్నలు మన కిప్పుడు విచారణీయాలు.

గతశతాబ్దాంతంవరకూ కూడా పైనచెప్పబడిన వ్యక్తివాదం అమలులోఉంది. అంటే, ఇతరదేశాలు దండెత్తివచ్చినప్పుడు సంఘాన్ని రక్షించడం, వాళ్లలో వాళ్లు దెబ్బలాడుకోకుండా వ్యక్తుల్ని కాపాడడం మొదలైన పోలీసుపనులు తప్ప తద్ధితరవ్యాపారాల్లో ప్రభుత్వం ఏమాత్రం జోక్యం కలుగజేసుకోకూడదని ప్రతిపాదించబడేది.

మొత్తం సంఘానికంతా శ్రేయోభ్యుదయాలెల్లా చేకూరుతా యనేదే వివాదానికైనా విచారణీయమైన ప్రశ్న. ప్రతివ్యక్తికీ తనబాగు తానుచూసుకుని అందుకోసం ప్రయత్నంచెయ్యడానికి స్వేచ్ఛయిస్తే, తత్ఫలితంగా వ్యక్తులసముదాయమైన సంఘంయొక్క శ్రేయం చేకూరుతుందని వ్యక్తివానుల అభిప్రాయం. ఈవాదంలోని పొరబాటులు ముఖ్యంగా రెండు:

(౧) ప్రతివ్యక్తికీ తనబాగును గ్రహించగల శక్తి ఉండడుకోడం. ఇదే నిజమైతే ప్రపంచ మింత దుఃఖభాజనం అయిఉండదేమో! ఒక్కసాధారణమైన ఉదాహరణ తీసుకుందాం. ఏవిధంగా తమబాగుని, శ్రేయాన్ని అభివృద్ధిపరస్తుందని లక్షలకొద్ది జనులు పెళ్లాంమెడలోని పుస్తెకూడా అమ్ముకుని, తాగుడు

దేవతకి దాసులుకావడం. అదీగాక, సాధారణంగా ప్రతివ్యక్తీ తనకి వెంటనే లభించే లాభాన్నీ సౌఖ్యాన్నీ వీటినే చూసుకుంటాడుగాని, తాను ప్రస్తుతం చేసే పనులవల్ల ముందుముందు కలిగే ఫలితాల్ని సరిగా ఊహించి, గ్రహించి, తదనుగుణంగా తన ప్రస్తుతపు నడవడిని మార్చుకోలేడు. పిల్లలకి చదువుచెప్పించడం అనేది వాళ్లు పెద్దవారైనతర్వాత వారి జ్ఞానాన్ని, సంపాదనశక్తిని కూడా ఇనుమడింపచెయ్యగలిగినా, ప్రస్తుతంమాత్రం అది తల్లిదండ్రులకి వ్యయదాయకమైన ఇబ్బందిగా మాత్రమే కనిపిస్తుంది. అదే పాటకజనుల విషయంలో ఐతే, ఆపిల్లలు ప్రస్తుతం సంపాదించ గలిగిన కూలిడబ్బులు పోవడంచేత మరింతభారమని పిస్తుంది. అందుచేతే ఇంగ్లండు మొదలైన నాగరిక దేశాల్లో పిల్లలకి చదువుచెప్పింప నిరాకరించే తలి దండ్రుల్ని శిక్షించడం, ఉచిత ప్రాథమిక విద్యాసదు పాయం కల్పించడం మొదలైన చట్టాలవల్ల ప్రభుత్వం ఈవిషయంలో కట్టుబాట్లుచేసి కలుగజేసుకోవల సొచ్చింది.

(౨) ఒకవేళ, ప్రతివ్యక్తికి తనబాగును సత్రించ గల జ్ఞానసంస్కారం ఉందనుకున్నా, దాన్ని సాధించ డానికి యత్నించడంలో ప్రతివ్యక్తికీ సమానమైన శక్తి, సదుపాయం ఉంటుందనుకోడం వ్యక్తివాదం లోని రెండోలోపం. ఒకపెద్ద పెట్టుబడిదారునీ, అతని క్రింద కూలికి పనిజేసే ఒకఫ్యాక్టరీ కూలివాణ్ణీ తీసు కుందాం. నెలకి అధమపక్షం రు ౪౦ లు ఉంటేనే గాని సంసారపుఖర్చు ఎత్తిపోయి తనకి శ్రేయం చేకూరదనే సంగతి కూలివాడు గ్రహించగలడను కుందాం. మంచి లాభాలొస్తున్నరోజులవడంచేత తలవనిదంగా చేరనూడితే పెట్టుబడిదారుమాత్రం జీతం ఇవ్వగలడనే సంగతి కూడా కూలివాడికి తెలుసుననుకుందాం. కాని, పెట్టుబడిదారు (ఫ్యాక్టరీ యజమాని) రు ౩౦ ల కంటె ఎక్కువ ఇవ్వ నంటే?—కూలివాడాపని మానుకోడానికి స్వేచ్ఛ ఉన్నమాట నిజమే. కాని, పనిలేకపోతే కడుపుకి లేక మాడవలసిఉండడంచేత ఈస్వేచ్ఛ ఉట్టి బూట కం. ఈకూలివాడు కాకపోతే ఇంకొకడు లభించడం చేతా, ఒకవేళ కూలివాళ్లంతా కట్టుగట్టినా కొంత నష్టం సంభవించడమేతప్ప కడుపుకి లేక మాడవలసిన అవసరం లేకపోవడంచేతా, ఫ్యాక్టరీ యజమానికి మాత్రం అంతయిబ్బంది లేదు. వ్యక్తికి తన బాగు, దాన్ని సాధించేఉపాయం తెలిసినా, శక్తిసామర్థ్యాలూ ధనప్రాబల్యం అందరివ్యక్తులికీ సమానంగా లేకపోటం చేత, ఏవ్యక్తి కావ్యక్తే తన శ్రేయాన్ని సాధించుకోడం అందరివిషయంలోనూ సాధ్యంకాదని స్పష్టమౌతోంది ఈఉదాహరణవల్ల.

ఈవిధంగా వ్యక్తివాదంలో ఉన్నలోపాలు గత శతాబ్దంలో క్రమక్రమంగా బయటపడ్డాయి. పారిశ్రా మిక విప్లవఫలితంగా సాధ్యమైన బహుళోత్పత్తివిధానం (Large scale production) కాలక్రమాన్ని పాశ్చా త్యదేశాలన్నింటికీ వ్యాపించింది. ఫ్యాక్టరీ యజమాన్లు తమలాభాలే తప్ప తమక్రింద పనిజేసే కూలీల బాగో గులు గమనించకపోవడంచేత ఫ్యాక్టరీశాసనాలు మొద లైనవాటివల్ల పాటకజనులకి సంబంధించిన వివిధ విష యాల్లో ప్రభుత్వం కలుగజేసుకోవలసివచ్చింది క్రమేణా. రానురాను సంఘానికి ముఖ్యావసరాలైన పరిశ్రమల విషయంలో ఆయావస్తువుల ఉత్పత్తి నిరాఘాటంగా కొనసాగగలందులకై తగిననిబంధనలు చెయ్యడమో, లేక ప్రభుత్వమే వాటిని నిర్వహించడమో కూడా జరిగింది. అంటే వ్యక్తివాదం క్రమక్రమంగా వెనకబడుతూ వచ్చిందన్నమాట.

ఇది జ్ఞానయుగం. ప్రతివిషయాన్ని మానవుడు తన మేధాశక్తి నుపయోగించి శోధించి సాధించాలే గాని ఏవిషయంలోనూ కూడా ఫలితం అదృష్టానికి వదలిపెట్టకూడదనే యీయుగతత్త్వం. ఆర్థికంగావిచా రిస్తే యీతత్త్వం వ్యక్తివాదానికి వ్యతిరేకమని గోచ రిస్తుంది. ఏవూరికి కావలసిన వస్తువు లావూరిలోనే తయారయే పరిస్థితులు గడిచిపోయి చాలాకాలమైంది. రాకపోకలకి సాధనాలు అభివృద్ధిచెందడంవల్ల ఏ దేశంలో తయారయేవస్తువు లాదేశంలోనే కర్చయే

స్థితిగతులు కూడా గతించి ఆర్థికంగా వివిధదేశాల పరస్పరత్వం (Interdependence) అధిక మయింది. గత శతాబ్దంలో ఈసందర్భంలో ప్రతివస్తువుకీ ప్రపంచం మొత్తంమీద ఉన్న చెల్లుబడి ఉత్పత్తులే గణనీయాంశా లౌతాయి ఆవస్తువ్యాపారంలో. ఈవిధమైన చెల్లుబడి ఉత్పత్తులూ, వాటిలో సంభవించే మార్పులూ తెలుసుకోడం ప్రతిఉత్పత్తిదారుకీ ప్రత్యేకంగా సాధ్యమయే కార్యంకాదు. అల్లా తెలుసుకోగలిగినా, ఆమొత్తపు చెల్లుబడిలో తనపాలబడేభాగం నిర్ణీతం కాకపోడంచేత, ఎవరికివారే తనకి చెల్లుబడి అవుతుందని తోచినంత ఉత్పత్తిచేస్తారు; మొత్తపు చెల్లుబడి కీఅంచనాలు మించిఉండడంచేతనైతేం, లేక ఆచెల్లుబడిలో యీ లోపుగా మార్పులు సంభవించడంచేతనైతేం అనుకున్నంత కర్చుకాకపోవడం, ధరలు పడిపోవడం, నష్టాలు రావడం, కొంతమంది పనివాళ్లు తొలగించబడి నిరుద్యోగసమస్య ఏర్పడడం మొదలైన చిక్కులు తటస్థిస్తాయి. దీనికంతా కారణం, ఒక ఉత్పత్తిదారుకీ ఇంకొక ఉత్పత్తిదారుకీ, ఒకపరిశ్రమకీ ఇంకొక పరిశ్రమకీ, ఒకదేశానికీ ఇంకొకదేశానికీ తమతమ కార్యక్రమాల్లో సంబంధం లేకపోడమే నని వ్యక్తమౌతుంది. అంటే, సమష్టిదృష్టిలేక వ్యక్తిదృష్టి ఉండడమే కారణమని తోస్తుంది. అటువంటి వ్యక్తిదృష్టి ( లేక వ్యక్తివాదం ) వల్ల సంఘజీవితాశయం మానవ మేధస్సు సూచించే సూత్రాలమీద సాధించబడక సాంఘిక జీవితఫలితాలు కేవలం అదృష్టాని కొదిలివెయ్యబడుతున్నా యన్నమాట. ఇందువల్ల కలిగే కష్టనష్టాలు నివారించాలంటే దేశమొత్తంమీద (ముందుముందు వీలైతే ప్రపంచమొత్తంమీదకూడా) ఒక నిర్మాణకార్యక్రమం ఏర్పరచి వివిధపరిశ్రమల, వివిధ ఉత్పత్తిదార్ల, వివిధవ్యక్తుల ఆర్థికజీవితక్రమం తదనుగుణంగా అనుశాసించడమే సాధనమని స్పష్టమౌతోంది. ప్రస్తుతం, రష్యా, అమెరికాదేశాల్లో పూర్తిగానూ, ఇంగ్లండు, ఇటలీ, జర్మనీ మొదలైనదేశాల్లో కొంతవరకూ అనుసరించబడుతున్న ఆర్థికవిధానాలకి (Economic planning) అర్థమిదే. అంటే, సంఘంయొక్క ఆర్థికజీవితాన్ని వ్యక్తుల శక్తిసామర్థ్యాలకీ, ఊహాపోహాలకీ, అంచనాలకీ వదిలిపెట్టి, ఫలితా లేటువంటివైనా కర్మఫలమని అనుభవించకుండా, వివిధ సాంఘికశక్తులనీ ఏకలక్ష్యసిద్ధికోసం ఏకోన్ముఖంగా ప్రవహింపచెయ్యాలంటే ఒకనిర్ణీతకార్యక్రమం అవసరం; ఆకార్యక్రమంలోని వివిధభాగాలనీ తగనరీతిని అనుసంధించి, మొత్తపు కార్యక్రమమంతా నిర్ణీతలక్ష్యమ్మీదే దృష్టిఉంచుకుని నడిపించగల నాయకత్వం అవసరం. ఒకదృష్టిలో విచారిస్తే అటువంటినాయకులే మన ఆధునికడిక్టేటర్లు. అంటే, ఆర్థికతత్త్వంలో కలిగిన మార్పుల రాజకీయప్రతిబింబాలే ఈసర్వాధికార్లు.

ఈజ్ఞానయుగతత్త్వంయొక్క ఆర్థికరూపమే 'ప్లానింగు'. ఆ 'ప్లానింగు' వల్ల అవసరమైన రాజకీయ పరిణామమే 'డిక్టేటరుషిప్పులు'.

కాని, వివిధదేశాలలో బయలుదేరిన సర్వాధికారపదవుల తత్త్వభేదాలు సూక్ష్మదృష్టితో విచారిస్తే ఒకప్రధానభేదం గోచరిస్తుంది. అమెరికా, ఇంగ్లండు దేశాలలోని అధికారకేంద్రీకరణం ప్రస్తుతంసమస్య ఐన ఆర్థికదుస్థితివల్ల సిద్ధించింది. అందుచేత, ఈవర్తకమాంద్యం తొలగడంతోటే పూర్వపు పార్లమెంటరీ విధానమో, లేక ప్రజాస్వామికప్రభుత్వాలన్నింటికంటె బాగా ఆచరణలోకి తీసుకురాగల నూతనవిధానమో అమలులోకొచ్చి, ప్రస్తుతపు 'సర్వాధికారం' తొలగిపోతుందని ఊహించడానికి వీలుంది. కాని, ఇటలీ, టర్కీ, రష్యామొదలైన దేశాల్లోని విషయం వేరుగా కనిపిస్తుంది. ప్రస్తుతార్థికదుస్థితివల్ల కలిగిన కష్టాల్ని తొలగించడం కూడా ఈదేశాల డిక్టేటర్ల కార్యక్రమాలలోని భాగమే. ఐనా ఇది తాత్కాలికాశయం మాత్రమే. జాతీయజీవితాన్ని నూతనపథాలలో నడిపించి, జాతీయప్రతిభనీ, గౌరవాన్నీ అధికం చెయ్యడం వీరిప్రధానాశయం. ఈ ఆశయసిద్ధికి ఆటంకంగా ఉండడంచేత ప్రస్తుతార్థికదుస్థితివల్ల కలిగిన సమస్యల్ని కూడా పరిష్కరించ యత్నిస్తున్నారు. అమెరికాయింగ్లండుదేశాలలోకంటె యీ డిక్టేటర్ల అధికారం ఎక్కువగా వారి సైనికబలంమీద ఆధార



దురిసేటి అప్పారావుగారు (బారిష్టరు)

మదరాసు హైకోర్టు రిజిస్ట్రారుగ నియమింప బడిరి.




డి. ఆనందరావుగారు

మదరాసు వ్యవసాయశాఖ డైరక్టరుగా కొంతి రామమూర్తిగారిస్థానే నియమింపబడిరి.



కే. శే. బాలాజిరావుగారు

అదివరకు ఇండియనుబ్యాంకు కార్యదర్శి; కాలధర్మము నొందిరి,




కీ. శే. ఊ. వెంకటసుబ్బరాయశ్రేష్ఠిగారు

ఆంధ్రదేశగ్రంథాలయోద్యమమునకయి కృషిసల్పినవారు



రాసుటఫారిగారు, అబిసీనియాచక్రవర్తి




లాలుచందు హీరాచందుగారు
(అంతర్జాతీయ వాణిజ్య సంఘ సమితి ఉపాధ్యక్షులు. ప్యారిసులో జరుగు ప్రపంచ వాణిజ్య మహాసభకు వెడలు ప్రతినిధులకు నాయకులు.)




ఎ. కొండప్పగారు
(రిలిజస్ ఎండోమెంటుబోర్డు ప్రెసిడెంటు)




శ్రీయుత డా. ఆచంట లక్ష్మీపతిగారు
(తునిలో జరిగిన ఆంధ్ర ఆయుర్వేద మహాసభ అధ్యక్షులు)

పడిఉన్నదన్నమాట నిజం. అల్లా అని, ప్రజాభిప్రాయం వీరి కసలే అనుకూలంగా లేదనుకోడం పొరబాటు. వీరి ఆశయాలూ, స్వార్థ రాహిత్యం దేశీయులందరూ హర్షిస్తారు. కాని తత్సిద్ధి కుపయోగించబడే మార్గాల్ని గూర్చే విభేదం. తమ సైనికబలంచేత తమకి ఆచరణ యోగ్యాలని తోచిన విధానాలు వీరు అమలులో బెట్ట గలిగినంతకాలం ఈవిధమైన డిక్టేటరుషిప్పులు సాగ వచ్చు. కాని, దేశాభ్యుదయంకోసం చేసిన స్వార్థరహిత సేవవల్ల ప్రజాహృదయాన్ని ఆకర్షించి, శాంతియుత ప్రచారంవల్ల ప్రజాభిప్రాయాన్ని అనుకూలం చేసుకో కుంటే కేవలపశుబలం వల్ల వీరి అధికారం ఎక్కువ కాలం సాగుతుందని తోచదు.

ఈ డిక్టేటరుషిప్పు లెంతవరకు శాశ్వతాలనే ప్రశ్న విచారించడంలో రెండుమూడు విషయాలు గమనించాలి. ఎంతప్రజాస్వామికమైనా దేశంలోని ప్రతివ్యక్తి ప్రత్యక్షంగా ప్రభుత్వంలో పాల్గొనడం అసంభవం. ఈవిధమైన అర్థం మనస్సులో పెట్టుకునే, ప్రజాస్వామిక ప్రభుత్వ మనేది దేవతలకితప్ప మానవ మాత్రు లాచరించగల విధానం కాదన్నాడు రూసో. తమకిచెందిన సర్వవిషయాలపైనా ప్రజలకి అంత్యనిర్ణ యాధికారం ఉండడానికి ప్రజలే ఆకార్యాలన్నీ ప్రత్య క్షంగా నిర్వహించడం అవసరం లేదని గ్రహిస్తే, ప్రజా స్వామిక ప్రభుత్వం మానవలోకానికికూడా వర్తిస్తుందని తెలుస్తుంది. ప్రభుత్వవర్గంగాఏర్పడేది కొందరువ్యక్తులు మాత్రమే. ఆవ్యక్తులు తమ అధికారాన్ని స్వప్రయోజ నాలకోసం కాకుండా ప్రజాభ్యుదయానికి వినియోగించే టట్టు కట్టుబాట్లు చేస్తే పైఆశయం సిద్ధిస్తుంది.

అధికారవర్గంగా ఏర్పడే వ్యక్తుల ఆశయాలూ, అభిప్రాయాలూ వారివారి ప్రత్యేకజీవితానుభవాలమీదే ఆధారపడి ఉంటాయి. కాని వారు చేసే శాసనాలు ఇతరజీవిత కార్యక్రమాలికి కూడా చెందుతుండడంచేత ఆ యితరజీవితానుభవాల్నికూడా ఆధారం చేసుకుంటే గాని వారు ఆయాశాసనాలు చెయ్యకూడదు. ఉదా: బట్టలవర్తకానికి సంబంధించే శాసనం చేసేముందు, ఆ వర్తకంలో అనుభవంఉన్న వ్యక్తులతో సంప్రదించాలి. అదీగాక, ప్రత్యేకం ఆవర్తకానికి చెందిన శాసనాల విషయంలో, అటువంటిశాసనాలు చేసుకునేఅధికారం ఆవర్తకంలోని వివిధతరగతుల సమ్మేళనంవల్ల ఏర్పడ్డ వర్తకసంఘానికే యివ్వాలి. ఈ విధంగా ప్రజా ప్రతి నిధులు వర్తించాలంటే దేశంలోని ప్రతి వ్యక్తి తన అనుభవాన్ని ఎటువంటి నిర్బంధం లేకుండా వ్యక్తం చేసుకోడానికి తగిన వాక్స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం, సంఘాలుగా కూడి ఆందోళన సాగించే స్వాతంత్ర్యం ఉండాలని లాస్కీ పండితుని అభిప్రా యం. అంటే, ప్రజాప్రతినిధులుచేసే ప్రతిశాసనంమీద ప్రతివ్యక్తి తన అనుభవపూర్వకమైన అభిప్రాయం ఇవ్వడానికి సంపూర్ణస్వేచ్ఛ ఉండేటందుకు తగిన సాధ నాలు కల్పించబడాలి. ప్రభుత్వ వర్గంగా ఏర్పడే వ్యక్తుల అధికారం నిరంకుశం కాకుండా, ప్రజాభ్యు దయసిద్ధికి స్థానికస్వపరిపాలన అభివృద్ధిచెయ్యడం వివిధ పరిశ్రమల—వివిధతరగతుల — వివిధశక్తుల సంయుక్త స్వరూపంగా పరిగణించి ప్రభుత్వాధికారం కూడా తదనుగుణంగా సర్దడం (Authcrity as fedaral) మొదలైన కట్టుబాట్లూ, సాధనాలూ కూడా సూచిస్తు న్నాడు లాస్కీ.

ఈవిధంగా వ్యక్తి తన అనుభవాన్ని వ్యక్తం చేసుకునేందుకు అవసరమైన ఏవిధమైనా స్వేచ్ఛాకూడా ఈడిక్టేటరుషిప్పులక్రింద —అందులోనూ ఇటలీ,జర్మనీ మొదలైనదేశాల్లోని సైనిక సర్వాధికారాలక్రింద లేదని వేరేచెప్పనక్కరలేదు. తాము దేశాభ్యుదయకరాలని యెంచే కార్యక్రమాలలో - విధానాలలో - ప్రజలు విధేయులై, మూగవాళ్లలాగు - వివేచనా రహితవిగ్ర హాలవలె - పాల్గొనడమే తప్ప, వారికి విమర్శనాధి కారం లేదని ఈసర్వాధికారుల అభిప్రాయం. ప్రజల కొక అభిప్రాయం, తమ ప్రతినిధుల్ని నియమించి శాసించగల వివేచనాసామర్థ్యాలూ అనేవే లేవని ముస్సోలినీ ఉద్దేశం. వారు చేసే కార్యాలు దేశానికి మేలుచేకూర్చేవిగానే ఉండవచ్చు; కాని, ప్రజల విమర్శనని అణచివేసి తన్మూలంగా వారివివేచనాశక్తి నరికట్టడంచేత, ఈవిధమైన నిరంకుశత్వం చాలాకాలం సాగితే ప్రజలలో వివేచనాశక్తి అనేదే నశించి వారు కేవలం ఆజ్ఞలు నెరవేర్చడమే తప్ప స్వయంసహాయం

చేత ఏపని చెయ్యడానికీ అశక్తులౌతారు. ఐనా, తమ కార్యాలు అన్నివిధాలా ప్రజాక్షేమాన్ని పెంపొందించేవే ఐతే, ప్రజలవిమర్శనలకి జడవవలసెందుకని కూడా కొందరు ప్రాజ్ఞులు ప్రశ్నిస్తారు. అందుచేత, శాసితుల హృదయపూర్వకాంగీకారం లేనిదే శాసనాలు చిరకాలం పాటించబడవు. నైతికశక్తిపూర్వకమైతేనే తప్ప కేవల పసుబలంవల్ల ప్రభుత్వాలు చిరంజీవులు కానేరవని చరిత్ర వేనోళ్ల ఘోషిస్తుంది. ఐనా, మానవజాతి పూర్వానుభవాన్ని మరచిపోయి, తమవిషయంలో మాత్రం అల్లా అవదనుకోవడం వివిధ దేశాల విచిత్రతర్కం కాబోలు!

కొన్నివందలసంవత్సరాల క్రితమే, అధికారవర్గంగా ఏర్పడేవ్యక్తుల స్వార్థరాహిత్యం, స్వార్థపరత్వం- వీటిని బట్టి ఉత్తమాలనీ, అధమాలనీ ప్రభుత్వాల్ని రెండువిధాలుగా విభజించాడు 'ఎరిస్టాటిల్' తత్త్వజ్ఞుడు. స్వార్థరహితుడైన ఒకేవ్యక్తి అధికారం నిర్వహించడమే రాజరికం (Monarchy); కాని, కాలక్రమాన్ని అతనో, అతనిసంతతో ఈ అధికారాన్ని స్వప్రయోజనార్థం వినియోగించడంవల్ల నిరంకుశత్వం (Tyr nny or Despotism) ఏర్పడుతుంది. ఈ నిరంకుశత్వం దుర్భరమవడంతోటే అధికారం సమర్థులై స్వార్థరహితులైన అల్పసంఖ్యాకులకి సంక్రమిస్తుంది. (Ar stocr ry). కాలక్రమాన్ని ఈ అల్పసంఖ్యాకులు కూడా ప్రజాశ్రేయం పాటించక స్వార్థపరులైపోవడంవల్ల అల్పసంఖ్యాకుల నిరంకుశత్వం (Olig rchy) ఏర్పడుతుంది. ఇది దుర్భరమవడంతోటే అధికారం అధికసంఖ్యాకుల హస్తగతమై ప్రజాస్వామిక ప్రభుత్వం (Polity) ఏర్పడుతుంది. కాలక్రమాన్ని సమర్థతావివేకాలు లేని జనసామాన్యం పాలనకి పూనుకోడంవల్ల అరాజకపరిస్థితు లేర్పడి మళ్లీ ఏవ్యక్తో తన శక్తిసామర్థ్యాలవల్ల అధికారం వహించి, తన స్వార్థ రాహిత్యంచేత నిలబెట్టుకుంటాడు. మళ్లీ పై సంస్కరణ ప్రారంభమై, ఈవిధంగా ప్రభుత్వరూపాలు చర్వితచర్వణంగా మారుతుంటాయని ఆగ్రీకుతత్త్వజ్ఞుని సిద్ధాంతం. ౧౯-వశతాబ్దానికిపూర్వంవరకూ కూడా ప్రబలంగాఉన్న రాజత్వసంస్థ కాలక్రమాన్ని నిరంకుశమై, బలహీనమై, గతశతాబ్దారంభంలో అధికారం ధనవంతులకీ, భూవసతిగల జమీందారులకీ సంక్రమించింది. వారినుండి క్రొత్తగా బయలుదేరుతున్న పరిశ్రమలవల్ల ధనవంతులైన మధ్యతరగతులకి సంక్రమించింది. ఈశతాబ్దంలో క్రమక్రమంగా జనసామాన్యానికి చెందుతోంది, వోటింగుహక్కు విస్తరింపజేయబడడం ద్వారా. ఈవిషయాల్ని పైనపేర్కొన్న 'ఎరిస్టాటిల్' సిద్ధాంతంతో పోల్చిచూస్తే ప్రజాస్వామికప్రభుత్వం సమర్థత, స్వార్థరాహిత్యత అనే లక్షణాలు గోల్పోయి, ఉత్తమతరగతినుంచి పతనం చెందిన సందర్భంలో ఒకేవ్యక్తి అధికారంక్రింద ఏర్పడే ప్రభుత్వాలే కాబోలీసర్వాధికారపదవులనే యోచనకూడా తోచక పోదు. ఇదే సత్యమైతే, కాలక్రమాన్ని ఈడిక్టేటరుషిప్పులే రాజరికాలుగా స్థిరపడతాయేమో అనే సందేహం కలుగుతుంది.

ఆవిషయం ఎల్లాఉన్నా, కేవల సైనికశక్తిమీద ఆధారపడిన సర్వాధికారాలు---ప్రత్యేకంగా, జర్మనీ, ఇటలీ మొదలైన దేశాల్లోఉన్నలాంటివి—తమతమ కార్యక్రమాలచేతా, ఉపోద్ఘాతనలచేతా, దేశాలమధ్యనున్న వైమనస్యాల్ని అధికంచేస్తున్నాయని చెప్పక తప్పదు. తమ పూర్వప్రాభవాన్ని పునఃప్రతిష్ఠచేసుకోవాలనే ఇటలీ, జర్మనీ మొదలైన దేశాల ఉద్దేశం ప్రస్తుత ప్రపంచపరిస్థితులలో శాంతియుతంగా నెరవేరుతుందని తోచదు. ఈవిధంగా దేశభక్తి అనే పేరుతో కొన్ని దేశాలు జాతీయ అహంభావాన్ని వృద్ధిచేసుకుంటున్నప్పుడు, ఏనాటి కెల్లావస్తుందో అని యితరదేశాలుకూడా తమమారణసామగ్రిని అభివృద్ధి చేసుకోడానికి యత్నించడంలో ఆశ్చర్యంలేదు. ఈ విధంగా తయారైన రణవాతావరణం ఎప్పుడు బీభత్సస్వరూపం దాలుస్తుందో చెప్పలేము. ప్రపంచయుద్ధాలవల్ల భస్మీపటల మయేది ప్రజాసామాన్యంగాని, ప్రభుత్వాధికారం చలాయిస్తున్న వ్యక్తులుకాదు. అందుచేత, ఈ ప్రభుత్వాధికారం ప్రజలకి సంపూర్ణబాధ్యత వహించి, ప్రజావిమర్శనాన్ని బట్టి నడుచుకుంటూ, ప్రజానుభవంమీద ఆధారపడి, ప్రజాశ్రేయాన్నే తన ఏకలక్ష్యంగా పెట్టుకొని వర్తిస్తే తప్ప ప్రపంచశాంతి అనేది దుర్లభం.

# కళా—కలా?

పూడిపెద్ది వెంకటరమణయ్య

ఏలా ఘోషా?
ఏలాగో నీ
రెండు చివరలూ
అతుగుకో బ్రతుగక ;
మాటా? మంతా?
ఏదో గుసగుస!
ఏదో బుసబుస!
ఏదో రోసరోస!
కళవళపడి లోలో
కళపెళ ఉడికీ,
పెళపెళ విరిగీ,
పలపల దొరలీ,
ప్రాకులాడితే
వినేవా రెవరు?
విని అర్థంచేసు
కొనేవా రెవరు?
ఉదధీ! ఉదధీ!!
నీ కెందులకీ యవిదీ?

జబాబు లేదూ,
సబబే లేదూ!

అక్కుపక్షిలాగు
లక్కపిడతలాగు
ఒక్కటిమై తన
పెక్కు వ్రేళ్లలో
చిక్కులుపడి
నొక్కులుపడి
గ్రుక్కలు మ్రింగుచు
ఉక్కిరిబిక్కిరిగా

కొక్కిరిత్రోవల
కొట్టులాడుతూ
బిట్టువడంకెపు
నౌకను బట్టి
ఊ చేస్తూంది!

కెరటపు వంపున
దా చేస్తూంది!

గిరగిర త్రిప్పి
రా చేస్తూంది!

చావు రేవులను
తూ చేస్తూంది!

బుస్సుపెట్టి తెరచాపను
చిం చేస్తూంది!

పట్టుపట్టి నడుగొయ్యను
వం చేస్తూంది!

పనిపట్టీ, పెనుసుడిలో దానిని
దిం చేస్తూంది!
తేల్చేస్తూంది!
తూల్చేస్తూంది!
కట్టుబల్లలను
రాల్చేస్తూంది!

ఇంకేం చేస్తుందో!
ఏ ఆయుధాలతో
వేం చేస్తుందో

ఎక్కడి కడలి!
ఎక్కడి పడవ?
విరహిణి వ్రేల్కొన విరి,
కోపపు బాపని కుత్తుక జందెము,
దయ్యము వాకిట దమనపు మొలక,

ఒక్క చిదుపుతో
ఒక్క విదుపుతో
ఒక్క మెదుపుతో
ఎక్కడో! ఏమో!
ఎగసి పడే కెరటపుకౌగిటిలో
పగిలి పడే పడవ పొదిగిటిలో
అక్కడకూడా
ఆసమయానా
ఉన్నాడండీ! నరుడు.
అంటుకుపోయిన గోచీ,
గెంటుకుపోయే నిలుకడ,
విడిపోయే గుండియ,
పడిపోయే జీవము-
నిగ్గు వెన్నెలలో
నీడబొమ్మలాగు
వంగీ, లేచీ,
అదికా దిది
యిది కాదది యని
విడివడి
విడివిడిగా
వడివడిగా
వెడలిపోయే
పడవబల్లలను
వరిస్తున్నా డప్పుడు,
తరిస్తాడట మున్నెప్పుడో
గందరగోళపు
సందరమంతా!
చెవిలో రొద,
గుండియలో సొద-
కాలు సేతు లాడవు,
కను లేవీ చూడవు-
అన లేమయినదో
ఆసే మిగిలీ
పిడికిట నూర్పుల
బిగ్గబట్టికొని
త్రోవా తెన్నూ తెలియక
తొట్రిలుపోతున్నా డానరుడు!
ఏమీ?
ఎంతటి సృష్టి!
ఎంతటి పుష్టి!
ఇవన్నీ చాలక
జలనిధి సాధిస్తాడా?
కంధిని గాలిస్తాడా?
భూతా లుద్రేకిస్తే
చేతులు నులుముకొని
మూతి బిగించుకొని
పడుతూ లేస్తూ
మిడుతూ చూస్తూ
ఉండే నరుడూ,
పుట్టిన సౌందర్యంలో
సొట్టచేయి పెట్టీ, అన్నీ
అలతిచేసి
వెలితిచేసి
కళ యంటాడు!
కల గంటాడు!
[ "అల్పీలూ, సూదులూ" నుండి. ]

# రాధాకృష్ణుడు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి



సర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు

## రాధాకృష్ణుడు కళోపాసకుడు

గగన చంద్రతారాపాళిని తిలకించినపుడు హృదయము గురుగంభీరభావపూరితమగును. నక్షత్రఖచిత వియత్తలమును విలోకించినపుడు ఆత్మ ఆనందించును. ఉత్తాల తరంగసంకుల సింధువును కాంచినపుడు తలపుకరళ్లు మనస్సునందు ఉవ్వెత్తుగ నుప్పొంగును. ఆత్మహృదినుండి

హృదీశ్వరియట్లు అనురాగసౌరభమును వెలార్చుకుసుమ మును కన్గొనినపుడు "హాయి హాయి" యనుచు మానస ముత్తురాతలూగును. తీపితుంపురులు కురిపించు గీతిక చెవిబడినపుడు పరితోషవీచికలందు అంతరంగము మున్కలేయును. కట్టెదుట కళ నిలిచినపుడు పిడుగులు మీద డుల్లిపడుచున్నను, పరమహంసలట్లు నృత్యము సలుపుదుము. బృందావనవిహారి మధురమంజులి వంశీరవ మట్లు సుధాబంధురభావధారను వెడలించు రాధాకృష్ణుని సమక్షమున నిలుచునపుడు ఆత్మవిస్మృతులమై సచ్చిదానందములం దోలలాడుదుము.

కళ ఆత్మనుండి వెడలును. ఆత్మయందలి బ్రహ్మానందము కళనుండి జాలువారును. కళయందలి మహత్త్వమును గుర్తించువారు, కళయందలి సౌందర్య మాధుర్యములను జుఱ్ఱగలుగువారు రాధాకృష్ణుని హృదయ మందలి బృందావనశోభను కనులార గాంచెదరు. స్వర్గమర్త్యములను, జీవాత్మపరమాత్మలను కలుపునది కళయనియు, మనుష్యసృష్టియందలి పరమాశయముల నరచేత నిడునది కళయనియు అధునాతన వసుంధరకు తెలుపగలిగిన మహావ్యక్తు లిర్వురే. వీరిలో రాధాకృష్ణు డొకడు. రెండవయాతడీతని యంతరంగమిత్రుడు భృగుకవీంద్రుడు రవీంద్రుడు.

దివ్యపృథ్వియం దేకడనుండియో తరలి యుగ యుగములందు ఒక్కొక్కమానవహృదయమున కళ తన చిత్రకుంజమును నిర్మించుకొనును. దీని జన్మస్థలమును చూపు భూగోళము మనుష్యమేధస్సునందు లేదని మనీషు లెఱుగుదురు.* సూనగర్భమున నడగి, సమీర స్పర్శవలన సుస్వర సుప్స్వంగు నెత్తావియట్లు, గాయ కుని వ్రేలితాకుడున వీణాతంత్రినుండి అల్లన శిరమెత్తు స్వానుశబ్దముకైవడి, తరణికిరణచుంబనమున కమల హృది గల హాసన ముట్టె ఆననమున తళ్కొత్తులీల, విశ్వ పతి సంశ్లేషమున రాగసందీప్తహృదయమును విచ్చు సంధ్యాసీమంతినిపగిది, ఆత్మనందనమున పచ్చని చిగుళ్లయం దెందో పవ్వళించియున్న దివ్యభావము కళోపాసకుని స్మృతిస్పర్శయందు, గిలిగింతనంది స్ఫీతహృదయయై ఆతనివనిపి, వానివాగ్వల్లీడోలికయందు దూగాడి ఆతనిరచనతల్పమున జేరుకొనును. ఈభావము గంధర్వాంగన బోలునది. ఇది భారతహృదయోద్యాన మందే వెలయును. బహురూపముల నిది గోచరింప జాలును. నేడిది శమంతకమట్లు రవీంద్రునియెడంద యందును, కౌస్తుభమణికరణి రాధాకృష్ణుని హృదయ మందును వెలుగొందుచున్నది.

భావమందలి అమరవిభూతిని కనిన పాశ్చాత్యులు మిగుల నరుదుగ నున్నారు. వీరు ప్రాచీవిజ్ఞాన కల్హారమున గ్రుంకులిడిన మానసౌకములు. వీరొకప్పుడు మనియుండిరి. సైన్సుమయమైయున్న నేటి ప్రతీచీ ఖండమున వీరులేరు. యశస్సీలకులైన పాశ్చాత్యరచ యితలు నేడెందఱో ఉండుట నిక్కమే. బెర్నార్డ్ షాయనుడు, హాసెల్సుఅనుడు, వేలస్అనుడు, గాల్స్‌వర్ది యనుడు, మఱియుపాశ్చాత్యరచయితయనుడు, బెర్గ్‌సన్అనుడు, క్రోస్ అనుడు, రస్సెల్అనుడు, జేమ్సుఅనుడు, మఱి ప్రతీచీతాత్త్వికుడనుడు వీరు ఐన్ స్టైన్ రూథర్‌ఫర్డ్‌లు మున్నగు భౌతికశాస్త్రజ్ఞులవలె మేధశ్శిఖరముపై నిలిచి, ఐహికభావసామగ్రి నందుండి జగతిపై దొరలించిరి; హృత్కంజమునుండి దివ్యలలిత భావకేసరములను వెడలించిరికారు. వీరికాధ్యాత్మికదృష్టి లేదు. యోజనపై వీ రాధారపడెదరు. పరిమితిగల ప్రత్యక్షప్రపంచానుభవమే వీరి భావఖని. ఆత్మప్రదీప కళిక వీరికి ప్రత్యక్షము కాలేదుకావున సమ్యగ్జ్ఞానము వీరికి దూరస్థమై, దుమూహ్యమై యుండును. సాహితీ సామ్రాజ్యమున నిలిచి, దివ్యైశ్వర్యమును నేడు భూమీ జనుల దోసిళ్ల బోయు ప్రతిభావంతులు రవీంద్రరాధా కృష్ణులే. రవీంద్రుడు తాత్త్వికదృష్టిగల కవి. రాధా కృష్ణుడు కవితాదృష్టిగల తాత్త్వికుడు. కావున నీతని ప్లేటోతో పోల్చవచ్చును. వీరి హృదయము లొక్కండే. వీరు దివ్యదృష్టిగల కళోపాసకులు. ప్రాచీప్రతీచీ ఖండ ముల నేలు విజ్ఞానచక్రవర్తులై, జగద్గురువులై వసుమతీ శాంతిపై రవిరాధాకృష్ణులు మనసులు నిలిపిరి.

---

* Rabindra Nath Tagore on "Art"

సహజశక్తికి సముచితపఠనము దోహదమైనపుడే అది కల్పద్రుమమట్లు పెరిగి, అనంతకాలమున శాఖోపశాఖలను వ్యాపింపజేయును. గభీర పఠనమును, అంతరంగికశక్తిని లేనిరచయితలు కుండలములను దాల్చినను, శాల్వలను గప్పుకొనినను, వీరి శరీరములను బూడిదచేయు వేడినిప్పులు శరీరములపై ప్రేలాడు నీపరుకును కూడ బూడిదచేసి వదలును. మనుష్యశక్తియందలి సత్యాసత్యములను నిర్దిష్టమొనరించునది కాలము. దీనికి మోమోటమి లేదు. నిష్ఠురత లేదు. ఇది కనుపొరలను చించును. చీకటిని చీల్చును. అసత్యమును చెండాడి సత్యమును నిలుపును. ప్రతిభాశాలి కిది అమృతముతో అభ్యంగనమొనరించి ఆతనికి చరణాశ్రితదాసియై యుండును. ప్రకృతికి ఆయువుపోసి, ప్రకృతిని కళాప్రదీప్తము చేయు ఆలోకహిల్లోలములట్లు ఆధ్యాత్మిక భావములు మనుష్యశక్తిని సోకినపుడే అది చిరంజీవియై చిరప్రభా కలితమై వెలుగొందును. ఇది కల్పకమువంటి దంటిని కదా! కల్పకశాఖలనుండి శీతలవాతూలము వెడలదా? అది తేజఃపూరిత స్వర్గమృత్తికయందు సారవంతమైన హృదయకేదారమందు బుట్టినదగుటచే, కడుంగడు రమ్యమై మధురఫలవిలసితమై యొప్పును. సహజశక్తి సమన్వితమైన రాధాకృష్ణుని హృదయము రవికవిహృదయమట్లు రమ్యమై చక్కనై శాంతిమయమైనది కాదా? ఈతనిహృదయస్థ దివ్యనగరాజమున జనించిన స్వాదుఫలములగుటచే, ఈతని భావములు జగతికి దివ్యాహారము నొసగునవియై యున్నవి. ఈఫలములందలి రసముపై బుద్ధినిలిపి, చంద్రుని చూచినంతనె దివాలున చదలున కెగయు చకోరమట్లు, మేఘసందర్శనమున వేయి కన్నుల పింఛమెత్తి నాట్యమాడు నెమలిలీల రసహృదయు లావేశభరితులై, దానిని గ్రోలి, భావపక్షవిక్షేపమున నీతని రచనా విహాయసమున నెగసి అపూర్వ అద్భుత దృశ్యము లెన్నిటినో కాంచి కులుకుచుందురు.

రవీంద్రరాధాకృష్ణులను కొంతదనుక నేను జోడించుటకు కారణము లేకపోలేదని చదువరు లూహించియుందురు. కవి సృష్టిశక్తిగలవాడు.* వట్టితాత్త్వికుడు భాష్యకారుడే. ఇతడు మానవుడే; అతడు బ్రహ్మ. రాధాకృష్ణుడు వట్టితాత్త్వికుడుకాక, సాధారణమానవుడు కాక కవివంటి సృష్టికర్తయని తెలుపుట నా యాశయము. ఇట్లని ఋజువుచేయుట నాతొలుతటి కర్తవ్యము.

సహజశక్తియందే సృష్టిశక్తియుండును; దీనికంతేని స్వాతంత్ర్యము కలదు. దీనిని గల వ్యక్తి ఒకమాత్రక చేబట్టు మువ్వదారములకు లొంగి అది చెప్పినట్లు ప్రవర్తింపడు. రాధాకృష్ణుని గభీరపఠనము ఆతని హృదయమందడగిన సహజశక్తిని విజృంభింప జేసినది. ఆలోకవాతూలములను గ్రోలు పూవు వికాసమున నొప్పారును. ఈవికసన మెరుగుపామ్ముకాదు. ప్రాచీ ప్రతీచీ విజ్ఞానములను దిగమ్రింగిన రాధాకృష్ణుడు తన వాక్కులందు వ్యక్తపఱచిన నవనవోన్మేష భావములు ఎరువుసొమ్ములుకావు. ఈతనివాక్కులు ఈతని ఆత్మనుండి వెడలును. కావున నవి గభీర భావవిలసితములై సౌందర్యసందీప్తములై ఈతని సహజసామర్థ్యమును వ్యక్తీకరించును.

కవిభావములు మనశ్చక్షుస్సమక్షమున చక్కనైన రూపులు నిలుపును. పతితమనసు నాలోకముచే, నాశచే నింపును. ఆతనికి నవజీవనమొసగును. చెప్పనేల? పునర్జన్మనిచ్చును. అసాధారణ కవితాసంపదగల రాధాకృష్ణుడు తనసాహితీ జీవనమున తొలుత చక్కని నవల వ్రాసినాడు. నాడీతనికి తత్త్వశాస్త్రమును ప్రబోధింపవలసిన అధ్యాపక పదవి లభింపకున్నయెడల, నిరుద్యోగియై కొంతదనుక నిలిచి కేవల సాహిత్యోపాసనమునకు దివ్యదృష్టిగల తనకలమును నియోగించి నేడు నోబుల్ప్రైజ్ నందియుండును. తాను ప్రబోధించు విషయమందే ఈతడు తన సర్వశక్తులను పదంపడి కేంద్రీకరించినాడు. తననవలను ప్రచురింపక ఒక మనశ్శాస్త్రగ్రంథము వ్రాసినాడు. ఈతని తొలుతటి యత్నమున నుద్భవించినదగుటచే, అది సభ్యప్రపంచదృష్టి నాకర్షించినది కాదు. షేక్స్పియరుమహాకవి ప్రజ్ఞ Comedy of Errors మున్నగు తొలుతటి గ్రంథ

* Russel's "Principles of social Reconstruction" Page 234.



రాధాకృష్ణయ్యగారు, వారి సతీమణి

ములం దచ్చటచట మేఘములమఱుగునుండి వెడలు రవిరశ్మియట్లు గోచరించినట్లు రాధాకృష్ణుని ప్రథమ గ్రంథమున భాస్వన్మరీచిక లందందు గోచరించినవి. ఈతని యంతరంగమున బ్రహ్మాంశ మిమిడియున్నదని ఈతని గనిన, ఈతడు తొలుత సేవించిన విశ్వవిద్యాలయము గుర్తింపలేదు. ఈమహాపురుషుని గంటినని నాడుకాదు నేడైనను దాక్షిణాత్యము గర్వపడుచుండుట లేదు. రాధాకృష్ణుడు మావాడని ఉప్పొంగు దాక్షిణాత్యు లెందఱో లేరు. ఈతని హృదయమున అఖండజ్యోతి వెలుగుచున్నదని రవీంద్రుడు తొలుత గుర్తించినాడు. ఈజ్యోతిని కాంచి ఆషుతోషు అనురాగతైలధారచే దానిని మఱింత జ్వలింపజేసినాడు. ప్రజ్ఞాప్రతిభలు కనులెదుట దోచుతఱి నతమస్తకులగుటకు సంశయింపని ప్రతీచీవాసు లీజ్యోతికి సాగిలపడిరి. "ఓహో! మనవాడని" మనతెల్గులు కొందఱు ఒకమాఱు చప్పట్లు చఱచిరి. ఈతడు మహోన్నతశక్తి గల కళోపాసకుడని నేడుకూడ వీరు గుర్తింపలేదు.

రాధాకృష్ణుని రచనములను పుంఖానుపుంఖముగ పరికించితిమేని, అవి తాత్త్వికార్థము గల కవితాలేఖనములని గ్రహింపగలము.* విచిత్రరూపరేఖా విలసితములైన విశ్వదృశ్యము లన్నిటిని కొలదిమాటలచే పఠిత మానసయవనికపై తళుక్కొత్తించుశక్తి రాధాకృష్ణునకు కలదు. ఈతని రచనము ఒక్కొకపుడు కిరణశాబకముల కాటపందిరైన పొదుపుకొండ యనిపించును. ఇంకొకపుడు శారదశర్వరి విడియు దివ్యకుంజ మనిపించును. వేఱొకప్పుడు విద్యుల్లతాంగుల ఖేలనాంగణ మనిపించును. సాధారణసంభాషణ కందుకూడ నీతడు వాడు వాక్కులు వజ్రపుతునకలట్లుండును.

బండరాళ్లయందుకూడ బోధామృతమును సుందరభావముగ కనుగొనుట కవిపని. ఈపనియందు వర్డ్సువర్త్ కవి మిగుల నాఱితేఱినాడు. తత్త్వశాస్త్రములోని బండతలపులను దివ్యసౌందర్య మొసగు కవి రాధాకృష్ణుడు. తాత్త్వికోపన్యాసములనుండి పది యామడలు పర్విడు పాశ్చాత్యులే ఈతని పలుకులు వినుటకై ఉవ్విళ్లూరుటకు కారణ మవి జగన్మోహినియట్లు "దరహాసచంద్రికలం జిలికించు"న వగుటయే! జగన్మోహినియైన భావము ఎట్టియద్భుతములనుపుట్టింపదు! సౌందర్య మెట్టి గురుగంభీర కార్యములను చేయింపదు? ఎదుట నొక సుందరాననమును చూచి, ఆవేశపూరిత హృదయులై యోధు లెన్నెని యద్భుతములను సలిపెడివారని ప్రాచీప్రతీచీసారస్వతములు తెలుపుచుండలేదా? తన స్వర్ణమయూఖములనుండి సౌందర్యరాశిని గ్రుమ్మరించియేకదా ప్రభాకరుడు నూతనజీవమును సృష్టించును! సౌందర్యమండిత దృశ్యములను విలోకించియేకదా ఆవేగపూరితహృదయుడై కవి, ఒక్కొక అక్కరమం దొక్కొక భువనమును జేర్చును! సౌందర్య ప్రదీప్తమైన రాధాకృష్ణుని రచనము ప్రాచీన భారత రమణియట్లు ఉత్తమాశయనిధానమై వెలుగొందుచుండును. యోచనానుభవ సంకల్పములు (Thinking, Feeling and Willing) మూడింటినికూడ తనిపి, సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడును.

సృష్టికర్త మనుష్యవాక్కులను నిమిత్తమాత్రములు కావించుకొని తనభావములను వ్యక్తీకరించును. ఈ వాక్కులు మహాకవివి కావచ్చును; మహాభక్తునివి కావచ్చును; మహర్షివి కావచ్చును. దివ్యభావనావేశముగల వ్యక్తిముఖమునుండియే యివి వెల్వడును. సృష్టికర్త కళోపాసకుడని రాధాకృష్ణుడే పలికినాడు.†

కళోపాసకుని హృద్వీణను మీటి మధురరవము లేపువాడు సృష్టికర్త. పద్యమనుడు, గద్యయనుడు హృదయసముద్భూతము; మంజులభావసమన్వితము; మహిమోపేతము. రాధాకృష్ణుని ఉపన్యాసములు వినునపుడును, రచనలను చదువునపుడును మనయాత్మలు పరమహంసలట్లు నృత్యముచేయును. నృత్యగతి ఆత్మనుండియే వెడలును. ఆధ్యాత్మికశక్తి సోకినపుడే విహంగ

* Prof. J. H. Muirhead's Disquisition on Philosophy and Poetry.
Rabindranath's Exposition of the Ideals of Art.

† Radhakrishnan's "The Hindu View of Life" Page 69.

మట్లు ఆత్మలేచును. ప్రతికూలరవములు లేపుచు హృదయమందిరమున కొండొక దుర్భావము ప్రవేశించెనేని కట్టెదుట గల ఆత్మ దాని కదృశ్యమైయుండును. శ్రోతల యాత్మలను, పఠితల యాత్మలను ఉత్తాలలూపు వాక్కు అద్భుతమైన యాత్మశక్తినుండి వెడలు ననుట నిస్సంశయము. జడపదార్థములచే గంతులు వేయించు శక్తి రాధాకృష్ణునకు కలదు! మానవకోటిని మంత్రముగ్ధ మొనరింపగల శక్తి రాధాకృష్ణునకు కలదు!! విషాక్త వాతూలమును తఱిమి మధుమయ మలయహిల్లోలమును లేపు మహితభావశక్తి రాధాకృష్ణునకు కలదు!!! నిష్ఠురహృదయులను కూడ పులకితాత్ములగావించి రసమగ్నులజేయగలశక్తి రాధాకృష్ణునకు కలదు!!!! రాధాకృష్ణుని శక్తి ఈతని హృదయబృందావనమందలి రాధాకృష్ణునిది కాదా?

పూవును తావియునువలె కళయును తాత్త్విక భావమును అవినాభావసంబంధముగలవని బహుయుగములకుమున్నే భారతీయులు గుర్తించిరి. మిడిల్టన్ ముర్రే పోలు పాశ్చాత్యతాత్త్వికులు వ్యతిరేకభావమును వ్యక్తీకరించినను, ఆంగ్లసాహిత్యమందలి ఆవర్శరచయితలు భారతసంప్రదాయమందలి మహత్త్వమును, సత్యమును గుర్తింపగలిగిరి. *

తలపోత కందని అద్భుత ఆంతరంగికశక్తి యొకటి కళకును, తాత్త్విక మత భావములకును పుట్టినిల్లు. సత్యమునకును సౌందర్యమునకును ఈశక్తి కేంద్రస్థానము. అమృతాంశువునుండి వెడలు చల్లందనమునకును, ఆలోకమునకును గల కలయికవలె నీ శక్తి సముద్భవ కళాతాత్త్విక భావములకు సౌందర్య సత్యములకు చక్కని పొందుకల్గును.† కవలపూలకు తల్లియైన కొమ్మయట్లు, ఈ యుత్తమాశయములకు మాతయైన అద్భుత ఆంతరంగికశక్తినే Intuition అని కళోపాసకులును, తాత్త్వికులును ఉల్లేఖింతురు. ‡

తాను తెలిసికొనవలసినది, చేయవలసినది, ఆశింపవలసినది ఏద్దియని తాత్త్వికుడు ప్రశ్నించుకొనవలెనని ఒక సుప్రసిద్ధపాశ్చాత్యతత్త్వవేత్త పలికినాడు.§ కాని ప్రతీచీతాత్త్వికులు సాధారణముగా తొలుతటిప్రశ్నకే తమదృష్టి నప్పగింతురు. $ గతభావవృద్ధిని హృదయం

* Dr. Ccusin's dissertaticn cn Philcscphy and Art. Lcwell cn "Pcetry". Hudson on Pcet's greatness. రాధాకృష్ణుడు వాకొను "Live Philcscphy and creative Joy" పుష్పాధరము నంటియుండు మాధుర్యసౌందర్యములట్లు ఈతని రచనలందవినాభావసంబంధమున గోచరించుచుండును.

† Truth is Beauty Beauty is Truth ("Keats"). Ruskin cften identifies Truth Beauty and Gocdness as cne.

‡ తన గ్రంథములందు తలమానికమైన "An Idealist View cf Life" లో రాధాకృష్ణుడు ఈశక్తి మహత్త్వమును సహజగంభీరభాషణముల వ్యక్తీకరించినాడు—కళకు కన్నతల్లియైన ఈశక్తి మతావేశమునుగూడ కనునదని రాధాకృష్ణుడు పలుకుచుండును. (Radhakrishnan's "An Idealist View cf Life" Page 177. Ibid Page 89. Dr. Cousins on intuticn. See als Plato's "Republic" VII Page 518. C. E. M. Joad's "Guide to Mcdern Thcught" కళావ్రతుడును, తాత్త్వికుడును, ప్రణయపిపాసువును అందు అద్భుతాంతరంగికానుభవము లొక్కండేయని రాధాకృష్ణుని వాక్కులవల్లనే స్పష్టమగును. ఈయాంతరంగికానుభవము లొకే అదృశ్యఅద్భుతశక్తినుండి వెడలునని ఆతడు వచించినాడు. (Radhakrishnan's "An Idealist View cf Life" Page 93.

§ "What can I know? What ought I to do? For what may I hope?"—Kant.

$ "Fundamentally then, Philosophy is the answer to the question "What can I know?"-Hume's Philosophy, Part II. Chapter I.

గమ మొనరించుకొందురు. వీరిసృష్టి విహంగమట్లు భావనభమున రివ్వురివ్వున నెగయును. ఇది మిల్టన్, బర్కులు చెప్పు (Vide: Milton's "Paradise Lost" and Burke's "Speech on Conciliation with America.") 'winged minstrel' పోలు నదికాదు. రాధాకృష్ణుడు ఈవర్గపు తాత్త్వికులందు లేడు. * కవిదృష్టివలె, ప్రవక్తదృష్టివలె ఈతనిచూడ్కి ఆశాలోకసందీప్తమై నూతనసృష్టిని, ఆదర్శస్థితిని సోకుచుండును. వివిధమహాసభలందీతడు పల్కిన వాక్కులిందులకు తార్కాణములు. తాత్త్వికుడు వెన్కకేకాక ముందరకు కూడ చూడవలెనని ఆనాడు అంతర్జాతీయ తాత్త్వికమహాసభయందీతడు తేటతెల్లముగ దెలిపెను. మనుష్యహృదయమున ఉత్సాహమును, ఆశను బుట్టింప నెంచు రాధాకృష్ణుడు విశ్వమంతయు అనురాగప్లావితమై యున్నదని పలుకుచుండును. అద్వైతసిద్ధాంతమందును, జగదీశుని immanence యందును ఈతనికెంతేని విశ్వాసమున్నది. (Love and justice are at the heart of the universe. Radhakrishnan's "The Religion we need" Page 27.) దురంత దుఃఖబంధురమైన నేటి వాతావరణమున ఈశ్వరాశీర్వాదము బోలు ఈనుడువు చల్లందనమును కురిపించుటలేదా?

కవిపంచాస్యునివలె రాధాకృష్ణుడు భూతల స్వర్గమును కాంక్షించినాడు. మానవులందు ప్రస్తుతము తలసూపిన చెదుగులను చూపి, వసుంధరదృష్టినుండవలయు శాంతిసహకారాది ఉత్తమాశయములను గుణించి ఈతడును, రవీంద్రుడును వాకొనిన నుడువులందెంతో పోలిక కలదు. † ప్రపంచహృదయమును రాబందులట్లు పొడుచుకొని తినుచున్న దుర్భావములు కడతేరినగాని వసుంధరయందు శాంతి నెలకొనజాలదని కొందఱు బుద్ధిమంతులు గ్రహించిరి. ఈ దుర్భావములను తెలుసు సద్భావములును, సదాశయములును తాత్త్వికులహృదయములనుండియు, కవుల మనసులనుండియు, భక్తుల యెడందలనుండియు వెడలునని వీరెఱుగుదురు. ఈ యంశమును దృష్టియందిడికొనియే "ప్రపంచశాంతిని కాంక్షించు అంతర్జాతీయమహాసభయందు పల్వురు

---

* The Owl of Minerva does not start on its flight until the evening shades of twilight begin to fall" Hegel. "Each may tread the weary mountain from the top of which alone the vision can be seen in all its splendour". (Radhakrishnan's "An Idealist view of life" Page 121) "In Buddha and Jesus, the new vision of life, the new unification of nature, inner and outer, has become flesh. If we remember the wonders achieved in the course of evolution, the hope is not unreasonable that we may all attain to the greatness these have reached" (Vide Radhakrishnan's "An Idealist view of life." and "The heart of Hindustan" Page 102.) "The Spirit in man" అను శీర్షికననుసరించి రాధాకృష్ణుడు చెన్నపురి, అన్నమలై, లండన్ విశ్వవిద్యాలయములందు గురుగంభీరములైన ఉపన్యాసము లొసగినాడు. ఈతని "Idealist View of Life" లో ఈయుపన్యాసములు విపులముగ వివరింపబడినవి. ఆశామరీచి కలచే నివి—ముఖ్యముగ వీనియంత్యభాగము—కాంతిలుచుండును. భక్తుడైన తాత్త్వికుడును కళోపాసకుడైన తాత్త్వికుడును ఒకేవర్గమందలివారు. వివేకానందుని వాక్కులుకూడ మనుష్యహృదయము నాశచేతను, ఆనందము చేతను నింపునవి. (Vide Swamy Vivekananda's Speech at the Parliament of Religions

† Vide Radhakrishnan's Speech delivered at the 10th Session of the Indian Philosophical Congress and the wonderful speech delivered at the annual sessions of the League of Nations' International Commission on Intelectual Cooperation, 1933. Vide " An Eastern University" By Tagore Tagore's address delivered at the Y. M. C. A. Colombo 1934. Vide Tagore on "Co-operation".

భౌతికశాస్త్రజ్ఞులున్నారు. ఇపుడు మీవంటి తాత్త్వికు డాసభయందు ప్రవేశమందుట మాయాశయ" మని మనపాలకులు రాధాకృష్ణుని జినీవాకు ఏటేటను పుత్తెంచుచున్నారు.

## రాధాకృష్ణుడు తాత్త్వికుడు

* నూతనయుగపురుషులైన రవీంద్ర రాధాకృష్ణులకు ఎన్నెని పోలిక లున్నను, రవీంద్రుడు రాధాకృష్ణుడనియు, రాధాకృష్ణుడు రవీంద్రుడనియు దెలుపజెల్లదు. అధునాతన సభ్యజగతికి వీరు తలిదండ్రు లట్లుండుట నిక్కమే. తలిదండ్రులందు పోలిక లేకాక వ్యత్యాసములుకూడ నుండవా? తండ్రికిగల మేధాశక్తి తల్లికేది? రాధాకృష్ణునకు గల మేధాశక్తి రవీంద్రునకు లేదు. భావవ్యక్తీకరణమున రాధాకృష్ణునకుగల సాహసము రవీంద్రునకు లేదు. రవీంద్రుడు మహాకవియేగాని రాధాకృష్ణునిపోలు పండితుడు కాడు. విజ్ఞానాంశములను పరిశీలించునపుడు, మతాదివిషయములను విమర్శించునపుడు ఘనపాండితి అత్యంతావశ్యకము. రవీంద్రుడు తన పలుకులను, విద్యుత్తులట్లు మనసున తళుక్కుమను తలపులనుండి అల్లుకొనును. ఈతలపులలో కొన్ని తటిచ్ఛటలముల పగిది అద్భుతసత్యములు; కొన్ని తాత్కాలికములైన మెఱపులుమాత్రమే. కవికి భావన మధికము. యోజన మల్పము. చర్చగాని, డిబేటుగాని ఈతని ప్రకృతికి ప్రతికూలము. హైందవ వేదాంత మందలి భావస్ఫురిని రవీంద్రుడు గ్రోలినాడు కాని, అందలి ప్రత్యేకతాత్త్వికాంశములను రాధాకృష్ణునట్లు పిడికిటబట్టినాడుకాడు. ప్రథమభారతతాత్త్వికమహాసభ కధ్యక్షుడై ఈలోపము నీతడు సూచనగా దెలుపుకొనినాడు. ప్రాచీప్రతీచీ హృదయములను కలుపవలెననిన, హైందవ క్రైస్తవమతములందు శేకత్తింపబడిన విరుద్ధభావములను నేలరాల్చుట అనివార్యము. మతనిమర్శనమునకు తగిన సత్తువకలవాడు రాధాకృష్ణుడు కాని, రవీంద్రుడుకాడు. క్రైస్తవమతమహత్త్వమునకు జోహారొనరించుచు, ఆమతమందుగల నేరములను మోమోటము లేక తెలిపి, హిందూమతమును గుఱించిన వికృతభావములను చెండాడి, దాని మాహాత్మ్యమును అధునాతనసభ్యజగతికి దెలిపి రాధాకృష్ణుడు ప్రాచీవిజ్ఞానమునకు, ప్రాచీసభ్యతకు, ప్రత్యేకముగ భారత నాగరకతకు చేసిన అద్భుతసేవను రవీంద్రుడు చేయజాలడు కల్ల.

## రాధాకృష్ణుడు మహావిజ్ఞాని

హృదయశక్తి మేధాశక్తులు రెండును సరిసముగ నెవ్వనియందోగాని విజృంభింపవు. ఇట్టి సమత్వశక్తి నేటి వసుంధరయందు ఒక్క రాధాకృష్ణునకే కలదు. ఈప్రత్యేకాధిక్యము ఈతని విజ్ఞానజీవనమున చిత్రవిచిత్రములను పుట్టించుచున్నది.

అద్వితీయపాండితి నీతనికిచ్చినది ఈతని మెదడు. దీనికందని విషయ మెద్దియు లేదు. ఇట్టి మేధాశక్తిగల రెండవమనుష్యుడు ఆంధ్రుడే.—అతడు విశ్వేశ్వరయ్య. రాధాకృష్ణుడు గుట్టలకొలది గ్రంథములను దిగమ్రింగినాడు. కాని యాతడు కంఠపెంచుకొనిన భోక్త కాడు. ఈతడు నముల్మిమింగిన గ్రంథములు ఈతని ఒంటబట్టి ఈతని బుద్ధిని నిశితమొనరించినవి. రాధాకృష్ణుని గ్రహణశక్తి అత్యద్భుతము. పల్లవ రేండ్లను పూండ్లను కడచి, మనసున కెక్కించుకొను విషయములను వేగవంతమైన ఒక్కచూడ్కియం దీతడు గ్రహింపగలడు. భావగ్రహణమందలి వేగము వ్యక్తీకరణమందు గూడ నీతనికి కలదు. నిభృతపఠనమందైన మున బహువర్షములు తపించి, నిషింతజ్ఞానసిశశక్తిని రేకెత్తించి, తాను తలపచి, తా నెఱుగని ప్రజ్ఞను తనయందు జేయావేశభరముహూర్తమందో గుర్తించి, ఇతడు ముందంజవేయగడంగినాడు. కనులుమూసి ఒక్కపరి ఆత్మపరిశీలన మొనరించుకొని, బహుజన్మసంచితకృషిఫలితముల నందుండి లేవందీసి, చేబట్టి అగ్రసరుడనువాడే మనుష్యులందు మనుష్యుడై, కాలక్రమమున పూర్ణత్వము నందు పొందుకొనగలడు.

వట్టి పాండితిగలవానిని మహాపురుషుడనుటకు నే నంగీకరింపను. పండితుడు ప్రశంసనీయుడే కాని

* Vide Sir Francis Young Husband's observati ns (n Indian heroes.

పూజనీయుడు కాడు. పూజకు తగినవాడు జగదీశుడును, ఆతనికి సైదోడైన కళోపాసకుడును. మొదటన సృష్టి సున్న కావున పండితుడు సృష్టికర్తకాడు. తాను సమల్రమింగినదేమో ఈతడు క్రక్కివేయును. హృదయముతో యోజింపగలశక్తి (యీశక్తి యెవ్వరికోగాని ఉండదు) గలవ్యక్తికావున రాధాకృష్ణుడు తానుపడసినదానిని జీర్ణించుకొనుటయేకాక, దానికతన నూతన సృష్టిని కావించుచుండును. మట్టిచిప్పయందు బడిన నీటిబొట్టులు ఏమార్పును చెందవు. ముత్తెపు చిప్పయందు బడిన జలబిందువులు కనులవిందొనరించు మౌక్తికములు కావా? సహజశక్తిగల మానసమున కిట్టి యద్భుతసృష్టిశక్తి కలదు. తనయందుండి దారము వేసుకొంట సాలీని పనియట్లు, సహజశక్తిగల మనుజుడు ఏదో భావము నల్లుచుండును. అంతరంగమందలి శక్తి రెండురీతుల విజృంభించునని నా యభిప్రాయము. మానసదిగ్వలయమునకు దిగువ గల అస్పృశ్య భావవితానము ఏముహూర్తమందో ఒక్కొక్కటిగ నా దిగ్వలయమున తక్కొత్తును! ఏజన్మయందో భావైశ్వర్యము నంతరంగమున గూడబెట్టుకొనినవాని కిట్టి యనుభవములు సాధారణములై యుండును. తామసగుణ సంపన్నుడు నిద్దురయందో, విలాసములందో సమయమును వ్యర్థమొనరించుచుండ, వెఱ్ఱివానివలె నేమూలయందో యడగియో, కల్లోలమందు నిలిచినను, మానసమును గభీర యోచనయందుముంచియో సహజశక్తి సంపన్నుడు, ఏయపూర్వదృశ్యమునో తన యెదుటి కాహ్వాన మొనరించుకొనుచుండును. మహావిజ్ఞానుల భావముల నీతడు గ్రహించినంతనే, అవి నాడి గల త్రివ్వగోలలట్లు ఈతని యంతరంగమును దొలిచి అంటుండి రంగారు బంగారును వెలువఱచును. పతనమువలన చేకుఱు మేల్లు రెండువిధములు. ఇతర సామగ్రి నిది మనసున జేరవేయుటే కాక, పతితయంతరంగమున నడగియున్న సొత్తును బయటబెట్టుటకు నిమిత్తమాత్రమగును. రాధాకృష్ణుడు విజ్ఞానుల కుటుంబమున బుట్టకున్నను, శైశవమున మనసున భాసమాన స్వప్నములను లేపంజాలు దివ్యదృశ్యము లెవ్వియు నీతని కనులెదుట గోచరింపకున్నను, ఎన్నడో ఈతడు తన యంతరంగమున నిట్టిసొత్తును చేరవేసికొని యుండుటచే నిది ఈతని విజ్ఞానజీవనమున బయటబడినది. కావున రాధాకృష్ణుడు వట్టి పండితుడై నిలువక, నిత్యజీవియైన మహావిజ్ఞాని కాగలిగినాడు. భువిబోలు మెదడును, దివిబోలు యెడదజేరి ఈతనికి పండితులందును, కళోపాసకులందును, మనుజులందును, దేవతలందును కూడ తావొసగినది.

వేదయుగము మొదలు నేటివఱకు పూర్వపశ్చిమ భూఖండములందు తలయెత్తిన ఉద్గ్రంథములను రాధాకృష్ణుడు తనమనసున జేరవేసికొనినాడు. శంకరుడనుడు, ప్లేటో యనుడు, రామానుజుడనుడు, అరిస్టాటిల్ అనుడు, యాజ్ఞవల్క్యుడనుడు, స్పయినోజాయనుడు, వ్యాసుడనుడు, సోక్రటీస్ అనుడు, ప్రాచీ ప్రతీచీ మహావిజ్ఞానుల నెంతటినేని పేర్కొనుడు, వీరు రాధాకృష్ణుని అంతరంగమిత్రులై, ఆతనిహృదయమున చిరస్థానము నందినారు. అగస్త్యు డొక్కసముద్రమునే మ్రింగినాడు. గాని రాధాకృష్ణు డనేకమహార్ణవములను గ్రోలినాడు ప్రాచీప్రతీచీ తత్త్వశాస్త్రములను శంఖచక్రములట్లు దాల్చిన ప్రజ్ఞానిధి రాధాకృష్ణుడు! ప్రాచీ ప్రతీచీ సాహిత్యములను మణికుండలములట్లు దాల్చిన ప్రతిభాశాలి రాధాకృష్ణుడు!! ప్రాచీ ప్రతీచీ ఖండములందు నేడు విజ్ఞానచ్ఛటలను సారించు అద్భుత తేజస్వి రాధాకృష్ణుడు!!! ప్రాచీప్రతీచీ సభ్యతలందలి మహత్తరాంశములను కనదురుకంఠమాల గావించుకొనిన సౌందర్యమూర్తి రాధాకృష్ణుడు!!!. విజ్ఞానముల మేళవింపు పూర్వార్ధ పశ్చిమార్ధగోళముల కీతని నారాధ్యదేవత గావించినది. పూర్వపశ్చిమనాగరకతలందలి చెడుగులను చూపుట కీతడు జంకలేదు. రెండింటియందలి మేల్లు నుగ్గడించుటకు సంశయింపలేదు. ఇట్లని నిరూపించుట కీతని గ్రంథములనుండి ఎన్నో దృష్టాంతములను పేర్కొనగలను. స్థలపరిమితిని తలచికొని నిట్టూరుపు పీలుచుంటిని.

రాధాకృష్ణునందు హృదయమేధస్సులు సరిసముగ నుండుటచే, ఈతనిహృదయము వెలార్చు ఆవేశ

పూరమున కీతని మేధస్సు కట్ట లేర్పఱుచుచుండును. ఆవేగసంవరణము లీతనియందు చక్కని సమన్వయ మందినవి. కనులు మూసికొని "వహ్వా!" యని ఈతడు గంతులు వేయడు. తపసియే కాని, కనులు మూసికొని ఈత డేమియు పలుకడు. ఈయంశమును మనసునందు నిలుపగలిగితిమేని ఈతని రచనావిధాన మెట్టిదో, ఈతని చరిత్ర యెట్టిదో గ్రహింపజాలుదుము.

ముందంజవేయు మహనీయులలో పల్వురు గతమును పూడ్చిపెట్టుమనువారు కలరు. ప్రాచీభావామృతమును తనివార గ్రోలిన రవీంద్రుడే ఒకప్పుడుత్సాహపరవశుడై గతమునుగురించి ఓమువోడుకుఅభిప్రాయమును వ్యక్తీకరించినాడు.* అంధానుకరణము "నిస్సీ!" యని త్రోసివేయు రాధాకృష్ణుడు యుగయుగములనుండి కొట్టుకొనివచ్చు తెట్టెని నెట్టివేయు రాధాకృష్ణుడు భారతప్రాచీనమహత్త్వమును పునరుద్ధరింపదలంచు మహాత్ములం దొక్కరుండనియు, ఈపునరుద్ధరణమునకు నూతనసృష్టి తోడుపడవలెనని కాంక్షించు విజ్ఞానపిపాసువు రాధాకృష్ణుడనియు నొక్కి చెప్పగలను.†

అన్యదేశీయులేకాక, పాశ్చాత్యనాగరకతయందు మునుగుచు తేలుచునుండు భారతీయులుకూడ హిందూమతమును చేరుపట్ల దివిటీలనుకాక కొరకంచులను చేతబట్టుచుండిరి! సంస్కృతాక్షరము తెలుగని వెంకయ్యలు సనాతనమతముపై తూటాలు వదులుచున్నారు. సనాతనవిజ్ఞాన మహత్త్వము నుగ్గడించు మహనీయుల‡ పలుకు లాలింపక, అందలి తేనియ నించుకైన చవిచూడని దేవయ్యలు దానిపై నిప్పులు చెరిగి పోయుచున్నారు. రాజకీయసాంఘిక రంగములందు గోచరించు ఆర్ది నెప్పులకంటె భారతమతరంగమున తోచు ఆర్ది నెప్పులు భయదమై యున్నవి. మన మతమహత్త్వమును మనము గుర్తింపక, మన నాగరకతను మనము ఛిద్రంటించుచుండ నొరులు మనపై పన్నీరుజాన కురిపింతురా? నిన్నకాక మొన్న మేయోకన్య కారుకూతలు కూసినది. నేడు ఒకసుప్రసిద్ధ ఢిల్లీ వారపత్రికలో నొక యాంగ్లేయుడు భారతీయులు పశుజాతివారని తెలుపుటకు సంశయింపలేదు. హిందూమతమును హిందువులు గౌరవించినంతకాలము, విదేశీయులు సయితము ఆమతవిజ్ఞానమును దోసిళ్ల గ్రోలిరి. తమమతమునెడల హిందువులకు గల విశ్వాసము సన్నగిలినదాది అది యొరుల వెక్కిరింతలకు గుఱియైనది.§ హిందువులు దయ్యముల నారాధించువారని పల్వురు పాశ్చాత్యులు అపోహపడిరి. ఈ దురంత విప్లవమును వివేకానందస్వామి ఛేదింప గమకించినాడు. రామకృష్ణుని సహజగంభీర భావముల నాతడు పాశ్చాత్య జగతిపై వెదచల్లినాడు. వివేకానందస్వామి వెనుక హిందూమతమహత్త్వమును ప్రతీచీసీమలందు ఉగ్గడింపగలిగిన మహాపురుషుడు రాధాకృష్ణుడే. వివేకానందుడు సన్యాసి, వంగీయుడు, విశేషావేశము గలవాడు. వంగ ప్రకృతికి సహజమైన ఆవేశమునకు మతావేశము తోడుపడినది. ఆవేశపూరిత హృదయుడై యితడు హిం

* Rabindranath Tagore on "Past"

† Radhakrishnan's Remarks on "Religion" and Civilisation in his Indian Philosophy; "Hindu view of life" and "Idealistic view of Life".

‡ Jagadguru Sree Puri Sankaracharya's "Gita Lectures"; Lokamanya Bala Gangadhara Tilak's address delivered at the Conference of the Bharat Dharma Maha mandal held in Benares on 3rd January 1906.

§ పదునేడవ శతాబ్దమున భారతదేశమును దర్శింపవచ్చిన బెర్నియర్ అను ప్రయాణికుడు మొగలాయీల యైశ్వర్యమున కెంతేనినిలువగట్టి, హిందూమతమును హాస్యదృష్టితో విలోకించినాడు. "...Superstitious piety and compassion toward the sun ... trickery of prayers, of ablution, of dippings and of alms ... all that fabulous trash of their Beths and other books..."

దూ ఆచారములను గుఱించిన దురభిప్రాయములను తుత్తునియలుచేసినాడు.* పాశ్చాత్యవిద్యాధికులు కొందఱు హిందూవిజ్ఞానముదెస దృష్టిసారించిరి. జోన్సు, కోల్‌బ్రూక్, మేక్సుముల్లరు ప్రభృతులు సంస్కృతమును చక్కగ పఠించిరి. వివేకానందునివలెనే రాధాకృష్ణుడు భారతీయులందు భారతీయుడు. అందున ఇతడు ఆంధ్రుడు. వంగీయునకు గల ఆవేశము ఆంధ్రునకు కూడ గలదు. ఈతనికి తమిళునకు గల మేధాశక్తి కూడకలదు. ఈశక్తి యావేశమును పొంగనీయదు. తన యావేశమును తనహృదయమందు చిక్కబట్టగల రాధాకృష్ణుడు వివేకానందునికంటె గడసరియై, కేవల మతోపదేశమునకు పూనుకొనక పాశ్చాత్యప్రకృతిని తట్టగల అద్భుత తార్కికతాత్త్వికశక్తిని పురస్కరించుకొని, భారతవిజ్ఞానమందలి గొప్పందనమును రెండవ మానవమాత్రునకు సాధ్యముకాని వచఃకౌశలమున ప్రతీచీవిద్వాంసులమ్రోల వ్యక్తీకరించినాడు. స్వామిజీ ఉద్బోధనమునకు చెవియొగ్గి, ఆతని చరణములొత్తిన పాశ్చాత్యులు, ఆతడు ధారవోసిన మతావేశము తమయందు నిలిచినంతకాలము, ఆతని పవిత్రస్మృతిని దలచి ఆతనియడుగుజాడలనుబట్టి నడచిరి. పదపడి తమతొంటి పుంతయందు తాము ప్రవేశించిరి. రాధాకృష్ణుని వాక్కులు హృదయమునేకాక మెదడునుకూడ తట్టినవి. ఈతనివాక్కులు కేవలము పూలవానయట్లు కురిసి, స్మృతిపథమున సౌరభవాహిని బ్రవహింపజేసి యూరకొనవు. ఈతనిభావములు ఎదుటివ్యక్తి మనసున చిరస్థానమునందజాలునవి. హేతునిరూపణము గావింపక ఈతడొక్కమాట నుచ్చరింపడు.†కవితాధారలు వాదనమునకు పనికివచ్చు పరికరములు కావు. తార్కికుని వాక్కులు విషయగ్రహణమునకును, ఎదుటివాని వాదనలను తునియలుచేయుటకును పనికివచ్చును. కాని యివి చెమ్మటబొట్టులను రాలజేయును; ఉస్సురస్స రనిపించును. "అబ్బా!" యని ఒకడు గ్రహించిన అంశములు హృదయమున నిలుకడగనజాలవు. తర్కమునకు కవిత్వము తోడుపడి వ్యక్తపఱచిన నుడువు హృదయంగమమగును. ఇట్టి నుడువులు రాధాకృష్ణునిసొమ్ములు. మతావేశమునకు తాత్త్వికపరిజ్ఞానము తోడగుటచే భావగమనిక క్రమమైయుండును. రాధాకృష్ణుని భావగమనిక వేగవంతమైనదయ్యు నొడుదొడుకు లెఱుంగదు. హిందూమతమును గుఱించిన ఈతని అద్భుతోపన్యాసములు ప్రతీచీమహావిద్వాంసుల హృదయములను కదలించివేసినవి. పశ్చిమఖండమందలి ఈతని తొలుతటి ఉపన్యాసమును వినిన కేంబ్రిడ్జియూనివర్సిటీ వైస్‌ఛాన్సెలర్ తాను హిందువయినట్లు మురిసిపోయినాడు. లండన్ విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు "ప్రాచీయాచార్యుడైన రాధాకృష్ణుని చరణోపాంతమున గూర్చుని" ఆతని గంభీర వాక్కులు వినుతరుణము తనకు చేకుఱుట తన యదృష్టమని పలికి పరమానందభరితుడైనాడు. స్వాతంత్ర్యము లేని భారతీయులను, నిరుపేదలైన భారతీయులను చూచి వారి నీసడించు ఆంగ్లేయులే రాధాకృష్ణునిపై పూలవాన గురిపించిరి.

రాధాకృష్ణుని గ్రంథము లన్నిటియందును హిందూమతమును గుఱించిన ఆతనిభావములు ఉత్తాల తరంగములట్లు పొంగుచుండును. హిందూమత సారము నీతడు తన "The Hindu view of life" లో తెలిపినాడు. శైలిసౌకుమార్యమునకును, భావసౌందర్యమునకును ఈతని గ్రంథములలో నిది మిన్నయని నా యభిప్రాయము. గ్రంథకర్తకు కూడ నిట్టి యభిప్రాయమే యుండును. కావుననే దీని నీతడు తన యర్ధాంగలక్ష్మి కంకితముచేసెనని నాతలంపు. ఇది యించుమించుగ నన్ని యైరోపియను భాషలలోనికి ననువదింపబడినది.

---

* Swamy Vivekananda's address delivered at the Chicago Parliament of Religions, September 1893.

† Prof. A. R. Wadia's remarks on Reason in his Address at the third Session of the Nanjangud Karnataka Sanghas Philosophical Conference.

వెనుకటి విజ్ఞానులమాటలనే యితఁడు ఆంగ్లమందు విసరి వేయలేదు. *

హిందూతత్త్వశాస్త్రముతో పాశ్చాత్యులకు కొంత పలుకుబడి కలిగించిన వంగదేశపండితు లిద్దఱు కలరు. దాస్‌గుప్త, హాల్దార్‌లు చక్కని చరిత్రకారులట్లు మన భావవాహినినేకరువుపెట్టిరి. వీరికిని రాధాకృష్ణునకును పోలికయే లేదు. ఐదుఖండముల మనసులను ఆకర్షింపగలిగిన కవిపండితుఁడై, పండితకవియై ప్రాచీప్రతీచీనాగరకతలకు మేలిపెండిలి సేయ దొరకొనినవాఁడు మనరాధాకృష్ణుఁడు. †

తోటకాపరి ఉద్యానమందలి కలుపును, ముండ్లపొదలను ఊడపెఱికి, చక్కని తీవలనునిలిపి, క్రొత్తలతల నందునాటును. ఉద్యానమపుడు నవనవోన్మేషమై యుండును. అధునాతనపృథ్వీసభ్యత నొక యుద్యానమట్లు విలోకించి దీనికి ప్రస్తుతరూపొసగిన మతములను పరిశీలించి, వానియందు దలయెత్తిన కంటకములదెస వ్రేలెత్తి రాధాకృష్ణుఁడు నవజీవన సముద్భాసితసభ్యతకనులపండువొనరింపవలెనని యుద్దేశించుచున్నాఁడు. ‡

ఇట్లుద్దేశించుపట్ల హిందువుల మతసాంఘికజీవనముల నితఁడు పరిశీలించి వానియందలి విశిష్టతను ప్రతిపక్షు లెంత తెముటదోచినను జంకుగొంకులేక ఋజువు చేసినాఁడు. హిందూబౌద్ధమతము లుద్బోధించు కర్మసిద్ధాంతమెట్టిదో పాశ్చాత్యులమాటటుండ పల్వురు భారతీయులే గుర్తింపరైరి. ఈ సిద్ధాంతమునెడల నవిశ్వాసము చూపినవారిలో కొందఱు బ్రహ్మసమాజికులు. వీరిలో నాంధ్రబ్రహ్మసమాజికులకు తలమానికమనిపించుకొనిన వీరేశలింగంగారొకరని వీరి వాల్యూములను చదివినపుడు గ్రహింతుము. హిందూమతసముద్భవమైన బ్రహ్మసమాజము ననుష్ఠించు మహనీయులలో పల్వురు హిందూమతతత్త్వమును సమగ్రముగ గ్రహింపనివారగుటచే అందలి మహత్తరాంశములు కొన్నింటిని అనుచితవిమర్శకు గుఱిచేసిరి. కావున వీరిని గాంచిన హిందూసోదరులు కొందఱు వీరు తమనుండి వేఱైనవారని అపోహపడిరి. అధునాతన విద్యావిధానమున భారత తత్త్వశాస్త్రపఠనమునకు తావులేనందున, నేటి విద్యాధికులనేకులు స్వీయసీమవిజ్ఞానము నన్యదేశీయసులోచనములందు పరికించి, అందలి బహుళాంశములను తీవ్రముగ తునియలొనరింపబూనుకొనిరి. అధునాతన విద్యాధికులలో నొక్కండైన రాధాకృష్ణుఁడు సాహసోపేతుఁడై వీరికెదుటనిలిచి 'కర్మ'మున్నగు వాదములను గాండీవివలె సమర్థించి వానియందలి నిగూఢమహత్త్వమును తేటతెల్లముగ వ్యక్తీకరించినాఁడు. §

కర్మసిద్ధాంతమును గేలిచేయువారిలో ప్రధానులు క్రైస్తవులు. మానవునకు లభించునది ఒక్కటేపుట్టుకనియు, జన్మాంతమున నాతఁడు చిరనరకమునుగాని,

---

* The Hindu view of life, Page 130. Ibid Page 37. "The Hindu view of Life, Page 77. Ibid, Page 38

† "Counter attack from the East" By C. E. M. Joad, Page 39.

‡ "The Hindu View of Life" Page 128. "It is a pious delusion to think that none else than Jesus attained this consciousness of Spiritual oneness with God" "It cannot be contended that it is impossible to reach heaven unless it be through the mediatorship of Jesus." (Extracts from Radhakrishnan's "Hindu Thought and Christian Doctrine") Radhakrishnan's "Kalki" Page 68 Ibid Page 43. Ibid Page 40. "The Hindu View of Life" Page 59. Radhakrishnan's Indian Philosophy Vol. II Page 768.

§ Radhakrishnan's Chapters on Karma in "The Heart of Hindustan" and "Indian Philosophy."

చిరనాకమును గాని అనుభవింపవలెననియు వీరివాదన. ఈచిరస్వర్గము ఒక్క ఏసుక్రీస్తువల్లనే లభించుననని వీరందురు. ఈవాదములను రాధాకృష్ణుడు ముక్కముక్కలుచేసి వదలినాడు. (**Vide: Radhakrishnan's "Hindu Thought and Christian Doctrine"**) చిత్రమేమన హిందూకర్మసిద్ధాంతమును బలపడుచు భావార్థమును క్రైస్తవప్రధానాచార్యుల ప్రబోధములందు కలదని ఇతడు రూఢిచేసినాడు.♦ కొమ్ములుతిరిగిన క్రైస్తవబోధకు లీతని నుడువులు విని చల్లున లేచిరి.

హిందూసంఘమందలి జాతులను గురించి పండితులు పలువిధములైన చర్చలు సలిపిరి. ప్రొఫెసర్ కీత్, సర్. హెచ్. రిస్లే, ప్రొఫెసర్ రాప్సన్ మున్నగు ఆంగ్లేయవిద్వాంసులు వీనిచారిత్రక ప్రాముఖ్యమును గురించి తమకు తోచినదేమో తెలిపిరి. అనునాతన భారతవిద్యాధికులు వీనియస్తిత్వము కూడదనుచున్నారు. హిందూవర్ణములపై తరుచుగ దుమ్మెత్తి పోయువారిలో ముఖ్యుడు ప్రఫుల్లచంద్రరాయలని "ఒకభౌతికశాస్త్రజ్ఞుని అనుభవములు" అని యీతడు వ్రాసినగ్రంథము వలన బోధపడును. రాధాకృష్ణు డీవర్గపువ్యక్తులలోనివాడు కాడు. హిందూసంఘమున నేడు గోచరించు లోపములను ప్రతిఘటించుటకు వెనుదీయని ఈతడు వర్ణాశ్రమధర్మమందలి గభీరోద్దేశములను విపులీకరించినాడు.$

రాధాకృష్ణుని సాహిత్యతాత్త్విక మతభావములను విపులముగ విమర్శించుట కీవ్యాసమున చోటులేదు. ప్రపంచమున కంతకు నీయాయంశములందు ప్రామాణ్యము చెప్పగలవ్యక్తులు కడు నరుదుగ బుట్టెదరు. తెలుగమ్మ కడుపునబుట్టిన రాధాకృష్ణు డిట్టివాడని తెలుపుట నాయాశయము.

## రాధాకృష్ణుడు వక్త

కళోపాసకుడు ఏమికావలచినను అగును. అసాధ్యములను సాధించు శక్తి ఈతనికి కలదు. కళోపాసనమున నాటితేరిన రాధాకృష్ణుడు విజ్ఞానియంద్రజాలు బహువిధశక్తులనందినాడు. దీనిలో నీతని వక్తృతాశక్తియొకటి.

ప్రపంచచరిత్రయందు మహావక్తలకు ఎంతేని చోటున్నది. డెమస్తెనీస్, సిసేరో, బర్క్, పిట్, ఫాక్స్ మున్నగునాంగ్లేయులు మాపుగాని కీర్తి నందిరి. మనదేశమందు కూడ మహావక్త లుద్భవించిరి. ఈవక్తల సామర్థ్యమున వ్యత్యాసము కలదు. సురేంద్రుని భాష చక్కనై యుండెడిది. ఆతని కంఠము జలధరగర్జన సన్నిభము. బిపిన్‌పాల్‌శైలి అంత చక్కనిది కాదు. అపుడపుడు గ్రామరుతప్పుల నతడు వదలువాడు. ఈతని యుచ్చారణము నిర్దుష్టమైనదికాదు. కాని సింహనాదమొనరించుచు నీత డుపన్యసించువాడు. శ్రీనివాసశాస్త్రి గొప్ప వక్తయే. కాని, యితడు ప్రేక్షకుల యాత్మలను నృత్యము చేయింపలేడు. ఇతనియందు ఆవేశమేమియు గోచరింపదు. ఇతనిభావములు మిగుల లలితములై అలంకారశోభితములై యుండును. ఇతని భాష చక్కందనమునకు మారుపేరై యుండును. ఇతని యుచ్చారణ మాంగ్లేయులకు కూడ సిగ్గు దెచ్చునదై యుండును. ఇతని యుపన్యాసము వినుతరి కదలక మెదలక గూర్చుని ఎంతేని హాయినందుదుము. సరోజిని యుపన్యసించుతరి రెక్కలుకట్టుకొని వివిధరాగసందీప్తభావాంబర వీథులందెగయుదుము.

రాధాకృష్ణుడు మహావక్తలందు శిరోమణి. ఈతని శక్తి ఈతనికే సాటి. వంగీయునకుగల మహావేశ మీతనికి లేదు. వక్తకు క్రమగతి నుబుకు భావనావేశముండుట అనివార్యము. వంగీయుడు తరుచుగ గణాచారివలె గంతులువేయును. నృత్యమందు భావబంధురమైన గమనికయుండవలెను. ఈగమనిక క్రమముదప్పెనేని

♦ Radhakrishnan's "The Heart of Hindustan" Page 119.

$ Radhakrishnan's "The Hindu Dharma" and "The Heart of Hindustan" Page 21 Etc.

నృత్యము నెత్తిగంతులగును. పెల్లుబ్బు ఆవేశము వక్త వాక్కులనుండి వెడలెనేని, అతడు క్రమముదప్పిన వాచాలుడగును. ఛర్చ్చనుండి వెడలు పియానోశబ్దమువలె భావము ననుసరించి ఒకపరి నింగినంటుచు, వేఱొక తూరి క్రిందికిదిగుచు తరంగభంగినుండు నిస్వనము ఆదర్శ వక్తల కంఠములనుండి వెడలును. ఇట్టి కంఠముగల ఆమదె బీసెంటుసతి. విషయము ననుసరించి భావ గుణము ననుసరించి, గర్భాలయమునుండి వెడలు ఘన శబ్దమట్లు వక్తహృదయమునుండి ధ్వని వెడలును. రాధాకృష్ణు డుద్రేకమును రేకెత్తించు విషయములజోలికి పోఁడు. అతడు మిక్కుటముగ వలచినది తత్త్వశాస్త్రము. ఇందలి భావము నదీపూరమువంటిది. తత్త్వశాస్త్రమును దిగమ్రింగిన రాధాకృష్ణుని హృదయమునుండి భావపూరము గంగాఝురివలె వెడలును. పైనపేర్కొనిన వక్తలందఱిని మించిన విజ్ఞానియగుడు, ఈతనికిగల భావశబలత వారికి లేదు. భాషాజ్ఞానమందు కూడ నీతడు వారికన్న మిన్నయని వచింతును. ఆంగ్ల మీతనిచేతులందలి కందుకము.

విశేషభాషాజ్ఞానము వక్తకు కావలసిన పరికరము. ఈజ్ఞానమే ఒక్కనివక్తగావించుననుట శుద్ధ తప్పు. రక్తమట్లు ఎఱ్ఱనైన మందారమునుగాక సురభిళ గులాబిసూనమునే కళోపాసకుడు ముద్దిడుటకు కారణము హృదయమును పల్లవింపజేయు భావ కుసుమ మందుండుటే. గంధబంధురభావమును సృష్టింప నుప్పొంగజేయు హృదయమే తేనెసోనలను వెడలింపగలదు. ఈ హృదయము సౌందర్యమాధుర్యములకు నిధానము. రాధాకృష్ణు డిట్టిహృదయముగల వక్త. ఈతనివాక్కులందలి చక్కందనము, ఈతనివాక్కులందలి చల్లందనము, ఈతని వాక్కులందలి తియ్యందనము నిరుపమానములు.

రాధాకృష్ణుని హృదయము మెఱపుల నిక్షేపము. మెఱపుగొనములు రెండు. అద్భుతతేజము, మహావేగము. ఈతనివాక్కులు తేజోయుతములై మహావేగమున వెడలును.

కడువడిగ మాట్లాడుట వక్తకనివార్యముగ నుండవలయు లక్షణమని చదువరు లూహింపరాదు. భావదారిద్ర్యముచే చిక్కిన హృదయము సహజ భాషాధుని నిని వెల్వరింపలేదు. భావరహితులై వడవడవాగువారు మొఱకులచే "నోహో!" యనిపించుకొందురు. వీరి వాక్కు బాకాచప్పుడువలె భయము గొలుపునుగాని, సన్నాయివలె శాంతసమొసగదు. రాగాలాపనము హృదయమునుండి కగా వెడలవలసినది! ఈహృదయము రససహితమైనదై యుండవలెననుట నిర్వివాదాంశము. సహజశక్తికి సాధనశక్తి తోడైనపుడే కళ శోభిలును. మహావక్తయని మనము పేర్కొనువ్యక్తి, నిభృతమున పెక్కుదినములు పెక్కురాత్రు లాసీనుడై, అప్పుతలపులు మూసికొని, ఆత్మహృదిలోనికి తరలి అందుగల తన కళావిభూతిని పరికించి, బాహ్యప్రపంచమందు దారమ నవతరింపజేయుటకెంతేని తప మాచరించును. అప్పపాటుకాలమున వక్తముఖమునుండి వెడలువాక్కును విని ఆనందింతుముగాని ఆవాక్కు బహువర్ష తపఃఫలమని యోజింపము. రాధాకృష్ణుని హృదయము వెలుగుతో నిండినది. పిండిముద్దనుండి చక్కని బొమ్మలు చేయు చేడియకైవడి, రాధాకృష్ణుడు తనయెడదయందలి వెలుగు నెన్నియోవిధముల సాధించి మెఱపులను సిద్ధము చేసినాడు. రంగస్థలిపై "Ladies and Gentlemen" అని యితడు నోరు తెఱచినంతనే ఈ విద్యోతములు హాతూలపక్షముల నెగసిపోవును.

ఉదయభానునితో ఎంతెంతన రమ్యారణ్యమునుండి శకుంతతతులెన్నో రివ్వురివ్వున వియత్తలము దెస నెగయును. పొడుపుకొండపై తోచు భాస్కరుని వలె, రాధాకృష్ణుడు రంగస్థలిపై నిలిచినంతనే ఆతని హృదయారామమున గల భావవిహంగములు రివ్వు రివ్వున నవ్వలిజగతిపై నెగయును. తన భావములతో రాధాకృష్ణు డెగయును. అద్భుతగమనిక ఆతనికి సహజమైనది. సహజభావముగాని, సహజభాష గాని లేక, వడివడిగ మాట్లాడి మహావక్త యనిపించుకొన జూచు వ్యక్తి నాల్కద్రెంపుకొని నిముసములో చచ్చును.

ప్రతిభాశాలియైన కళాస్రష్టుడు కావున, రాధాకృష్ణుని హృదయమం దావేశమును, ఉద్రేకమును క్రమగతి నుప్పొంగును. ఇవి యుప్పొంగినపుడే భావతరంగములువ్వెత్తుగ లేచును. గణితబోధకునివలె కళోపాసకుడు అడుగులు లెక్కించుచు నడువకుండుటకుకారణ మాతని

హృదయము అశ్వహృదయవిద్య నెఱిగిన మహారథికుడు నడపు హయమాయువట్లు కదువడిగ ముందులకు డాయించుటయే. రాధాకృష్ణుడు సంయమశక్తి గల మనీషి. గుఱ్ఱమట్లు పర్విడు ఈతని హృదయము నీతని మెదడు తనవల్గముచే బట్టియుంచును. వల్గము, అనుచిత గమనమును నిరోధించును గాని క్రమగతి కాటంకము గలిగింపదు. ఆత్మకురుక్షేత్రమున రాధాకృష్ణుడు తనవశ్యవాక్కును, పార్థుని తేరు నడపిన రాధాకృష్ణునివలె నడపును.

ఆవేశము నెఱుగని హృదయము వక్తృత్వప్రారమును వెడలింపలేదు. ఈ యావేశము ఆధ్యాత్మికశక్తి సమన్వితమైనది. దీనినే రాధాకృష్ణుడు **Spirit of Man** అనుచుండును; అదృశ్య అంతరంగపృథ్వినుండి భావబ్రహ్మండము నివ్వలికి దొరలించును. కొయ్యవలె నిలిచి తక్కుచు, తారుచు నేమోమాట లుచ్చరించు వ్యక్తి భావనావేశ మెఱుగని పుల్లయ్యయని పల్కుదును. ఇతని తల పెద్దదై యుండవచ్చును. ఇతనిహృదయము చిన్నదనుట నిస్సంశయము. ఇతడు శాంతమూర్తి యనుకొనవచ్చును; కాని కళోపాసనమునకు పనికిరాడు. భావనావేశము నెఱుగని హృదయము శిలాసన్నిభము. మొండిరాతి నాశ్రయించునది శాంతముకాదు—మతిచిరమరణము. ఆవేశసంయమములు కలవాడు కావున రాధాకృష్ణు డాదర్శవక్తయు, ఆదర్శవ్యక్తియుకూడనైనాడు. **"Style is the man"** అని **Newman** ఊరక పలికినాడా?

జనసామాన్యముయొక్క చప్పటుల నాశించు వక్తలలో పల్వురు సరుకులేని ఓబయ్యలు; సభికుల మనోభావమెఱిగి **Argumentum ad Papulum** లో సాటితేటి వీరుపేరుసంపాదింతురు. ప్రదర్శనపటాటోపమునుగాని, వ్యర్థవిజృంభణముగాని యెఱుగని రాధాకృష్ణుడు వీరికి పెక్కామడల దూరమందున్నాడు. ఈతనివాక్కులు నయాగరాజలపాతమువలె వెడలునవేయైనను భయంకరశబ్దము నెఱుగవు. ఎదుటగలకుర్చీలు కాష్ఠముచే నిర్మింపబడినవి. కాక విజ్ఞాన ప్రభాకలితములైన యెడల ఈతనివాక్కులు విని రాసక్రీడలదేలును; వానితో నొక్కమాఱు దివి భువికలిగి సురధునియందు గ్రుంకులిడును.

నేటివసుంధరయందు రాధాకృష్ణుని మించినవక్త లేడని ఎవరెస్టుశిఖరమునుండి కంఠమెత్తి పల్కగలను.

## రాధాకృష్ణుడు రచయిత

రసనమునుండి అమృతధారలు కురిపింపగలవారందఱు రచయితలుకారు. కలముకొనయందు సృష్టి చిత్రములు చూపగలవారందఱు వక్తలుకారు. రెండు శక్తులుగల కళావ్రతుడురాధాకృష్ణుడు. ఈశక్తుల కతననే ఈతడు స్థలకాలపరిమితుల నతిక్రమించు అంజవేయగలిగిన మహావ్యక్తియైనాడు.

గతేహృదయమువలె రాధాకృష్ణుని హృదయము అలంకారముల యూట. కావున నీతని వచనము లలంకారముల యూటయైనవి; కావున నీతని రచన లలంకారశోభితములై యుండును. తెచ్చిపెట్టుకొనినసగలు వికృతరూపమునిచ్చును. సహజకుండలములు దేవేంద్రుని కన్నులను గూడగుట్టవా? రాధాకృష్ణుని కలము సహజకుండలములు కలది.

సహజభావమున్నతావున సహజ రచనముకూడనుండును. రాధాకృష్ణుని రచనము ముద్దులు మూటగట్టుననిన జాలదు. "ఇత్యమరః" యని యిత డేరచయితననుకరింప లేదు. అనుకరణమున మనుష్యత్వ మేది? ఇది మిషనునకు తగినపని; మనుష్యునకు తగినదికాదు. రాధాకృష్ణుడు మిషనుకాడు; మనుష్యుడు; మనుష్యులందు మనుష్యుడు. జలజగర్భమున నెందో యుదయించు తావిపట్టులు ఈతని తలపులు ఈతనిహృదయమున నెందో జనించును. పూవు కనుకలలు ముత్తెపుతుంపురులై పూవుమోమున కాంతిలును. కళోపాసకుని కలలు ఆతని రచనమున మౌక్తికములట్లు వెలుంగును. రాధాకృష్ణుని రచనము తారహారసందీప్తమైయుండును.

విజ్ఞానము, ఆత్మవిశ్వాసము, స్వాతంత్ర్యము, సాహసము, రసానుభవకౌశలము ఆదర్శరచయితసొమ్ములు. జంకుచు గొంకుచు, తలగోకుచు, మెదడుమెట్టుచు,

స్మృతి కేదారమున పద్యములను నెమకుచు కలముపట్టు పెద్దన్నయ్య తనకలమునకు సిగ్గును, తనరచనా జీవనము నకు తలవంపులను దెచ్చును. సహజశక్తి ఆత్మకు చెంది నది కావున, పదప్రయోగమందుగూడ సహజశక్తిని జూపునాతడు తొలుత తాను తనయంతరంగమున నమి తానందమంది పఠితల హృదయములందు గూడ రస తరంగిణుల నుప్పతిలజేయును. అక్కఱగుపట్ల నీతడు ఆదర్శరచయితల ప్రయోగముల నుపయోగించునుగాని, యిట్లొనరించి తనపాండితిని చూపునుగాని, ఒక్కొక ముహూర్తమున నావేశమంది వీనినిగాని వానినిగాని తలపక కడురయమున తనసృష్టి దాను కావించుకొనును. ఈతని రచనమున ఎసుడు దిగుడులు గాని, గతుకులు గాని, ముండ్లపొదలు గాని ఉండవు. నూతనప్రయోగ ములనే కాక నూతనశబ్దముల నీతడు సృష్టించును. ఈ విద్దెయం దాటితేఱిన ఆంగ్లకవి మిల్టన్. సారస్వత ప్రపం చమున పట్టభద్రుడైన వ్యక్తి ఏమనినను అది యొరులకు నొరవడి యగును. మిల్టన్‌కవి సృష్టించిన 'Pandemonium' మన్నగు పదముల నెందఱెందఱు నేడును ఎత్తి కుదించుటలేదు ? ఇట్టి స్వాతంత్ర్యమును చూపగలిగిన ఆంధ్రమహారచయిత తిక్కన. అధునాతన యుగమున ఆంధ్ర సారస్వతమున నెందఱో పండితులు పోలీసుగిరి చలాయింపజొచ్చిరి ! చేత సంకెళ్లుపూని హుమ్మని నవ్యరచయితలపై వీరుబుకుచుందురు. నిరంకుశత్వము విజృంభించుచోటులందు సహజశక్తి మూలబడి ముక్కి పోదా ? ఇట్టిస్థితియందు కూడ రచనావిధానమున కొంత క్రొత్తందనమును చూపగలిగినవారు తిరుపతి వేంకటకవులు; వీరిలో తిరుపతిశాస్త్రిగారిది పైచేయి

రాధాకృష్ణుడు ఆంగ్లమహా రచయితల గ్రంథ ముల నన్నిటిని జీర్ణించుకొనినాడు. రచనారహస్యముల నన్నిటిని పిడికిటబట్టినాడు. సరియైన, అసలైన, అంద మైన పదములనే ఈతడు ప్రయోగించును. Epigram లను సృష్టించుటందీతని మించిన రచయితలేడు. ఇతడు వాడు Allusions, Allegories ఈతని పఠనము హద్దు పద్దులేనిదని రూఢిచేయును. క్రొత్తదైన తలపునీతడు క్రొత్తదైన పదప్రయోగమునందే తెలుపును. వక్తృత్వమందువలె, ఆంగ్లభాషారచనమున నీతనికిగల శక్తి నేడేయాంగ్లేయునకును లేదు. గంభీరభావ విలసితములై, సౌందర్యోపేతములైన ఈతని రచనలను ఆంగ్లమహా విద్వాంసులు కనుల కద్దుకొనుచున్నారు. తత్త్వ శాస్త్రాంశములనిన పదియోజనముల మారను పర్వెత్తు వారు రసవృష్టి కురిపించు ఈతని వచనములను వినుట కును, తేనెతో తొలుకాడు ఈతని రచనములను మన సారగ్రహించుటకును ఆతురంపడుదురు.

ఇట్టి కళాకౌశలము కలవాడు సాహిత్యాంగము లైన కథలను, వ్యాసములను, పాటలను, నాటకములను, నవలలను గూడ వ్రాయుచుండవలసినది. రవీంద్రు డీఫ రుకును మాత్రమే నమ్మకొనినాడు. అతనిహృదయ మొకవీణ. రాధాకృష్ణుని హృదయముకూడ వీణయే ! వీణపై వాయింప దగినవి పాటలును, కృతులును, రాగములు కాని గట్టిరాళ్లవంటి శాస్త్రాంశములుకావు. తనవీణియను మీటుచు రాధాకృష్ణు డీగట్టిరాళ్లను కర గించి వేయుచున్నాడు. ఇట్టి విద్యగల తాత్త్వికు డీత డొక్కడే. తాత్త్వికాంశములు పామరులకు కాక పండి తులకే యయ్యును, రాధాకృష్ణుని కలమునుండి వెడలు తఱి అవి రసహృదయులైన పామరులకు గూడ ప్రీతి కరములు కాగలవు.

నక్షత్రములను త్తిని మల్లెచెండులవలె జడయందు దురుముకొని, అమృతాంశ అరుణాంశ కిరణములను దండచేసి గళసీమయం దలంకరించుకొని, శమంతక మణి ద్వయమును దుద్దులు చేసికొని, మెఱపుల నధరోష్ఠ ములపై చిర్నగవుగావించి, కనులందు దివ్యతేజమును తళ్కొత్తించుచు, ప్రభాతకాలపద్మమట్లు ప్రఫుల్ల హృదయయై జవ్వని యొర్తుక ఎదుట దోచుచో, అది రాధాకృష్ణుని శైలియని తెలిపెదను. ఈదివ్యరూపము వాణిఏని తెలుపువారు, అది రాధాకృష్ణుని శైలికి రూపాంతరమని గుర్తింతురు. హృదయము గల మానిసి, కళయెఱిగిన వ్యక్తి, రసపిపాసులైన పూరుషుడు, ఆనం

దకామియైన మానవుడు దానిని కాంచి, ఆత్మవిస్మృతుడై అద్భుతస్వప్నము లల్లుకొనును.

## రాధాకృష్ణుడు అధ్యాపకుడు

రాధాకృష్ణుడు తనఅధ్యాపకవృత్తిని చెన్నరాజధానిలోనే ప్రారంభించినాడు. కాని అప్పుడీతడు దిఙ్మండలమంతటిలోని కోహినూరుమణియట్లుండెను. మణిప్రభపై కన్నువేసినవాడు రవీంద్రుడు. మణిని తనశిరమున దాల్చుకొనవలెనని మక్కువపడినవాడు ఆషుతోషుముఖోపాధ్యాయుడు. రాధాకృష్ణున కాషుతోషు చూపిన గౌరవము పల్వురు వంగీయులకు కన్నెఱ్ఱయైనది. మితిమీఱిన రాష్ట్రాభిమానముచే కనుపొరలను పెంచుకొనుట వంగీయుల యలవాటు. బ్రజేంద్రలాల్ సీల్‌చుట్టు రామభజనము చేసిన వంగీయులు 'మంద్రాజీ'కేమి, మణిముకుటమేమి యనిరి. ఆసమయమందే మణిముకుట మొకటి సీల్‌బుఱ్ఱపై పెట్టి దాక్షిణాత్యు లాతని మైసూరునందు నిలిపిరి. తనయెన్నిక తనపదాతులకు నచ్చలేదని ఆషుతోషు నవ్వుకొన్నాడు. తనపదాతులు కారుకదా తన్ను పుట్టించిన జేజెమ్మ వచ్చివలదనిన, ఆషుతోషు తననిశ్చితాభిప్రాయమును గచ్చకాయవలె చిటుకగొట్టుకొనువాడు కాడు. ఇతనికి బెబ్బులి ("Bengal Tiger") యనుమాఱుపేరు కలదు. ఒకమాఱు శార్దూలముగర్జించినంతనే క్షుద్రజంతువులు కలుగులలో దూరినవి. పులిగతించినవెనుక నివి రాధాకృష్ణునిజూచి ఎన్నెని కూతలు కూసినవి. గంభీరహృదయుడైన రాధాకృష్ణుడు గంధగజేంద్రమట్లు తనదారిని తాను నడచినాడు. అచిరములో సభ్యజగతినుండి ప్రేమపుష్పాంజలి నందినాడు. ఆషుతోషు అస్తమించినపుడు చింతితహృదయుడై రాధాకృష్ణు డామనీషిని దాను కలిసికొనిన శుభముహూర్తమును తలచికొనుచు, ఆతనియాత్మ నుద్దేశించి పూలచెండును విసరినాడు.*

మహాపురుషులసేవించు భాగ్యము నాకు పిన్ననాడే కలిగినది. రాధాకృష్ణుడు కలకత్తాయందడుగువేసినంతనే ఆతనిపై కన్నువేసితిని. ఈతని మకాము భవానీపురమందుండెడిది. పాల్, రాధాకృష్ణ, చిత్తరంజనులను తఱచుగ (మువ్వురును భవానీపురమందే వసించుచుండువారు కావున) గలిసికొనువాడను. బిపిన్‌చంద్రపాల్ నకు దక్షిణదేశీయులపై ప్రీతిమెండు. ఆతనికీర్తివల్లరి దక్షిణసీమనుండియేకదా దశదిశల ప్రాకినది! తత్త్వశాస్త్రమున పాల్‌నకు చక్కనిపాండితి కలదు. రాధాకృష్ణునిపై ఆతనికి మిక్కిలి మక్కువయుండెడిది. నాయానందమునకు మేరలేకుండెడిది.

పదేండ్లకుమున్ను ఎం. ఏ. తరగతియందు నాకు పఠనీయమైనది ఆంగ్లసాహిత్యము. నాదృష్టిని కేవలము ఆంగ్లమందే నిలుపక, వివిధములైన ఎం. ఏ. తరగతులందలి ప్రధానాధ్యాపకుల ఉపన్యాసములు వినుటకై ప్రత్యేకమైన అనుమతిబడసి ఆయాతరగతులందు ప్రవేశించువాడను. జే. ఆర్. బేనర్జి, హాల్డర్, రాధాకృష్ణులు ఫిలాసఫి సెక్షన్‌లోని ముఖ్యులు. 5th Year Class లో రాధాకృష్ణుని ఇండియన్ ఫిలాసఫీ లెక్చర్లు, 6th Year Class లో వెస్టెర్న్ ఫిలాసఫీ లెక్చర్లను వినువాడను. శరవేగమున, తాను చెప్పదలచిన దానినీతడు అరగంట నేపటిలో ముగించి పిదప నిష్టాగోష్ఠి సలుపువాడు. ఇంద్రజాలము కొలదినిముసములుమాత్రము నిలుచునట. రాధాకృష్ణుని యింద్రజాలము ముప్పదినిముసములవఱకు నిలిచియుండెడిది. ఈసమయపరిమితియందే ప్రథమ ఆశియా విద్యామహాసభ కధ్యక్షుడై వారణాసీనగరము నాతడు మంత్రముగ్ధము గావించినాడు.

ఆగారమందు ప్రవేశించునపుడే ఇతడుపన్యాసములు మొదలిడువాడు. ఒకఫుల్‌స్టాప్ కాని, కామా కాని, సెమికోలన్ కాని ఈతని వాక్కుల నడుమనున్నట్లు నాకు తోచెడిది కాదు. రాధాకృష్ణుడు తన విజయపతాకమును తొలుత, నీతరగతులం దెత్తి, పదంపడి విశ్వమహాసభలం దెత్తినాడు. భావ్యున్నతి కీతడు పునాదు లీతరగతులందే వేసికొనినాడు. ఇచట జరిగిన 'రీహార్సె'లు పదంపడి ప్రఖ్యాత ప్రదర్శనములైనవి. చేత నొక కాకితపు తునకైనను, తా జెప్పదలచుదానిని

---

* Radhakrishnan's article "The Calcutta Review" July number 1924.

గుటించిన పాయింట్లు గల చిన్ని తునక్కను, బూనని రాధాకృష్ణ డదేరీతిగ పదపడి పాశ్చాత్యదేశములందు "Upton Lectures" "Heskell Lectures" "Hibbert Lectures" మున్నగు మహోపన్యాసములను గావించినపుడుకూడ నట్టి తునక్కను చేబట్టినాడు కాడు. ఇట్టితునక్క శాస్త్రి కనివార్యము కాని ఈతనికి కాదు. రాధాకృష్ణ డుపన్యసించుచుండ గదిగోడలును, బెంచీలును తన్మయానంద మందుచుండెడి వనిన, మా యానంద మెట్లుండెడిదో నేను పాఠకులకు తెలుప నక్కరలేదు. 1926 లో ఈతడు తొలుత పశ్చిమఖండముల కరిగినాడు; ఆంగ్లవిద్యాధికులు వందిమాగధులై ఈతని వెంటబడిరి.

1929 లో ఆక్స్ఫర్డులో రాధాకృష్ణ డధ్యాపకుడై యుండెను. ఆంగ్లావనియందు స్థిరవాస మేర్పఱచుకొని ప్రశంసనీయమైన తనవృత్తి నందే జరుపుడని ఆంగ్లవిద్యార్థులీతని వేడిరి. కాని ఈతడు భారతాంబ మీదనే తనదృష్టి సారించినాడు. ఇటలీనుండి ముసోలిని ఈతని నాహ్వానించెను. అమెరికను లీతనిరాకకై యెదురుచూచిరి. అఖండమందు గూడ నీత డఖండ విజయ మందినాడు. తల్లినేలపైగల తీపికతన ఆక్స్ఫర్డునువదలి 1930 జూలై 5 వ తేదీనాటికి రాధాకృష్ణుడు కలకత్తా చేరుకొనినాడు. ఆచార్యుడై విజయడిండిమమును మ్రోగించి వచ్చిన రాధాకృష్ణునకు స్వీయసీమస్థులు ఘనముగు స్వాగతమొసగిరి.

## రాధాకృష్ణుడు పాలనాకుశలుడు

కలకత్తా విశ్వవిద్యాలయమున తత్త్వశాస్త్రము ను ప్రబోధించు నవసరమందే రాధాకృష్ణుడు చాలకాలము సెనేటు సిండికేటులందు సభ్యుడై, ఆమహాసంస్థ పురోభివృద్ధికై మిగుల పాటుపడినాడు. ఈతడు నిలిచి మాట్లాడుచుండ, శతవృద్ధులైన సభ్యులు, జిజ్ఞాసువులై శ్రోత్రపలుంగు నందితిమని ఆనందించువారు. అచిరములో నతడు Post Graduate Council of Arts కు అధ్యక్షుడై నాడు. ఈపదవి నొకప్పుడు ఆశుతోషు అలంకరించువాడు. ఆతనిగద్దెయం దుపవిష్టుడైన రాధాకృష్ణుడు ఆతనికంటె కడుకౌశలముగ తనపవిత్ర కర్తవ్యమును నెఱపుకొనునాడు. భారత విశ్వవిద్యాలయములు కేవలము పరీక్షాసంస్థలై యుండ ఆవర్ణ విజ్ఞానమునకు వానియందు చోటులేకుండెడిది. ఈలోపమును తీర్చివేయ ఆశుతోషు కంకణమును గట్టుకొనెను మహావిద్వాంసులను, జాతిమతభేదములను పాటింపక, తన విశ్వవిద్యాలయమున కాహ్వానించి నూఱురీతుల విజ్ఞానశాఖలందు ఎం. ఏ బోధనమునకు వ్యవస్థగావించెను. చేవగల విద్యార్థుల కళోపాసనమునకును పరిశోధనమునకును, చక్కని యేర్పాటులు కావించెను. పాలిట్ రసవిహారి ఘోషు లాది దేశభక్తులు ఉన్నతవిద్యా పోషణమునకై విశేష ధన మొసగిరి. ఈయనుకూల పరిస్థితులందు రాధాకృష్ణుడు తనకర్తవ్యమును కడుకౌశలముగ నెఱపజాలినాడు. పాలకుని హృదయమున నెట్టి యాశయములు నెలకొందిననేమి ఆతనిపదముల కెదుట నడ్డుగట్టులు తోచేనేని ఆతడేమి చేయగలడు ? పాలకుని యుద్దేశములందలి పరమార్థమును గ్రహించి, ఆతనికి బుజమెద్దు పల్వురప్రముఖులు ప్రత్యక్షమైనపుడే యతడు కృతకృత్యుడుకాగలడు. కళాశాఖయందు రాధాకృష్ణుడును, భౌతికశాస్త్రశాఖయందు రామనును సూర్యచంద్రులట్లు తేజరిల్ల గలకత్తా విశ్వవిద్యాలయ మద్భుత పరిశోధనల కాలవాలమై ప్రపంచదృష్టి నాకర్షించినది. కళాశాఖకు అధ్యక్షుడైన రాధాకృష్ణుడు బోధనయందేగాక, ఉన్నతపరిశోధన మందేకాక, నానావిధ విజ్ఞానాంశముల లోతునెఱిగిన మనీషి యనియు, పరిపాలనమున నద్భుతప్రజ్ఞగల వ్యక్తి యనియు, ఒరులు పెక్కునెలలందు నెఱపు క్రియల నొక్కత్రుటిలో జరుపగల మతిమంతుడనియు వాసి గాంచెను. చాలకాల మీతడీయధ్యక్షపదవి నలంకరించియుండెను. ఈతని యున్నతి కొందఱికి కన్నెఱ్ఱయైనది కాని యితడు సమ్ముఖమందు గోచరించినపుడు వారి యహంభావము రవియెదుటమంచు తొలగు మంచు తెరవలె తొలగెడిది. ఈత డింటియొద్ద నున్నపుడే ఏక

గ్రీవముగ కౌన్సిల్ సభ్యులీతని దయయన్యక్షునిగా నెన్నుకొని గౌరవించునారు. ఈతని పాలనాకౌశలమును, మేధాసంపదను గుఱుతించి, ఉత్తరహిందూస్థానీయు లీతని లక్నో విశ్వవిద్యాలయమున కుపాధ్యక్షుడుగా నుండగోరిరి. రాధాకృష్ణు డావేశికోలును మన్నింపలేదు.

### రాధాకృష్ణుడు ఉపాధ్యక్షుడు

ప్రపంచఖ్యాతిగాంచిన ఈమహావిజ్ఞాని తమ వాడని ఇటీవల గుర్తించిన ఆంధ్రులు, తమవిశ్వకళాపరిషత్తునుండి మతినుంతుడైన రామలింగారెడ్డి తరలి నంతనే, యిత డాసంస్థ కుపాధ్యక్షుడు కావలెనని కోరిరి. ఆంధ్రుల వాంఛ వంగీయుల చెవిబడినది.

తమ విశ్వవిద్యాలయమున కీతడు పశ్చిమ ఖండములందు ప్రతిష్ఠ దెచ్చిన ప్రజ్ఞాధురీణుడని గుర్తించి నంతనే ఈతని ప్రతిపక్షులు నోళ్లుమూసికొనిరి. కలకత్తా విశ్వవిద్యాలయాధికారులు మదరాసు ప్రభుత్వము వారి యనుమతి గైకొని, పంచమజార్జి నామధేయమున స్థాపితమైన తత్త్వశాస్త్ర పీఠమున నరువదేండ్ల వయసు వచ్చుదనుక నీత డాసీనుడై యుండు వ్యవస్థ గావించిరి. సహృదయులైన వంగపండితులలో నొక్కరుడును, నాకు మిగుల గూర్చు నెచ్చెలియు నైన సునీతి కుమారఛటర్జి రాధాకృష్ణు డాంధ్రవిశ్వకళాపరిషత్తున కరుగునేమో యని యడలి "మేము రాధాకృష్ణుని వీడజాలము. అతడు మావిశ్వవిద్యాలయమున కలంకారము" అనినాడు. ఆంధ్రవంగవాంఛల నడుమ రాధాకృష్ణుడు కొంతకాలము మిన్నకొనియుండెను. మిన్నకొని యుంట రాధాకృష్ణుని ప్రధానగుణములలో నొకటి.

సాధారణముగా మనమెఱుగు విషయములకు తాత్కాలిక రూపమొకటి, కొంతకాలము గడచిన పిదప వానికి స్థాయిగా నుండు సహజరూపమొకటి యుండును. నిలుకడమీదగాని నిజము తెలియదు. ఏవిషయమును వినినను, రాధాకృష్ణుడు చప్పున తన అభిప్రాయమును తేల్చివేయడు. ద్వేషభావము నీతడెన్నడు వ్యక్తీకరింపడు. ఎదుటివాని హృదయమందలి భావాంబుధ్ధిని తెప్పపాటుకాలములో గుర్తింపగల శక్తిగలవాడయ్యు తన నిదర్శనములు చేబడునందాక తనయుత్సాహమును, ప్రశంసను తనయందే అరికట్టియుంచును. ఈతని నీరవభావమున నిరసనభావము కాక నిగూఢయోజన కలదు. కన్నుగలవాడు కావున, దూరదృష్టి గలవాడు కావున తాత్కాలికాభిప్రాయములు చెవిబడినంతన చెయిగాల్చుకొనక, ఉబ్బితబ్బిబ్బు కాక, కొంతసేపు తడయును. "ఎల్లఱకు చెవియొగ్గుము. కాని కొందఱికి మాత్రము నీయుద్దేశము దెలుపుము" అని షేక్స్పియరు తెలిపిన సూత్రమును, "వినదగు నెవ్వరుచెప్పిన" అను పద్యమందలి నీతిని రాధాకృష్ణు డొంటబట్టించుకొన్నాడు. ఇత డప్రమత్తుడనుట నిస్సంశయము.

తనభావికర్తవ్యమును గుఱించి ఆంధ్రులును, వంగీయులును వ్యక్తీకరించు అభిప్రాయములకు రాధాకృష్ణుడు చెవియొగ్గియున్నాడు. కొంతకాల ముదాసీనుడై యున్నాడు ఆంధ్రులయభిప్రాయమును సంపూర్ణముగ గుఱుతించినాడు. తన నేలమీది ప్రేమ పెంపున కలకత్తానువదలి ఆంధ్రవిశ్వకళాపరిషత్తునందు ప్రవేశించినాడు. నాడాది తోడి సీమస్థులకు మిగుల సన్నిహితుడైయున్నాడు.

ఆ ఘోషు క్రియాకలాపము పురికొలిపిన ఆశయమే ఈతని కనులెదుట కాంతిలినది. జాతిమత భేదములకు త్రోసిరాజనియే ఆంధ్రవిశ్వకళాపరిషత్తున నీతడు తనగద్దెపై నాసీనుడైనాడు. పాడుపుకొండ కెదుట, కనువిందైన కడలిదాపల, కొండకోనయందు పాదనూపిన తన విశ్వకళాపరిషత్తు వసుంధరయందు వన్నెకెక్కవలెనని ఈతని యుద్దేశము.

రాధాకృష్ణుడు వట్టిస్వప్నములల్లి సంతృప్తిపడువాడు కాడు. విహంగమప్లైగయువాడేయయ్యు, మేఘవీధులందు కాపురముండువాడు. తీపితలపులను మదియందు మాటిమాటికి నెమరువేయుచు హాయినందుకళోపాసకుడయ్యు, క్రియకు బలాదూరని కాళ్లు ముడుచుకొని గీతగోవిందములు పాడువాడుకాడు. కర్మవీరుడైన లెనిన్ కార్యతత్పరతలో కొంత భాగమును,

భావాంబరవీథి విశ్రుతవిహారియైన శ్రీమకెరోలండ్ భావశబలతను దనయది చేసికొనినవాడు కావున రాధాకృష్ణుడు తనయాశయములను ప్రత్యక్షమూర్తులు గావించుకొన దపించుచుండెను. పక్కాగడసరికావున తగు నెరవుల నూహించి తలచినదానిని చేపట్టితీఱును. తాను విజయుడు కావలెననియు, ధనంజయుడు కావలెననియు ఈతని యుద్దేశము. మనుష్య హృదయమునకు, అందును అర్వాచీనమానవసంఘ హృదయమునకు సంబంధించిన శీతోష్ణస్థితులెట్టివో చక్కగా నెఱిగినవాడగుటచే ఈస్థితిగతులకు అనుకూలముగలీల కడుకౌశలమున నీతడు తనయత్నములను సాగించుచు జయరమను వశమొనరించుకొనును. ఈధాత్రీచక్రము నెఱిగిన దిట్ట కావున కాట్లకుక్కలకు ఆలవాలమైన నేటి వసుంధరయందు, ఎదుటివాని యున్నతి జూచి కంటకుమ్ము బోసికొను దుర్మతులకు తావైన నేటి వసుమతియందు నిరపాయముగ నీతడు నెగ్గుకొని, మహోన్నతస్థితికి వచ్చి మేగువులవంటి వారిని పిడికిట బట్టగలిగినాడు. దేవదేవుడైన రాధాకృష్ణుని పేరుదాల్చిన తాను ఆతని గొనములను ఆత్మజీవనమున ననుష్ఠింపబూనినాడు. పైన నుల్లేఖించిన గుణములు కృష్ణపరమాత్మ మానవలోకమునకు మేలుబంతియైనాడు. ఎదుట మహాకల్లోకము భయదమై తోచుచున్నను, హృదయమందు దనంతశాంతమును నెలయింపగలవాడు శ్రీకృష్ణుడుకదా! (Vide Swamy Saradananda's Bengalee Commentary on Bhagavadgita) సంక్షుభితమహార్ణవమునదిలిచినను హృదయశాంతిని గోల్పడని మహాపురుషుడు రాధాకృష్ణుడు. ఈగురుగుణములకు ఈతని ధృతిసహనములు సహకారులైనవి. కావుననే మిగుల సామాన్య పరిస్థితులందు బుట్టిన ఈతడు, చిఱుతప్రాయమున పెక్కుకడగండ్లకు గుఱియైన ఈతడు చరచర పైకిలేచి, సభ్యజగతియందు దాకాశదీపమై వెలుగొందగలిగినాడు. హృదయమందు, చిరానుష్ఠానముకతన నీగొనములను నాటించుకొనినవ్యక్తి అవి యొసగుశక్తి ననేకవిధంబుల బ్రయోగింపగలడు. ఆత్మజీవనమున జయసిద్ధిగనిన రాధాకృష్ణుడు తనతో నవినాభావ సంబంధముగల మహాసంస్థలకు గూడ నట్టిశక్తికతన విజయము జేకూర్పగలడు.

ఈయంశములను దృష్టియందిడికొంటిమేని, తానుపాధ్యక్షుడైన అల్ప సమయములోనే రాధాకృష్ణుడు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు కంకణమునకు జేగంటగట్టి రామనుప్రభృతుల ప్రశంస నందుట ఆతనిపట్ల అక్కజపడవలసిన విషయము కాదని గుర్తింతుము.*

అనేక విశ్వవిద్యాలయములతో సన్నిహిత సంబంధముగల మహావిజ్ఞాని కావున, ఆదర్శవిశ్వకళాపరిషత్తెట్లుండవలెనో రాధాకృష్ణు డెఱుగును. తానెఱిగిన బహువిషయాంశములను తఱచుగ నతడు వివిధవిశ్వవిద్యాలయములందు స్నాతకమహోత్సవ సమయములలో తన మహోపన్యాసములందు వ్యక్తీకరించినాడు. రాధాకృష్ణుని మానసికగ్రంథన మెట్టిదో చదువరుల కిందు దెలిపితిని కావున, ఆతని యుపన్యాసముల ధోరణి యెట్లుండెనో వారు గ్రహింపగలరు. తనపతాకముపై విశ్వకళాపరిషత్తు "ముందంజ" యనుపదమును చిత్రింపవలెననియు, ఏయంశమును గాని యువకులు విమర్శింపక గైకొనరాదనియు, ఉత్సాహవంతులై నవజీవన సందీప్తహృదయులై వారు తమ కర్తవ్యములను నెఱపుకొనవలెననియు రాధాకృష్ణుడు పలుకుచుండెను.† భారత తత్త్వశాస్త్రమున అమృతప్రవంతులు పాఱించిన అవిరళభావవృష్టిరి చుటకలువేసిన వానకోయిల యగుచు రాధాకృష్ణుడు ప్రాచీనసత్యములను నూతనరీతిని తఱచుగ జేపట్టగల్గుచుండెను.

పాశ్చాత్య రాష్ట్రశిఖరమున శోభిల్లినది కపిధ్వజము. ఈకపిధ్వజము తాత్వికులుగ, సాహిత్యోపాసకులును

* Sir C. V. Raman's address delivered at Waltair in connection with the third anniversary of Students' Union.

* Radhakrishnan's observations on the functions of a University in his Convocation addresses at Lahore and Lucknow.

తెలియుగ వాకొను "Spirit of Enquiry"ని సూచించు చిహ్నము. విజ్ఞానమున కిది ముఖద్వారము. పరిపూర్ణత్వము దెస మానవగమనమున కనుకూలమైన రహదారి నేర్పఱచు అద్భుతశక్తి యీ Spirit కాక మఱేది? పృథ్వీతలమున వివిధరంగస్థలములనుండి పలుమాఱు రాధాకృష్ణుడు కావించిన గంభీరోద్బోధనము లీ Spirit నుండియే కదా వెడలినవి!

ఇతరరంగస్థలములందు తాను కావించు ప్రబోధములకు రాధాకృష్ణుడు తనవిశ్వకళాపరిషత్తునందు కార్యరూప మొసగుచుండెను. మంత్రశక్తిగల వాక్కులు మహాదేవాలయములట్లు మహీతలమున స్థిరవాసము నేర్పఱుచుకొనగలవు. కాని ఈదేవాలయములు నిముసములో నిర్మాణముకావు. నిర్మాణమగుచో, గడ్డిమేట్లవలె నివి గాలియం దెగిరిపోవును. ఇటుకపై నిటుకను పేర్చి, దృఢసంకల్పముచే నిరంతరయోగమును దృఢమొనరించి, ఇచ్ఛాశక్తిచే కర్మయోగి గోపురమును నిలుపును. తపసునందును, దృఢనిశ్చయ, ఇచ్ఛాశక్తులందును రాధాకృష్ణుని మించినవిజ్ఞాని అధునాతన వసుంధరయందు మఱొక్కడు లేడు. ఇట్టి మహావ్యక్తి ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకు అధినాథుడగుట ఆంధ్రుల అదృష్టము. రెండవమారు ఏకగ్రీవముగ నీతని నుపాధ్యక్షునిగ నెన్నుకొని, ఆంధ్రులు ఈతని యఖండశక్తియందలి తమ యవిచలిత విశ్వాసమును జూపిరి. రాధాకృష్ణుని ఉద్దేశములు కుసుమించుటకు సమయముపట్టును. ఈకుసుమసౌరభము వాతూలమున రివ్వురివ్వున నెగసి సభ్యప్రపంచ హృదయమును సోకును. నా డెగుగుంఫనములును ఆంధ్రవసుంధరపై నబ్బురంపు చూడ్కులు పఱపును. ఆంధ్రులందఱు రాధాకృష్ణునకు బుజమునొడ్డి ఈయుత్తమాశయము పూర్ణమగుటకై శక్తివంచనలేక యత్నింతురుగాక!

రాధాకృష్ణుడు మేఘవీథులందెగురువాడైనను, వర్డ్స్‌వర్త్ కవీంద్రుని భరతపక్షియట్లు తనదృష్టిని నేలపై నిలిపియుంచునని సూచించితినికదా! పరమాశయములనుగూర్చి జలదగంభీరస్వరమున మాటలాడు రాధాకృష్ణుడు పెద్ద నూటపదునొకండు దిద్దుకొని రామభజన మొనరించుచు, కాలహరణమొనరించుటలేదు. "Man does not live by bread alone" అను ఏసుక్రీస్తు వచనమున సంపూర్ణవిశ్వాసముంచిన తాత్వికుడును, "Religion is not for empty stomachs" అని రామకృష్ణపరమహంస పల్కిన నుడువున గట్టి నమ్మకమిడిన లౌకికుడును గూడనైన దిట్ట రాధాకృష్ణుడు. మెదడుగలవాడు నేడురేపులగతి యెట్లని యోజించును. హృదయముగలవాడు భావికాలకునరశిఖరమున గల భాస్వంతాశయముపై కన్ను నిలుపును. రాధాకృష్ణున కీరెండును సరిసమానములై యున్నవనికదా యంటిని. ఈయాశయము ఆకసమువంటిది. అది నేలవంటిది. రెండింటికిని నడుమ బహుయోజనములు నిలిచినవి. వీనికి పొందుగుదురు టెట్లు అని కొందఱడుగవచ్చును. రెండింటికిని కౌగిలి గలుపు దిగ్వలయమును జూపి అందుండి దివ్యజ్ఞాన మరీచికలను ప్రసమ్మరింపగల దినమణి రాధాకృష్ణుడు. ఇతర విశ్వవిద్యాలయములు నీళ్లు నములుచుండ భారతసీమ ఆర్థికదార్ఢ్యమును, విద్యార్థుల వ్యక్తిగత పురోభివృద్ధిని సుసాధ్యములుచేయు శిక్షణా విధానమునకు రాధాకృష్ణుడు తన విశ్వకళాపరిషత్తునందు నేడు విశేష ప్రాముఖ్య మొసగినాడు. నిరుద్యోగపు పిశాచమును మొదలంట నఱుకజూచుచున్నాడుకాని ఈసమస్యలు పూర్ణముగ సంపూర్ణ స్వరాజ్యమందిన భారతదేశమందే పరిష్కారము కాగలవు.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తును గుఱించిన ప్రత్యేకాంశములను విశదీకరించుట నాప్రస్తుతాశయముకాదు. సత్తువగలవారినే చేరదీయ నిశ్చయించిన రాధాకృష్ణుడు, సాధ్యమైనంతవఱకు ఆంధ్రప్రజ్ఞాధురంధరులకే స్వాగత మనుచున్నాడు. ఆంధ్రేతరులైన పెద్దలు క్రమక్రమముగ రంగస్థలినుండి తమవిష్కంభమును ముగించి, నిష్క్రమించుచున్నారు. ఆంధ్రజాతియందైక్యత గల్గింప శక్తివంచనలేక రాధాకృష్ణుడు యత్నించుచున్నాడు. రాయలసీమవాసుల కనేకసౌకర్యము లేర్పఱచుచున్నాడు. రవీంద్రసప్రూలాది యశస్వులచే నుపన్యాసము లిప్పించుచున్నాడు. తోడి మహావిజ్ఞానియైన రామనుచే తన మహాసంస్థకు సేవజేయించు

చున్నాడు. అల్లాడిమున్నగు అర్థసంపన్నులచే పరిషత్తు కొఱకీయందు శ్రీదేవిని స్థాపింపయత్నించుచున్నాడు. మహోదారులు జయపురాధీశులు శ్రీ శ్రీ శ్రీ విక్రమ దేవవర్మ మహారాజులుంగారి మ్రోల చంటిబిడ్డయైన విశ్వకళాపరిషత్తు నిడి ఆదరపూర్వకమైన ఆశీర్వాదము నపేక్షించినాడు. శ్రీ శ్రీ మహారాజులుంగారు బిడ్డను అక్కున జేర్చుకొనినారు; వలసినంత కనకమును ధార వోసినారు.

రాధాకృష్ణుడు తానాంధ్రుడనని మరియు వ్యక్తి. ప్రత్యేకరాష్ట్రమును, ప్రత్యేకవ్యక్తిత్వమును ఆంధ్రులు కాంక్షించుచున్నారని ఆతడెఱుగును. ఆంధ్రపురోభివృద్ధి ఆంధ్రవిశ్వకళాపరిషత్తు నుండియే శాఖోపశాఖలై వ్యాపింపవలెనని ఆతడెఱుగును. ఈయాశయములకై పాటుపడనెంచియే ఆతడు తన నాలుగు ఉన్నతోద్యోగములలో ప్రస్తుతోద్యోగము నెన్నుకొనె నని నాతలంపు. భావికాల మీతని యత్నములపై శుభాక్షతలు చల్లునని నాయాశ.

## రాధాకృష్ణుడు దేశాభిమాని

తనవిజ్ఞానమున తాను మునుగితేలుచు అందలి రతనము నుగాంచి కులుకుచు సుఖముగ కాలక్షేపము చేయువ్యక్తి రాధాకృష్ణుడుకాడు. ఊరు తగులబడుచుండ నీతడు ఫిడేలు చేతబట్టు ప్రబుద్ధుడు కాడు. భారతదేశ ప్రస్తుతస్థితి కీతడెంతేని దుఃఖపడుచుండును. నిరుపేదల యవిద్యకును, నిష్ఠుర దారిద్ర్యమునకును ఈతడు చింతిలుచుండును. * మహామేరువువంటి వాడైనను ఈతడు సర్వజనసులభుడు; నిగర్వి; సదయ హృదయముగలవాడు

తీవ్ర కాంగ్రెసు వాదిచే కూడ "అమ్మో!" అనిపించు వాక్కుల నేటి భారతరాజకీయములను చర్చించు నవసరమున రాధాకృష్ణు డుచ్చరించినాడు. † శ్వేతపత్రము సూచించిన రాజ్యాంగ విధానము భారతీయుల ఆశయముల కనుకూలమైనది కాదని ఇటీవల ఈతడు వాల్తేరులో ఒకవిద్యార్థిసభ కధ్యక్షుడై తెలిపెను. కాంగ్రెసునెడల విశేషాదరము గల రాధాకృష్ణుడు, దేశీయమహానాయకులకు సన్నిహిత మిత్రుడైన రాధాకృష్ణుడు, ఏజంకు గొంకులేక పాలకుల నేరసులను చూపినాడు. పరహితజీవనమున మేలుచేయియైన ఈతని యర్థాంగలక్ష్మి రాట్నము త్రిప్పు సీమంతినీచూడామణియై, మాతృదేశ భావిభాగ్యము నల్లు తల్లులందోర్తుకయై, ఈతని యున్నతోద్దేశములకు సాయపడు నెచ్చెలియై యున్నది. గాంధి జీవలె నే ఈతడు శాంతిప్రియుడు. దౌర్జన్యము తనకు దెచ్చియిచ్చు స్వరాజ్యము తనకు వలదని గతకాంగ్రెసుమహాసభయందు మహాత్ముడు పల్కిన నుడువు నందలి మహత్తరభావము నీతడు బహుభంగుల కొనియాడినాడు. (Videi Radhakrishnan's Allahabad Convocation Address). కాలక్రమమున రాధాకృష్ణుడు రాజకీయములందు లంఘించునని జోస్యము చెప్పుచుంటిని.

## రాధాకృష్ణుడు సంస్కర్త.

రాధాకృష్ణుడు సంస్కరణాభిలాషి. సంఘమందలి చెడుగులు పోకున్న, దురంతరోగ పీడితవ్యక్తియట్లది కృశించి తనయాయువు కోల్పోవునని గ్రహించి దానిని కాపాడ యత్నించుట బుద్ధిమంతుల లక్షణము. కాని సంస్కర్తలమని చెప్పుకొను భారతీయు లనేకులు పాశ్చాత్యపద్ధతుల ననుకరించుచు సంస్కరణము పేరిట భావబంధురమైన ప్రధానాచారములను కొన్నింటిని మాపుచేయుచు సంఘహృదయమందలి దీపము నారిపివేయ జూచుచున్నారు. జ్వరపీడితునకు సన్నిపాత

* Radhakrishnan's "Kalki" Page 9. and his Convocation Speech delivered at the University of Lucknow.

†Radhakrishnan's Lucknow Convocation Address delivered on 5th December 1931. and his "Indian Philosophy" Chapter on "The Present situation".

భైరవి పనికివచ్చును గాని ఉత్కృష్టమైన శస్త్రచికిత్స కూడివచ్చునా? కాలిముల్లును దీయుటకు మాఱు కంఠమును గోయువాడు హంతకు డనిపించుకొనడా? నేడు హిందూ సంఘమున లోపములుండుట నిక్కమే! రోగముకంటె భయంకరమైన ఔషధము నిచ్చు వక్రవైద్యులబోలు సంఘసంస్కర్తలుండుటకూడ నిక్కమే! ఎటుచూచినను, ఉలికిపడవలసి వచ్చుచున్నది. రాధాకృష్ణుడు కన్నుగల సంస్కర్త; భారతాంబ హృదయమున ననవరతము వెలుగు మహత్తరాశయములకు భంగము రారాదని యోజించు దేశభక్తుడు; కూడని తలపులను తునియలుచేయనెంచు దిట్ట. సరాసరిసంస్కరణముతో చినపుడు చఱ్ఱుమనువా రెవ్వరును ఉండరు. ప్రాచీనానీతి సంస్కరణము కళ్లబడుతటి కనుబెజ్జజేయువారుండకపోరు. సముచిత సంస్కరణాభిలాషి రాధాకృష్ణుడని తెలుపుట కెన్నెని తార్కాణములు కలవు. స్త్రీపురోభివృద్ధి నభిలషించునీతడు ప్రాచీన భారతాశయములను కనులనుండి మహిళామణులు చెదరనీయరాదని తెలుపుచుండును.* హిందూ ముసల్మాను సమ్మేలన మనివార్యమని ఈతడు పల్కుచుండును. కడచిన అలహాబాదు విశ్వవిద్యాలయ స్నాతకమహోత్సవ సమయమున అస్పృశ్యతను ఖండించుచు నీత డొనరించిన మహోపన్యాసము పాఠకుల చెవులందు గింగురుమనుచునేయుండును. వివేకానందస్వామి పల్కులకును, గాంధీజీ వాక్కులకును ఈతనినుడువు లెనయైయున్నవని చదువరులు గ్రహించియుందురు. †

సంఘదోషములనుడు, రాజకీయములైన నేరసులనుడు, వ్యక్తిగత దోషములనుడు, జాతిదోషములనుడు, బహుజాతుల దోషములనుడు, ఆంతరంగిక పరివర్తనము ("Inward Renewal" Vide : Radhakrishuan's "Heart of Hindustan") వలనగాని అంతము కావని రాధాకృష్ణుని యభిప్రాయము. ఈయద్భుత పరివర్తనమును దెచ్చునది మతమహత్త్వమని ఈతడెఱుగును. ఇది పునరుద్ధరణమందిననాడు సచ్చిదానందములు పుడమిపై వెలయునని రాధాకృష్ణు డెఱుగును. మతగంభీర సత్యములే అంతర్జాతీయత్వమును నెలకొలుపునని తఱచుగ పలుకు రవీంద్రప్రభృతులను వాక్కుల కీతనిపల్కు లుజ్జీయైనవి. ‡

రాధాకృష్ణు డాదర్శతాత్త్వికుడు. వాదనానైపుణ్యమును, వ్యాఖ్యాన కౌశలమును("Pious Sophis- tries of the Sacrosanct hair splittings of this School or that School of dogmatics", Vide Radhakrishnan's Indian Philosophy Vol: II pp 771) కాక జీవనరంగమందు ప్రత్యక్ష ప్రపంచమందు సలుపు సత్క్రియలే తాత్త్వికుని శిఖరమున మణిముకుటమును నిలుపునని రాధాకృష్ణు డెఱుగును. ఈతని నొరవడిగావించుకొను తత్త్వవేత్తలందఱు ఇట్టిగంభీరాభిప్రాయమునే వ్యక్తీకరించిరి. తాను నెఱపవలయుకర్తవ్య మింకను ఎంతేని కలదని ఈతడు తలచుచుండును.

కళోపాసకుడై, తాత్త్వికుడై, మహావిజ్ఞానియై రాధాకృష్ణు డైదుఖండములందును దన యశోలతలను ప్రాకించినాడు. ఇట్టి యదృష్టము యుగపురుషులకు గాని లభింపదు. రాధాకృష్ణుడు పండితుల కారాధ్య

* Radhakrishnan's "Indian Philosophy" and Sir. Francis young husband's reference to the great Philosophy's Love of the Old ideal in his "Dawn in India"

† Mahatma Gandhi's "The Story of My Experiments with Truth", Part II Page 321.

‡ Radhakrishnan's Kalki, Page 93 Etc. Dr. Arundale on "Civilisation". Prof. Mckenzie's Presidential address delivered at the 10th session of the Indian Philosophical Congress. Dr. Radhakrishnan's observations on the functions of Philosophy in his "Indian Philosophy".

దేవతలైనారు. పామరుల పూజా గృహములందిక తావునందవలెను. భారతతాత్త్వికులందఱు మహామునులు. భరతఖండమున తత్త్వశాస్త్ర మతశాస్త్ర సాహిత్యములు మునిహృదయములందు పుష్పించినవి. దీనికిని, ఋషిజీవనములకును అవినాభావసంబంధ ముండెడిది. ముష్కరులైన తాత్త్వికులు అన్యదేశములందు మనిరి; కాని మనదేశమందు మునులైన తాత్త్వికులే మనియుండిరి. మునిపాదరజముతో నిండిన మన్నున మిన్ను నెలుగుకన్న మిన్నయైనమన్నున పుట్టిన తాత్త్వికుడు రాధాకృష్ణుడు. కర్మవీరుడే నేడు మునియనిపించుకొనుచున్నాడు. అధునాతన కాలశైవలి ననుసరించు నీమహాపురుషుడు, జ్ఞానయోగియైన ఈమహాపురుషుడు, దేవమందిర సన్నిభహృదయముగల ఈమహాపురుషుడిక ఆదర్శకర్మయోగి కావలెను. వనమాలియైన కృష్ణుడు, వంశీధరుడైన కృష్ణుడు, బృందావన విహారియైన కృష్ణుడు, గీతాచార్యుడైన కృష్ణుడు, సాధుజన పరిత్రాణకుశలుండైన కృష్ణుడు, అవతారపురుషు డనిపించుకొనినాడు. కళాసందీప్త హృదయుడైన ఆచార్యరాధాకృష్ణుడు అవతారపురుషు డనిపించుకొనగలడా ?

---




ఉ ప హా ర ము టి. వి. యస్. శర్మ.

# యానాది సత్తి

అత్తిలి సూర్యనారాయణమూర్తి
(రవీంద్రసారస్వత సమాజం)

౧

పగలు పదిగంటలైంది. వేసంగిసూర్యుడు సెగలు వేయిస్తున్నాడు. తెల్లవారుఝామునే మకాం పోయి స్వేదస్నానంతో వచ్చిన సబుయిన్స్పెక్టరు పిన్నారావు, అప్పుడే, అంగర్కీ అంచెలగొట్టే అధికారచిహ్నమైన జరీపట్టీల యెర్రపాగా బల్లమీద పెట్టి, స్టేషన్ హౌసువరాండాలో నిలబడ్డాడు, వేళ్లతో మొగం మీదప్రవాహాల్ని తుడుచుకుంటూ.

"ఎవరోయి అక్కడా? కూజాలో నీళ్లైనా లేవేం?"

ప్రక్కనే యీతాకుల చాపమీద కూర్చుని కాగితాలు అటునిటు తిరగేసే కానిస్టేబులు

"పోలడు యీవేళ పనిలోకే రాలేదండి. పెళ్లంట! పెళ్లి!" అన్నాడు.

"ఊఁ! ఈయేనాదియెదవలకి ఒకంట చూస్తాన్నా బుద్ధిలేదు. రానీచెప్తా. సోడా ఒకటి తెప్పించు".

"దొరగారు యీ సాయంత్రమే వస్తారట."

డ్రాయరువెనుక కుర్చీలో చతికిలబడ్డాడు. ఎక్కడినుండో ఢమడక్క ఢమడక్క తాళంతో కాకలీ మృదుకంఠస్వనాలు సన్నగాలిలోవచ్చి ఆతని దేహానికీ, మనస్సుకూ విశ్రమం సమకూర్చాయి.

"అమ్మయ్యా" అంటూ ఆతడు వ్రాయదలచిన డైరీ అక్కడే పెట్టి వరండాచివరకి వెళ్లి నిలబడ్డాడు.

గంతులేస్తూ, తాళాల ధిం, ధిం చప్పళ్లలో యానాదిస్త్రీపురుషుల కంఠాలు మేళవింపబడుతూండగా పెళ్లిజట్టు ఆతనివైపుకే వస్తూన్నారు. వారి మధ్య సమున్నతమూర్తివంతుడు, దీర్ఘబాహుడు, నీలాల కాంతుల అనాదిపోలడు, జరీమడతల ఎర్రకండువా భుజంపై వ్రేలాడగా ఠీవిగా వస్తున్నాడు. ఆతనిప్రక్క తురాయిపువ్వులూ, స్టేషన్లో కాశీరత్నాలూ జడనిండా గుచ్చుకోని, పసుపుచీరతో, కలహంసికాగమనంతో పెళ్లికూతురు నడుస్తున్నది.

తిరుపతినల్లచందనంబొమ్మ. పదహారేళ్ల బాలాకుమార్తె, పసతీర్చిన పొంకాలుతిరిగిన అందాల రేకుల దేహసౌష్ఠవంతో, ఏచెంచురాజు యజ్ఞంచేస్తేనో పుట్టిన యాజ్ఞసేని, పెళ్లికూతురు సత్తి. ఎండుతనంలేని జీవనలుపు. ఏశిల్పరసజ్ఞుడూ ఇక్కడ శాస్త్రం ఒప్పదురా అనేందుకు వీల్లేని అద్భుతవిన్యాసాలు ఒప్పే మోము ఆప్రకృతిపాప, యానాదిబాలకు.

తలవాల్చి నిలబడ్డ పెళ్లికూతు రెవరో పోల్చలేక పోయాడు అధికారి. ఆమె నేత్రనీలోత్పలములనుండి వెలుకుచూపుల సువాసనలు అంతావిరజిమ్మిపోతున్నవి.

సోడా తెచ్చిన కానిస్టేబులు అట్టే నిలబడి పోయాడు. సబుయిన్స్పెక్టరూ సోడాతాగడం మరిచాడు.

"పెళ్లికూతు రెవరురా" అన్నాడు యిన్స్పెక్టరు. ఆతని చూపు లాదంపతుల బిగి ఒడళ్లపైనే వున్నాయి.

"మేజస్ట్రీటుగారింటికాడ పనిజేసే సత్తి అండి" అని జ్ఞాపకపర్చాడు కనిస్టేబులు.

"సత్తి యింతరూపవతా! మంచిదానినే కొట్టావురో పోలా" అన్నాడు పట్టలేక ఆ అధికారి.

"సిత్తం. మీసలాపోళ్లం. దీవన్లుండాలండి."

"సత్తికూడా పాడుతుందిరా" అన్నాడు పిన్నారావు.

"బాగా పాడుతుంది బాబో" వారిలో పడుచువాడొకడు జవాబు.

"ఓపాట పాడించండర్రా" అన్నా డాయన. అందరూ తాళమిళితంగా తెయ్యిమని గంతేస్తూ పాడుతున్నారు. ఆ తప్పెటలసగోపలోనూ మంగళవాయిద్యంతోనూ మనుష్యుల్ని మరపించే కిన్నెరస్వనిలా సత్తి కలకంఠకంఠం అపూర్వంగా అలుముకుపోయింది. అధికారి తన్నే మరచి అక్కడే వుండిపోయాడు.

కంగారుగా కానిస్టేబు లొకడు దొరగారు వస్తున్నట్లు చెప్పాడు. కాకోదర దర్శనంలా కొంకరు వారిన ఆతను కలవరంతో జేబులోని పదిరూపాయలనోటు సత్తికి బహుమతీ యిచ్చి, పాగా సవరించుకొని స్టేషను వెలుపలకు పరుగెత్తాడు.



“ ఆతని చూపు లావంపతుల బిగి

2

రెండు నెలలైంది. యేదో వికారంగా వుంటున్నాడు సబుయినస్పెక్టరు పిన్నారావు. ఈ మధ్య ఆతనుచేసే పన్లె బాగులేవని బ్లాకుమార్కులే!

సత్తి మామూలుగా మేజిస్ట్రేటుగారి యింటిపనులు చేస్తూనేవుంది. పోలసు పదితొమ్మిదేళ్ల వీరభీరుడు. ఓనాడు ఈ అవని రాజ్యాలను ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన వంశం వాడాయను!

పోలడిమొఖం ప్రకృతి తల్లి నేర్పిన భావగాంభీర్యంతో వెలుగుతోంది. పర్వతరాజ్యకన్యను పట్టిన పరమశివుడులా కేరిపారచూడలేకుండా ఉన్నాడు. అందమైన అనాదివుల బాలిక సత్తి తనహస్తాల్లో నలిగి తన ఉడికిపోయే పురుషత్వానికి శాంతి యివ్వాలంటే పోలడిరూపం యెప్పుడూ మేఘంలా పిన్నారావు కోర్కెకు అడ్డువచ్చినట్లేవుంది.

ఏవంకతోనో సత్తిని పోలీసుస్టేషనుకు రప్పిస్తూ ఉండేవాడు. సబుయినస్పెక్టరుగారి ఆర్థ్యాంగ్యాలు

అర్థంచేసుకోకుండా అతిఅమాయికంగా జవాబు చెప్పేది సత్తి.

ఈబహుమతులూ ఆబహుమకులూ, పైగా రెండు చీరలూ ఒకకాసూ బహుమతీయిస్తే, అన్నీ "బాబయ్య గోరు యిచ్చా" రంటూ మొగుడుచేతులో పెట్టేది.

ఓసాయంత్రం ఓకొంగతనాన్ని గురించి ఆనోకి అడగాలని యిన్స్పెక్టరు సత్తిని కబురంపించాడు. మత్తిల్లిన కళ్లతో నేడెక్కిన దేహంతో సత్తిని దగ్గరగా లాక్కుని, చెవులో "నీవళ్లు బంగారం చేస్తా. ఎంతమంచి మీవాళ్లు లాంటి



ఒళ్లెమైనే వున్నాయి."

పోలేదు." ఇక మాట రావటంలేదు. సత్తి గబుక్కున విదల్చుకొని యీవలకు వచ్చింది. సందెచీకట్లలోనే దానికళ్లు మెరుస్తూ కనబడ్డాయి. ఇంతట్లో పోలడు ఆ చీకట్లో ప్రద్యుమ్నకుమారుడిలా ప్రత్యక్షం అయ్యాడు.

ఇనస్పెక్టరుగుండె కుంగింది. సత్తి దబ్బున వచ్చి "రా, మామా! యింటికెళ్దాము" అని వణికేస్వరంతో మొగుడుచేయిపట్టుకుంది. ఇద్దరూ యింటికి ఠీవిగా నడిచారు.

సబుయిన్స్పెక్టరు పిన్నారావు ధైర్యం చాలని పిరికికోపంతో పళ్లు పటపటా కొరికాడు.

"ఇక పోలడుపని సరి."

## 3

పోలడు చాలా తెలివైనఘటం. అసలు వాడి కళ్ళల్లోను, నుదురులోనూ దక్షిణాపథాన్ని చండశాసనం చేసిన చక్రవర్తుల వంశం చాటింపు అవుతున్నది.

చిన్నతనంలో తండ్రి 'యానాదివోళ్లకు సదువేంటి మాప్పబూ' అంటూనే ప్రాథమిక పాఠశాలకు పంపించాడు. ఓయినస్పెక్టరుగారు తన గుఱ్ఱానికి కళ్లెం తోమడానికి పోల్ణ్ణి పంపించమంటే ఆచదువు కథ అంతటితో అడ్డంతిరిగింది.

కాని వాడు వదలుతాడాండి చదువురుచి. పోలీసుస్టేషనులో మంచి హృదయంగల రైటరుగారి దయకు పాత్రుడయ్యాడు. ఆయన తీరికైనప్పుడల్లా పుస్తకాలు చదివించడం, రాయించడం, నాల్గు యింగ్లీషుతునకలు పారేస్తూండడం జరిగించాడు.

* * * *

వెంకటరెడ్డి ఆవూళ్లో పెదకాపు. ఓరోజు ఆతని యింట్లో నానుపేటలు పోయాయి. ఇంకా చిల్లరనగలేవేవో పోయాయి. పోలీసువారికి రిపోర్టువచ్చింది. ఆ ప్రశ్నలతోటీ, యీప్రశ్నలతోటీ వస్తువుపోయిన యజమానిని హడలగొట్టారు. చివరకి సమాధానం కుదిరింది.

మసిపూసి మారేడుచేసి ఎప్పుడూ స్టేషన్ వద్దే పనిచేసేవాడు కాబట్టి పోల్ణ్ణి శ్రమపడి లాక్కొని రావల్సి వొచ్చింది వీరికి. నగలు తెమ్మని యినస్పెక్టరు పోల్ణ్ణి నిర్బంధించాడు. లోపల 'మాంచి అదను యీ దెయ్యాల్ని అడ్డం లేకుండా చేసుకోనేందుకు' అనుకున్నాడు.

"నే నేమీ ఎరుగను బాబయ్యా, దణ్ణం"

"ఛీ వెధవా, మిమ్మల్ని ఓకంట చూస్తోన్నా, లాభంలేదు. ఓపక్క కోస్తూంటే ఓపక్కనుంచి రక్తం తాగుతూంటారు......నాలుగు ఉతకవోయి నెంబరు నూటపదహారూ" అన్నాడు అధికారి.

అన్నదే చాలు. అధికారికంటె అధికం చెలాయించే తాబేదారు రక్తం కళ్లచూచాడు. సత్తి గోలుగోలున యేడుస్తూ మేజిస్ట్రేటుగారివద్దకు వెళ్లి చెప్పుకుంది. ఆయన కబురంపడం, దెబ్బలు ఆగడం జరిగింది.

కొట్లో పెట్టారు పోల్ణ్ణి. మిడిమిడి యెండలో పోలీసుస్టేషనువద్ద పడి యేడుస్తోంది సత్తి.

"బాబయ్యా ఆడు తప్పు సెయ్యలేదుండి. ఆడు రాత్రల్లా యింటికాడ—"

"నీకెల్లా తెల్సునే?"

సత్తికి దుఃఖంలో సిగ్గు, "ఇద్దరం ఇంటికాడే..."

పిన్నారావు హృదయం మండింది. ఈ అందకత్తెను, అనుభవించే అధికారం ఆవెధవ కెల్లా వచ్చింది. ఈ అద్భుతవిగ్రహం వాడి కౌగిలిలో అణిగిందే. వాడూ, ఇదీ—" పళ్లు పటపట మనిపించాడు.

ఇంతట్లో ఒకయుక్తి తోచింది. వప్పించుకొని తన గాఢవాంఛ తీర్చుకోరాదూ?

"సత్తీ, యీరాత్రి యిక్కడ ఉండిపో—నాతో—ఉదయం పోలిగాడు విడుదల—ఏం?"

"ఓలమ్మో! కొంప మునిగింది దేముడో!" అంటూ సత్తి బెబ్బుల్ని చూసిన లేడిపిల్లలా మేజిస్ట్రేటుగా రింటికి గుండెలవిసిపోతూండగా పరుగు.

మర్నాడు సత్తి కానరాదు. ఊరంతా గాలింపించాడాసబుయినస్పెక్టరు.

పోలడుకి ప్రథమతప్పిదంక్రింద ఆరునెలలు శిక్ష తప్పలేదు.

## ౪

మహాసంగ్రామంలోని ప్రళయఘోష. మారణయంత్రాలు, యెద్దెంకోల విచిత్రపర్యటనాలు, హిందూమహాసముద్రాన్ని కలచివెయ్యడంలో యుద్ధం ధాటీ తీరాలకుకొట్టి, మెయిలు ఆగనిస్టేషన్లలో, ఝుూరున మెయిలు పోయే సమయాన్న రైలుస్టేషనంతా వణికినట్లు దేశంఅంతా అదటుకొంటోంది.

అయినవాణ్ణి, కానివాణ్ణి కూడా పటాలాలలో జేర్చుకునే రోజులవి. ఎవడో అసలుదొంగ దొరికితే

పోలడు పదిహేనురోజులలోనే జయిలులోంచి బయట పడ్డాడు. తిరిగివచ్చిన పోలడికి యిల్లాలిపోకడ చెప్పే చుట్టం పక్కం కనపడలేదు. వెనుకటి యినస్పెక్టరు బదిలీ అయిపోయాడు.

నిరాశచేసికొని పోలడు తహశీల్దారునారి నాశ్రయించాడు సైన్యంలోకి పంపమని. పోలడి బలధైర్యాలు మాసి ఆయన [illegible] పట్నం పంపించివేశాడు. పటాలంలో పోలడు పరమైనసిపాయి అయ్యాడు.

మెసపటోమియా మొదలైనచోట్లలో పోలడు కనబరచిన ధైర్యానికి మిత్రమండలి ప్రశంసించింది.

బస్రాయుద్ధం. లెఫ్టినెంటు జనరలు సర్ హెన్రీ మార్టిను నాయకుడు హిందుపటాలాల్ని యినపయంత్రాల్లాంటి టర్కీ సైన్యాలపైకి నడుపుతున్నాడు. టర్కీ సైన్యాధ్యక్షుడు మేజరు వాన్‌ఫీడల్‌బర్గ అఖండతెలివితేటలు కలవాడు. వ్యూహనిర్మాణంలో నడపడంలో నెపోలియన్‌కు తమ్ముడు.

హైందవసైన్యాలు చెల్లాచెదరు. వెనక్కి తగ్గిపోయాయి. ఇంతలో లెఫ్టినెంటు జనరలు మార్టిను ఫిరంగిగుండు పేలిన లోహజ్వాలశలాక కణతలోంచి దూసుకుపోగా, నరికిన చెట్టులా కూలాడు. అతని ఉపనాయకులు యిదివరకే బలిఅయిపోయారు. మార్టిన్ సేనానాయకుని వెనకాలే, మహోగ్రమూర్తి, అర్యుల్ని అనేకసంవత్సరాలు అరికట్టి నిలిచిన అడవిరాజువంశంవాడు సిపాయి పోలడు వంగినాడు. మార్టినుకు తగిలిన దెబ్బకు గుడ్డ కట్టాడు. హుమ్మని ఎత్తి బుజానవేశాడు.

“ఆవో, అరే! హిందూకా షేర్‌లోగ్” అని పొలికేక పెడుతూ ముందుకు దూకాడు. అతనివెంటే ఒళ్లుతెలియని పరవడులు హైందవసిపాయిదండు. గుళ్ల వర్షం—పడుతున్న వాడిపైనుంచి బూట్సుపాదాలు—పోలడుభుజంమీద మార్టిను నాయకుడు.

ఆశ్చర్యంపోయే టర్కీ సైన్యంలోకి కొండప్రవాహంలా వచ్చింది దండు. సున్నీలు, కత్తులు, తుపాకులూ, మరతుపాకులు చేతికివచ్చే వ్యవధిలేదు—అరగంటలో టర్కీసైన్యంలో పడిపోయి చావుబతుకులమీద ఉన్నవాళ్లు, ప్రాణాలు వదిలినవాళ్లు రెండు రకాలే! వాన్‌ఫీడెల్‌బర్గ శవముపోలడుకాలికింద ఉన్నది.

ఇంతలో, రెడ్డుక్రాసుసమితివారు వచ్చారు. మార్టినుదొరను ఇవ్వడే పోలడు! అతనిరౌద్రాకారమును శ్రీ నరసింహప్రత్యక్షం. ఎల్లాగో బతిమాలి మార్టిను నాయకునకు వైద్యోపచారాలుచేస్తే, కళ్లు తెరిచాడు.



పోలడు మార్టినుకు పెంపుడుకొడుకయ్యాడు. సిపాయిపనినుండి లాన్స్‌నాయక్, నాయక్ పదవులను కొండల్నించి ఉరికే గోదావరి పరవళ్లులా దాటి హవల్దార్ అయ్యాడు.

కమిషన్‌రేంక్సులో ప్రథమసోపానం జమాదారు అయ్యింది. యుద్ధం అయ్యింది ౧౯౧౯ సంవత్సరం వార్సేల్సు సంధి అయ్యింది. పోలడు పోలక్ మార్టిను అయ్యాడు. బాస్రాయుద్ధంలో వచ్చిన విక్టోరియాక్రాసు ఆతని పీరదుస్తులమీద మెరుస్తున్నది.—

జమాదార్ పోలక్ మార్టినుకు డిప్యూటీసూపరెంటెండెంటు పదవి యిప్పించాడు మేజరు జనరలు సర్ హెన్రీ మార్టిన్ క. సి. ఐ. ఇ., ఒ. బి. ఇ., సర్వదక్షిణాపథ హిందూసైన్యాధ్యక్షుడు.

పోలక్ (వ్యవహారికం) ఏలూరుకు డిప్యూటీసూపరెంటెండెంటుగా బదిలీ అయి వచ్చాడు. పోలక్ హిందూదేశం వచ్చినప్పటినుంచీ సత్తిని వెదుకుతూనే ఉన్నాడు. ఆమెను ఏల వెతికిస్తున్నాడో అందరికీ తెలియకూడదు. అది ఆతని హృదయరహస్యం.

సత్తి మంచుకరిగినట్లు కరిగి మాయమయ్యింది. యానాదిసంపులు ఎక్కడెక్కడున్నవాటినీ పోలీసువాళ్లు సత్తికోసం తణికీ. ఆంధ్రదేశంలో జిల్లాలన్నీ అయ్యాయి.

పోలక్‌తోపాటు సత్తిని వెదుకుతూ వున్నాడు సబుయినస్పెక్టరు పిన్నారావు. అతడికి సత్తి బెజవాడ దాటి మాయమయ్యిందని తెలుసు. తర్వాత?

అతడు తాళ్లపూడి బదిలీచేయించుకున్నాడు. జంగారెడ్డిగూడెంవరకు ఆచోకీ చేసుకుంటూన్నాడు.

ఏనాడు వివాహమంగళ రూపంతో పరమ కళ్యాణి శ్యామలాదేవిలా సత్తి కళ్లబడిందో ఆక్షణంలో ఆమెసౌందర్యమూర్తి అతని హృదయంలో మాసిపోవని చిత్రమైపోయింది.

ఆమె పుష్టాలై పొంకాలైన అవయవాల్ని తలచుకున్నాడు. నాగరకతావేషంలో ఆమెను వూహించుకున్నాడు. పక్కపాపిడి దువ్వుకోని ఆనల్ల చెవితమ్మంట్ల ఆణిముత్యాల లోలకులు తళుకులాడిస్తూంటే, పొట్టిచేతుల ప్రాక్కు, సన్న ఫ్రెంచిసిల్కు పాముపూసం చీర, మెళ్లో సన్న డైమన్‌కట్టు బంగారు గొలుసు, హృదయం తొంగిచూపింప జేసే నవీనపద్ధతి పైట విన్యాసాల్లో ఛమకులీనుతుండగా, ఒకటిరెండు వంకీస్ట్రేట్ బంగారుగాజులతో, కాలికి మొఖమల్ స్లిప్పర్సు తొడుక్కొని తనతో తమితీర, హాయిమీర, మోహాలు బిగిపోవగా కాలం గడపుతో ఉండడం కలలు కంటూఉండేవాడు.

## ౬

మన మేజస్ట్రేటుగారు యుద్ధఋణం రోజులలో బాగా పనిచేసి కొవ్వూరులో తహశీల్‌దారుగా వుంటూ వున్నాడు. తహశీల్‌దారుగారిపిల్లల్ని తోపుడుబండిలో ఎక్కించి ఓయిరవై యేళ్ల పరిచారికబాలిక కొవ్వూరు వూరిచివర రోడ్డుమీద తోసుకుంటూ బంగాళావైపు వెడుతూవున్నది.

ఆ అమ్మాయి చాలాకాలంనుంచి తహశీల్‌దారుగారింట్లోనే వుంటూవుంది. ఎప్పుడూ వారి పిల్లల్ని ఆడిస్తూ, వారింట్లోనే భోంచేస్తూ వారిచ్చిన చీరా రైక కట్టుకుంటూ కాలం గడుపుకుంటూ వుండేది.

తహశీల్‌దారుగారి పిల్లలు ఒక్కనిముసమైనా ఆ బాలికను వదలివుండేవారుకారు. పిల్లలతో కేరింతాలు కొడుతూ కథలు చెబుతూ ఆబాలిక, బండిని తోసుకు వెడుతూ వున్నది.

కొత్తగా జిల్లాపనేంచేసి కొత్తగా కొవ్వూరు మకాం వేసికొన్న డిప్యూటీ సూపరెంటెండెంటుగారిని దర్శించడానికి తాళ్లపూడి సబుయిన్‌స్పెక్టరు పిన్నారావు మహోశీవిగా బంగాళాకు వస్తున్నాడు.

రోడ్డుమీద పిల్లలబండీ తోసుకువెళ్లే ఆబాలిక కనపడింది. గొప్పవాళ్లింట్లో అలవడిన ఆకొంచెపు నాగరకతావేషం వెనకనించి అతనికళ్ల[illegible]గానే ఆనడకలో, ఆమూర్తిలో ఏదో అతనిహృదయం గబగబ పటుగెత్తింపజేసే స్ఫురణ మెఱుములా మెఱిసింది.

ఆబాలికను చేరి ఆమెముఖం చూసేటప్పటికి ఆమే యీతనిమొహం చూసింది. ఇరువురూ మరుసటి క్షణంలో గుర్తించుకున్నారు. ఆమె భయావేశంతో గజగజలాడిపోయింది. అతడు మోహావేశంతో అగ్నిజ్వాలయ్యాడు.

"ఎన్నాళ్లకు దొరికావే! మహచక్కని రూపం వచ్చింది! నీకోసం ప్రపంచకంఅంతా గాలించాను. నిన్ను కలగనని రోజుందిటే!" అతడామెచెయ్యి పట్టుకున్నాడు.

అతని రక్తనాళాలవెంబడిని తీక్ష్ణమైన ద్రాక్షసారాయి ప్రవహించింది. అతనికళ్లు ఎరుపులెక్కాయి. ఘాటయిన విస్కీతాగినవాడులా అయ్యాడు.

"నీకోసం వందరూపాయిలు ఖర్చుచేయిస్తా. అయిదువందలు ఖర్చుచేస్తా. నీయిష్టంవచ్చిన చీరలు కొనుక్కో. నీయిష్టంవచ్చిన నగలు కొంటా. నిన్ను రాణిని చేస్తా. ఎవరిదగ్గర వున్నా సరే. ఫర్వాలేదు. నాతో రా"

పిన్నారావునాయుణ్ణి చూడడంతోనే ఆ బాలికపైప్రాణాలు పైనే పోయాయి. కొయ్యబారి పోయింది. పామునుచూచిన కప్పలా, బెబ్బుల్ని చూసిన లేడిలా ఆయువతి నిశ్చేష్టయై, అతడు తనచేయిపట్టుకున్నా వదలించుకోవాలన్న భావమే లేక, నోట మాట రాక, మోకాళ్లు పట్టువీడగా, అప్రయత్నంగా వచ్చిన "అమ్మో" అను కేకతో కూలబడిపోయింది.

"ఓసి వెఱ్ఱిపిల్లా! ఎవరైనా చూస్తే ఏమను కుంటారు. నువ్వు ఎవరింట్లో వుంటున్నావు. తప్ప కుండా కలసికోవాలి. నీలాభం నువ్వెరగవు. నిన్ను సింహాసనంమీద యెక్కించి రాణీలా పాలించుకుంటా. వెనకటికన్న అందంగా వున్నావు. నీమొగుడు బ్రతికి వున్నా డనుకుంటున్నావేమో. వాడు యుద్ధంలో చచ్చిపోయాట్ట. మనువు చేసుకోలేదుకదా. లే." అని ఆమెను రెండు భుజాలూ పట్టి లేవదీసాడు. తహశీల్దారుగారి పిల్లలు ఘొల్లుమన్నారు.

౨

"ఏమిటిది?" అను యింగ్లీషుభాషలో గంభీర స్వనములు పిన్నారావునాయుడికి వినపడి ఛటుక్కున ఆవైపుకి తిరిగాడు. విహారపు పాశ్చాత్య పట్టుదుస్తులు ధరించి, సాయంత్రపు టోపీ తలపై పెట్టుకొని, ఆజాను బాహుడు, చేతిలో మలాకాబెత్తం ధరించి, ఒక పెద్దమనిషి నల్ల నిరూపంకలవాడు ఫ్రెంచికట్టు మీసాల వాడు, ఖరీదుగల యింగ్లీషుచుట్ట కాలుస్తూన్నవాడు, గంభీరమైన ముఖంకలవాడు ప్రక్కనే ప్రత్యక్ష మయ్యాడు.

"ఎవడురా యీనీగ్రోదొంగ" అనుకున్నాడు పిన్నారావు సబుయినస్పెక్టరు.

"ఎవరు నువ్వు?"

"ఎవరైతే నీకెందు కయ్యా! నీదారిని నీవు వెళ్లకా"

"ఆమనిషెవ్వరూ? నీవామనిషిని ఏం చేస్తు న్నావ్?"

"నే నెవరినో నాడ్రస్సునుబట్టి నీకు తెలియటం లేదా?"

ఆకొత్తపెద్దమనిషి పిన్నారావునాయుణ్ణి ఎగాదిగా చూసాడు.

"నువ్వు పిన్నారావునాయుడువు"

"నువ్వెవరవయ్యా? అధికప్రసంగాలు చెయ్యక అవతలికి వెళ్లు. పోలీసుస్యూటులో అడ్డుతగులకు. అనవసరమైన చిక్కులు పడగలవు. నీదారిని నీవు పో."

"ఎవరమ్మా నువ్వు? వీడు నిన్నేమి చేస్తు న్నాడు"

"బా......బా......బయ్యగారూ—"

ఆబాలికకు యీాయనముఖం ఎక్కడో చూచి నట్లున్నది. ఆపెద్దమనిషికినీ యీబాలికను ఎక్కడో చూచినట్లున్నది. ఆమె గబగబ ఆతనికడకువచ్చి ఆతని కాళ్లకు వంగి నమస్కారంచేసి

"బాబయ్యగారూ—నన్ను రక్షించండి. నాకు భయంవేస్తున్నది—"

ఆకొత్తపెద్దమనిషి ఆతోపుడుబండిలో వున్న అయిదేండ్ల బాలిక నుద్దేశించి

"తల్లీ, కళ్లుతుడుచుకో. వీ డేమిచేసాడు ఆ అమ్మని."

'వీడువీడు' అను యీపెద్దమనిషి మాటలకు పిన్నారావు మహోగ్రుడై పోయినాడు. కాని యెదుట నున్న ఆమూర్తి నలుగురు పిన్నారావునాయుళ్ళను పలుదోంపుల్లల్లా విరువగలడు. పిన్నారావు గుప్పిళ్లు గట్టిగా ముడుచుకుంటున్నాడు.

అయిదేండ్ల ఆపసికూన

"మా తత్తినీ ఆలూ తెయ్యి సత్తుకునీ నాత్తో లా, నాతో లా అంతున్నాలూ. తెయ్యిపత్తుకూ లాగు తున్నాలు. తత్తి ఏత్తింది."

సత్తీ! ఎవ రీసత్తి. ఆమె ముఖాన్ని పరకాయించనీ. తన సత్తి పోలిక. సత్తి. తన సత్తి. దైవం వున్నాడు. నిజంగా నాసత్తేనా? ఆపెద్దమనిషిహృదయం కంపిల్లిపోయింది.

"నువ్వేసత్తివమ్మా?"

ఇంతలో కొవ్వూరు సబుయినస్పెక్టరు, సర్కిల్ యినస్పెక్టరు, నలుగురు పోలీసు జవానులూ అక్కడకు వచ్చి అటెన్షన్ అయి ఎడమచేతులు తొడ పక్కకు గట్టిగాఅదిమి, కుడిచేతులు మరలుత్రిప్పినట్లు వేగంతో చెంపలకడకుయెత్తి యీపెద్దమనిషి తమవైపు చూచువరకు అట్లనే నిలబడివున్నారు.

ఆవచ్చినవారివైపు యీ పెద్దమనిషి చూడ్డంతోటే వాళ్లంతా ఛటుక్కున కుడిచేతులుతీసి ప్రక్కలకదిమిపట్టుకొని శిలావిగ్రహాల్లా నిలుచుండి పోయారు.

ఆపెద్దమనిషి వారి అభివాదాలు గ్రహించినట్లు తల పంకించాడు. ఇదంతా చూసే పిన్నారావునాయుడికి చెమటలు పోశాయి. అమ్మయ్యో! డిప్యూటీసూపరెంటెండెంటు! అప్రయత్నంగా తాను కర్రలా నిలబడిపోయి సాల్యూటు చేసాడు. ఇవన్నీ యేమీ గమనించడం లేదు డిప్యూటీ సూపరెంటెండెంటు పోలక్.




"బాబయ్యగారూ—నన్ను రక్షించండి. నాను భయంవేస్తున్నది—"

"నువ్వు సత్తివా?— నీది యేనాదికులం."

ఆమె తనసత్తి. తన సత్యము. తన సత్యవతీదేవి.

"సర్కిల్ యినస్పెక్టర్, ఈవిణ్ణి బంగాళాకు యీబిడ్డలతో రమ్మనమని అనుగు" అతని గొంతుకు గద్గదికమైంది.

ఇంతలో సత్తికి మెరుపుమెరిసినట్టులైంది. ఆగొంతుకులో తనపోలడు ప్రత్యక్షమైనాడు.

"ను—నువ్వు—బావ—"

తెచ్చిపెట్టుకొన్న నాగరికత అడ్డంవచ్చింది. సత్తిని సుడిగాలిలాకవ్వుకొని చంటిబిడ్డలా యెత్తి, హృదయానికి హత్తించుకొని, తమియార కౌగిలించుకొందామని పోలక్‌కు మహావాంఛ కలిగింది. ఆమెను అపరిమిత మార్దవంతో చెయ్యిపట్టుకొని,

"నేను నీపోలణ్ణి" అన్నాడు చంటిపిల్లాడులా. సత్తి నమ్మలేదు. నమ్మకుండా వుండాలేదు. ఇతడు తనబావ. తనరాజు. తనదేవుడు. తను ప్రాణంవదిలేసి స్వర్గంలో లేదుగదా! తనబావే! ఇది మాయ కాదు కదా!

"నాకు ఏమీ తెలవటం లేదండి."

ఆమెకు పిచ్చ యెత్తిపోయినట్లుయింది.

"సర్కిల్ యినస్పెక్టర్, ఈమె నాభార్య. యేనాదిసత్తి. ఈమెకోసం లోకం గాలించాను. నా అదృష్టంకొద్దీ దొరికింది"

౮

"బావా" అని ఆమె కెవ్వున అర్చి మూర్ఛపోయింది. తూలి క్రిందపడిపోతూన్న ఆమెను రెండుచేతులతో పోలక్ ఎత్తివేసి తనవక్షానికి ఆమెను గట్టిగా అదుముకొని "యినస్పెక్టర్, త్వరగా డాక్టరును తీసికొనిరా" అని చెబుతూ బంగాళాలోకి రెండంగలలో చేరి ఆమెను తన క్యాంపుకాటుమీద పడుకోబెట్టి మొహాన్ని యిన్నినీళ్లు చల్లాడు. ఆమె నాడి పరిశీలిస్తే అతిబలహీనంగా కొట్టుకొంటోంది.

ఒక కనిస్టేబులు సైకిలెక్కి మేఘాలమీద ఊరికి డాక్టర్ని పదినిముసాలల్లో తీసికొనివచ్చాడు.

డాక్టరువచ్చి ఆమెనాడి పరిశీలించి భయంతో యింజెక్షను యిచ్చు సూదిని శుభ్రపర్చకుండాఁహూడా హృదయానికి మిక్కిలి బలము కలుగజేయు అడ్రినాలెన్ పొడిచాడు. రెండోయింజెక్షన్ డిజిటాలిస్ స్టికి సైను యిచ్చాడు.

ఈలోకాన్ని వదలిపోవు ఆమెప్రాణం అడ్డు తగిలి ఆగింది. కాని ఉపద్రవం పోలేదు. రాత్రి రాత్రి బండిమీద ఒక కానిస్టేబులు రాజమండ్రి వెళ్లి సివిలు సర్జనుని లాక్కొనివచ్చాడు. మూడురోజులు డాక్టరులు పెనగులాడి మహాయుద్ధం చేసి శివస్వరూపులై మృత్యుంజయులయ్యారు.

నాల్గవనాడు సత్తికి మెలకువ వచ్చింది. డాక్టర్లు పోలక్‌వృత్తాంతం అంతా అడిగి తెలిసికొని ఆబాలికకు నెమ్మదిగా చెప్పారు.

చెన్నపట్నాన్నించి పోలక్ రప్పించిన నర్సు సత్తిని కన్నతల్లిలా కాపాడింది. తహశీల్దారుగారి భార్య, సర్కిల్ యినస్పెక్టరుగారి భార్య, కొవ్వూరు సబుయినస్పెక్టరుగారిభార్యా రోజూవచ్చి సత్యవతీదేవిని చూస్తూండేవారు.

పోలక్‌గారికథ ప్రపంచం అంతా వెల్లడిఅయిపోయింది. పిన్నారావునాయుడికి ప్రాణాలు ప్రాణాలులో లేవు. తన వుద్యోగానికి నీళ్లు వదలుకొన్నాడు. పిచ్చవాడిలా బంగాళాదగ్గర పడిగాపులు పడివున్నాడు.

అయిదోరోజునుంచి డాక్టర్లు పోలక్‌గారిని భార్యవద్దకు అప్పుడప్పుడు వెళ్లనిచ్చారు. పదిహేనురోజులైనాక పోలక్ సత్యవతీదేవిని ఒంటిగా కలుసుకునేందుకు వీలుచేసిం దానర్సు.

గాఢమైన కౌగిలిలో అణగిపోయిన వాళ్లిద్దరకూ మాటరాలేదు. వీరపురుషుడగు పోలక్ గాఢప్రణయనాయకుడున్నూ అయినాడు. ఆమెచెవిలో తన చరిత్రంతా మళ్లీ చెప్పుతున్నాడు. ఈవుద్యోగ స్వీకరణం సత్తిని వెదకడానికేట. యుద్ధం అయినాక కొత్తగా

నేర్చుకొన్న యింగ్లీషుప్రవాహంలో రైల్వే నావల్సు వందలు చదివాడు పోలక్. ఆనవల్సులోని ప్రణయం అంతా ఆమెచెవిలో మహాప్రవాహంలా ధారపోసాడు.

"నీకు యింగ్లీషు చెప్పిస్తాను సత్యవతీ"అన్నాడు.

"బావా! మీరు గొప్పవాళ్లయ్యారు. నేను పనిమనిషిని. మీకు పనికిరాను. మీరు యింకో చదువుకొన్న దొరసానిపిల్లనో, ఎవరినో చేసికొని గౌరవంగా కాలక్షేపం చేయరాదూ?" అని కన్నీళ్లతో పలికిందా బాలిక.

"ఛీ వెఱ్ఱిపిల్లా! నీకు దొరసానిని పెట్టి యింగ్లీషు చెప్పిస్తా. నువ్వు నాదొరసానివి. నా దేవతవు. యుద్ధం చేసేటప్పుడు, ఉద్యోగం సంపాదించుకొన్నప్పుడు నీ రూపమే అస్తమానమున్నూ ప్రత్యక్షం అవుతూ వుండేది" అని పోలక్ ఆమెరెండుచెంపలూపట్టి మోము తనవైపుకు త్రిప్పుకోని పరమ ప్రణయావేశమైనట్టిన్నీ, గాఢమైనట్టిన్నీ, దీర్ఘమైనట్టిన్నీ, మహాఆనందాత్మకమైనట్టిన్నీ ముద్దు నిచ్చినాడు.

తనభార్యను కన్నతలిదండ్రులల్లా కాపాడిన తహశీల్దారుగారుదంపతులకు పోలక్ కనపర్చిన కృతజ్ఞత వర్ణనాతీతం.

ఈసంగతంతా తన పెంపుడుతండ్రి సర్వదక్షిణాపథసైన్యాధ్యక్షుడు సర్ హెన్రీమార్టిన్ గారికి తంతి యిచ్చాడు. మర్నాడు సైన్యాధ్యక్షులదగ్గరనుండి

"నీభార్యతో కలసి నువ్వు బెంగుళూరు తప్పక వెంటనే రావాలి. లేడీమార్టిన్ ప్రభ్వి నీభార్యను కౌగలించుకోవాలని ఆత్రుతపడుతోంది. నీభార్యను రక్షించిన ఆ తహశీల్దారుగారికి కొద్దిరోజులలో డిప్యూటీకలెక్టరు అయ్యేందుకు యేర్పాటు చేస్తున్నాను" అని జవాబుతంతి వచ్చింది.

ఆమర్నాడు పోలక్ పిన్నారావునాయుణ్ణి కబురంపించాడు.

"ని న్నేంచెయ్యవచ్చును పిన్నారావూ?"

"చిత్తం... క్ష—మిం—చం—డి." పిన్నారావుగొంతుక వణకిపోయింది.

"నీవంటి నీచులు లోకంలో చీడపురుగులా వుంటారు. కాని మనోబలం కలిగిన మనుష్యులు నీబోటిగాళ్ల దౌర్జన్యంవల్ల మరికాస్త ఉత్కృష్టత పొందుతూ వుంటారు. నిన్ను నల్లిని నలిపినట్లు నలపగలను. నీచరిత్ర నీ అంతరాత్మకు వదలుతున్నాను. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకో. దేవతాస్వరూపిణి నాభార్య నీకు హాని చేయవద్దని బ్రతిమాలుకొన్నది. ఆమెపేరు పెట్టి దీపం పెట్టుకో. నీ చరిత్ర గమనిస్తా... ఇంకొక మనుష్యమాత్రుడికి నీవు అపకారం చేసావని తెలుస్తే నీజన్మ పరమనీచమైపోతుందనిమాత్రం ఘట్టిగా చెబుతున్నాను. పో."

పిన్నారావు తన చెవులు తానే నమ్మలేకపోయాడు. సిగ్గుపడిపోయి వంగి తల వాల్చుకొని ఎట్లనో బైటకివచ్చాడు. ఈసంగతివిన్న పోలీసుడిపార్టుమెంటు అంతా పోలకు అవతారమూర్తి అనుకోనివారు లేరు.

౬

గోదావరీతరంగాలు సంధ్యారుణకిరణ తూలికల స్పర్శచేత గులాబీరక్తిమ దాలుస్తూ, తెరచాపనెత్తికొని మహావేగంతో పోతూవున్న ఆనావకు కప్పనితగులుతూ తుప్పరలై ఎగురుతూ కోటివర్ణాలు తాలుస్తూ కిందకి పడిపోతూన్నవి.

దక్షిణపుగాలి గోదావరీదేవితో సయ్యాటలాడుతున్నది. దూరాన పాపికొండలు సందెచీకట్లలో నీలారుణమగు రంగుతాల్చి అవ్యక్తంగా కనపడుతున్నవి.

ఇసుకతిప్పలలో పూలువిరిసిన దోసపాదులు కమ్మని సువాసనల్ని పన్నీరు చల్లుతున్నవి. ఆనావలో పోలక్ తనహృదయేశ్వరి అయిన సత్యవతీదేవిని మల్లెపూవులచే అలంకరింపబడిన ఆమెశిరస్సును తన చెక్కిలికి నొక్కుకొని దృఢమైన తనబాహువుపు పాపికొండ అడవులలోని మహాలతలా చుట్టవేసి, తన కదుముకొని ఏమేని వెఱ్ఱిమాట లాడుకున్నాడు.

ప్రణయపూజావేశాలైన నయనాలతో సత్యవతీదేవి భర్తమోము తిలకిస్తూ వున్నది.

ఆనావ ఆరికరేవలవైపు ఛెంగుఛెంగున దుమికిపోతున్నది.

---

# తెలుఁగు మొలక

మున్నుంగి... శీర్ష

చి. సౌ. ఊ. లక్ష్మీకాంతము (కృష్ణకుమారి)

ఈయమ్మ శ్రీ నాళము కృష్ణరాయమిథునము కన్న కూఁతురు. శ్రీ ఊటుకూరి హయగ్రీవ గుప్త (అడ్వొకేట్)కు అర్మిలిఇల్లాలు. శ్రీ మోతే కృష్ణరాయ జమీందారుని గారాబు మేనగోడలు. తల్లి సుశీలాదేవి గానకళాసుధయు, తండ్రి కృష్ణరాయని సాహిత్యరజమును మేళవించి కరఁచిపోసిన పుత్తడిబొమ్మ. పాలబుగ్గలనాఁటి మొదలుగా పదునెనిమిదేండ్ల ప్రాయము దాఁక భారతీదేవి చనుబ్రాల నల్లారుముద్దుగఁ బెరిగిన నిసుఁగు. ఇటు సంగీతవ్యవసాయము, అటు సాహిత్యవ్యాసంగము, పదిసంవత్సరములు నిరంతరాయముగ సాగించి సాధించిన తత్పరచిత్త. కళాసిద్ధికై బుద్ధిని మీఁదుగట్టినది; కరమందిన పతికి జీవిత సర్వస్వము కానుకపట్టినది. సాహిత్యమునఁ దన నెఱపిన పరిశ్రమ ఫలించినది. "ఆంధ్రసర్వకళాపరిషదము"న "ఉభయభాషాప్రవీణ" పట్టము నాపోశనముపట్టి తొలికబళముగా నారగించిన కృతార్థురాలు. *

ఓడ్డకృషిని వాత్సల్యాతిశయమునఁ బ్రోత్సహించి పోషించుచున్న అమ్మ-నాయనల కళాప్రియత్వము నగ్గించుటయ కాదు, ఇల్లాలి వైదుష్యమును భూషించి వినోదించుచున్న ఏలినవాని విద్యావిలాస లాలసత్వము నుగ్గడింపవలెను. కళాధిదేవతకు నోచుకున్న ఈయమ్మ పాడిన మంగళహారతియందలి పల్లవి తెలుఁగుసీమనెల్ల పేరంటము బిలువఁ దఱలి తలుపుపట్టినది.

విద్యాపిపాసు వసు నీయనుంగు జెల్లెలి అభిలాషమునకు ఆస్థ కృతపడినది. అవిరతవ్యవసాయమునకు సహజకౌతూహలము జతపడినది. గ్రహణశక్తితో వైశద్యము ప్రతిగలిపినది. పరామర్శదృష్టిని ప్రజ్ఞావిశేషము సమన్వయించినది. బుద్ధిసంపన్నతను భావనాప్రసన్నత అనుగమించినది. వక్తృత్వమును ఉచ్చారణదక్షత అలంకరించినది; ధృతియు వరించినది. ఆకృతి స్త్రైణము, అంతఃకరణప్రవృత్తి పౌరుషము. 'వ్యాస-కాళిదాసుల శకుంతల', 'అనుకరణము' ధర్మరాజాది 'భారత'వ్యక్తుల చరిత్రలేశములను మున్నుగా ఈయమ్మ రచించినవానిలోఁ గొన్నిటినేని జదివి పైవాక్యముల యర్థమును గ్రహించి పెద్దలు మన్నింతురు గాక.

ఈ తెలుఁగుమొలకవంటి చెల్లెండ్రను కనుపుతోఁ గూడ మనసు ఫలించి, సంగీత-సాహిత్యాదికళాకోశములను ఖజానాలఁ జేర్చి, కన్నతల్లి సీమ కఱవుదీర్తురు గాక! ఈ 'కృష్ణకుమారి' (లక్ష్మీకాంతమునకు నామాంతరము) తెలుఁగుతోఁబుట్టువుల కెల్ల మేలిమచ్చుగా వేయేండ్లు ముత్తైదుతనమున వెలయుఁగాక!

---

* ౧౯-౩౫ సం.రం, మార్చిలో జరిగిన ఆంధ్రసర్వకళాపరిషత్ పరీక్షయందు 'ఉభయభాషాప్రవీణ' పట్టము (మొదటి తరగతిలో) ఏకైకాగ్ర్యముగా నందినది.

ఉభయభాషాప్రవీణ



వి. సౌ. ఊ. లక్ష్మీకాంతము (కృష్ణకుమారి)



‘బానిసపడుచు’ వేషమున నున్న ‘నైనా మే మెక్‌కినీ.’



'రాకెటు' ప్రయోగము

# అంతరిక్ష శోధకులు

మానవప్రయత్నములందు సాధ్యాసాధ్యములు సాపేక్షములు. ఒకయుగమునందసాధ్యమైన సంకల్పప్రయత్నములు వేరొకయుగమ... సాధ్యము లగుచున్నవి. ఒక మానవున కసాధ్యమైన కార్యము వేరొకనికి సులభముగ నుండును. అసాధ్యములైన పురాణగాథలు కాలాంతరమున నవలాంశములును సామాన్యవిషయము లగుచున్నవి. ప్రవృత్తిపరిణామమునందు శాస్త్రార్థములనాద్యంతములు. ధ్రువమండల చంద్రమండల సంచారమును నాకాశసంచారమువలెను సాధ్యమను భ్రమను ప్రకృతిశాస్త్ర పరిశోధనలు విశదము చేయుచున్నవి. పూర్వము పార్థివశక్తిమూలమునను సంచలించెడి యంత్రములు వర్తమానకాలమునందు అప్ శక్తిమూలమునను సంచలనమును పొందుచు గంటకు ౧౦౦౦ మైళ్ల వేగముతోను ఆకాశమునందు విమానములు, రాకెటులును పరువిడుచున్నవి. ఆటోఫిషరుగారను జర్మనుశాస్త్రజ్ఞుని ఆకాశశోధనము భయసంభ్రమములను గలుగజేయుచున్నది. ఆటోగారిసోదరుడు బ్రూనోగారు ౭౦ అడుగుల రాకెటును నిర్మించిరి. ఆరాకెటునందు ౧౯౩౩ నవంబరునందు ఫిషరుగారు ఉక్కుద్వారముగుండా ప్రవేశించిరి; తదనంతరము ద్వారము బంధింపబడినది. పెట్రోలు ఆక్సిజను సంయోగమువలన గలిగిన ద్రావకశక్తిచేతను రాకెటుఆకాశమునకు ఎగిరినది. కొన్ని నిమిషముల తరువాతను పారచ్యూటుద్వారా రాకెటుతిరిగీ క్రిందికి దిగినది. ఆటోఫిషరుగారు రాకెటునుండి బయటికి వచ్చి వారి యనుభవము నిటులు చెప్పిరి :—

రాకెటు భూమిని విడిచినపుడు మహాగర్జన మేర్పడినది; మోయరానిబరువు నన్ను నలిపివేయునటులుతోచి వెంటనే నాకు స్మృతి పోయినది. కారణము నెత్తురు తలనుండి దేహమునకు ప్రసరించుట యైయున్నది. నాకు తిరిగీ స్మృతిగలిగినపుడు (Altimeter) ఎత్తు ప్రమాణయంత్రము ౩౨,౦౦౦ అడుగులు ఎత్తును అనగా ౬ మైళ్ల యెత్తును చూపినది. రాకెటుప్రదేశ మంతయును వేడిమిచే మండిపోవుచున్నది. కారణము రాకెటు ఎగిరిపోవుట, యందమర్చిన చిన్న రాకెటులు ప్రేలుటయై యున్నది. నేను తిరిగీ భూమిమీదను కాలు పెట్టగలిగినందులకు సంతసించుచున్నాను.

రాకెట్లద్వారా వైమానికశాస్త్రజ్ఞులు అంతరిక్షమునను సంచారము చేయుటకు చేయుచున్న ప్రయత్నములు భయభ్రాంతులను గలుగజేయుచున్నవి. విమానములు, రాకెటులును వాయుమండలమును దాటి ఆకాశమునందు స్ట్రాటోస్ఫియరునందు

గంటకు 300 మైళ్ల చొప్పునను ప్రయాణము చేయుట కేర్పాటులనుజేయ దలచుచున్నారు. రుష్యా, ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా, ఇటలీ రాజ్యములందు వైమానికశాస్త్రజ్ఞులు వాయుమండలము నతిక్రమించి స్ట్రాటోస్ఫియరునందు రాకెటులను నడిపించుటకు పరిశోధనలను జేయుచున్నారు. కొందరు శాస్త్రజ్ఞులు చంద్రమండలమునకు పోవుటకు రాకెటులను తయారుచేయ దలచుచున్నారు. ప్రకృతి శాస్త్రాన్వేషణములకు రుష్యారాజ్యము నూతనముగ బూనుకొనిన పురోభివృద్ధి ఆశాజనకముగ నున్నది. ఇంగ్లాండుమాత్ర మీవిషయములందు వెనుకబడియుండుట సంతాపకరము. సకలవిధములను వెనుకబడిన ఇండియా సంగతిని విచారింపవలసిన యవసరమే కనుపడదు.

[నాషుపత్రిక సేకరించికనుండి]

---

## దురదృష్టవంతుఁడు

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

ఇనుపగజ్జెలతల్లి మాయింటివేల్పు
పాడుపెద్దమ్మ మాపెద్దతోడఁబుట్టు
క్రూరదైవంబు పెట్టనికోట మాకుఁ
గంటినిఁక రెప్పవలె నన్నుఁ గాచుచుండ్రు.

పిల్లి ప్రత్యక్షమగు నిద్రవీడిలేవఁ
దుమ్మువినవచ్చు నెట్టికార్యమ్ముఁ గడఁగ
బ్రాఁతకుం బూనఁబడు హంసపాదు మొదటఁ
బయనమయిరాఁగ ముంగిటంబడుదు జాతి.

అవసరంబగుపట్లఁ బ్రయత్నపడుచు
నెంతయోజించినను నాకు స్మృతికిరావు
అనవసరమగుపట్ల నయత్నముగను
స్మృతిని వహియింతు విద్యావిశేషములను.

రత్నమని యమ్మఁబో బొమ్మరాయియగును
అతిరసంబని తినఁబోవ నాప్లమగును
త్రాడఁటని పట్టుకొనఁగ సర్పమయి కఱచుఁ
జుట్టమని వచ్చి దయ్యమై పట్టుకొనును.

గఱికపఱకయు విష్ణుచక్రంబ యగును
మందవాతంబునుం బ్రకంపనము యగును
శిలయుఁ దనుమ్రొక్కఁగాఁలఁదన్నులనుదన్ను
నాదు కాల్సేతులే యాను నాకుఁ బగరు.

మరతలు పమర్పఁబడియె మామకనిశాంతమునకు నయ్యది తానయి మూసికొనును
సిరివెలందుక లోనికిఁ జొఱఁగరాఁగఁ
దెఱచికొనియుండు దురదృష్టదేవికొఱకు.

---

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

(యువ జ్యేష్ఠాషాఢములు)

ఉత్తరము




దక్షిణము

[ఈపటమును ఆయాదిక్కులు సరిగా నుండునట్లు తలమీదుగా పెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాదులు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| జూన్ | 8 | తేదీని | రాత్రి | 8-55 | గంటలకును, | జూన్ 29 తేదీని రాత్రి 7-32 గంటలకును | కనబడును.] |
| ,, | 15 | ,, | ,, | 8-27 | ,, | జూలై 7 ,, ,, 7-0 ,, | |
| ,, | 22 | ,, | ,, | 8-0 | ,, | | |

"There are three voices of nature. She joins hands with us and says "Struggle; Endeavour". She comes close to us. We can hear her heart beating. She says "Wonder, Enjoy, Revere". She whispers secrets to us, we cannot always catch her words, she says "Search, Inquire" These then are the voices of Nature, appealing to Hand, Heart and Head, the Trinity of our being."

—J A Thomson.

(మన జీవనస్థితి హేతువులైన కర, హృదయ, మేధావయవములు మూడింటికి ప్రకృతిమాత వేర్వేరుగా మూడువాక్యములు చెప్పుచున్నది. (౧) ఆమె మనచేతులతో చేతులు కలిపి "వదలకు— ప్రయత్నించు - కృషిచేసి అవసరమైనచో పోరియైన సాధింపుము" అని మన చేతులకు ప్రోత్సాహవాక్యము పలుకుచున్నది. (౨) స్వకీయమైన హృదయస్పందనము మన కర్ణగోచర మగునట్లు ఆమె మనలను సమీపించి "ఆశ్చర్యానందములు పొంది, భయభక్తులతో పూజింపు" మని హృదయమునకు ఉపదేశము చేయుచున్నది. (3) మన చెవులలో నామె ఏకాంతముగా చెప్పు మూడవ వాక్యమునందు మాటలు సరిగా వినపడకున్నను "సరిగా పరిశీలించు; సంగతిసందర్భములు తెలుసుకో" అని కర్తవ్యోపదేశము గ్రహింపనగుచున్నది.)

ఈజ్యేష్ఠశుద్ధసప్తమి మొదలు ఆషాఢశుద్ధ సప్తమి-౮-౬-3౫ మొదలు ౮-౭-3౫ వరకు నగు మాసమునందు రాత్రి తొలిజామున నగపడు గ్రహనక్షత్రాలను ఖగోళచారుల నరయుదము.

## పాలవెల్లి (The Milky Way)

ఈ మాసములో పాలవెల్లి ఉత్తరదిశనుండి తూర్పుమీదుగా దక్షిణమునకు వంగియున్న పెద్ద మండలఖండమువంటి ఆకారము కలిగి వ్యాపించియున్నది. అది ఉత్తరసమీప ఈశాన్యదిశనుండి దిక్చక్రమును అంటిగాని, దిక్చక్రమునకు కొంచెము ఎగువగాగాని ప్రాగాగ్నేయదిశలు గడిచి దక్షిణమును చేరుచున్నది. ఉత్తరదిశనుండి వరుసగా పరిశీలించినపక్షమున నాపాలవెల్లి ఊర్వశి, రాజహంస, వీణ, గరుడ, శ్రీ మహావిష్ణు,ధనూ, వృశ్చిక, వృక, వేదిక, యయాతి, అశ్వతరమండలములమీదుగా దక్షిణమున త్రిశంకు (The Southern Cross) వరకు కా[illegible]ది. రాజహంసమండలముకడ ఈపాలవెల్లి రె[illegible]యలుగా చీలి, రెండు పాయలుగానే మూలనక్షత్రములవరకు పోయినది. అక్కడ యీపాయలు రెండును మరల ఏకమగుచున్నవి. ఈరెండు పాయ[illegible]మధ్య ఛాయాపథము దృగ్గోచరమగుచున్నది. మేఘములు లేని చీకటిరాత్రులలో, ఈమాసమున నీపాలవెల్లి దృశ్యము మిక్కిలి మనోజ్ఞమై కానవచ్చుచున్నది.

## రాసులు (Zodiacal Constellations)

పడమటనుండి తూర్పునకు వరుసగా మిథున, కర్కాటక, సింహ, కన్యా, తులా, వృశ్చిక, ధనూ రాసులు వ్యాపించియున్నవి. మిథునము అస్తమించుచున్నది. ధనుస్సు ఉదయించుచున్నది.

## తేజోవిషయమున నగ్రగణ్యమైన నక్షత్రములు

## (First Magnitude Stars)

౧. బ్రహ్మ (Vega)
౨. జ్యేష్ఠ (Antares)
3. అశ్వతర (౧) (Alpha Centauri)
౪. ,, (౨) (Beta ,, )
౫. స్వాతి (Arcturus)
౬. శ్రవణము (Altair)
౭. త్రిశంకు (Alpha Crux)
౮. విశ్వామిత్రుడు (Beta Crux)
౯. చిత్త (Spica)
౧౦. మఘ (Regulus
౧౧. పాంబమూర్తి (Pollux)

అను నీపదునొకండుదివ్యనక్షత్రములు మనకు ఈమాసముతొలిజామున నగపడుచున్నవి.

## గ్రహములు (Planets)

తూర్పుఆకాశమున, విశాఖనక్షత్రగతుడై దేవ గురుడు (Jupiter) విద్యుద్దీపమువలె మెఱయుచున్నాడు. దానవగురుడగు శుక్రుడు (Venus) ఈజూన్ ౧౦-వ తేదీని పుష్యమి ౩-వ పాదమునందును, జూలై ౭వ తేదీని మఘ మూడవపాదమునందును కనబడును. కాబట్టి శుక్రునకు ఈ నెలలో పుష్యమి, ఆశ్లేష, మఘా నక్షత్రములలో సంచారము కలదు. దానవగురుడగు శుక్రుడు పడమట Gas light వలె దివ్యమైన తేజస్సుతో మెఱయుచుండు దృశ్యము మిక్కిలి మనోజ్ఞమయియున్నది. ఈ గురుశుక్రులమధ్య భూపుత్రుడగు అంగారకుడు (Mars) ఎఱ్ఱనికాంతితో మెఱయుచు, ఈమాసమునందు, హస్త, చిత్ర నక్షత్రములమార్గమున సంచరించుచున్నాడు. జూనుమాసాంతమున మఘసమీపమున శుక్రుడును, చిత్రసమీపమున కుజుడును ప్రకాశించుట మిక్కిలి గమనింపదగియుండును చంద్రుడు ౧౬ జూన్ తేదిని జ్యేష్ఠనక్షత్రము చెంత వెలుగుచు, ఈజ్యేష్ఠమాసపుపేరు సార్థకముచేయుచున్నాడు. తక్కిన గ్రహములు ఈ మాసమునందు రాత్రి తొలిజామున నగపడవు.

## ఉత్తరనక్షత్రములు

ఉదయము, అస్తమానము అనునవి లేక ఎప్పుడును ఉత్తరమున కానవగు లఘుబుక్షునక్షత్రములు చక్కగా మెఱయుచున్నవి. ధ్రువుడు ధ్రువక్షితికిమధ్య వెలుగుచున్నాడు. ధ్రువునికి ఎగువను వరుసగా కశ్యప, మహేంద్రులును, తోకవూలను అగ్నినక్షత్రమును, అగ్నికితూర్పున ఆవగింజవలె మిణుకుమిణుకు మనుచు మిత్రనక్షత్రమును ఉన్నవి. అగ్నికెగువను ధాతవిధాతలు ధ్రువరక్షకులు మెఱయుచున్నారు. ధ్రువతారచెంత నుండి ఈశాన్యమునకు ఊర్వసి చుక్కలు అడ్డు (Horizontal) గా మెఱయుచున్నవి. మృగశిర, ఆర్ద్ర నక్షత్రములు ఇదివరకే అస్తమించినవి. తూర్పున జ్యేష్ఠ నక్షత్రము ఉదయమయినది. ఇంద్ర దేవతాకమైన జ్యేష్ఠ ఉదయము కాగానే వృత్రవధ అయినది. పునర్వసు చుక్కలలో మిథునము (Caster and pollux) మాత్రము అగపడుచున్నది. పునర్వసుచుక్కలకు ఈవల పొట్లపూవువంటి పుష్యమినక్షత్ర మున్నది. ఆ చుక్కమబ్బున కటునిటు గలచుక్కలు గాడిదె (Asseli) లని యును, అవి ధవళధవళమైన పుష్యమి యను వెండికంచములో ఆహారము తినుచుండు ననియు పడమటివారి గాథలు గలవు. పుష్యమికి దిగువను సర్పాకార ఘోరమైన ఆశ్లేషనక్షత్రము లున్నవి. ఈచుక్కలను పాశ్చాత్యులు Hydra చుక్క లందురు. ఈహైడ్రాచుక్కల గుంపు స్వాతిదిగువవరకు వ్యాపించియున్నవి. ఆశ్లేషకు ఆవల మఘనక్షత్రము లున్నవి. అవి పల్లకిబొంగును పోలినవని మనవారు చెప్పుదురు; కొడవలి రూప మని పాశ్చాత్యులు చెప్పుదురు.

## వాయవ్యమున

మిథునమునకును ధ్రువక్షితికిని మధ్య లంబోదరముతోను, మూషకవాహనముతోను, ఏకదంతముతోను విఘ్నేశ్వరు డగపడుచున్నాడు. విఘ్నేశ్వరునకు ఈవల పడమటకు వ్రాలి, బృహదృక్షమునందలి క్రతు, పులహ, పులస్త్య, అత్రి, ఆంగీరస, వసిష్ఠ, మరీచి అను నామములుగల సప్తమహాఋషులు మెఱయుచున్నారు. ఈరెండు ఋక్షములకు మధ్య మెలికలు తిరుగుచు ఘోరసర్పాకారుడై నరకుడు పరిజనముతో చూడనగుచున్నాడు.

## నైరృతిదిశను

నౌకామండలముయొక్క పైభాగములుమాత్రము కొన్ని కనబడుచున్నవి. అగస్త్యు డస్తమించినాడు. నౌకామండలపుచుక్కలకు ఎగువను ఆశ్లేషాహిచుక్కలును, వాటికిఎగువను, మఘకు దిగువను గ్రావములు (Sextant) ను, వాటిప్రక్కనే చమసము (Crater, the Cup) ను, చమసమునకు దిగువ వమ్రీ (పుట్ట) మండలమును కలవు. చమసమునకు తూర్పుగా వార్తికము వ్రాలియున్నది.

## దక్షిణమున

పాలవెల్లి దక్షిణపుకొసలో శిలువఆకారముగల నాలుగు నక్షత్రము లున్నవి. దానిని పాశ్చాత్యులు

Southern Cross అనియు, మనవారు త్రిశంకుడనియు చెప్పుదురు. త్రిశంకుడు ఇంద్రప్రహృతుడై తలక్రిందుగా పడుచుండగా "తిష్ఠ" "తిష్ఠ" అని నిలిపిన విశ్వామిత్రుడు గగనమధ్యరేఖ గడచి అఖండతేజముతో మెఱయుచున్నాడు. త్రిశంకునకు ఎగువను అశ్వతర మండలము కలదు. అందలి ఆల్ఫా బీటాగుర్తులుగల కాంతివంతములగు చుక్కలు అశ్వినుల 3 వ స్థానమున నున్నవి. ఆదిగువను ఇంద్రశాపోపహతుడగు యయాతి యున్నాడు. ఆగ్నేయదిశను వేదికామండల మున్నది. దాని కెగువను వృకాసురు డున్నాడు.

## తూర్పున

రాజహంస, శ్రవణ నక్షత్రములును, ఆగ్నేయ దిశను ధన్వియు ఉదయమైనారు. ఆదిగువను తేలు కొండెవంటి మూలయు, పగడమువంటి జ్యేష్ఠయు, జ్యేష్ఠకెగువను మిత్రదైవత్యమైన అనూరాధచుక్కలును ఉన్నవి.

## మధ్యను

రాజహంస వాహనముగాను, సంగీతసాహిత్య విద్యాస్వరూపిణియు, వీణాపాణియు నైన సరస్వతి భార్యగాను గల బ్రహ్మ, తనముఖమందు భార్యను ధరించి యున్నాడు. వీణ సరస్వతికి సంజ్ఞ. అట్టివీణామండల మున కాలుచున్న మెగ్నీషియముతీగ (Burning Magnesium Wire)వలె తెల్లని తేజముతో మెఱయుచు బ్రహ్మనక్షత్రము కనబడుచున్నది. బ్రహ్మకు దిగువ శేషశాయియై శ్రీ మహావిష్ణువు దర్శనమనుగ్రహించుచున్నాడు. ఈ జ్యేష్ఠమాసమునకు త్రివిక్రమదేవుడే మూర్తివంతమై సూర్యాస్తమానమైనపిమ్మట తూర్పున దర్శనమిచ్చుచున్నాడు.

అనూరాధకు పడమట విశాఖచుక్కలు గలవు. ఆమధ్యను గురుగ్రహము అఖండతేజముతో వెలుగుచున్నది. ఇంచుమించుగా గగనమ[illegible]నే భూతేశ మండలము (Bootes), స్వాతి (Ar[illegible]arus) నక్షత్రములును, వాటికి దక్షిణముగా ఆప, చిత్రనక్షత్రములును ఉన్నవి. కన్యారాశిలోని ఆప్యవసు, నళ, పాణిని, కణ్వ ప్రముఖనక్షత్రములును, వాటికెగువను కన్య వేణియని మనమును, Coma Berenices: The hair of berenice అని పాశ్చాత్యులును చెప్పె చూపు వేణీమండల మున్నది. క్షీరోదముయొక్క ఉత్తర ధ్రువము ఆసమీపముననే కలదు. మఘనక్షత్రమునకును కణ్వాదిచుక్కలకును మధ్య సింహారాశిలో పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని నక్షత్రమున నొకభాగమును ఉన్నవి.

మొత్తముమీద ఈమాసము తొలిజామున పదునొకండు మొదటిరకపు నక్షత్రములును, గురు శుక్రాంగారక గ్రహములును ప్రకాశించుచుండుటచేత ఖగోళము మిగుల తేజోవంతముగా చూపట్టుచున్నది. సూర్యాస్తమయముకాగానే త్రివిక్రముని సందర్శనము ఈమాసముయొక్క ఆధిక్యత.



# ఏజన్సీమహాసభ

మదరాసురాష్ట్రమున ఏజన్సీప్రదేశము గంజాం, విశాఖపట్టణము, తూర్పుగోదావరి — ఈ మూడు జిల్లాల లోను వా     యున్నది. అడవిజాతు లనేకములు అచ్చట నివాసము చేయుచుండును. వారి క్షేమాభ్యుదయములకు వలసిన ఆర్థికరాజకీయాదు లగు సౌకర్యములను నిర్ణయించి వానిని సంపాదించుటకయి ప్రయత్నముచేయ నీమహాసభ పార్వతీపురమున ౨౫-౫-౩౫ నాడు కూడినది. దీనికి విశ్వదాత, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు అధ్యక్షతవహించిరి.



కా. నాగేశ్వరరావు పంతులుగారు

ఈయేజన్సీ విస్తీర్ణము ౧౯,౮౬౯ చ. మైళ్లు. ఇందలిజనసంఖ్య ౧౭,౬౩,౭౬౫. ఇందులో (౧) భగాలూజాతివారు ౩౪,౩౭౯; (౨) చెంచులు ౨౩౧; (౩) డోంబులు ౭౯,౬౪౩; (౪) గదబలు ౪౭,౪౭౯; (౫) గొండాలు ౨౯,౧౫౨; (౬) జాతాపులు ౭౮,౧౩౨; (౭) కొం[illegible]లు ౩,౪౭,౨౩౭; (౮) కొండదొరలు ౮౫,౯౫౨; (౯) కోయలు ౫౯,౧౧౩; (౧౦) పానులు ౭౦,౫౨౭; (౧౧) పోరజాలు ౧,౨౩,౧౦౦; (౧౨) సవరలు ౨,౧౧,౭౮౧.



శ్రీ చెలికాని సీతారామస్వామిగారు

(ఆహ్వానసంఘాధ్యక్షులు.)

నూతన రాజ్యాంగ సంస్కరణములందు వీరికేమి యు సౌకర్యములు లేవు. హిందూదేశమునకు రాష్ట్రీయ స్వపరిపాలనము వచ్చినను ఏజన్సీభాగమునుమాత్రము బ్రిటిషుగవర్నమెంటు ప్రత్యేకాధికారముక్రింద నుండ వలసినట్లే యున్నది.

ఈ యేజన్సీభాగమునుండి అధికభాగము ప్రకృతము క్రొత్తగా నేర్పరుపబడనున్న ఒరిస్సారాష్ట్రమున జేర్చుటకు నిశ్చయింపబడెను. అట్లు చేర్చుభాగము ౧౪,౭౪౩ చదరపుమైళ్ల విస్తీర్ణము కలది. అందలి జనసంఖ్య ౧౪,౫౪,౦౩౨. దీనివలన ఏజన్సీవారికి తీరనినష్టము గలుగును.

ఈ యేజన్సీలవారు ఆదిమజాతులవారు. వీరు అటు ఓఢ్రులుకాని, ఇటు ఆంధ్రులుకాని కారు. కాని వీరికి మొదటినుండియు ఆంధ్రులతో పరిచయము, అనుబంధము అధికము. ఇంచుమించుగ వీరాంధ్రులలోనివారయిపోయినారు. వీరిని ఆంధ్రులనుండి చీలదీసి ఓఢ్రులలోగలుపుట సముచితము కాదు. మఱియు మద్రాసు రాజధాని ఒరిస్సాకంటె సంపన్నమయినది. మద్రాసు రాజధాని ఆయములోనుండి ఏటేటఅభివృద్ధికొరకు విశేషముగ ధనమువెచ్చింపబడుచుండునపుడే యేజన్సీయిట్లు వెనుకబడియున్నది. నిరంతరము అతివృష్టి, అనావృష్టి దోషములకు పాలగుచుండుటచేత ధనసంపన్నము కాని ఒరిస్సారాష్ట్రమున చేరి ఏపాటి అభివృద్ధిని గాంచ గలదో! కాబట్టి మదరాసురాజధానిసంబంధము ఏజన్సీశ్రేయస్సునకు అనివార్యము.

ఏజన్సీలవారు బాగుపడుటకు సకలవిధముల విశేషముగ కృషిచేయవలెను. వీరిలో వచ్చినవారు నూటికొక్కనివంతుననైన నుండరు. వీరికి చదువు, సంస్కారము, విజ్ఞానము లభించునట్లు చేయవలెను. ఆర్థికాభివృద్ధిమార్గములను చూపవలెను. వీరిని పీల్చివేయు చున్న ఋణబాధనుండి తప్పించవలెను. మన్నెజ్వరముల బాధ తొలగించు నుపాయము లారయవలెను. వ్యవసాయ, వ్యాపార సౌకర్యములు కుదురవలెను. ప్రయాణయోగ్యములగుబాటలు నిర్మింపబడవలెను. పరపతిపుట్టుటకు తగినవీల్లు నేర్పరుచవలెను. సభాకార్యక్రమమున నీవిషయము లన్నియు ప్రస్తావనకుదేబడి చర్చింపబడినవి. వీనిని ఫలప్రదములుగజేయ గట్టిప్రయత్నము చేయవలసి యున్నది. తమరాష్ట్రమునంచుల నివసించుచు, తమకంటె చాలవెనుకబడి, నానాటికి క్షీణించుచున్న యీ యాదిమజాతుల నుద్ధరించుట ఆంధ్రుల కవశ్యకర్తవ్యము.

---

## చిత్రపటాలు

**అడివి బాపిరాజు**

నాదుకలలన్ని పటములై నాదుమంది
రాంతరస్నిగ్ధకుడ్యాల నందగించు,
తెలియబడరాని వర్ణికామిళిత మాధ్భు
తములు, రేఖాప్రవాహ చిత్రంపుసుడులు
అస్మదీయ జీవితరహస్యమ్ము కలచి
వైచు దివ్యభావములలో పరిణమించు.

---



గాంధిమహాత్ముడు బోర్సదులో తమ బసయందు సర్దారు పటేలుగారితో
ప్లేగు విచారణనుగూర్చి చర్చించుట




శ్రీమతి కమలా నెహ్రూగారు, ఆమె కుమార్తె ఇందిరా నెహ్రూగారు

# 'గ్యాంగ్ మాన్' సూరయ్యా

కవికొండల వేంకటరావు

స్టేషన్ చూస్తే 'వేంద్ర' రైలుస్టేషన్‌కంటె చాలాచిన్నస్టేషన్; కాని సందడి చూస్తే అక్కడికంటె ఎక్కువ. అందుక్కారణాలు మూడు: ౧. రెండురైళ్లు తప్పుకోవడానికి ఆబద్ది వుండడమేకాకుండా ౨. అక్కడ ప్యాసెంజరు ఆగిపోయివుంటుంది, మెయిలు దాన్ని అందుకొని దాటిపోయే వఱకు 3. మఱిఏబల్లూ నడవనప్పుడస్తమానం ఏదోమరమ్మత్తు ఆఅయోమార్గాన్ని ఆప్రాంతంలో ఆస్టేషన్‌కడ జరుగుతూవుంటుంది. పదిమందికూలీలూ, ఒకమేస్త్రీ వచ్చే రైలుకూ, పోయ్యేరైలుకూ తమ బారు చూపెడుతూవుంటారు. ౪. దానికంటే గొప్ప కారణం మఱొకటేమిటంటే సమీపంలోనే రైల్వేసరిహద్దుతీగలకావలగానున్న చేలగట్ల మీద గొడ్లకాసేవాళ్లు ఓపాట పాడుకుంటూ వుంటారు.

"'గ్యాంగ్‌మాన్' సూరయ్యా
ఖణేల్-ఖణేల్-ఖణేల్.
గంటకొట్టే మారయ్యా
ఖంగ్-ఖంగ్-ఖంగ్."

ఎవళ్లురా ఈసూరయ్యా, ఈమారయ్య అంటే 'సూరయ్యకొడుకు మారయ్య' అంటారు. కాని వారియిద్దఱి చర్యల్లోనూ కావలసినంత తేడా వుంది అని గమనించరు. ఇద్దర్నీ ఒకటేపాటలో కలిపి పాడేశేస్తూవుంటారు—ఒకకోవలో ముత్యాల్లాగు పేర్కొంటూ.

సరిగా యోజిస్తే ఇరువురియొక్క వృత్తులకీ సహస్రాంశం వార. గ్యాంగ్‌మాన్ సూరయ్య ఆస్టేషన్‌లో రైలుబండీవున్నంతసేపూ ఏమీ చప్పుడుచేయడు. తన జట్టువాళ్లల్లో చివర్నో, మధ్యనో ఎక్కడోఒకచోట నిలబడివుంటాడు. బండీ అలా వెళ్లిపోయిందీ అంటే గునపం పుచ్చుకునో, పెద్దపిడిపాఱ పుచ్చుకునో పనిచేస్తూ ఖణేల్ ఖణేల్ మనిపిస్తాడు. ఇఖ మారయ్యఅయినట్టాయినా రైలు తనస్టేషన్‌లో వున్నప్పుడే వాడిపని. ఖంగ్, ఖంగ్, ఖంగ్ వాయిస్తాడు గంట, రైలుని పొమ్మంటాడు. ఆపైని వాడి అజాపజా అగపడదు, వినబడదు. మఱోతేడా—సూరయ్యను చూచినవాళ్లు మారయ్యను చూడరు. మారయ్యను చూచినవాళ్లు సూరయ్యను చూడరు—రైలుప్రయాణీకులమాటే నే చెప్పేది. ఎంచేతాఅంటే మారయ్యా ఎప్పుడూ ప్లాటుఫారంమీది మనిషి, సూరయ్యా ఎప్పుడూ లైనుఅవతలమనిషి: మఱోతేడా—మారయ్యకు నెలకు ౧౦, ౧౨ రూపాయలు జీతం. సూరయ్యకు రోజుకు ఆరణాలు కూలీ: మఱోతేడా—మారయ్య కుఱ్ఱవాడు, ౨౦ ఏళ్లకంటే ఎక్కువవయస్సున్నవాడుకాడు. సూరయ్యా ఏభైయేళ్ల పెద్దముండాకొడుకు.

అయినా పెద్దచిత్రం! చేలగట్లకు, రాళ్లంతా
ఆయిద్దర్నీ పాటలో కలిపి పాడేస్తూవుంటారు.

'గ్యాంగ్‌మాన్' సూరయ్య
ఖణేల్-ఖణేల్-ఖణేల్!
గంటకొట్టే మారయ్య
ఖంగ్,-ఖంగ్,-ఖంగ్!



" గొప్పచిఱునవ్వుతో మోము

దాన్నిబట్టి చూస్తే ఈపాట మారయ్య పుట్టింతరువాత ఏపదేళ్లకో పదిహేనేళ్లకో బయలుదేఱివుండాలి అని అనిపిస్తుంది. ఎవరు కల్పించింపీ అంటే ఎవరి దనగలం? దారే పోయే గాలికూనయొక్క ఉత్తిఅభూతకల్పనగా భావించాలి.

'గ్యాంగ్‌మాన్' సూరయ్యా
ఖణేల్-ఖణేల్-ఖణేల్ !
గంటకొట్టే మారయ్యా
ఖంగ్-ఖంగ్-ఖంగ్..

పాట అలా తేలిగ్గా వినిపిస్తుందికాని అది ఆవూళ్లోవాళ్లేవళ్లన్నా, అందులోకీ వలివాడవాళ్లెవళ్లన్నా ఆలకించడం వస్తే వాళ్ల హృదయాలు తరుక్కుపోతూవుంటాయి. అయినా కుఱ్ఱవాళ్లు పాడుతూవుండడంచేత అదో మాయమఱపుగా పరిణమించిపోయి పెద్దవాళ్ల చెవుల్లోకూడా ఒక్కొక్కప్పుడు అమృతధారయొక్క మర్మరరవమ్మాదిరిగా పులకింపుగొలిపి "ఎక్కడుందో అదిప్పుడు? పాపం! స్వర్గంలోనో నరకంలోనో"అని అనిపిస్తుంది.



పీరమ్మబుల్లి తల కత్తేవాడు."

అదిప్పుడు పాపం! "అది"అంటే పరాయివాళ్లకేం తెలుస్తుంది? అనుకొనే ఆవూరి అమ్మలక్కలకూ, అన్నయ్యలకూ, బావయ్యలకూ తెలుస్తుందికాని.

లోకంలో ప్రతీవ్యక్తీ తనకు లోచనగోళాలున్నంతలో వికాసంపొంది విశదీకరణం అవుతూనేవుంటుంది కాని కాకపోదు; ఎటొచ్చీ కొందఱు పదిమందికంటాబడి మఱిపదిమంది మెచ్చుకునేలాగో, నిందించేలాగో ప్రవర్తిస్తారు. కొందఱు ఏకొద్దిమందికో అవుతూవుంటారు. రాగాపోగా చెప్పొచ్చే కబురేమిటంటే "అది"అని ఆవూళ్లో ఆపాటను

బట్టిఆగ్రామస్థులుస్ఫురింపజేసికొనేవ్యక్తి కొన్ని సుఆడిన అమ్మాయీ కాదు-చింతపిక్కలాడిన గుంటా కాదు- పుట్టుచేటూ దుమ్ములో దొర్లి బూడిదలో పొర్లి, మాలపల్లిమాణిక్యం అని మాత్రం పేరెన్నికగన్న వీరమ్మ అనే ఆడ పిల్లకాని. ఆపిల్ల ఎదగడంలో, ఎదిగి బొద్దవడంలో, బొద్దయి కొద్దికొద్దిగా కోరిక లీరిక లెత్తించుకోవడంలో కనబరుస్తూవచ్చిన చలాకీలు, సంయిసైగలు, ముక్కుతులకింపులు, ముంగురుల మలపింపులు ఏ-యవ్వనం వచ్చి ఈడేరి యింతవఅకూ ఈరేడులోకాలా సంచరించిన ఏ-చపలాక్షీ జరిపియుండదు. అంటే నమ్మండి.

వయస్సొచ్చాక్కూడా ప్రతీరోజూ పచ్చగడ్డి కోతకు పోయేది. రైలుగట్టు పంచలనేవున్న పడియలవార మొలిచి మోసులెత్తిన అమృతకాడ, ఊదగడ్డి, నక్కతోకగడ్డి, రెడ్డివారినానబాలు, చిలకతోటకూర, చెంగలిగడ్డి, తుంగగడ్డి, పావలితీగ, వెన్నవెదురాకు, పిల్లిపెసర, అంతాయాదాలాపంగా చుట్టపెట్టి కోసేది. కోసి ఏంచేసేదీ? అప్పటికప్పుడె రైలుగట్టుమరమ్మత్తు పూర్తి అయి విశ్రాంతికై ఆపడియలవార చతికిలబడే సూరయ్యాముందు ఆకోసిందంతా పెట్టి" మాంవా! ఇది గేదెలు తింటాయీ? ఇది ఆవులు తింటాయి. ఇది గుఱ్ఱాలుతింటాయేమో? ఇది మేకలు తినవు? "అని తను యాదాలాపంగా చుట్టపెట్టికోసిందాంట్లో ప్రతీదీ ఏదో ఒక జంతువు తినడానికక్కఱకువస్తుందే బుల్లీ! అని అతడనేదాకా మోపు కట్టుకునేది కాదు. మోపు మాపు కట్టుకు ఏంచేసేదీ? సూరయ్యాను "మోపెత్తిపెట్టుబావా" అనేది. సూరయ్యా ఏమనేవాడూ?"మాంవనల్లా బావనయ్యానా" అంటూ గొప్ప చిఱునవ్వుతో మోపువీరమ్మ బుల్లితల కెత్తేవాడు. అంతలో సందెలడేది.

"రాక్షసీ! ఈదాకా ... డ మిడికి మృతమారుతున్నావే వీరీ!" ... వీరమ్మ బుల్లియొక్క తల్లి ఎదురై ... త ఎత్తు ఎగిరి హాములుచూపిస్తే, వెలి... దీలో వీరమ్మబుల్లి నవ్వుతూ మోపడేసి "నీరోజుల్లో ఎప్పుడన్నా ఈలాంటి మోపెత్తుకొచ్చావంటే కోపంపడతావుగాని ఇంతమో పెత్తుకొచ్చావంటే అమ్మా!"అనేది.ఆనవ్వుతో తల్లియొక్క రౌద్రం పటాపంచలైపోయి "నాతల్లీ అంతంతమోపు లెత్తుకురాకే. మెడ బెణికిపోతుంది." అని కూతురి ముంగురులు వెనక్కెత్తి ఓమాటు మొలగుడ్డ దిగదీసి, పైగుడ్డ ఎగదీసి, ఆపెద్దమోపుని ఆతల్లి రెండు మఱీ పెద్దమోపులుగా బులబులాగ్గా అమర్చి ఆమ్మకానికి గొనిపొయేది. పల్లెటూళ్ళల్లో అమ్మకానికని అనకూడదులెండి. వతనుగా వేయించుకునే వెలందొర్లకో బామ్మర్లకో వేసివచ్చేది.

విడ్డూరంగా చెప్పేసీమాటేమో పాతకుల్ని వేధించి చంపక త్వరగా చెప్పేస్తే వాళ్ళూ నేనూకూడా తెలపినిపడతాం:— ఎలాగొచ్చిందో వీరమ్మ కొన్నాళ్ళ కడుదు పొచ్చింది. ఎంత కడజాతివాళ్ళయినా మాలవాళ్ళల్లో మాఋమనువు కద్దూ ఆటంకం లేకపోయినా, కట్టుతప్పిన కన్నెపిల్ల కడుదు పైందీ అంటే కులంవాళ్లొప్పుకోరు. వనం

విడిచిపోయిన కోతి మళ్లీ వనంలోకి వస్తుందా. ఆలాగ్గానే కులంచెడ్డది కులంలోకి మళ్లీ రానేరదు. వీరంబుల్లికి ఆగోలంతా ఏం తెలుసు? ఏల తెలీదు! క్రమంగా నెలలు పైబడినకొద్దీ బెంగెట్టుకుంది. దానివయస్సు అంతా పోగుచేస్తే పద్దెనిమిదేళ్లు నిండా వుండవు. ...టికోడలై యుంటే బహు రంగంగా నీళ్ళో... వలసిన నీరేజాక్షి.

తల్లీవ... "తగని పని చేశావే వీరీ! ఎంతమంది గడ్డిమోపు లెత్తుకురావడంలేదు. అంతా నీలాగే నవ్వుటాలపాలైనారే?" అని కళ్లనీళ్లు పెట్టుకోవడం ఒకనాడు చూచింది వీరమ్మ. "అయితే ఏంచెయ్యమంటావు?" అంది తల్లితో కూతురు. తల్లి ఏమన్నా తండ్రి నడగమంది. తండ్రి అక్కడేవుండి అన్నీ వింటూ "వెళ్లి గ్యాంగ్‌మాన్ సూరయ్యని సలహాఅడుగు" అన్నాడు. వీరికి ఆమాట కత్తెట్టిపొడిచినట్టయింది. "బాబా! ఆడదలచి సూరయ్యమాంవని తూలనాడేరుగాని — కిరస్తానీమిస్సమ్మ మన గుమ్మంలో కొచ్చి నిరుడు యేసుమీదికీర్తన పాడి "మరియమ్మకన్నెకు పుట్టిన పట్టీ! నా య్యేసూ!" అంటూంటే ఆసెమ్మలు బోసెమ్మలు ఏలా వింటూ ఊరుకున్నారా?" అని అడిగింది. "మనగుమ్మంలో కొచ్చిందీ దొరసానమ్మ?" అన్నాడు తండ్రి. "మనగుమ్మం వొక్కటే అన్నమాటేమిటి, అన్నిగుమ్మాల్లోకి వచ్చింది." అంది వీరి. "మఱి అలాగైతే ఆమతంలో కలిసి వాళ్లసలహా పుచ్చుకుని ఏడువు. ఫో. నాగుమ్మంలో వుండకు" అన్నాడు తండ్రి.

వీరి కేంతోచింది కాదు. తిన్నగా దొరసానమ్మగారింటికి వెళ్లి ఆవిడసలహా మీద ముందుగా మతంపుచ్చుకోకుండా ఘోషాఆసుపత్రిలో పురుడుపోసుకొని పురిటి అప్పుడు పిల్లాడితండ్రి ఎవరని అడిగితే "గ్యాంగమన్ సూరయ్య" అనిమాత్రం చెప్పి తానోమూల కొత్తిగిల్లింది.

పిల్లవాణ్ణి ఆసుపత్రివారు ఇవలకు తీసి సూరయ్యకు కబురెట్టి అతడొచ్చాక "సూరయ్యా! ఇడుగో నీకొడుకు" అన్నారు. సూరయ్య నిర్ఘాంతపోయి మొట్టమొదట ఏదో ఉనబోయినాడుగాని పిల్లవాని కెవ్వు విని కొంచెం చలించి పుత్రవాత్సల్యంతో చేరతీసికొని "తల్లేది?" అని అడిగేడు. "తల్లి చనిపోయింది. పిల్లవాణ్ణి పెంచుకో" అని చెప్పి ఇచ్చివేసినారు.

వీరినిమాత్రం తరువాత తమమతం లోకి కలుపుకొని "వీరీ! నీవు పునర్జన్మం ఎత్తినావనుకో. వెనుకటిదంతా మఱచిపో. నీవు చాలా అందమైనదానివి. మంచిదానవు. నీకు చదువుచెప్పించి నీకు ఉద్యోగం ఇప్పిస్తాం" అని వీరిపేరు మార్చివేసి దానికి "ఆసియాఖండపు హెలెన్" అని బిరుదుతో కూడిన నామకరణం నూతనంగాచేసి నీళ్లిచ్చి ప్రజల్లో పడేశారు.

సూరయ్య తాను ఆసుపత్రినుండి తీసి తెచ్చుకొన్న కుఱ్ఱవాణ్ణి ఆగూడెంలోనే అంతమందిలోనూ పెంచి పెద్దవాణ్ణిచేసి వాళ్లందఱికీ కన్నెఱ్ఱగావుండేలాగు అక్కడే తాను గ్యాంగుమాన్‌గావుండే సెక్షన్‌స్టేషన్ లోనే గంటకొట్టేవాణ్ణిగా కుదిర్చి మారయ్య అని పేరిచ్చేడు.

మారయ్యాకు ఈవుద్యోగం అయ్యే సరికి ఎన్నేళ్లు గడిచివుంటాయి హెలెన్ జీవితంలో? అధమపక్షం మరో పదహారు పదిహేడేళ్లయినా గడిచివుంటాయి. కాని వీరి వీరిలాగుంటే ఆమనిషి ముప్పైఅయిదేళ్ల మనిషిలా కొపించేదేమోగాని, హెలెన్‌గా మాత్రి విద్యావతియై, డిగ్రీసంపాదించుకొని, ఒకచోట అతినవనాగరికమైన ఆయాసం లేని ద్యోగంలో ఉబ్రహ్మచారిణిగా కాలం బుచ్చుతూ, ఎవర్ని రానిండి టీయిస్తూ ఉపమాపెడుతూ, చెక్కిళ్ల నేమిటమ్మా పొక్కులని నెచ్చెలు లడిగితే పోత్రప్పొక్కు లన్నట్టు మందహాసంచేస్తూ వుంటూంటే ఎన్నేళ్లమనిషిలా గొపిస్తూవుందని చెప్పను? ఎన్నేళ్లమనిషిలా గెవరి కెలా అనుకోవాలని వుంటే అన్నేళ్లమనిషిలా కగపించేది.

మునుపులేని నవకం నాజూకుతనం వెల్లడి ముఖంలో తాండవిస్తూంది. రోజూ నబ్బెట్టి తోమి, స్నో రాసి, పౌడరుచల్లి కాని యివలకు రానేరాదు. కడితే సిల్కుచీరే కాని అల్కాచీర కట్టదు. తొడిగితే తొందఱ పనివుండేవాళ్లకు ఇంత కన్న సౌడుగైన రయికలు పనికేరావంటూ, ఎక్కించనవసరం లేని ఎక్కడెక్కడి టక్కుటమారుకంచు కాలూ తొడిగి, గానుగెద్దుకళ్లగంతల్లా గముచ్చుకునేది. రైల్లో ప్రయాణంవస్తే రెండో తరగతిగాడీ, బస్సుఎక్కితే ఫ్రంటుసీటు, రిక్షాలో తనూ తన శీరకుచ్చెళ్లూనూ.

నిజంగా హెలెన్ తన పూర్వగాథ అంతా మఱచిపోయింది. అదెప్పుడన్నా తలపుకువచ్చినా "ఛెస్సి! ఎంతచెడ్డపని జరిగి పోయింది." అని అనుకొనేది. ఒకమాటు నాలిక్కరుచుకునేది. నరకం అనేది వుంటే ఎలా భరించనూ అని అటమటించిపోయేది. కాని ఎవళ్లతోటీ ఏమీ చెప్పేదికాదు. ఆబాధ ఆరోత తనలోతానే అనుభవించేది. పైకిమాత్రం బహుఅమాయకురాలిగా వ్యవహరించేది. అమాయకురాలు కాదా యేమిటి? గా — వ్యవహరించేది చాలా తప్పు! ముప్పైఆరేళ్లు పు పైబడ్డా హెలెన్ పెళ్లిచేసికోలేదు.

సర్వసాధారణంగా అలాంటిమనిషితో సరిగా మాట్లాడ్డానికి తగిన మనుష్యులు లోకంలో దొరకటం కష్టం. దొరకినా మగవాళ్లల్లో ఒకళ్లిద్దఱు దొరుకుతారేమో గాని ఆడవాళ్లల్లో అసలే దొరకరు. ఆడది ఆమెతో సరసని కూర్చుందీ అంటే పెళ్లికాని ఆడదేదీ? ఆవయస్సులో?

ఒకమాటు హెలెన్ సెకండుక్లాసు కంపార్టుమెంటులో తానొక్కర్తే ఎక్కుతూ మఱొ ఎఱిగున్న నేటివ్ క్రిస్టియన్ ఆనందమ్మ అగపిస్తే "రా అక్కయ్యా! కాస్సేపు ఈ బండిలో కూర్చుందుకాని. ఎవరూ ఏమీ అనరులే. అంటే నే నిచ్చుకుంటాను ఎక్సెసు ఛార్జి" అని ఆనందమ్మను తనబండీలో కెక్కించుకుంది. ఎక్కించుకొని "చూడక్కయ్యా!" అని పలుతడవ లంటుందికాని ఏంమాట్లాడుకుంటారు? ఆనందమ్మ కూర్చోవడం హెలెన్‌కు దగ్గఱసానే కూర్చుంది. కానైతే ఆమెకూడా శుభ్రమైన తెల్లని సఫేదులాంటి కోక కట్టుకుంది. కళ్లకు జోడెట్టుకుంది. ఒళ్లు ఎక్కడకనిపింపజేస్తే ఎక్కువ శోభస్కరంగా వుంటూ మక్కువలు గొలిపిస్తూవుటుందో అక్కడే వెలిబుచ్చి

మిగతాదిక్కులు కప్పిపుచ్చే మచ్చెకంటివే. అవితేమాత్రం మాటలేం ఊరుతాయి వాళ్లిద్దఱిమధ్యా అప్పటప్పటికి. కాస్సేపు అలా వూరుకున్నట్టే వూరుకొని "మనవాళ్లనందఱ్నీ అడిగేనని చెప్పు" అంది హెలెన్. ఆనందమ్మ "నీవు చచ్చిపోయేవు అనే అనుకొన్నారు ముందు చాలామంది. ఈ తరువాతనే ... ఎక్కడో కనబడ్డావు అని ఎవరో ... బ్రతికున్నావు అని అనుకొన్నారు. ...యింది నీకు మళ్లీని?" అని అడిగింది

హెలెన్‌కు వళ్లు గరపొడిచి, గరపొడిచినవెరనిమిషంలో నరాలన్నీ పట్టుతప్పి నట్టయిపోయి ముచ్చెవంట్లా పోసేసింది వళ్లు! రైలు ఆగితే బాగుండిపోను కూసిన్ని చన్నీళ్లు పట్టించి చల్లాచ్చును" అని ఆనందమ్మ అనుకుంటూండేలోపల మనకథ కాటపట్టయిన చిన్నస్టేషన్ వచ్చింది. గ్యాంగ్‌మాన్ సూరయ్య రైల్లోవాళ్లకు తనజట్టునంతనూ చూపిస్తూవున్నట్టు నిలబడ్డాడు. గంటకొట్టే మారయ్య జండా చుట్టచుట్టుకుంటూ గంటకేసి నడుస్తూవున్నాడు.

"నీళ్లు! నీళ్లు!" అంది ఆనందమ్మ. గార్డువొర వచ్చి తొంగిచూచి డాక్టరుసాయం అవసరమని చెప్పి హెలెన్నును గ్యాంగ్‌మాన్ సూరయ్యయొక్క గంటకొట్టే మారయ్యయొక్క చేతులమీద దింపించి ఆనందమ్మకు వప్పజెప్పి స్టేషనుమాస్టరుకు



"గ్యాంగ్‌మాన్ సూరయ్యయొక్క గంటకొట్టే మారయ్యయొక్క చేతులమీద దింపించి"

నచ్చచెప్పి "తేఱిన పిదప వెనకాలబండిలో ఎక్కించిపంపించండి" అన్నాడు. ఆరైలు వెళ్లిపోయింది.

రైలు వెళ్లిపోయిన అరగంటగ్గాని హెలెన్‌కు స్మృతివచ్చిందికాదు. స్మృతి రావడం ఏమిటి, హెలెన్ అనడం ఏమిటి? "ఆనందమ్మా! చూడక్కయ్యా! మళ్లీ పెళ్లాడ్డం అనేది అంతసులభమా? ఈలోకంలో? నాకు తెలియదక్కయ్యా! ఏసుక్రీస్తు పరిముఖంగా చెబుతూవున్నాను. నా కొక్కమాఱూ ఇంకా పెళ్లికాలేదు. కాని పెళ్లి అయినట్లు సంచరించినకారణాన్నిబట్టి పెళ్లి అయినదాన్నిగా నన్ను నీవు భావించినప్పటికిన్నీ మళ్లీ పెళ్లిఆడ్డంఅనేది అంతసులభమా? ఈలోకంలో?" అని అంటూ గ్యాంగ్‌మాన్ సూరయ్యకేసి చూస్తూ "ఆపిల్లాణ్ణేంచేశావు?" అని అడిగింది. స్టేషన్‌మాస్టరూ ఇతరులూ అందఱూ నిశ్చేష్టులై చూస్తూవున్నారు. సూరయ్య "ఇడుగో! వీడే! ఈ సూరయ్యే వాడు" అన్నాడు.

"ఇంపీరియల్‌బ్యాంకిలో ఆరువేలరూపాయ లున్నాయి నావి. అవి వానివిగా విల్లు చెప్పి నేను చచ్చిపోతూవున్నాను. పెళ్లికానీ పెళ్లికాకపోనీ, ఈశరీరమునకు నీశరీరముతో ఎప్పుడైతే ఒకప్పుడు అంటుకలిపేనో, సూరయ్యమాంవా, నాఆత్మ నాసర్వస్వము నీదిగానే నిశ్చయంచేసుకున్నాను. సూరయ్యా వాడిపేరు? ఇలా రా నాయనా! ఇలా రా బాబూ! ఇంపీరియల్‌బ్యాంకిలో ఆరువేలరూపాయ లున్నాయి నావి. అవి నీవిగా విల్లుచెప్పి నేను [illegible]తూవున్నాను. ఎంతకాలం సూరయ్య [illegible]ణేల్ ఖణేల్ రైలుబడ్డీలు పొడిచీ, ఎంతకా[illegible] నీవు గంట కొట్టీ నాకుమల్లే ఆరువేల.. సాదించను? ఇంపీరియల్ బ్యాంకిలో నావి ఆరువేల రూపాయ లున్నాయి. అవి మీవిగా అనుభవించండి. చూడక్కయ్యా! ఆనందమ్మక్కయ్యా! విను నాఆఖరిపలుకు, ఒప్పుదలవాక్కు ఈసూరయ్యకు నేను పెళ్లికాకముందు! పెళ్లికాకముందు — తప్పే అది? తప్పే అది? — న్యాప్రాయం ఇచ్చినాను న్యాప్రాయం ఇచ్చినాను. నన్ను స్వర్గమునకు జేరనిమ్ము" అని హెలెన్ కడసారి నిట్టూర్పు విడిచి గతించిపోయింది. ముందుబండిలో వెళ్లిన గార్డుకు వెనకబండిలో ఎక్కడా ఆమె తిరిగీ కనిపించలేదు.

* * *

గొడ్లకాసేవాళ్లు పాడేపాటలో అంతర్యంగావున్న విషాదగాథ ఇంతవుంది. పైవాళ్లకేం గోచరిస్తుంది?




యూరపువెడలిన భారతీయ విశ్వవిద్యాలయముల విద్యార్థినులు

# లలితకళాదర్శమండలి, బెజవాడ.


యం. సి. రాఘవన్.


మద్దూరి బుచ్చన్నశాస్త్రి


సి. యస్. ఆర్. ఆంజనేయులు


కె. శేషాచార్యులు


బండారు వెంకటేశ్వర్లు


కె. వి. సుబ్బారావు


టి. వి. శాస్త్రి


శాల్లిభంజి కుటుంబరావు


మాష్టర్ కె. యస్. ప్రకాశ్ [illegible]


[illegible] వి. విశ్వనాథం


ఆర్. వీర్రాజు




శ్రీమతి ముసు షిరీను ఆలిగారు

చెన్నరాష్ట్రమున బి. ఏ. ఆనర్సు (లిటరేచరు)
పరీక్షయందు ఉత్తీర్ణయైన ప్రథమ మహమ్మదీయస్త్రీ




కుమారి మనీబేను కారాగారు

మంగుళూరులో జరిగిన ప్రథమ కేరళ కార్మిక
సభాధ్యక్షురాలు




శ్రీమతి కుముదమ్మగారు




శ్రీమతి అంగుళ్యాబాయిగారు

విమానముల నడపు విద్య నభ్యసించుటకుగాను వీరిద్దరును మదరాసు ఫ్లయింగు క్లబ్బునందు చేరిరి. వీరిలో కుముదమ్మ (వయస్సు 19) మదరాసులో న్యాయవాదియగు వి. ఎస్. నరసింహాచారి గారి కుమార్తె. అంగుళ్యాబాయి (వయస్సు 16) వి. ఎస్. చిన్నసామిగారి కుమార్తె.




## గుంటూరు రామకృష్ణంరాజుగారు

వీరు [illegible] గారు నారాయణరాజుగారి జ్యేష్ఠ [illegible] రి వయస్సు ౫౮ సంవత్సర [illegible] జిల్లా అలమంద రైల్వేష్టేషనుకు [illegible] మైలు దూరమున నున్న భీమాళిగ్రామము వీరి వాస స్థలము.

వీరు జీవితమునంతయు వివిధ ఫలవృక్షములను పెంచుటయందే వినియోగపరచిన అనుభవస్థులు. తోటలు వేయువారికి స్థలనిర్దేశము చేయుటలోను, ఆ వృక్షములకు పనికివచ్చు దోహదములను తయారు చేయుటలోను పేరెన్నికగాంచినవారు. ఏకాలమున కాతీరున రసవంతములగు పండ్లను పండించుటలో వీరికృషి యద్భుతము. గంజాం, విశాఖపట్నం జిల్లాలలోను, కటక్‌లోను వున్న జమీందారులకును, ధనవంతులకును వీరు అనేక ఫలవృక్షోపవనములను వేయించి వారి మన్ననలను పాత్రులైరి. డెంకానల్ సంస్థానాధీశులకు వీరు ముద్దుబిడ్డ. ఏజాతి ఫలవృక్షములనైనను ఒక్కసారిగ ౧౦,౦౦౦ కావలసినను ఇవ్వగల సమర్థులు. సప్తసంతానములలో నొకటగు ఆరామప్రతిష్ఠయం దభిలాషగలవారిపాలిట వీరు పెన్నిధానము. వీరు స్వయముగవచ్చి తోటలవేయించుటయందు దిట్టలు. వీరిముగ్గురు కుమారులుకూడ వీరివద్దనే ఉద్యానకర్షణమందు పేరు పొంది తండ్రిగారికి సహాయభూతులుగ పనిచేయుచున్నారు. తోటలను పెంచుటలో పాశ్చాత్యులకన్న మనము ఎక్కువకృషి చేయుటలేదు. ఆవైపునకు మన దేశీయులు కూడ దృష్టి మరల్చి పనిచేయువెడల అది భుక్తికి ముక్తికికూడ సాధనమై దరిద్రదేవతను దేశము నుండి తరలించును; వృత్తిలేనివారికి వృత్తికల్పించును. ప్రకృతి సౌందర్యమునకై పరితపించువారికి ప్రాణము పోయునదియే ఉద్యానకర్షణ. ఇట్టి ఉద్యానపాలనయందారితేరిన మనరామకృష్ణంరాజుగారికి పరమేశ్వరుడు సకలైశ్వర్యముల నిచ్చుగాత! ఇంకను వీరు తమసహాయ సంపదలచే ఆంధ్రావనికి తోడ్పడుదురు గాక!

—ఉద్యానరసికుడు.



---

## స్వర్గీయ శ్రీమతి రాధాబాయమ్మగారు, రాజమహేంద్రవరము

ఈమె విదుషీమణి. సంస్కారప్రియ. సంఘసేవా పరాయణ. కుటుంబపరిశ్రమలయందు నేర్పరి. నిరంతర ఆధ్యాత్మికవిద్యావ్యాసంగ మొనర్చు స్త్రీ. మహిళాసభల యందు సభ్యురాలు. శ్రీ గౌతమీగ్రంథాలయముల



ముప్పదివత్సరములనుండి సభ్యురాలు. కార్యనిర్వాహక సంఘసభయందలి సభ్యురాలు. ఈమె జీవితమున దైవభక్తి రూపొందినది. విద్యలసరస్వతి. సుప్రసిద్ధ నెలమ వంశస్థ భావ నారాయణగారి ధర్మపత్ని. మరణము-౧౭-౫-౩౫ రాత్రి ౭౪ గంటలకు.

---

## కే. శే. పిట్టి అయ్యప్పశెట్టి గారు

ఈయన సుమారు ౨౦ సంవత్సరముల నుండియు ఆంధ్రపత్రికా కార్యాలయమున కంపోజిటరుగా పని చేయుచుండువారు. ఈయనకు నెలరోజులనుండి కాలు, చేతులు, శరీరమంతయు వాచి ఔషధసేవ చేయుచు కార్యాలయమునకు వచ్చుచుండెడివారు. మే ౨౫ వ తారీఖు శనివారంవరకు పనిచేసి యింటికి రాత్రిసుమారు ౯౪ గంటలకు చేరుకొనుసరికి బ్రహ్మప్రళయ మైనది. మరుసటి దినం ఆదివారంనాడు మల మూత్రములు బంధించి సోమవారంనాడు పగలు ౨ గంటలకు పాత చాకలిపేటలో స్వగృహమునందు పరలోకగతు లైనందుకు కడువిచారపడుచున్నాము.

ఈయన ఆంధ్రపత్రికా కార్యాలయమునందు బుక్కువర్కులో పనిచేసి, "ఫోర్ మెన్" గా రైన ఆవుల పార్థసారధి నాయుడుగారి ... పలుకులకు లోనై, వారికి కుడిభుజమై ... లన్నిటిని కడు సమర్థతతో చెక్కముల ... స్రుకొనిపోవు చుండెడివారు. ఈయన ...భారతి, ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము, ... పత్రికలలో ప్రచురింపబడుచున్న హిందువా...



ఇంకా ఇతరములైన 'జాబు' పనులను కడునేర్పరితనముతో నిర్వహించుచుండెడివారు. ఈయన తెలుగు, అరవము, కన్నడము, ఇంగ్లీషు, హిందీ, ఈ అయిదు భాషలలోను కంపోసుచేయగల దిట్ట.

మనసిచ్చి పనిచేయు ఇటువంటి మనిషి దొరకుట కడుదుర్లభము. వీరి అకాలమరణము విచారమును గలుగజేయుచున్నది. ఈయనకు బంధు వర్గము చాలకలదు. ఈయన కీ. శే. సర్ పిట్టి త్యాగరాయశెట్టిగారి బంధు వర్గములలో నొకరు. ఈయన పట్టినపట్టు విడుచువాడు కాడు. ఆడంబరములేని మనిషి. ఈయనకు రెండు వివాహములు. ఈరెండవభార్య రోగపీడితయై యున్నది. వృద్ధురాలైన తల్లిగారికిని, సోదరునకును తదితర, బంధుమిత్రాదులందరికిని మా సానుభూతిని అందజేయుచున్నాము. ఈశ్వరుడు ఈయన ఆత్మకు శాంతి చేకూర్చుగాక యని కోరుచున్నాము.




## పద్మనాభయుద్ధము

ప్రాచీన (ఏకాశ్వాస) ప్రబంధము. గ్రంథకర్త చట్రాతి [illegible] నకవి. క్రౌను ౨౦+౮౦ పుటలు. [illegible]ము. వెల రు ౦-౧౨-౦.

శ్రీ వత్సవాయ రాయజగపతివర్మగారు,
పెద్ద[illegible]ంము, తూర్పుగోదావరిజిల్లా.

"విశాఖపట్నము జిల్లాలోని పద్మనాభమను గ్రామమున విజయనగరం పూసపాటిప్రభువులను శ్రీ విజయరామకళింగాధీశ్వరులు క్షత్రియుల పౌరుషపరాక్రమములు లోకమునకు చాటుటకు జరిపినయుద్ధమిందు వర్ణింపబడినది." "ఈగ్రంథమం దొక్క యాశ్వాసమాత్రమే ఆంధ్రభారతీతీర్థ పరిశోధకవిశ్వవిద్యాలయము (Andhra Research University) నకు దొరికినది." "ఇది యసలుగ్రంథములో కొంతభాగమే ......కాని......యీ యాశ్వాస మింతవఱకు సమగ్రము." "శ్రీ విజయరామయశోభూషణ మను పేర నీగ్రంథమును పూర్వము రాజయోగి పత్రికలో కొంత భాగము కీ. శే. శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులు గారు ముద్రించియుండినట్లు వినికి."

"కృతికర్త శ్రీ చట్రాతి లక్ష్మీనరసకవి యని ప్రతీతి. ఈప్రతిలోగాని ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారపు ప్రతిలోగాని యాశ్వాసాంతగద్య లేకుండుటం జేసి యంశమును నిర్ధారణగా చెప్పలేము." "వీరికుమారుడగు కనకయ్య దీనిని రచించె నని చట్రాతివారి వంశములో నివేవలివా రందురు." "లక్ష్మీనరసుగారు తమ రచనలను చేర్కొనుచు, వాటిలో భండనాగాతి భీమ శతకమును, విజయరామచరిత్ర మను నామాంతరముతో నీగ్రంథమును చెప్పినట్లున్నదని శ్రీసుందరము పంతులు గారు స్వయముగా నాతో సెలవిచ్చినారు." "ఈకృతికి విజయరామచరిత్రమను మఱియొకపే రున్నట్లు ... స్థిరపడును."

"దొరకిన యీ యాశ్వాసమందు పద్మనాభ క్షేత్రమున శ్రీవిజయరామగజపతి కళింగాధీశ్వరులకును, యింగిలీషు కుంఫిణీవారికిని జరిగినయుద్ధము సకారణముగాను, సమగ్రముగాను వర్ణింపబడియుండుటచేతను, శ్రీవిజయరామగజపతిమహారాజులుంగారి జీవితచరిత్రములో నీయొక్క భాగమే వర్ణింపబడియుండుటచేతను దీనికి పద్మనాభయుద్ధమని పేరిడి ప్రచురించడమైనది."

పయిమాటలలో మొదటివి గ్రంథప్రకాశకులవి; తక్కినవి గ్రంథసంపాదకులు, ఆంధ్రభారతీతీర్థ ప్రధానియు అగు శ్రీబుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారివి.

వీనినిబట్టి గ్రంథ మసమగ్ర మనియు, కృతికర్త ఎవ్వరో నిశ్చయింపవీలులేదనియు, గ్రంథముపూర్వనామము విజయరామ యశోభూషణమో, విజయరామ చరిత్రమో అయియుండవచ్చుననియు, ప్రకాశక సంపాదకులు స్వతంత్రించి దీనికి "పద్మనాభయుద్ధ"మని పేరు పెట్టిరనియు తెలియుచున్నది.

ఉపలబ్ధమగు గ్రంథభాగమున శ్రీ విజయరామ రాజు పద్మనాభమున విడియుట, కుంఫిణీవారి రాయబారము, కుతంత్రములు, యుద్ధసన్నాహము, యుద్ధరంగమున రాయబారము, రాత్రిముట్టడి, యుద్ధము, కళింగాధీశ్వరుని నిర్యాణము వర్ణితములు. వీరరసప్రధానమగు నీప్రబంధమున రచన చాలపట్టుల తదనుగుణముగ సాగినది. ధార యనర్గళము. కవి యట్టి "వీరవ్యాపారమును జూచినవాడగుటగాబోలు రక్తము డుకుటకుగానున్నయపుడే కావ్యము రచించియుండుటచే భావనతిస్వేచ్ఛగా నతిధారగా, నిరాఘాటముగా, వ్యావహారికపదభూయిష్ఠముగా ......వాడినాడు. వర్ణించునర్థములలో మనసు తన్మయముచేసి కవితానిరంకుశత్వమును చూపినాడు."

కొన్ని వ్యావహారికములు, లక్షణవిరుద్ధములును—"బహుమంది, రాచకుమాళ్లు, మార్గులు, మాకూమీకూను, కూడుకొ, పనేమి? వారలరు, సారాకావడులా (ల) ను, మాపోతెన్, వేంకటపత్యావనిపాలుడు, అఖిలజాగ్రత్త, మీరెఱుఁగున్న, సర్వపటాలములు, నిద్రికాప్రియమున, మేదిన్యాధిపుఁడు "తోతడయక రాజచంద్రుతో—" [ఇచట 'త' ప్రాసమునఁ గలదు. కాన 'ద' గా దిద్దవీలుపడదు.] మొదలగునవి. పైపద ములలో వ్యావహారికములును కానివి కొన్ని కలవు. ఇవిగాక ఉర్దూ, ఇంగ్లీషుపదములు కొన్ని యెడ నెడ వాడబడినవి. వాని సాధుత్వాసాధుత్వములను తజ్ఞులే ఎరుగుదురు. వీనింబట్టి కవిత్వము కొంత సాఫుగానున్నను, కవికి ఏతద్గ్రంథరచన ప్రథమ ప్రయత్నమగు నని తోచుచున్నది. గ్రంథశైథిల్య మచ్చటచ్చట గలదు. వీనికి దోడు ముద్రణస్ఖాలిత్యములు ఎక్కువగ నున్నవి. గ్రంథము నాలుగు సారులు ముద్రింపబడినను, వానియెడ తగినశ్రద్ధ కనుపఱచినట్లు లేదు. "కాని ఆంధ్రదేశచరిత్రకు మాత్రము (త్ర) కలుగు కావ్యములలో నిది ప్రధానముగ పరిగణింపఁ దగినదనిమాత్రము నిస్సంశయముగాఁ జెప్పవచ్చును." చారిత్రకవిషయములను పెక్కింటిని శ్రీ శేషగిరిరావు పంతులుగారు తమ "అవతారిక" యందు గూర్చి, గ్రంథమునకు బుష్టిని కలిగించినారు. చరిత్రపరిశోధకులు, వాఙ్మయాభిమానులు అగు ఆంధ్రులెల్లరు చదువ దగిన దీగ్రంథము. విశేషించి ఆంధ్రక్షత్రియు లాదరింపదగినది.

బు. వేంకటరమణయ్య

---

## ఇన్సూర్యెన్సుపత్రిక

సంపాదకుడు: యన్. రామచంద్రరావుగారు. సంవత్సరచందా రు. ౨ లు. విడిసంచిక నెల రెండణాలు.

ఇది "ఆంధ్రదేశమున ఇన్సూర్యెన్సు వ్యాపారాభివృద్ధికై, ప్రచారముచేయు మాసపత్రిక" యొక్క మొదటి సంపుటమున మొదటి సంచిక. "భీమావిషయ ప్రబోధినియైన పత్రిక ఆంధ్రలోకమున కిప్పుడు లేదు." "ఇదివరలో భీమాపత్రిక అను పేరుతో ప్రచురింపబడు చుండిన తెలుగుమాసపత్రిక నిలిచిపోయినది," ఇన్సూర్యెన్సు వ్యాపారాభివృద్ధికే కాక అన్ని వ్యాపారముల యభివృద్ధికిని మంచిప్రచారము అవసరము. దేశములో ప్రచారము జరుగవలయునన్న అది పత్రికలమూలమున సులభమగును. 'భీమా వ్యాపా[illegible] మనభారత దేశమందింకను శైశవావస్థలోనున[illegible] ఇన్సూర్యెన్సు తత్త్వము ప్రచార[illegible] సాధనమే కాని అది చదువుకొన్నవారికే [illegible]చున్నది. చదువుకొననివారికతి [illegible] మన[illegible] చదువురానివారిసంఖ్య అపారముగ నున్నది. "ఇన్సూ రెన్సు పత్రిక" వారి విషయములో ఏమిచేయగలదు?

"భారతదేశములోని భీమాకంపెనీల విషయము ప్రత్యేకించి పరిశీలించినయెడల మనదేశములోని ప్రజల వద్దనుండి సాలీనా చెల్లింపబడు ప్రీమియముల మొత్తములో రమారమి సగము మొత్తము ఈదేశములో వ్యాపారము చేయుచున్న "విదేశీభీమాకంపెనీలకు చెల్లింపబడు చున్నది." సరియైన ప్రచారమువలన యిట్టివన్నియు నివారింపబడగలవు. మనదేశమునను మనరాష్ట్రరాజధాని యిన్సూర్యెన్సులో చాల వెనుకబడియున్నది. ఈస్థితి కూడ తొలగవలసియున్నది.

దేశదారిద్ర్యమును ఇన్సూర్యెన్సు బాపగలదా? దేశదారిద్ర్యమునకును ఇన్సూర్యెన్సునకును గల సంబంధ మెట్టిది? ఇట్టిప్రశ్నలకు సమాధానము సులభసాధ్యము గాదు. ఈపత్రికయే అన్ని సమస్యలకును సరియైన సమాధానముల నొసగి ఇన్సూర్యెన్సు కంపెనీలను అభివృద్ధిలోనికి దేవలసి యున్నది. అన్నిటికిని ప్రజల సాహాయ్యమే ముఖ్యము.

---

## భాషామణి

మాసపత్రిక (సం. ౧, సంచికలు ౧-౩)

సంపాదకుడు:—చెఱుకువాడ వేంకటరామయ్య, భాషామణికార్యస్థానము, రాజమండ్రి. ఏడాది చందా రు. ౨-౦-౦.

"ఈ కాలమున నాంధ్రమున బెక్కు పత్రికలు ప్రకటింపబడుచున్నవి. కాని యందుఁ గేవలము నుబుసుపోకకు మాత్రమే యుపకరించు విషయములు హెచ్చుగాఁ గానబడుచున్నవి. భాషాభివృద్ధి మూలకములు, నుత్తమాదర్శకములుఁ, బారమార్థికములు వాని యం దంతగా గోచరించుట లేదు. తత్కారణమున నీపత్రికయం[illegible] ర్వకవులయు నాధునిక కవులయుఁ బ[illegible] ఁ గావ్యములు నాటకములు నవ[illegible] [illegible]) మొదలగునవి ప్రకటింప [illegible] సంపాదకుని భాషాభ్యుదయకాంక్ష [illegible] 'వల[illegible]

'భాషాభిమానులు' ఏతదుద్యమమునకు 'దోడు పడి' సంపాదకుని 'పూనికను సఫలపఱుప' దగుదురు.

మొదటి సంచికయందు ప్రారంభించిన గ్రంథములు:

భక్తచింతామణి—శ్రీ కవిశేఖర, సూక్తిసుధానిధి వడ్డాది సుబ్బారాయఁడుగారు, జ్యోతిషశాస్త్రము—శ్రీ చెఱుకువాడ సుబ్రహ్మణ్యముగారు, శాపము (నవల)—శ్రీ డాక్టరు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, చెఱకు తునుకలు (ఖండకావ్యము)—సంపాదకుడు, అపోహావేశము (నాటకము)—[illegible]చిరాజు దుర్గాశంకరామాత్యుడు, సాహిత్యదీపిక (విమర్శ) శ్రీ శ్రీపాద కామేశ్వరరావుగారు. ఈగ్రంథముల భాగములే క్రమముగ రెండుమూడు సంచికలందును ప్రకటితములయినవి.

## సౌందరనందము

రచయితలు: పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వెంకటేశ్వరరావుగార్లు.

విక్రయస్థానము:—ప్రభాకర అండు కంపెనీ, రాబర్టుసన్ పేట, మచిలీపట్టణము, వెల ఒకరూపాయి.

భదంతాశ్వఘోషుని సంస్కృత సౌందరనందమను కావ్యములోనియితివృత్తశేషమును గొని స్వతంత్రముగ నీకావ్యము రచింపబడినది. తొమ్మిదిసర్గలు. అన్యతనాంధ్రకవిప్రపంచనిర్మాత శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి కిది గురుదక్షిణగా సమర్పింపబడినది.

మహితాత్ముడు గౌతమునికి నందుడను నొక సవతితమ్ముడు. ఆయనభార్య సుందరి. నందుని నాతని సౌందర్యముకారణముగా సుందరనందుడని పిలుచుచుండిరి. ఈయిరువురును విషయలంపటులు. ఒకరిని విడచి యొకరు నిమిషమేని గడపనోపనివారు. సంసారమే స్వర్గముగా భావించి కాలము గడపుచుండినారు. గౌతముడు వారి యీవ్యాసంగమునకు ఖిన్నుడై ఎటులైనను వారిని తరింపజేసి ధర్మదీక్ష నొసగ సంకల్పించి అతిప్రయాసమున చరితార్థుడగుట యిందలి యితివృత్తము.

సరళమై, సుందరమైన శైలియు, ధారావాహియైన కవిత్వమును, మృదుమధురమైన భాషయు జతగొని యీకావ్యము చదువజదువ నింపులు గొల్పుచున్నది.

తీయని యీకావ్యరసమును తీయనితమి నాంధ్రులాస్వాదింప గలరనుట నిస్సంశయము.

## భక్తమందారశతకము

కర్త: కూచిమంచి జగ్గకవి.

ప్రకాశకుడు: కూచిమంచి శ్రీరామమూర్తి, గొల్లనాపల్లి, పెద్దాపురం, తూర్పుగోదావరి. 'రామా, భక్తమందారమా' అను మకుటము గల స్తుత్యాత్మక వృత్తపద్యశతకము. (వెల నాలుగణాలు)

'మ. సరసప్రస్తుత కూచిమంచి కులభా
స్వద్వార్థిరాకాసుధా
కరుఁడక్ గంగనమంత్రినందనుఁడ రం
గత్తిమ్మభూమండలే
శ్వరవర్యార్పిత 'బేబదల్' బిరుద వి
ఖ్యాయ జగన్నాథనా
మరసజ్ఞుండను బ్రోవు మెప్డు నను రా
మా, భక్తమందారమా.'　　౧౦౧

ఈపద్యమే యీశతకము కూచిమంచి జగ్గకవి కృతమనుటకు ప్రమాణము. ఇది క్రొత్తగా లభించిన దనుచున్నారు ప్రకాశకులు. రచనము ధారాళముగ నున్నది.

## రంగభూమి

సంపాదకుడు: యస్. యస్. సోమయాజులు గారు, ౮౮. పెరుమాళ్ మొదలివీథి, రాయపేట, మదరాసు.

సంవత్సరచందా రు. ౧-౮-౦. విడిప్రతి రెండణాలు.

రంగభూమి "కళోపాసనగావించు సచిత్రాంధ్ర మాసపత్రిక" యని యొకచోటను, "కళాసేవ యొనర్చు సచిత్రాంధ్రమాసపత్రిక" యని మరియొకచోటను వ్రాసికొనినది. దిట్టలైన సేవకులును, సహృదయులైన యుపాసకులును ఉండినయెడల కళకు ఇక లోటుండదు. కళాప్రచారముచేయుటకు పత్రికలు ముఖ్య సాధనములు.

'రంగభూమి' లో ప్రకటింపబడినవ్యాసములలో ఎన్ని దానియొక్క ఆదర్శములకు తగియున్నవో విచారింపదగినవిషయము.

ముఖపత్రమునగల చిత్రము, దానికి 'ప్రేతకు' ని యర్థము కళలోని అసభ్యతలకు 'రంగభూమి' సుడిగాలివలెనుండి ఆదర్శకళాప్రచారము గావింపవలెనను నాశయమును వెలిబుచ్చుచున్నది. నాట్యకళాసేవకే యిది పుట్టియుండవలె ననెడి యూహను గల్గించుటకు పత్రిక పేరుకూడ కారణమగుచున్నది. కళలనన్నిటిని ఉద్ధరింపకున్నను, ఒక్కనాట్యకళనుమాత్రము ఇది ఉజ్జీవింపజేసినయెడల అదియే పదివేలుచేసినట్లు.

---

## ఆర్తరక్షామణి

కర్త: వడ్డాది సుబ్బారాయకవి శేఖరుడు, రాజమహేంద్రవరము. (వెల నాల్గణాలు)

'రామా, ఆర్తరక్షామణీ' అను మకుటముగల నూటపదారువృత్తములు, రామస్తుత్యాత్మకము లిందున్నవి. గ్రంథము చివర 'భక్తచింతామణీ' మకుటము గల పద్యములు ౧౮ చేరినవి. 'కవిశేఖరు' ల కవిత్వవైఖరి నాడునాటికి పండువారుచున్నదని ఈ 'ఆర్తరక్షామణి' పాఠకులు తెలిసికొనగలరు.

---

## నేను

ప్రథమసంపుటము. క్రౌను ౧/౮ సైజు, పుటలు ౨౬౦ వెల ౦-౮-౦.

కర్త: యద్దనపూడి వెంకటరత్నం, తాడేపల్లిగూడెం, పడమటిగోదావరి జిల్లా.

ఇది గ్రంథకర్త స్వీయచరిత్ర [illegible] ప్రాయమువఱకు గలది మాత్రమే. [illegible] గ్రంథకర్త తరువాతి వయస్సున తాను [illegible] కొనిన విషయముల ననేకముల నా[illegible] నుపన్యసించెను. అందు అంత చిన్న[illegible] తమవిగా వ్యక్తపరిచిన భావములు కొన్ని అస్వా[illegible] కములుగా తోచుచున్నవి. కాని పాఠకులకు సంప్రదాయబద్ధమగు లోకజ్ఞానమును కలిగించుట కవి యొదవును.

రచనము స్వైరమార్గమున నడచినది. అందు చక్కదిద్దుకొనవలసినది అధికముగ కలదు. భాష వ్యావహారిక మయినను తరుచు సమన్వయము సౌలభ్యదూర మగుచున్నది.

---

## మందారవతి

౧౮ పరిచ్ఛేదముల ఆఖ్యాయిక. సంస్కృతవచనము. కపిస్థలము కృష్ణమాచార్యులవారిచే రచితము. ప్రకాశకులు వావిళ్ళవారు, చెన్నపురి.

క్షేమేంద్ర కవిచంద్రుని బృహత్కథామంజరి లోని రెండు కథలను ఆధారముగా గైకొని యీయాఖ్యాయిక రచింపబడినది.

చక్కని, సుబోధమైన శైలి. ధారాళమైన శయ్య. పరిశీలనార్థము బృహత్కథామంజరిలోని రెండుకథలును ఆంగ్లానువాదమున ననుబంధరూపముగ నివ్వబడినవి. వీరు కావించిన మార్పులుగూడ సరసముగనే కనుపించుచున్నవి.

---

## పానశాల

కర్త: కవికోకిల దువ్వూరి రామిరెడ్డి.

క్రౌను ౧/౮ సైజున ౮౬ + ౩౨ పుటలు. వెల రు. ౦-౮-౦.

ఈ 'పానశాల' ఆంధ్రలోకమునకు క్రొత్తది కాదు. ఇందలి మన్నువు భారతి యింతకుమున్నే చవి చూపినది. ... యిపుడు ప్రత్యేకము పుస్తకమయినది. ఇందలి ... ములు పారశీకకవిశిఖామణి ఉమ్ర ...వుల ... యీలు) ననుసరించి రచి...నవి.

నిరంతరము మధురకవితాగానమును వినిపించుచు సహృదయ హృదయముల జూరగొనినది యీ 'కవికోకిలము.'

పారసీకసాహిత్యము యొక్కయు, ఉమ్రఖయ్యాముయొక్కయు చరిత్రలను, ఖయ్యాముకవిత్వతత్త్వమును వివరించు చక్కని యుపోద్ఘాత మీ 'పానశాల'కు సింహద్వారము. దీని పానశాలను బ్రవేశించువారికి రససంగ్రహణము సులభము.

ఈగ్రంథము నమ్మువారు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండుసన్సు, ఎస్ప్లనేడ్, మదరాసు.

---

## ఏకవీర

కర్త: విశ్వనాథ సత్యనారాయణ, బందరు. క్రౌను ౧/౮ సైజు. పు. ౨౦౦.

ఇదియొక నవలయని 'భారతి' పాఠకు లెరుగుదురు. ఇందలి యితివృత్తము భగ్నప్రణయ మాశ్రయము గాగలది. కథాసన్నివేశము మనోహరముగ నున్నది. గ్రంథకర్తకు సహజములగు నవ్యభావసమంచితమగు భావనాశక్తి, ప్రౌఢమధురమగు రచనాసౌందర్యము నీ 'యేకవీర' యందు సహృదయులకు గోచరము కాగలవు. ఇది 'రసతరంగిణి' యందు దయిదవది.

---

## ఆంధ్రదశరూపకము

అనువాదకుడు: మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, ప్రధానపండితుడు, ఆంధ్రవిశ్వకళాపరిషత్ కళాశాల, వాల్తేరు. క్రౌను ౧/౮ సైజున ౨౦ + ౧౨౬ పుటలు. వెల రు. ౦-౮-౦

ఇది ధనంజయకృత సంస్కృత దశరూపకము ననువాదమునకు సంస్కారమునుపొందిన రెండవముద్రణము. 'రూపమున గొంతనవనవమై పరిమాణమున గొంత హెచ్చినది.' దీని ప్రయోజనమును హెచ్చినదని తోడ్తోడ జెప్పటొప్పు. శాస్త్రులుగారిఈ'ద్వితీయముద్రణ విజ్ఞప్తి'యందు నేటి నాటకరచయితలు తెలిసికొనవలసిన విలువగల విషయము లనేకములు గలవు.

ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారు, ఎస్ప్లనేడ్, మదరాసు.

---

## వ్యాసమంజరి

కర్త: కర్లపాలెం కృష్ణారావు.

ఇందు కథలు, వ్యాసములు ఉన్నవి. పొంగుచున్న దేశాభ్యుదయాకాంక్ష వీనియుత్పత్తికి కారణము కావలెను. రచనమున నోడుపున్నది; పొందిక చాలదు. కాని అభివృద్ధిలక్షణములు కలవు. శబ్దసౌష్ఠవ మింకను సరిపడవలెను. ఇది యేడాది కాఋపూవులుపూచు 'సాహిత్యలత' పూచిన మూడవపూవు. రేకులు ౮౧. వెల రు. ౦-౧౨-౦.

---

## సుమహారము

గ్రంథకర్త: రావుల లోకనాథం పంతులు, కరణం, పేరాల, గుంటూరుజిల్లా.

ఇది గ్రంథకర్త శ్రీపంచమజార్జి సార్వభౌమునికి రజతోత్సవసమయమున సమర్పించుకొనిన ప్రశంసాత్మక 'సుమహారము'. రాజభక్తివాసనల మెండుగా నీనుచున్నవి యిందలిపద్యములు.

---

## తెనుగువీణ (ఖండకావ్యముల సంపుటి)

గ్రంథకర్త: ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

ప్రకాశకుడు: కనకదండి గోపాలకృష్ణశాస్త్రి, అశోకవనం, నిడదవోలు, పడమటిగోదావరి.

హనుమచ్ఛాస్త్రిగారి పదునారు చిన్న ఖండ కావ్యము లిందుగలవు. శాస్త్రిగారు నవకవులలో కాగల వారని నేటిమాసపత్రికలపాఠకలోకమునకు దెలియును. అచ్చుకూర్పు నవ్యముగా నున్నది. కాగితము సొగసుగా నున్నది.

## రైతు భజనావళి

(వెల రెండణాలు)

సంపాదకుడు: ఆచార్య (గోగినేని) రంగనాయకులు. రైతుఉద్యమప్రచారమునకని పలువురు రచియించిన గీతములు, పద్యములు నిందు ముద్రితములయినవి. ఉద్దిష్టార్థసాధనమున కవి చక్కగా చాలియున్నవి.

### ౧. తరణోపాయము

పు. ౨౮+౪౩, వెల రు. ౦-౩-౦

### ౨. భగవన్నామప్రభావము

పు. ౭౬, వెల రు. ౦-౩-౦

### 3. శ్రీరామపూజ

పు. ౧౪౨, వెల రు. ౦-౫-౦

### ౪. నామసంకీర్తనము

పు. ౭౪, వెల రు. ౦-౫-౦

ఇవి శ్రీరామభక్తితత్పరులగువారికి పనికివచ్చు గ్రంథములు. వీనిని 'శ్రీ సీతారామనామసంకీర్తన మందిరము' (అగ్రహారము, గుంటూరు) వారు ప్రచురించిరి.

## ఆంధ్రవాల్మీకి శ్రీవాసుదాస జీవితము

'వాసుదాసు' శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు. వీరి జీవితచరిత్ర మిందు సంగ్రహముగ నున్నది. శ్రీమతి తురగా కామాక్షమ్మ దీనిని రచించినది. (పు. ౨౩, వెల రు. ౦-౩-౦)

## శ్రీ సీతారామశ[illegible]

గ్రంథకర్త: ద్విభ[illegible]

'సీతారామా' అను మకుటము గల [illegible] శతకమున నున్నవి. చివర 'శ్రీ [illegible]' (ఒకపుట) నున్నది.

## తారామండలం మొదలైననాటికలు

కర్త: వజ్ఝలకాళిదాసు.

'సరస్వతి' మాసపత్రికలలో నప్పుడప్పుడు ప్రకటితములయిన అయిదునాటికల సంపుటము. ఆపత్రిక నుండి ఆ సైజుననే పునర్ముద్రితమయినది.

# గ్రంథ స్వీకారము

## ఆంధ్ర వాల్మీకిరామాయణము, స 'మందరము'

బాలకాండము, పు. ౯౯౧, వెల రు. ౬-౦-౦

అయోధ్యాకాండము పు. ౧౨౬౩, వెల రు. ౭-౮-౦

మూలకర్త, వ్యాఖ్యాత: వావిలికొలను సుబ్బారావు, శ్రీరామజయమందిరము, ౨౧ రాబాహనుమంతలాలావీథి, తిరువల్లిక్కేణి, మదరాసు.

## Rao's Typewriter Mechanism
### (Questions & Answers)
### Part III. (ఇంగ్లీషు)

కర్త: బి. వి. రంగరావు; F. C. I.

నందలూరు, కడపజిల్లా. వెల రు. ౦-౮-౦

# రాయలసీమ క్షామ దృశ్యములు




౧. పశువులకు తిండిలేక సంతలలో అమ్ముట




౨. శింగనమలయందు రాళ్లుకొట్టుటకు పోవుచున్న కూలిజనము

# ప్రకృతిశిబిరము–ఐనవల్లి



చెట్లనీడను ప్రకృతి వైద్యపాఠములు బోధించుట




స్త్రీలు ఫలాహారము చేయుట



పురుషులు ఫలాహారము చేయుట



# సాభిప్రాయ విశేషములు



అనంతమైన ప్రపంచనాటక మెప్పటికప్పుడు విచిత్ర పరిణామమును పొందుచుండును. అనంతము ... జీవజాలములు, వేషభాషలు, ... చ నాటకరంగము ... భాంకములు. రజతోత్సవ ... క్వెట్టా భూకంపములు, సృష్టిలయములు, రాగద్వేషములు, లాభనష్టములు, జయాపజయములు, కలిమిలేములు, త్యాగభోగములు, సాంఖ్యయోగములు, బంధమోక్షములు పురుషార్థసాధనములైన ప్రపంచనాటకవిలాసములు. ప్రపంచనాటకవిలాసము లాత్మానంద సాధనము లయి ప్రపంచ ధర్మపరిణామమున కాధారములు. ధర్మశ్రుతిబద్ధమైన చరాచర ప్రపంచము ప్రపంచనాటకమునం దానందతాండవమును జేయుచున్నది. ప్రపంచనాటకప్రదర్శన సందర్శనములకు సకలజనులును నధికారులు. నాటకప్రదర్శనములకు సాధనములు వీధులైనను సౌధములైనను, తోలుబొమ్మలైనను టాకీలైనను మానవప్రాజాపత్యమును, ప్రయోజనమును నిత్యమైనవి. ప్రపంచపరిణామమునందు నిత్యమైన మానవధర్మప్రయోజనమును వికసింప జేయుటకు వర్తమానసమయమునందు ప్రపంచవ్యాప్తములైన ప్రయత్నములు వెల్లడిచేయుచున్నవి.

సకలదేశములందును వివిధవ్యవహారములందును జాతిభేదములు, కులభేదములు, మతభేదములు, లింగభేదములు, వయోభేదములు, స్థితిదశాభేదములు మానవధర్మారాధనమునకు ప్రతిబంధకములుగాకను సర్వమానవధర్మలక్ష్యము వికసించుచున్నది. విశ్వవ్యాప్తములైన శాంతశివసుందరధర్మములు సంపన్న దరిద్రులందును, కులీనదీనులందును, బ్రాహ్మణహరిజనులందును, గవర్నరు భటులందును, యజమానకార్మికులందును, పండితపామరులందును, బాలవృద్ధులందును, స్త్రీపురుషులందును, కావ్యగేయములందును, నగరగ్రామములందును, మేడగుడిశలందును విశ్వేశ్వరుడు ప్రత్యక్షము చేయుచున్నను మానవుడు నిరసించుచున్నాడు. సర్వవ్యాప్తమైన చైతన్యశక్తికి మానాభిమానావృతములైన దురభిమానావరణములను నిర్మూలనము చేయుట ప్రపంచధర్మపరిణామమునందు దివ్యాధ్యాయము. ప్రపంచధర్మపరిణామము సాధ్యమగుటకు మానవస్వాతంత్ర్యము సకలార్థములందును సంభవమగుట యావసరమగుచున్నది. వర్తమానయుగమునందు రాజకీయ సాంఘి కార్థిక శాస్త్ర కళా సాహిత్యాది' సకలార్థములందును ధర్మపరిణామమునకు పర్యాప్తము లగుచున్న మహా

ప్రయత్నములు చైతన్యశక్తి ప్రతిష్ఠను ప్రత్యక్షము చేయుచున్నవి.

మానవ ధర్మయోగ నిర్వహణమునకు మానవులందరును సమానాధికారులు ప్రతిష్ఠితముగ నున్నను చరాచర ప్రపంచవ్యాప్తమైన చైతన్యశక్తి మానవ ధర్మాభ్యుదయమునకు సాధనము గాగల విధమును శాస్త్ర కళానిర్మాణములు ప్రత్యక్షము చేయుచున్నవి. గ్రామొఫోను, ఫోటోగ్రాఫు, ఫోటోఫోను, టెలిఫోను, టెలివిజను, రేడియొ మొదలగు నిర్మాణములు మానవధర్మావతరణావసరమును విశదము చేయుచున్నవి. పరిపూర్ణమైన చైతన్యశక్తి మానవధర్మాభ్యుదయమునకు వినియోగపడుటకు దురభిమానావరణరహితమైన పూర్ణయోగానుష్ఠానము సాధనము. దురభిమానావరణబద్ధమైన ప్రపంచవ్యవహారములందు ధర్మపరివర్తనము గలుగుట కెన్ని భూకంపములు కావలయునో, ఎన్ని సంగ్రామములు కావలయునో, ఎన్ని ప్రళయము లవసరమొ కాలము వ్యక్తము చేయగలదు. మానవధర్మ స్వాతంత్ర్య ఫలదాయకమైన మహాపరివర్తనమునకు ప్రపంచ మంతయును జోహారు లొసంగుచున్న విధమును, రాజ్యాంగపరివర్తనములు, శాస్త్రపరిశోధనలు, కళానిర్మాణములు, సాహిత్యవిన్యాసములు, ప్రేమవిలాసములు, కామసంకీర్తనములు మొదలగు సకలార్థములును విస్పష్టము చేయుచున్నవి. వర్తమానకాలమునందు ప్రజాహృదయము నాకర్షించుచున్న సినిమారంగములు, పరికరణములు, నృత్యగీతములు, భావవిభావములు, తారలు ప్రపంచావృతమైన మానవధర్మపరిణామమునకు నిదర్శనములు. జ్యేష్ఠమాస సంచికయందు ప్రచురింపబడిన "భారతసినీమారంగము - స్త్రీలు" వ్యాస[illegible] చిత్రపటములను నవలోకించినపుడు [illegible]జ్యాంగము లందువలెను సాహి[illegible] భారతీయదైన్యావస్థ విశద[illegible]న్న

* * *

## భారత సినీమారంగములు-స్త్రీలు

సినీమారంగములు వర్తమానకాలమునందు విద్యావినోదవిహారరంగములు; పండిత పామరుల నాకర్షించుచున్నవి. పాశ్చాత్య సంస్కారఫలములైన సినీమాలు భారత దేశమునందును ధర్మపరివర్తనమును గలుగ జేయుచున్నవి. సౌందర్యసాహసములు, నాట్యగానములు, సాహిత్యరచనలు, ప్రేమానుసంధానములు, కామదృశ్యములు, ప్రకృతివిలాసములు సినీమాదృశ్యములందు ప్రత్యక్షమగుచు ప్రేక్షకులకు సమ్మోహమును గలుగ జేయుచున్నవి. ప్రేక్షకహృదయములందొ విశ్వమునందు బాహ్యాభ్యంతరములందు ప్రతిష్ఠితమగనున్న చైతన్యశక్తి ప్రత్యక్షమగుచున్నది. ఆచారపారతంత్ర్య బద్ధములైన హృదయములందు చైతన్యశక్తిని ప్రజ్వలింపజేయుట దుర్లభమైనను ధర్మశ్రుతిసమ్మేళన మజ్ఞాతముగను సంప్రాప్తమగుచున్నది. అజ్ఞాతమైన ధర్మశ్రుతి సమ్మేళనమును సుజ్ఞా

# రాయలసీమ క్షామ దృశ్యములు




౧. పశువులకు తిండిలేక సంతలలో అమ్ముట




౨. శింగనమలయందు రాళ్లుకొట్టుటకు పోవుచున్న కూలిజనము

# ప్రకృతిశిబిరము–ఐనవల్లి



చెట్లనీడను ప్రకృతి వైద్యపాఠములు బోధించుట




స్త్రీలు ఫలాహారము చేయుట



పురుషులు ఫలాహారము చేయుట




అనంతమైన ప్రపంచనాటక మెప్పటికప్పుడు విచిత్ర పరిణామమును పొందుచుండును. అనంతము[illegible]ీవజాలములు, వేషభాషలు, [illegible]చ నాటకరంగము[illegible] [illegible]ఘాంకములు. రజతోత్సవ [illegible] క్వెట్టా భూకంపములు, సృష్టిలయములు, రాగద్వేషములు, లాభనష్టములు, జయాపజయములు, కలిమిలేములు, త్యాగ[illegible]ోగములు, సాంఖ్యయోగములు, బంధమోక్షములు పురుషార్థసాధనము లైన ప్రపంచనాటకవిలాసములు. ప్రపంచనాటక విలాసము లాత్మానంద సాధనము లయి ప్రపంచ ధర్మపరిణామమున కాధారములు. ధర్మప్రతిబద్ధమైన చరాచర ప్రపంచము ప్రపంచనాటకమునం దానందతాండవమును జేయుచున్నది. ప్రపంచనాటకప్రదర్శన సందర్శనములకు సకలజనులును నధికారులు. నాటకప్రదర్శనమునకు సాధనములు వీధులైనను సౌధములైనను, తోలుబొమ్మలైనను టాకీలైనను మానవప్రాజాపత్యమును, ప్రయోజనమును నిత్యమైనవి. ప్రపంచ పరిణామమునందు నిత్యమైన మానవధర్మ ప్రయోజనమును వికసింప జేయుటకు వర్తమానసమయమునందు ప్రపంచవ్యాప్తము లైన ప్రయత్నములు వెల్లడిచేయుచున్నవి.

సకలదేశములందును వివిధవ్యవహారములందును జాతిభేదములు, కులభేదములు, మతభేదములు, లింగభేదములు, వయోభేదములు, స్థితిదశాభేదములు మానవధర్మారాధనమునకు ప్రతిబంధకములుగాకను సర్వమానవ ధర్మలక్ష్యము వికసించుచున్నది. విశ్వవ్యాప్తములైన శాంతశివసుందరధర్మములు సంపన్న దరిద్రులందును, కులీనదీనులందును, బ్రాహ్మణహరిజనులందును, గవర్నరు భటులందును, యజమానకార్మికులందును, పండితపామరులందును, బాలవృద్ధులందును, స్త్రీపురుషులందును, కావ్యగేయములందును, నగరగ్రామములందును, మేడగుడిశలందును విశ్వేశ్వరుడు ప్రత్యక్షము చేయుచున్నను మానవుడు నిరసించుచున్నాడు. సర్వవ్యాప్తమైన చైతన్యశక్తికి మానాభిమానావృతములైన దురభిమానావరణములను నిర్మూలనము చేయుట ప్రపంచధర్మపరిణామమునందు దివ్యాధ్యాయము. ప్రపంచధర్మపరిణామము సాధ్యమగుటకు మానవస్వాతంత్ర్యము సకలార్థములందును సంభవమగుట యావసరమగుచున్నది. వర్తమానయుగమునందు రాజకీయ సాంఘి కార్థిక శాస్త్ర కళా సాహిత్యాది సకలార్థములందును ధర్మపరిణామమునకు పర్యాప్తము లగుచున్న మహా

ప్రయత్నములు చైతన్యశక్తి ప్రతిష్ఠను ప్రత్యక్షము చేయుచున్నవి.

మానవ ధర్మయాగ నిర్వహణమునకు మానవులందరును సమానాధికారులు ప్రక్షిప్తముగ నున్నను చరాచర ప్రపంచవ్యాప్తమైన చైతన్యశక్తి మానవ ధర్మాభ్యుదయమునకు సాధనము గాగల విధమును శాస్త్ర కళానిర్మాణములు ప్రత్యక్షము చేయుచున్నవి. గ్రామొఫోను, ఫోటోగ్రాఫు, ఫోటోఫోను, టెలిఫోను, టెలివిజను, రేడియొ మొదలగు నిర్మాణములు మానవధర్మావతరణావసరమును విశదము చేయుచున్నవి. పరిపూర్ణమైన చైతన్యశక్తి మానవధర్మాభ్యుదయమునకు వినియోగపడుటకు దురభిమానావరణరహితమైన పూర్ణయోగానుష్ఠానము సాధనము. దురభిమానావరణబద్ధమైన ప్రపంచవ్యవహారములందు ధర్మపరివర్తనము గలుగుట కెన్ని భూకంపములు కావలయునో, ఎన్ని సంగ్రామములు కావలయునో, ఎన్ని ప్రళయము లవసరమొ కాలము వ్యక్తము చేయగలదు. మానవధర్మ స్వాతంత్ర్య ఫలదాయకమైన మహాపరివర్తనమునకు ప్రపంచ మంతయును జోహారు లొసంగుచున్న విధమును, రాజ్యాంగపరివర్తనములు, శాస్త్రపరిశోధనలు, కళానిర్మాణములు, సాహిత్యవిన్యాసములు, ప్రేమవిలాసములు, కామసంకీర్తనములు మొదలగు సకలార్థములును విస్పష్టము చేయుచున్నవి. వర్తమానకాలమునందు ప్రజాహృదయము నాకర్షించుచున్న సినిమారంగములు, పరికరణములు, నృత్యగీతములు, భావవిభావములు, తారలు ప్రపంచావృతమైన మానవధర్మపరిణామమునకు నిదర్శనములు. జ్యేష్ఠమాస సంచికయందు ప్రచురింపబడిన "భారతసినిమారంగము - స్త్రీలు" వ్యాస... చిత్రపటములను నవలోకించినపుడు ...జ్యాంగము లందువలెను సాహి... భారతీయచైతన్యావస్థ విశద...

*        *        *

భారత సినిమారంగములు-స్త్రీలు

సినిమారంగములు వర్తమానకాలమునందు విద్యావినోదవిహారరంగములు; పండితపామరుల నాకర్షించుచున్నవి. పాశ్చాత్య సంస్కారఫలములైన సినిమాలు భారతదేశమునందును ధర్మపరివర్తనమును గలుగజేయుచున్నవి. సౌందర్యసాహసములు, నాట్యగానములు, సాహిత్యరచనలు, ప్రేమానుసంధానములు, కామదృశ్యములు, ప్రకృతివిలాసములు సినిమాదృశ్యములందు ప్రత్యక్షముగుచు ప్రేక్షకులకు సమ్మోహమును గలుగజేయుచున్నవి. ప్రేక్షకహృదయములందు విశ్వమునందు బాహ్యాభ్యంతరములందు ప్రక్షిప్తముగనున్న చైతన్యశక్తి ప్రత్యక్షమగుచున్నది. ఆచారపారతంత్ర్య బద్ధములైన హృదయములందు చైతన్యశక్తిని ప్రజ్వలింపజేయుట దుర్లభమైనను ధర్మశ్రుతిసమ్మేళన మజ్ఞాతముగను సంప్రాప్త మగుచున్నది. అజ్ఞాతమైన ధర్మశ్రుతి సమ్మేళనమును సుజ్ఞా

నము చేయుటపురుషార్థము. ఏమారుమూలలనో నామరూపములులేకను దాగియున్న సామాన్యులనతికాలమున ప్రఖ్యాతస్టారులై బాహ్యాభ్యంతర ప్రపంచముల కానందమును గలుగ జేయుట ధర్మపరిణామమునకు పరమార్థము. ధర్మపరిణా[illegible]ందు బాహ్యాభ్యంతరసాధనము ల[illegible]శ్రయములు. ఆత్మవికాసము [illegible]మూలము. ఆత్మవికాస[illegible]ర[illegible]చరప్రపంచమంతయును పరి[illegible]ంచుచున్నది. ఆత్మయోగమునందు సంభవమైన సకల పాపములు సంక్షయమును పొందుచున్నవి. ప్రపంచధర్మపరిణామమునకు ప్రతిబంధకములైన ప్రాచీననవీన సంప్రదాయాచారముల నతిక్రమించుట పరమార్థము, పురుషార్థము. ప్రాచ్యపాశ్చాత్యసినిమాలపరిస్థితు లీవిషయావగాహనమునకు నిదర్శనములు పాశ్చాత్యదేశములందు సినిమాస్టారులు ప్రశంసాభినందనములను బడయుచున్నను భారతదేశమునందు గౌరవాదరణములను బడయకున్నారు.

సంసారస్త్రీలును, పురుషులందు విద్యాశీలవంతులును సినిమారంగములందు చేరకుండుటయును ధర్మపరిణామమునకు ప్రతిబంధకములు. సినిమారంగములందు జేరిన స్త్రీలు, పురుషులు ప్రతిష్ఠను బడసినవిధమును ప్రేక్షకుల గౌరవాదరణములు వెల్లడిచేయుచున్నవి. భారతీయసినిమాలందు నూర్జహాను, రోజీ, సీతాఖోటె, గోహరు, సులోచన మొదలగు స్త్రీలు గడించినప్రతిష్ఠ సినిమాలయభ్యుదయమునకు నిదర్శనము. ఆంధ్రదేశమునందు రామతిలకము, కోటిరత్నము, శ్రీరంజని గారులు మొదలగు స్త్రీల కళాకౌశలమును ప్రజారంజకముగ నున్నది. ప్రస్తుతము ప్రదర్శింపబడుచున్న సక్కూబాయిఫిల్మును ప్రజల నాకర్షించుచున్నను, వెంకటేశ్వరులు గారి పాత్ర యెప్పటివలె నాకర్షణీయముగనున్నను నితరపాత్రలును కథాసంవిధానమును నవ్యక్తముగ నున్నవి. నాటకప్రదర్శన నిర్వహణమునందువలె సినిమాఫిలుముల నిర్వాహణమునందును నట నిర్వాహకులకు సంయోగసాహచర్యములు లేకను తెలుగుటాకీఫిలుములం దభ్యుదయము గనుపడకున్నది. ఫిలుముల యభివృద్ధికిని, స్వీయలాభమునకును నట నిర్వాహకులకు సంయోగసాహచర్యము లత్యంతావసరములు.

సినిమారంగములందు నాట్యకళ కసాధారణమైన ప్రయోజనము గలిగినది. ఇతర లలితకళలవలెను నాట్యకళయును నధోగతిపాలయిన విధమును సినిమా నృత్యములు విశదము చేయుచున్నవి. ఈ సంచికయందలి నటరాజ చిత్రము, భారతీయ నర్తకి ఇష్వాని గుల్బనో చిత్రము, వెంకటేశ్వరరావుగారి నర్తకిచిత్రము నాట్యకళోద్ధరణావసరమునువిశదము చేయుచున్నవి. పాశ్చాత్యభారతీయాంధ్రాదితారల భావవిలాసములు, వేషధారణములు, రూపలావణ్యములు, ఆటపాటలు సమ్మోహకారణములైన నవజీవనోత్సాహమునకు సాధనములుగ నున్నవి. నవజీవనశక్తి వికసించుటకు నవ

జీవనాధారములైన పూర్ణకళోపాసనావసరమును సినీమాలు, నాటకములు, లలితకళలు, పరిశ్రమలు, నియతకర్మలు, నిత్యకర్మలు బోధించుచున్నవి. సకలార్థములకును సాధ్యమైన మానవధర్మాభ్యుదయము కీలకముగ నున్నది.

* * * *

సాహిత్యకళావికాసము

విశ్వవికాసము సాహిత్యకళావికాసము. జీవయాత్ర సాహిత్యకళావిలాసముల ధర్మయాత్ర. సాహిత్యకళావిలాసవిహీనమైన జీవయాత్ర పురుషార్థమునకు నిరాధారము. సాహిత్యకళలు, సాంఖ్యయోగములు, శాస్త్రనిర్మాణములు, కావ్యచిత్రములు పరస్పరాశ్రయములై జీవయాత్రకు సంపూర్ణఫలమైన పురుషార్థమును సఫలము చేయుచున్నవి. కళోపాసనమువలెను సాహిత్యోపాసనమును నవజీవననిర్మాణ వికాసములకు వినియోగపడుట పురుషార్థము. కళారంగములవలెను సాహిత్య రంగములును సామాన్య ప్రజాహృదయమునందు నవజీవనోత్సాహ శక్తులను పల్లవింపజేయుట పురుషార్థమునకు బీజమైన ధర్మపరిణామమునకు సాధనము. గతము మహత్తమమైనను వర్తమానము లేకను నిరర్థకము. ప్రపంచావృతమయిన పరివర్తనపర్వ సమయమునందు మానవధర్మ లక్ష్యమును వర్తమానమునందు లగ్నము చేయుట సాహిత్యమునకు కీలకము. 'సాహిత్యాంగములైన పాటలు, పద్యములు, కథలు, కావ్యములు, నవలలు, నాటకములు, శాస్త్రములు, పరిశోధనలు, విమర్శనలు, వ్యాఖ్యానములు, వర్ణనలు, జీవితములు నవజీవన సాహిత్యమునకు సాధనము లగుట ధర్మపరిణామమునకు కీలకము. శ్రీపార్వతీశ్వరశాస్త్రిగారి "ప్రాతబండి", వేంకటశర్మగారి "[illegible]మ్మెదపాట", శివశంకరశాస్త్రిగారి "వకుళ[illegible]క" మొదలగు రచనలు [illegible] గాకను నవజీవనోత్సాహ[illegible] పడుట సాహిత్యోపాసనమునకు ప[illegible]ము. సాహిత్య కళోపాసనాసంభవమైన జీవయాత్ర రాజకీయార్థికసాంఘికాది సకలవ్యవహారములందును మానవధర్మము! పరిణా[illegible]మును పొందుచున్నది.

* * *

రాజ్యాంగపరిణామము – ఇండియాబిల్లు

హిందూస్థాన రాజ్యాంగపరిణామమునకు హిందూస్థానప్రజ లధికారులు. హిందూస్థాన ప్రజకు వినియోగపడని రాజ్యాంగవిధానము పార్లమెంటు యామోదమును బడసిన దివ్యాంగనిర్మాణమైనను దేశప్రయోజనములకు నిరుపయోగము. సర్ సామ్యుయలుహోరుగారు సూత్రధారులై ప్రదర్శించిన ఇండియాబిల్లుప్రహసనము పరిహాస పాత్రమని ప్రాజ్ఞులందరును నంగీకరించుచున్నారు. స్వాతంత్ర్యములేని రాష్ట్రీయస్వాతంత్ర్యము, బాధ్యతలేని కేంద్రప్రభుత్వము, సంయోగాధికారములేని ఫెడరేషను నియమనిబంధనలందు సాధ్యమైనను వ్యవహారములందు దురారాధ్య మనుట తెలిసిన విషయము. ప్రహాసన

ప్రదర్శనమునందు మెక్డొనాల్డుగారు, చర్చిలుగారు మొదలగు విదూషకులు చూపిన మూర్ఖత్వము బ్రిటీషు రాజ్యనీతి కనురూపముగ నున్నది. ఇండియాబిల్లు స్థిరతరముగను ఇండియాను బ్రిటీషు రాజ్యమునకు దాసాను[illegible]గను బంధించు చున్నది. స్వదేశ[illegible]శములందు గల మహారాజులు, [illegible] [illegible]బులు, కోటీశ్వరులు, [illegible]సం[illegible]భిమానులు, ప్రభువులు, త్రకశిఖామణులు, పారిశ్రామికాధికారులు వారి యధికారభాగ్యభోగములను శాశ్వతముగ ననుభవించుటకు రాజ్యాంగ విధానము నిర్మింపబడినది. కార్మికపక్షమునను లాన్సుబరి మేజరుఅట్లీగారి సవరణలును, లిబరలుపక్షమునను సర్ హార్బర్టుసామ్యుయలుగారిసవరణలును, కన్సర్వేటివు పక్షమునను చర్చిలు పేజిక్రాఫ్టుగారిసవరణలును,ఇతరపక్షనాయకుల సవరణలును నిరాకరింపబడినవి. పార్లమెంటు ఆమోదించిన ఇండియాబిల్లుప్రథమమునను ప్రారంభింపబడిన ఇండియాబిల్లుకన్నను పథ్యాన్నముగ నున్నదని కన్సర్వేటివు పక్షాశీర్వాదమె వెల్లడిచేయుచున్నది. హోరుగారి సంకల్పానుసారముగను ఇండియాబిల్లు కామన్సుసభయందామోదింపబడినది. ప్రభువుల సభయందామోదింపబడగలదు. హాలిఫాక్సు ప్రభుపదవినిబడసిన ఇర్విన్ప్రభువు ఇండియాబిల్లును ప్రశంసించి చేసికొనిన యాత్మవంచనయె బ్రిటీషుప్రభుత్వరాజ్యనీతికి ప్రమాణముగ నున్నది. ఇండియాబిల్లును ప్రతిఘటించిన యన్నిపక్షములవారును బిల్లున కాశీర్వచన స్వాగతంబుల నొసంగుటయును, భారతీయులను బిల్లునకు స్వాగతంబు నొసంగమని కోరుటయును ప్రస్తుతము భారత రాజ్యాంగ సంస్కరణాధ్యాయము ముగిసినదని తెలుచున్నది. హోరుగారి ప్రజ్ఞావాదమును భారతీయులెకాకను బ్రిటిషు నాయకులును ఖండించినను, సమర్థించినను ప్రయోజనముమాత్రముశూన్యము. ఇండియాబిల్లు ప్రయోగమునం దెటులు పరిణమించునదియును కాలము తెలుపగలదు.

ప్రవృత్తియందు విషబీజముల కమృతఫలములుపండుట దుర్లభము. ఇండియాబిల్లునందు బలవంతముగను నాటబడినసంస్థానబీజములు, సాంఘికవిభేదములు, ధనస్వామివిభేదములు, జాతీయవిభేదములు, అధికారసంరక్షణములు, వ్యాపారరక్షణములుబీజానురూపములైనఫలములను గలుగజేసి, ఇండియాబిల్లును నిరర్థకముచేయుట యథార్థమైనను బ్రిటీషు జాతీయప్రభుత్వము సంకల్పించిన భారతీయపారతంత్ర్యశృంఖలములు ప్రస్తుతము దృఢతరములైనవి. ప్రపంచవ్యవహారములు మహాపరివర్తనమును పొందుచున్న సమయమునందు, జాతీయప్రభుత్వ సంకల్పములు, దైవధర్మసంకల్పములకు భిన్నములై నిరర్థకములగుట సులభము. ఇండియాబిల్లును హోరుగారు ప్రసాదించినను హామలునందుపెట్టుట భారతీయులమీద నాధారపడియున్నది. హోరు

గారు చెప్పినటులు బిల్లును హర్షించువారును, హాయులునందు పెట్టువారును నుండుట సహజము. అట్టివారివలనను బిల్లునకును, దేశమునకును ప్రయోజనము శూన్యము. ఇండియాబిల్లునకు సర్ తేజబహదరు సప్రూ గారి వలెను నాశీర్వదించెడి భారతీయు లనేకు లుండుట సహజము. రాజ్యాంగము లందు ప్రాబల్యము గల కాంగ్రెసుపక్షము మొదలగుపక్షములు బిల్లు నాశీర్వదించనంత వరకును బిల్లున కేవిధమైన ప్రయోజనమును గలుగదని ప్రపంచవ్యాప్తమైన స్వాతంత్ర్య దాహము, రాజ్యాంగపరివర్తనములు వేయి నోళ్లను చాటుచున్నను హోరువర్గమునకును, వారి స్తోత్రపాఠకులకును జ్ఞానోదయము గలుగకున్నది. ఇండియాబిల్లును నిరాకరించుటకును, నుపయోగించుటకును కావలసిన శక్తిసామర్థ్యములు భారతీయులకు గలవు కాని హోరువర్గమునకును, జాతీయ ప్రభుత్వమునకును లేవని గ్రహించుటయైనను వివేకము. ఇండియా బిల్లు నిర్మాణముతో జాతీయ ప్రభుత్వ మంతరించినది. బ్రిటీషు పార్లమెంటు నందు నూతనప్రభుత్వమంత్రివర్గ మేర్పడినది. చిరస్థాయిగను జాతీయప్రభుత్వము నేర్పాటు చేయుటకును ప్రయత్నములు జరుగుచున్నవి. పాప మయిదేండ్లుగను ప్రధాన మంత్రి పదవి నధిష్ఠించిన రామ్సె మాక్డొనాల్డుగారి నిర్గమనముమాత్రము విషాదకరము. కార్యాంతమునను దూదిగతి మేక్డొనాల్డుగారికి పట్టినది.

* * *

## జాతీయప్రభుత్వము-నూతనమంత్రివర్గము

జాతీయప్రభుత్వవర్గమునందు గలిగిన మార్పులందు రామ్సెమాక్డొనాల్డుగారి నిర్గమనముమాత్రము గణనీయము. స్వార్థపరాయణుడైన రామ్సె మాక్డొనాల్డుగారు స్వీయాభివృద్ధికి మూల [illegible] లేబరు పక్షమును, ఇండియాబిల్లును, [illegible]రాశయములను నధోగతిపాల[illegible] పంచతంత్రమునందలి దమన[illegible]కర[illegible]యుదంతమును స్మరింపజేయ గల[illegible] ప్రపంచ వ్యవహారములం దాత్మవంచకులకు తాత్కాలికముగను భాగ్యభోగాధికారములు లభించినను శాశ్వతమైన ధర్మచ్యుతిమాత్రము యథార్థము. మాక్డొనాల్డుగారు జాతీయ ప్రభుత్వ వ్యాజమునను కార్మికపక్షాశయములకు గలుగజేసిన హానియును, కన్సర్వేటివు పక్షాశయములకు గలుగజేసిన ప్రయోజనములును మానవధర్మపరిణామమున కపారమైన నష్టమును గలుగజేసినవిధమును గణించిన అయిదేండ్లయందును హిందూస్థానమును నితరప్రదేశములును ననుభవించిన నిర్బంధదుఃఖానుభవమును విశదము చేయుచున్నవి. నూతనమంత్రివర్గమునందు స్టాన్లిబాల్డువినుగారు ప్రధానామాత్యులుగను, సామ్యుయలుహోరుగారు విదేశాంగమంత్రిగను, జట్లండు ప్రభువుగారు హిందూస్థానమంత్రిగను,మాక్డొనాల్డుగారు పేరునకొకమంత్రిగను నేర్పడిరి. హోరుగారికిని మాక్డొనాల్డు గారికిని వారి సేవకు దగిన ప్రతిఫలము గలిగినది. అనతికాల

ముననే క్రొత్తయెన్నికలు జరుగునని యూహింపబడుచున్నది. జాతీయ ప్రభుత్వము చేసిన న్యాయములకు జాతీయాభ్యర్థులకు విజయము సహజమైనను ధర్మరక్షణపరాయణుడు, పరమేశ్వరుడు ధర్మ రక్షణమును జేయుట [illegible]డును. వర్తమాన విషాదపరిస్థితులందు [illegible]గ్రెసుసేవ దుర్లభమైనను ఆత్మో[illegible]నను [illegible]ోద్ధరణమునకును కాం[illegible]బల[illegible]దే తరణోపాయము సాధ్యమగ నున్నది.

*　*　*　*

కాంగ్రెసుబలధర్మములు

గతించిన [illegible]ంపండ్లయందును కాంగ్రెసు, దేశమునకును, స్వాతంత్ర్యమునకును, ధర్మమునకును, చేసిన సేవ కాంగ్రెసుపేరును మూలమూలలను వ్యాపింపజేసినది. కాంగ్రెసు నాయక ప్రచారకులు చేసిన త్యాగము కాంగ్రెసునకపూర్వమైన ధర్మబలమును సమకూర్చినది. గత మాసమునందు శ్రీ రాజేంద్రప్రసాదుగారి సంచారమునందు ప్రజానాయకులు, సంస్థానలువారికి సమర్పించిన స్వాగత సన్మానములు ప్రజలకు స్వాతంత్ర్యముపట్లను, కాంగ్రెసుపట్లను గల సంపూర్ణవిశ్వాసమును విశదము చేసినవి. కాంగ్రెసు బలప్రతిష్ఠ లనివార్యములని కాంగ్రెసు[illegible]జయములు విశదము చేసినవి. శ్రీయుత బూలాభాయిదేశాయి, వల్లభభాయి, సత్యమూర్తి, ప్రకాశముగారులు మొదలగువారల ప్రసంగములు కాంగ్రెసు గౌరవప్రతిష్ఠలను గాపాడవలసిన యవసరమును సువ్యక్తము చేసినవి. ప్రజానాయకులు నిరాశను, నిరుత్సాహమును విడిచి కాంగ్రెసు సంఘములందు సభ్యులై కాంగ్రెసుబలమును సకలవిధములను వివిధ సందర్భములందును పోషించుట నియతధర్మముగ నున్నది. నిరంకుశప్రభుత్వము నిర్బంధములను కల్పించిన కొలదియును కాంగ్రెసుబలము వృద్ధినిజెంది నిరంకుశాధికారమును నిర్జించవలసిన యవసరమును నిరంకుశ ప్రభుత్వవ్యవహారములు వేయినోళ్లను చాటుచున్నవి. క్వెట్టాభూకంపమును, కాంగ్రెసుపట్లను ప్రభుత్వప్రతికూలమును కాంగ్రెసు బలసంరక్షణావసరమును ప్రజలకు సువ్యక్తము చేయుచున్నవి.

*　*　*　*

క్వెట్టాభూకంపము – కాంగ్రెసునిధి

హిందూస్థాన మనుభవించుచున్న దుఃఖపరంపరల కాద్యంతము లగోచరములు. గత సంవత్సరమునందు బీహారు భూకంప మపారమైన నష్టమును గలుగజేసినది. వర్తమాన సంవత్సరమునందు క్వెట్టాభూకంపము బీహారు భూకంపమునకు మించిన ప్రాణ మాన ధన హానులను గలుగజేసినది. ౬0,000 మరణములు, కోట్లద్రవ్యనాశనము, అపారమైన దుఃఖవేదన క్వెట్టాప్రాంత ప్రజలకు గలిగినది. ప్రభుత్వము సహాయనిధి నేర్పాటు చేసినది. ప్రపంచమునందలి వివిధప్రాంతముల నుండియును సానుభూతియును, సహాయమును వచ్చుచున్నవి. రాజప్రతినిధికి విరాళములను సార్వభౌముడు, రాజ్యాధికారులు, రాజాధి

రాజులు, మేయరులు, మ్యూనిసిపాలిటీలు, ధర్మాధికారులు పంపుచున్నారు. అపారమైన నష్టము ననుభవించిన క్వెట్టా ప్రాంతములకు ధనసహాయముపలెను మానవసేవయును నవ సరమని విపరీతపరిస్థితులు వెల్లడిచేయు చున్నవి. కాంగ్రెసుపక్షమునను శ్రీ బాబు రాజేంద్రప్రసాదు గారు సంకల్పించిన సేవను రాజప్రతినిధి నిరాకరించుట యన్యాయముగనున్నది. క్వెట్టా ప్రాంతము నిరంకుశ పరిపాలితప్రాంతమైనను భూకంపసహాయము నందు రాజకీయసంబంధ మేమియు నుండజాల దని బీహారుభూకంపానుభవము ప్రభుత్వాధి కారులకు దెలిసియున్నది. కాంగ్రెసుప్రభు త్వాధికారులు కలిసి బీహారునందువలెను క్వెట్టాయందను ప్రజాసేవను జేయుటకు గల యవకాశములను ప్రభుత్వము నిరాకరించుట దేశావృతమైన దురదృష్టము. ప్రభుత్వ మేమి చేసినను ప్రజలుమాత్ర మెప్పటివలెనే సహా యము చేయుట ధర్మము. ప్రజలు కాంగ్రెసు ప్రచారకులును యథాశక్తిని క్వెట్టాభూకంపా ర్తులకు సకల విధములను స్వధర్మనిర్వహణ మునుజేసి మానవధర్మ పరిణామము సార్థ కము చేయుదురుగాత. ఈయేడు మండు టెండలందు ఆంధ్రదేశమునందు ఘోరమైన అగ్నిప్రమాదమువలనను దుఃఖార్తులైన ప్రజ లకును ధర్మాత్ములు యథాశక్తి సహాయము చేసి ధర్మరక్షణమును చేయుదురు గాక !

**మానవధర్మపరిణామము**

మానవధర్మపరిణామము సకల వ్యవస్థ లందును సార్థకమగుటకు పూర్వాచారబద్ధ మైన ప్రపంచవ్యవహారములందు స్వాతంత్ర్య సంచార మవసరమగుచున్నది. సకల వ్యవస్థ లును రాజ్యాధికారాధీనమైన మానవ యుగమునందు రాజ్యా... సకల స్వాతంత్ర్యములకును ... ముగ నున్నది. సకలార్థములకు మూలమై రాజకీయ స్వాతంత్ర్యమును ఇండియా బిల్లు దుర్లభము చేయుచున్నను సాహిత్యకళోపాసకులు, ప్రజానాయ కులు, కాంగ్రెసు ప్రచారకులు, సకల జనులు స్వయంసహాయమున నిర్వహింపగల కార్యవిధాన మనంతము గలదని జిజ్ఞాసువు లకు సినీమాలు, నాటకములు, నవలలు, పద్యములు, పాటలు, పరిశ్రమలు, కర్మకలాపములు సకలసందర్భములందును ప్రత్యక్షము చేయుచున్నవి. సకల జనులును స్వాభిమాన సంకుచితాభిప్రాయ ములను విసర్జించి నవజీవనపరాయణమైన మానవధర్మాభ్యుదయమునకు యథాశక్తిని నాత్మార్పణము చేసి కృతార్థు లగుదురు గాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7. ThambuChetty St. Madras.
Editor: G. Subbaramayya

